# శ్రీరంగమహాత్మ్యము

భైరవకవి ప్రణీతము

సంపాదకుడు

శ్రీ రంగాచార్య






ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు
హైదరాబాదు 4

SRI RANGA MAHATTVAMU

A Telugu classic by Bhairava Kavi (15th century A. D.) This volume includes Kavigajankushamu by the same author. Edited by Sri Srirangacharya Lecturer, Sri Venkateswara Oriental College, Palem, Mahabubnagar Dist.

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,

హైదరాబాద్-500 004.

ప్రచురణ. 296

ప్రథమ ముద్రణ-1979, ప్రతులు. 1,000

**వెల రూ. 14-00**

ప్రతులకు :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాద్-500 004

ముద్రణ :

పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ, హైదరాబాద్-500 001

---

Paper Used for the Printing of the book was made available (Partly) by the Government of India at concessional rate

# తొలి పలుకు

భాషా పరిణామాన్ని, సాహితీవికాసాన్ని, సాంఘికేతిహాసాన్ని క్షుణ్ణంగా అవగతం చేసుకోవడానికి ప్రాచీనార్వాచీన సారస్వతాన్ని అధ్యయనపరులందరికీ అనువైన పద్ధతిలో అందించాలనే ఉద్దేశంతో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రాచీనాంధ్ర కావ్యాలను ముద్రించి సరసమైన ధరలకు లభించే అవకాశాన్ని కల్పిస్తున్నది.

ప్రబోధ చంద్రోదయం వరహపురాణం, శుకసప్తతి వంటి కావ్యాలను ఇంతవరకు అకాడమీ ప్రచురించింది. ఇప్పుడు భైరవకవి రచించిన శ్రీరంగ మహత్త్వమును అందిస్తున్నది. భైరవకవి కృతమయిన కవిగజాంకుశమనే ఛందోగ్రంథాన్ని కూడా దీనితో జతపరచి ముద్రించింది. చాలాకాలం క్రింద మానవల్లి రామకృష్ణకవిగారు శ్రీరంగమహత్త్వమును వెలుగులోనికి తెచ్చిరి. ఇప్పుడీ కావ్యప్రతులు దొరకక పోవడంచేత అకాడమీ ప్రచురణకు పూను కున్నది.

ఈ కావ్యానికి సంపాదకత్వం వహించి చక్కని పీఠిక సమర్చిన శ్రీ శ్రీరంగాచార్యులుగారికి అకాడమీ ధన్యవాదాలను సమర్పిస్తున్నది.

ఇరివెంటి కృష్ణమూర్తి

హైదరాబాద్ కార్యదర్శి.

# శ్రీరంగమహత్త్వము

## విషయానుక్రమణిక

# శ్రీ రంగ మహాత్త్వము

## శ్రీ మ తే రా మా ను జా య న మః

సప్తప్రాకారమధ్యే సరసిజముకుళోద్భాసమానే విమానే ‌·
కావేరీమధ్యదేశే ఫణిపతిశయనే శేషపర్యంకభాగే ।
నిద్రాముద్రాభిరామం కటినికటశిరఃపార్శ్వవిన్యస్తహస్తం
పద్మాధాత్రీ కరాభ్యాం పరిచితచరణౌ రంగరాజం భజేఽహం ॥

మానవల్లి రామకృష్ణకవిగారు (1866—1957)

శ్రీ రంగమహాత్త్వమును ప్రప్రథమముగా ప్రచురించి (1912) వెలుగు లోనికి తెచ్చిన వారు- శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, ఆంధ్రవాఙ్మయమునందు మౌలికమైన పరిశోధన గావించిన కొందరిలో-ముందుగా పేర్కొనదగిన కవి గారు- మన తెనుగు సాహిత్య విమర్శనమునకు పాధేయ మొసంగినారు, ఆంధ్రమునందేగాక-ద్రావిడ కర్ణాట కేరళ ప్రాకృత సంస్కృత భాషా సాహి త్యములందు వీరు గొప్ప వైదుష్యము గలవారై ఆయాభాషలయం దెంతగానో కృషి సల్పిరి. ప్రాచీన గ్రంథ పరిశోధనముచేసి ఆ గ్రంథముల సంస్కరించి ప్రకటించుటయందును, శబ్దముల సాధ్వసాధుత్వముల నిర్ణయించుటలోను— వీరికి గల ప్రజ్ఞాపాటవములు - ఇతరులయం దంతగా లే వన్నను అతిశయోక్తి కాదు. దీనికితోడు—వీరికి అపారమైన ధారణాశక్తి, సర సమై ప్రబంధ ఫక్కిలో కవిత్వము చెప్పు నైపుణ్యము—బంగారమునకు తావి యబ్బినట్లైనది.

సాహిత్య రంగమున కెనలేని కృషిచేసి-యనేక కృతిరత్నముల బయటకు దీసిన వీరిని, సరస్వతి మాత్రమే చల్లచూపు చూచి లక్ష్మి పెడకన్ను పెట్టినది, తెలుగుదేశము మాత్రము వారికి బాకీ పడియున్నది. ఒక్కమాటలో చెప్పవలె నన్న-నన్నయగారి పేరెత్తకుండా తెలుగుకవిత — కవిగారిని పేర్కొనకుండా సాహిత్యపరిశోధన-లేదు.

కవిగారు తెలుగువారి పుణ్యమో! ఆంధ్ర - శారద యదృష్టమో! యను నట్లు (క్రీ. శ. 1904 నుండి) కొంతకాలము వనపర్తి ప్రభువువద్ద అంతరంగిక కార్యదర్శిగా నున్నారు, వారికి ఈ సమయము సాహిత్యపరిశోధనకు చక్కగా ఉపకరించినది. సంస్థానాధీశ్వరులు వీరికి అన్నివిధాలుగా సాయపడినారు. అప్పుడే 'విస్మృతకవులు' అనుపేర మనోహరము లగురచనలను సాహిత్యో ద్యానమున గుబాళింపచేసిరి (ఈ గ్రంథమున గల ప్రథమముద్రణ చివరి అట్ట పేజీపై వాని జాబితా గలదు) అట్టివానిలో నొకటి భైరవకవిప్రణీతమైన-యీ శ్రీరంగ మహాత్త్వము, ఆనాడు కవిగారీ గ్రంథముల సంపాదించి ప్రకటింప కున్నచో-నేడు-చాలభాగము వాని నామరూపము లైనను లేకుండెడివి. కవిగారి

కీప్రతి లభించిన పద్ధతిని గూర్చి-వారు వ్రాసిన దానినే యిచట పొందుపరచు చున్నాను.

‘ఈకృతి నాకు రెండుప్రతులు వనపర్తిసంస్థానాధీశ్వరుల తాళపత్రలిఖిత గ్రంథములలోనే లభించినవి. అందులో నొకటి 186 సంవత్సరములకుఁ బూర్వమునను దానికిఁ బ్రతికయగు వేఱొకటి 96 సంవత్సరములకుఁ బూర్వమునను తత్సంస్థానాధీశుల ప్రేరణంబుననే లిఖింపఁబడినవి. నేను తత్సంస్థానాధీశ్వరాశ్రయము పొందని కాలమున గ్రంథాన్వేషణము నిమిత్తము గద్వాల వనపర్తి సంస్థానాదులఁ గొంతకాలము సంచరించి వారి యనుగ్రహ[illegible]షఁ బాత్రుండనై గద్వాలలో భోజరాజీయాదికృతులు సంపాదించి వనపర్తిలోఁ బుస్తకములు శోధించుటకు ననుజ్ఞ వడసి వానియెదుటఁ గూర్చుండి తాళదళసంపుటముల విప్ప దొరకొనుసమయమున నకస్మాత్తుగా నప్పకవి యుదాహరించినఁ "గంపపుఁ గొండనెత్తము"యను భైరవునిపద్యము మనస్సునకు స్ఫురించెను. అంతనయ్యో! మన కేల యీకావ్యము ఈ గ్రంథసమితిలో లభింపరా దని మొట్టమొదటి పుస్తకము విచ్చి కొన్ని యాకులు ద్రోచి చదువఁగాఁ బ్రప్రథమమునఁ బై పద్యమే దృష్టిగోచర మయ్యెను, నాకుఁ గలిగిన యమందానంద మిట్టిదని చెప్పఁ జాల కుమారసంభవాది సత్కృతుల కున్నిది తీసిపోయినను నేనుత్సుకుఁడనై వెదకిన కృతిలోఁ బై పద్యమే మొదట గోచరించుట వైచిత్రీవిశేష మని తెలియ బలుచితిని-’ (పీరిక-పుట viii)

ఈ పీరికద్వారానే కట్టా వరదరాజు అనుకవిని గూర్చి - అతని శ్రీరంగ మహత్త్వమును గూర్చి తెల్పినారు, వారు తెల్పువరకు వరదరాజు శ్రీరంగ మహత్త్వమును గూర్చి యెవ్వరికిని తెలియదు![1]

---

1. కట్టా వరదరాజ కృతమైన శ్రీ రామాయణము (ద్విపద) ను - పరిష్కరించి 1950 సం, శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు - తంజాపుర సరస్వతీ మహల్ సిరీస్ - 12 గా ప్రకటించినారు.

   ఇతని శ్రీరంగమహత్త్వము - చెలికానిలచ్చారావుగారు ‘అముద్రితాంధ్ర గ్రంథసర్వస్వము’న - 8వ గ్రంథముగ ప్రచురించిరి, 1921 సం శ్రీరామ విలాసముద్రాక్షరశాల - చిత్రాడవారు - గ్రంథముగా వేసినారు.

1912 సంవత్సరమునందు రామకృష్ణ కవిగారు మొట్టమొదటి మారు - ప్రచురించిన తెనుగులో మొదటిదైన - శ్రీరంగమహత్త్వము పీఠికలోనిది - ఈ విషయము.

కవిగారు ఒక గ్రంథమునకు పీఠిక వ్రాయుచున్నపుడు దానికి సంబంధించిన ఇతర గ్రంథములగూర్చి తెల్పుదురు, ఇది మంచిపద్ధతి.

మానవల్లివారు - వనపర్తి సంస్థానమున నున్నప్పుడే కాకతీయ శాసనముల సేకరించిరి ('కొన్ని కాకతీయ శాసనములు') తరువాత - భారతి (రక్తాక్షి — పుష్యము) పత్రికయందు దివి ప్రచురింపబడినవి - వీనిలో నొకటి - సిద్ధేశ్వర శాసనము, ఇది సంస్కృతమున - చక్రనిశ్శైలిలో గల నిరోష్ఠ్య కావ్యము, తెలంగాణమున - శాసనములందు నిరోష్ఠ్యరచన - ఇదియేగాక బూదపురశాసనమునందును గలదు - (మహబూబ్‌నగరం జిల్లా)

ఈ విధముగా బహుముఖములైన కృషి చేసిన కవిగారు - వనపర్తి సంస్థానమున యపవాదులపాలై - ఉద్యోగమును వదలి మదరాసు చేరుకొనిరి- వారి ఆబాధను - 'శ్రీరంగమహత్త్వము' పీఠికలో నిట్లు తెల్పిరి.

'వ్యయప్రయాసములమాట బోనిచ్చి శతచ్ఛిద్ర వ్యాకులంబగు తాళదళ పరిశోధనం బభ్యాసవశంబున జుగుప్సారహితంబుగ నలవఱచుకొని కార్యము నెట్లో - నిర్వహించుచుండుటయు కొందఱ ఈర్ష్యాగ్రస్తులు చూచి యోర్వక పరి పరి విధముల నగుబాటు పఱచుచున్నారు" - (పుట vii)

అసూర్యంపశ్యలై యున్న అమూల్య గ్రంథములను వెలుగులోనికి తెచ్చినందుకు నాడు కవిగారికి మిగిలినది - మనోవ్యథ - వ్యాకులత, వనపర్తి సంస్థానమును వదలుట[1]

---

1. 'మానవల్లి కవిరచనలు' అను గ్రంథమును ఆం. ప్ర సా. ఎకాడమీ వారు, 1972 సం, ప్రకటించిరి. సంపాదకులు, శ్రీ నిడుదవోలు వెంకటరావు గారు. డా. పి. యస్. ఆర్. అప్పారావుగారు-ఈ గ్రంథమున కవిగారి జీవితము-విశేషాలు, వారి పీఠికలు, వ్యాసాలు, రచనలు, గలవు. అప్పారావుగారు-"నేనెరిగిన మానవల్లికవిగారు" అని 82 పుటలో వ్యాసమును వ్రాసిరి. ఈ గ్రంథము తప్పక చదువదగినది.

'—అంధకజన దూషితంబులు ఘనంబులుగావె

యమూల్య రత్నముల్'

ప్రాతః స్మరణీయు లైన కవిగారు ప్రకటించిన గ్రంథమును మరల ఈనాడు నా సంపాదకత్వమున సాహిత్య ఎకాడమీవారు ముద్రించుచున్నందులకు ధన్యుడను.

కవిగారిపై నాకు గల భక్తిభావము ఈ నాల్గుమాటలు వ్రాయించినది. ఆ యశశ్శరీరునకు సవినయముగా వందన సహస్రము లర్పించుచున్నాను.

పండితప్రభాకరులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు - క్రీడాభిరామము పీఠికలో కవిగారిని గూర్చి-

''సాహిత్య ప్రపంచమున మాబోంట్లు తిన్నగా
కన్నులు తెఱువక పూర్వమే రామకృష్ణకవి
గారు ప్రాచీన ప్రబంధములను ప్రకటించిరి-''
(క్రీడాభిరామ పీఠిక-1930)

వీరు ప్రకటించిన 'శ్రీ రంగమహత్త్వము శ్రీ రంగక్షేత్ర విషయము గలది గదా! అందువలన—శ్రీ రంగమును గూర్చి స్వల్పపరిచయము చేయుదును—

## శ్రీ రం గ ము

దక్షిణ దేశమందలి అతిప్రాచీనములైన పుణ్యక్షేత్రములలో పేర్కొనదగినది శ్రీ రంగము. అరవవారు దీనిని అరంగమందురు, నేటి తమిళనాడు రాష్ట్రములో తిరుచినాపల్లి జిల్లాయందు ఈ క్షేత్రము గలదు.ఇచ్చటిస్వామి శ్రీరంగనాయకులు. ౧౦౮ దివ్య తిరుపతులలో నొకటగు ఈ క్షేత్రము - శ్రీవైష్ణవులు సేవించు ముఖ్యక్షేత్రములలో నొకటి. ఈ దేవాలయ నిర్మాణము ఎప్పుడు జరిగినది చరిత్రకారులకు అందని విషయము. పురాణములయందు మాత్రము ఇది క్రీ పూ 10 శతాబ్దానికి చెందిన ఆలయ మని గలదు. దేవాలయ శాసనాలు —

రికార్డులు-10 శతాబ్దము A. D. నుండి గలవు. ప్రస్తుతమున్న దేవాలయము 13 శతాబ్దమున అభివృద్ధి చేయబడినది. దీనికి పాండ్యులు ముఖ్యులు. అనంతరము వచ్చిన రాజవంశములవారు-ఈ స్వామివారికి భూరి దానము లిచ్చినట్లు మన చరిత్రలు తెల్పును.

ఇట్టి దివ్యక్షేత్రము-ఎన్నియో రాజకీయమైన దండయాత్రలను — అన్య మతస్థుల ప్రధ్వంసకార్యములను అనుభవించినది. ముఖ్యముగా మహమ్మదీయుల దండయాత్రల వలన దేవాలయశోభ చెడిపోయినది. క్రి. శ. 1371లో - మలిక్ కాఫర్ దండయాత్ర (బుక్కరాయల మధురా విజయయాత్ర కూడా ఈ సమయముననే) జరిగినప్పుడు ఆ అల్లకల్లోలములకు తట్టుకొనలేక-శ్రీమాన్ వేదాంత దేశికులవారు-స్వామివారి విగ్రహమును తిరుపతికి తీసుక వెళ్ళి రక్షించి-అనంతరము యథాస్థానమును చేర్చినారట— ఈ విషయమును దెలుపుచు దేశికులవారు వేయించిన ఒక శాసనమునం దీ క్రింది శ్లోకము గలదు

'ఆనీయానీల శృంగ ద్యుతిరచితజగ ద్రంజనాదంజనాద్రేః
చెంచ్యా మారాధ్యకంచిత్ సమయమధనిహత్యోద్ధనుష్కాన్ తురుష్కాన్
లక్ష్మీక్ష్మాభ్యా ముభాభ్యాం సహనిజనగరే స్థాపయన్ రంగనాథం
సమ్యక్చర్యాన్ సపర్యాన్ పునరకృతయశః ప్రాపణో గోపనార్యః॥

(బుక్కరాయల ధర్మోద్ధరణమును శ్లాఘించుచు దేశికులవారు శిలాఫలకమును వేయించుచుండగా-గోపనదండనాథుడు - స్వామివారికి చేసిన యనితర సాధ్య మగు బృహత్ కైంకర్యమును— దలచి-ఆశువుగ నీ శ్లోకమును చెప్పి-వ్రాయించినారు)

ఆనాటి దండయాత్రలకు దేశికులవారు ఎంతగా కుమిలిపోయిన దీశ్లోకమే తెల్పుచున్నది.

ఈఅలజడుల కారణముగా అప్పటికి విజయనగరరాజులచే నిర్మాణము చేయించబడుచుండిన స్వామివారి గోపురనిర్మాణముకూడా ఆగిపోయినది. తర్వాత అనగా క్రి శ.1530-1542సం.లో. చేరరాజు విజయానికి చిహ్నముగా అచ్యుతదేవరాయలవారు నిర్మింప తలపెట్టిన గోపురముకూడా 48అడుగుల పరిమాణములోనే ఆగిపోయినది.

ఆనాడు అచ్యుతదేవరాయలవారు అసంపూర్తిగా వదిలిన గోపురమును నేడు తమిళనాడు ప్రభుత్వమువారు పూర్తిచేయ తలపెట్టి 20-5-1979నాడు ప్రారంభోత్సవము చేసినారు. ఇది పూర్తియైనచో- 246అడుగుల ఎత్తు, 15అంతస్థులు ఉండగలదు.

ఆశ్చర్యకరమైన విషయ మేమనగా- ఈరాజగోపురము పునాది (ఫౌండేషన్)18అడుగులకు మించిన లోతులో గలదట. శ్రీ లోకనాథం అనే చీఫ్ఇంజనీయరు- త్రవ్వించిచూడగా-అంతు చిక్కలేదు -గాని-అపరిమితముగా నీరు మాత్రము ఊరి వచ్చినది, 'ఆజలాంతం-'దేవాలయనిర్మాణ మనుపద్ధతికి ఇది యొకతార్కాణము,౧

స్వామివారి గర్భాలయము సప్తప్రాకారములు దాటిన తర్వాత గలదు, ఇందలి మొదటి మూడుప్రాకారములు లౌకికులపట్టణములు, నాల్గవదానినుండి- శ్రీరంగనాయకులవారి అస్థానము. అయినను, యాతాయాతజనవ్రాతము- ప్రయాణీకుల వాహనములు- ఈరద్దీవలన మనము ప్రాకారములలోపల నున్న విషయమే విస్మరింతుము,

ఇచట, స్వామివారిది శయ్యావిగ్రహము, సుమారు20అడుగుల మూల విరాణ్మూర్తి, దేవాలయమున కుభయపార్శ్వముల కావేరిప్రవహించును,౨ ఇచట ఈనది రెండుగా చీలి-ఉత్తరశాఖకొల్లడ(కోల్ రూన్)అనే పేరు గలిగియుండును, దక్షిణవాహిని కావేరి-ఇది మరి ఐదు శాఖలుగా మారి ఆప్రాంతమును సస్య శ్యామలముగా చేసినది, త్యాగరాజస్వామివారి తిరువయ్యారు(తిరు-అయ్యారు, ఐదునదులు)కావేరీతీరముననే గలదు,

కరికాలచోడుడు ఈకావేరికి ఆనకట్టలు కట్టించుట ప్రసిద్ధమైన విషయము,

---

౧ 29-7-79నాటి. 'హిందూపత్రిక'లోని చిన్నవ్యాసము ఆధారముగా ఈ విషయములు గ్రహించనైనవి.

౨ ఇచ్చట కావేరి బాహువులు సాచినినాయిక యని-స్వామివారు నాయకుఁ డని- కవులవర్ణన-అట్టిదే-ఈ శ్రీరంగమాహాత్మ్యమునందు గలదు(౯-౧౦౪-౧౪౧)

ఇట్టి శ్రీరంగక్షేత్రమున శ్రీవైష్ణవమతాచార్యులు తమ ప్రతిభాపాండిత్యము లను-శక్తియుక్తులను ధారపోసి విశిష్టాద్వైత మతస్థాపన చేసి-ప్రచారము చేసినారు,౧

శ్రీమన్నాథముని-యామునముని-శ్రీమద్రామానుజులు, పరాశరభట్టరు, దేశికులవారు,- అందరూ-ఈకేంద్రమునుండియే తమ శ్రీసూక్తుల ప్రవచనము చేసిరి. దేశికులవారు ప్రథమపర్యాయము శ్రీరంగమునకు వేంచేసినప్పుడు-స్వామివారి అవయవ సౌందర్యమునకు ముగ్ధులై-'భగవద్ధ్యాన సోపానము'ను రచించినారు. తమ ఆచార్యులవారి అనుశాసనమును కాదని-శ్రీరామానుజులవారు-ఈదేవళశిఖరమునుండియే-అందరకును అష్టాక్షరీమంత్ర ముపదేశించి-ముముక్షు వులుగా చేసి-ఆచార్యులవారి మంగళాశాసనములకు పాత్రమైరి. శ్రీవైష్ణవమత ప్రచారము చేయుచు శ్రీమద్రామానుజులవారు-ఈక్షేత్రముల సంచరించిరట,

శ్రీరంగం కరిశైల మంజనగిరిం తార్క్ష్యాద్రి సింహాచలం
శ్రీకూర్మం పురుషోత్తమంచ బదరీనారాయణం నైమిశం
శ్రీమద్ద్వారవతీ ప్రయాగ మధురా కాంచీగయా పుష్కరా
సాలగ్రామగిరిం నిషేవ్య రమతే రామానుజోఽయం మునిః॥

రామానుజులవారికి పూర్వము మిక్కిలిగా ప్రచారమునందని శ్రీవైష్ణ వము-వీరి అవతారప్రాదుర్భావముతో మిక్కిలిగా వ్యాప్తి చెందినది. వర్ణ సాంకర్యమును (వర్ణభేదమును)శ్రీవైష్ణవ మంగీకరింపదు. అందు కుదాహరణము-ఆళ్వారులే. వీరియందు పంచమజాతివారును గలరు-శంకరాచార్యులవారు-మనీషాపంచకమునందు-

'చండాలోఽస్తు సతు ద్విజోఽస్తు గురురి త్యేషామనీషా మమ' అని సెల విచ్చినదానిని మొదట శ్రీవైష్ణవులే అవలంబించినారు.

రామానుజులవారి యనంతరము – దేశికులవారి హయాములో – ప్రపత్తిమార్గమున వచ్చిన భేదభావములవలన శ్రీవైష్ణవము – రెండు

---

౧ 'వైష్ణవము'–విజ్ఞానసర్వస్వము. 3సం. తెలుగు సంస్కృతి. 560–566 పుటలు.

శాఖలుగా మారినది, ఒకటి — వడగళ్, రెండవది తెనగళ్, వడహాలశాఖకు దేశికులవారు ముఖ్యులు కాగా — తెనగల సంప్రదాయమునకు పిళ్ళలోకాచార్యులవారు ముఖ్యులైనారు. వీరి ప్రచారముల కారణాన మతాభివృద్ధి విశేషముగా జరిగినది. ౧

దేశికులవారి కుమారుడు - శిష్యుడును అయిన - వరదాచార్యులవారు (వీరికే నైనారాచార్యులను నామాంతరము) రాచకొండ సంస్థానమునకు విచ్చేసి - పండితులతో వాదించి శైవుడైన శాకల్యమల్లనను ఓడించి - ప్రభువులను - కవిని శ్రీవైష్ణవులుగా మార్చినట్లు చారిత్రకుల వ్రాతలు సాక్ష్య మిచ్చుచున్నవి. వీరినుంచియే తెలంగాణమునందు — శ్రీవైష్ణవము వ్యాప్తిచెంది - వెలమ — రెడ్డిప్రభువులు - శ్రీమతే రామానుజాయనమః - అనుచు - తదాచారములతోనే ఉండిరి. (నేటికిని వీరియం దీపద్ధతి తెలంగాణమున గలదు) వరదాచార్యుల వారి ప్రభావమున - భట్టరు, కందళ - తిరుమల, నల్లాన్‌చక్రవర్తుల — మొదలైనపీఠా లేర్పడినవి, వీరి ప్రభావముననే - తెలంగాణమున విష్ణ్వాలయముల నిర్మాణము - కవుల విష్ణుగాథాపూరితములైన రచనలు ఓరిమిగా చేయుట జరిగిన దనవచ్చును, తెలంగాణమున శ్రీరంగనాయకస్వామి ఆలయాలు వెలయుటకుకూడా ఇదియేకొంత ప్రోద్బలము ఈ విధముగా రాచకొండవారిపై బడిన శ్రీవైష్ణవప్రభావము - కవులకును తప్పలేదు. అందుకే భైరవకవి శ్రీరంగమాహాత్మ్యమును వ్రాసినాడు, (ఈ భాగమున శ్రీవైష్ణవవ్యాప్తియే సంక్షిప్తపరిచయము చేయబడినది, మతము — సిద్ధాన్తములు - సాహిత్యము - వీనినిగూర్చి తెల్పలేదు -) ఇది పురాణానువాదముకావున - పురాణములు — మాహాత్మ్యములగూర్చి కొద్దిగా తెలిసికొందము—

---

విశేషములకు చూ,

౧ శ్రీవైష్ణవము - వివిధసంప్రదాయములు - శ్రీమాన్‌చెలమచెర్ల రంగాచార్యుల వారి వ్యాసము, సంగ్రహాంధ్రవిజ్ఞానకోశము - ౮ సం. 417-425 పుటలు, మరియు — తెలుగుజానపదగేయసాహిత్యము — డా॥బి.రామరాజుగారు. (ద్వితీయముద్రణ. 1978. పుటలు — ३४८-३२०)

## పురాణములు.

## మాహాత్మ్యములు :-

ఆంధ్రసాహిత్యమున అనేకవిధములుగా విస్తరిల్లిన - స్థల - దైవ - తీర్థాది మాహాత్మ్యముల పద్ధతిని గూర్చి తెలుసుకొనుటకు ముందు - వీని కాధారమైన పురాణములను గురించియు తెలిసికొనుట అవసరము,

శ్రుతులు - స్మృతులు — పురాణములు — ఇతిహాసములు — అనునవి ధర్మనిర్ణయమునందు ప్రమాణము లని యార్యులకు గట్టివిశ్వాసము. వీనియందు సార్వజనీనోపయోగపరములైనవి — పురాణ ఇతిహాసములు, ఇవి - దేవతా భక్తిని విజృంభింప చేయునట్టివి.

పురాణము లనగా చతుర్దశవిద్యలయందు గణన కెక్కిన యివి జన్మచేత అర్వాచీనములైనను అతిపురాతనము లయిన అనేక విషయములను వర్ణించిన వగుటచేత పురాణములైనవి.రామాయణభారతాదులవలె నివి మిత్రసమ్మతములు, విజ్ఞానసర్వస్వములవంటివైన యీ పురాణములు - పంచలక్షణములతో కూడు కొని - అష్టాదశభేదములుగా గలవు -

అమరసింహుడు -

'సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ
వంశానుచరితంచేతి లక్షణానాంతు పంచకమ్'

అని - (సర్గము - ప్రతిసర్గము - వంశము - మన్వంతరము - వంశాను చరితము' అని పురాణ మైదులక్షణములుగా నుండును) తెల్పినాడు.

ఈ పురాణములు - (18) సాత్విక - రాజస - తామసములని మూడు విధములు ౧ — అవి యిట్లు గలవు.

---

౧. చూ - శ్రీరంగమహత్త్వము-౩-169, భక్తులు, భక్తియు-ఇట్లేత్రివిధములు.

| | | |
|---|---|---|
| ౧ సాత్త్వికములు | ౨ రాజసములు | ౩ తామసములు. |
| ౧ వైష్ణవము | బ్రహ్మాండ | మాత్స్యము |
| ౨ నారదీయము- | బ్రహ్మకైవర్తము | కౌర్మము |
| ౩ భాగవతము | మార్కండేయము | లైంగము |
| ౪ గారుడము | భవిష్యము | శైవము |
| ౫ పాద్మము | వామనము | స్కాందము |
| ౬ వారాహము. | బ్రాహ్మము. | ఆగ్నేయము. |

వీనియందు - నారదీయ - బ్రహ్మకైవర్త - వామనముల బదులు వాయవ్య - బ్రహ్మ - వైవర్త - కొందరి మతమున గలవు,

వీనియందు-నారదీయ - బ్రహ్మకైవర్త-వామనముల బదులు-వాయవ్య-బ్రహ్మ-వైవర్త కొందరి మతమున గలవు, అష్టాదశ పురాణముల (పెరిగి-౨౧ అయినవి) తరువాత - ఉపపురాణములు గలవు - అవి దాదాపు ౩౪,, మరి కెన్ని గలవో ? అష్టాదశపురాణముల పేర్లు వచ్చునట్లు సంక్షిప్తముగా—దేవీభాగవతమునందు-

'' 'మ' ద్వయం 'భ' ద్వయంచైవ 'బ' త్రయం 'వ' చతుష్టయమ్
'అ' 'నా' 'ప' 'లింగ' 'కూ' 'స్కా'ని పురాణాని పృథక్ పృథక్''

ఇట్టి పురాణములగూర్చి లోకమున-

అష్టాదశ పురాణేషు వ్యాసేన కథితం ద్వయమ్
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్' అని ఆర్యోక్తి గలదు. ౧

---

1 పురాణములు-ఉపపురాణములు వీనిని గూర్చిన సమగ్ర పరిశీలనకు -
1 సంస్కృత వాఙ్మయచరిత్ర-(లౌకిక వాఙ్మయము) మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, 1961 ముద్రణ, (69—80 పుటలు)

2 ప్రథమాంధ్రమహాపురాణము-డా. జి. వి. సుబ్రహ్మణ్యంగారు, (3—39 పుటలు) 1978 ముద్రణ.

ఇట్టి పురాణములయందు గల మాహాత్మ్య ప్రతిపాదకములైన భాగములను-ఆయా మతములవారు - ప్రత్యేక గ్రంథములుగా రచించిరి-అట్టివే-

## మాహాత్మ్యములు

మన సారస్వతము-ఆశు-మధుర - చిత్ర - విస్తరములను భేదములుగానే కాక-ఇతిహాసము, పురాణము, కావ్యము, ప్రబంధము, రూపకము, శతకము. ఉదాహరణము-అనునట్టి భేదములతో అనేక విధములుగా విస్తరించినది. కావ్య ప్రక్రియలోనే-కొందరు-క్షేత్ర - స్థల — పురాణములను గ్రహించి-మాహాత్మ్య గ్రంథముల వ్రాసిరి. పురాణముల నుండియే ఈ పద్ధతి పుట్టినది, అయినను - వీనియందు పురాణముల ధర్మము గౌణముగానే యుండును, భక్తి కొరకు - కథ కొరకు పురాణములు-క్షేత్రస్థల పురాణములు మాత్రము-కవికొరకు - అతని కవిత్వము కొరకు పుట్టినట్లుండును, ఇట్లున్నంతమాత్రమున - వీనియందు—కథా కథనచాతుర్యముగాని-శిల్పవైదగ్ధ్యముగాని కొరవడనివై జనులకు కథాశ్రవణాభిరుచిని పెంపొందించుసనటలో ఎట్టి సంశయమును లేదు, మన ప్రబంధాల కన్న గొప్పనైన గౌరవాన్ని ఈ మాహాత్మ్య గ్రంధాలు పొందినవి.

(ఉదా—పాండురంగమాహాత్మ్యము, శ్రీకాళహస్తిమహాత్మ్యము)

ఈమాహాత్మ్యగ్రంధశాఖకు మొదట శ్రీకారమునుచుట్టినవాడు-ఎర్రాప్రెగ్గడ ఆయన తన నరసింహపురాణమునకు 'మాహాత్మ్యము'అని పేరు పెట్టకున్నను—మాహాత్మ్యచ్ఛాయలోచేరిన గ్రంథమే.

ఇక వీనికి అన్వర్థాభిధానమును కల్గించి—సంపూర్ణాకృతితో ప్రకాశింప చేసిన మహాకవి-శ్రీనాధుడు, ఆయన శివరాత్రిమాహాత్మ్యము, కాశీఖండము, భీమఖండములు-అట్టివి,

వస్తువైవిధ్యమునుబట్టి-మాహాత్మ్యముల గ్రంధములు-స్థల-దైవ-తీర్థముల వైనను—వానియందవాంతరభేదముల నిట్లు విభజింపవచ్చును,౧

---

౧ మాహాత్మ్యముల గ్రంథనామములు మచ్చునకు చూపబడినవి ఈసందర్భముగా నేను, నేడివరకు ముద్రణగాని ప్రశస్తమైన మాహాత్మ్య గ్రంధములను కొన్నిటిని సేకరించినాను. మిత్రులు కపిలవాయి లింగమూర్తిగారివద్ద. సాల గ్రామమహాత్మ్యము' మరికొన్ని - శైవ—వైష్ణవ—మత—ప్రతిపాదకాలైన మాహాత్మ్యగ్రంథములు గలవు, మాహాత్మ్యములంగూర్చి ఎవరైనను పరిశోధన చేసి పెద్ద'సిద్ధాంతవ్యాసమును'సిద్ధము చేయవచ్చును

| | | | |
|---|---|---|---|
| ౧ | పర్వదినమాహాత్మ్యములు | — | ఉ॥ శివరాత్రిమాహాత్మ్యము. |
| ౨ | వారమాహాత్మ్యములు. | — | సోమవారమాహాత్మ్యము, |
| ౩ | మాసమాహాత్మ్యములు | — | కార్తీక-మాఘమాహాత్మ్యములు. |
| ౪ | క్షేత్రమాహాత్మ్యములు. | — | అహోబిల-కాశీ-భీమ-శ్రీరంగ- |
| ౫ | భగవన్మాహాత్మ్యములు. | — | ఉద్భటారాధ్యచరిత్ర. |
| ౬ | భగవద్భక్తమాహాత్మ్యములు. | — | శ్రీమద్రామానుజులు-పరమయోగి విలాసం, బసవపురాణం. |
| ౭ | భగవద్వస్తుమాహాత్మ్యములు | — | సాలగ్రామ, రుద్రాక్ష-తులసి- |

వీనియందు—క్షేత్రమాహాత్మ్యములలోనే స్థల-తీర్థ-మాహాత్మ్యములు చెప్పబడుచుండును, పాండురంగ—లో-స్థల-దైవమాహాత్మ్యములు చెప్పబడినవి, ఘటికాచలమాహాత్మ్యము—కేవలము స్థలమాహాత్మ్యమునే చెప్పినట్టిది, శ్రీరంగమాహాత్మ్యముమాత్రము—స్థల—తీర్థ—క్షేత్రమాహాత్మ్యముల తెల్పినట్టిది, పైన తెల్పిన౭విభాగములేగాక—భగవద్గీత—కన్యకాపరమేశ్వరి—గౌడ—పురాణకథలు (?) మాహాత్మ్యములుగా వచ్చినవి,

ఎన్ని విధములైన రచనలు వచ్చినను-వీని ప్రధాన ప్రయోజనము - భగవద్భక్తిని-అనేక విధములుగా-ఆకర్షవంతముగా జూపి - భక్తిని ప్రచారము చేయుట, భక్తునకు సులభముగా మోక్షప్రాప్తి కలిగించుట (కలుగునని తెల్పుట) అనియే చెప్పవచ్చు.

ఇట్టి వీనిలోని కథ లన్నియును-నదీనదములు వారాశియందు చేరినట్లుగా-మాహాత్మ్యప్రతిపాదకములై ఆయా క్షేత్రములకు హత్తుకొన వలయును, వీనినే స్థూలముగా—

౧ విష్ణు మాహాత్మ్యములు

౨ శివమాహాత్మ్యములు.

అని ద్విధావిభక్తములుగ చేయవచ్చును, ఉభయ మతములవారికిని ఆయాదేవతలే ముఖ్యులుగదా! శివసంబంధములైన మాహాత్మ్యములకన్న—విష్ణువును గూర్చిన

మాహాత్మ్యములే ఎక్కువగా గలవు, అందుకు ముఖ్యకారణము—విష్ణువునకు అవతారవైశిష్ట్యముండి శివునకు లేకపోవుటయే యని చెప్పవచ్చును,

ఎందరో కవులు—ఎన్నియోమాహాత్మ్య గ్రంధముల వ్రాసినారు. వీని యందు ముద్రణగానివే ఎక్కువగా గలవు, ముద్రింపబడిన వైనను—కొన్నియే నిలిచినవి. మరికొన్ని ప్రచారసు చెందినవి.

వీనిని వ్రాయుకవి యెంత ప్రతిభావంతుడైనను-ఎట్టి ఆవేశమునకు విశృంఖలతకు లోనుగాక భక్తికే లొంగియుండివలసివచ్చును, భక్త్యావేశమే దీనికి ముఖ్యము, ఈ పద్ధతిలో వ్రాయబడి నిలిచి ప్రచారము లైనవానిలో బసవ పురాణము నృసింహపురాణము, కాశీఖండ భీమేశ్వరరాపుణములను ప్రస్తుత మైన శ్రీ రంగమహత్వమును, మరియు, పాండు రంగ,ఘటికాచల, శ్రీకాళహస్తి మాహాత్మ్యములను చెప్పవచ్చును.౧

## రాచకొండసంస్థానము-
## కవిపండితులు:-

'—ఎట్లు మెప్పించెదో నన్ను నింకమీద
రావు సింగమహీపాలు ధీవిశాలు
నిండు కొలువున నెలకొనియుండి నీవు,
సరస సద్గుణ నికురుంబ శారదాంబ,'

అని మహాకవిసార్వభౌముడైన శ్రీనాధుడే జంకిన విద్వదాస్థానము-రాచకొండ, ఇది సంస్కృతాంధ్రసాహిత్యాలకు బంగారుకొండైన రాచకొండ-ఈసంస్థానములోనే- గౌరన- వర్ధిల్లినాడు. అతని పుత్రుడు భైరవుడు కూడా తండ్రితో కలిసినాడు, అట్టి సంసానమునుగూర్చి-అచ్చట వర్ధిల్లిన కవిపండితుల

---

౧. మాహాత్మ్య గ్రంధముల గూర్చి—చూ. 'ఆంధ్రవాఙ్మయ సూచిక' (జాబితా)
'దక్షిణ దేశీయాంధ్రవాఙ్మయము-నిడుదవోలు వెంకటరావుగారు (1960 ఋ. పుటలు—102-105)

గూర్చి సంగ్రహముగా తెలిసికొనుటకు ముందు రాచకొండ సంస్థానమును-పరిచయము చేయుట ముఖ్యము-

క్రీ.శ.1323 తెలుగుదేశచరిత్రకు దురదృష్టకరమైనది. అప్పటివరకు కీర్తిచంద్రికలతో ప్రకాశించిన కాకతీయసామ్రాజ్యము ఈ 1323లో-మహమ్మదీయ సేనావాహినికి తట్టుకొనలేక కూలిపోయినది (ఓరుగల్లు దుర్గము)అనంతరము ముస్లిములు భీభత్సమైన పద్ధతిలో తెనుగుదేశాన్ని ఆరునెలలు ముట్టడించి కొంతభాగమును వశపరచుకున్నారు, ఈకాలములోనే తమిళదేశమందలి మధుర రాజ్యముకూడా వీరి వశమైన దని పాండ్యదేశవృత్తాంతము తెల్పుచున్నది. తెలుగుదేశ మంతయు(కళింగముమినహా)ఉలుఘ్‌ఖాన్ అనువాని అధికారముక్రిందికి వచ్చి-ఢిల్లీతుగ్లక్ రాజ్యములో ఒకభాగ మయినది. ఉలఘ్‌ఖాన్ ఓరుగల్లుకోటకు సుల్తాన్‌పుర మనిపేరు పెట్టినాడు. రాజుల ఆజ్ఞకు లోబడి పరిపాలన సాగించుటకు ఓరుగల్లులో ఒక అధికారి నియమింపబడెను-మొత్తముపై తెనుగుదేశము-తెనుగువారి సంస్కృతి-ఒకటేమి-అన్నియును తురుష్కుల పరిపాలనమున బడినవి, వీరికి మనదేశముపై అధికారము కలుగుటకు ఇదియే ప్రధమ పర్యాయము.

ప్రతాపరుద్రభాను డంతర్హితు డగుటతో తెనుగునాట యవనాంధకారము వ్యాపించినది. దూరీకృతమైన అధర్మము వీరి పరిపాలనలో పెచ్చుపెరిగినది, ప్రజలకు స్వాయత్తతాభావము లేనేలేదు. వీరి దేవాలయములు వారికి మసీదులైనవి. ఈవిధమగు వారి పరిపాలనను అంతమొందించి అఖండ ఆంధ్ర సామ్రాజ్యస్థాపన చేయువారు ఎవరు? అనునది ఆలోచనగానే యుండెను,౧

1323న జరిగినయుద్ధములో ప్రతాపరుద్రునికి అండగా నుండి పోరుసల్పిన వాడెందరో మరణించగా— బెండపూడి అన్నమంత్రి. కొలని

౧ విలసశాసనమున తురుష్కుల దురాగతాలు వర్ణింపబడినవి-దీనిని-మరికొన్ని విశేషములను. చూ. విజ్ఞానసర్వస్వము(3సం. తెలుగుసంస్కృతి. పుటలు-279-281)

రుద్రదేవుడు, రేచర్ల సింగమనీడు (సింగమ నాయకుడు) ఇట్టివారె బ్రతికి బయట పడిరి. ప్రతాపరుద్రుని కాంచీదేశ దండయాత్ర సమయమునందు - అప్ప మంత్రియు - రేచర్ల ఎరదాచానేడు (సింగమనీని తండ్రి) సింగమనేడు - ఆ ప్రభువునకు బాసటగా నిల్చినారు.

ఇట్టి యోధులు మహమ్మదీయులకు బానిసత్వము చేయుచు బ్రతుకుట యనునది భరింపరాని విషయము. అందరు ఏకమై - ఒక నిర్ణయానికి వచ్చి - పోచినాయకుని పుత్రు డగు - ప్రోలయనాయకుని నాయకునిగా ఎన్నుకొని తిరుగు బాటు చేయ నిశ్చయించిరి (1325—1333). అతిశ్రమతో వీరి కృషి ఫలించినది— ఇతర రాజన్యులు తోడై నిల్చినారు, తత్ఫలితమే ఓరుగల్లు రెడ్డి సామ్రాజ్యములు, మొదలగునవి ఏర్పడినవి.

ప్రోలయ నాయకుడు, కాపయ నాయకుడు (1332-1368) తెలుగువారి పారతంత్ర్యాన్ని పోగొట్టిన తరువాత-బహమనీ సుల్తానుల బెడద తప్పినా రేచర్ల వారి బాధ తప్పలేదు - తమతండ్రి సింగమ నాయకుడు జల్లపల్లి యుద్ధమున (1361) మరణించగానే అనవోత - మాదా నాయకులు కత్తుగట్టి ఓరుగంటి దుర్గ ముపై దండయాత్ర చేసిరి అప్పటికే దండయాత్రలవలన బాధపడి కోలుకొను చున్న కాపయనాయకుడు - వీరితో యుద్ధము చేయక తప్పినదికాదు, విధి బలీయ మైనది. తెలంగాణమును పారతంత్ర్యమునుండి విడిపించిన ఆ మహాయోధు డస్త మించినాడు - చరిత్ర మరియొక విధముగా మారినది

ఈ యుద్ధము, లోగా పొందిన పారతంత్ర్య విముక్తివలన - తెలుగుదేశ మున మరియొక రాజ్యము వర్ధిల్లినది. అదియే రాచకొండ రాజ్యము, ఒకనాడు కాకతీయులకు సామంతులుగా నున్న రేచర్లవారు - ఈనాడు ప్రభువులైరి. వారు దేవరకొండను - రాచకొండను బలిష్ఠ దుర్గాలతో అలంకరించినారు. ఈ రాచ కొండనే - రాజాచలము - రాజగిరి అని యందురు, (రేచర్లవారు పరిపాలించిన కొండ కావున రేచర్లకొండ అనియు పేరుగలదు) నేటి నల్లగొండ జిల్లాలో నల్ల గొండకు - 40 మైళ్ళ దూరములో సంస్థాన నారాయణపురానికి ఏడు మైళ్ళ దూరములో ఈ రాచకొండ గలదు, ఎత్తైన బారులుదీర్చి యున్న అరిభయంకర మగు కోటగోడలు, పర్వతాలు - నేడు - ఈనదశను వెల్వరించుచు - గతచరిత్రను గుడ్లగూబల ఘూంకార ధ్వనులతో తెల్పుతు కన్పించును, ఇచటికి చేరుటకుకూడా నేడు సరియైన బాటలేదు ఈ సంస్థానమును పరిపాలించిన రాజులు-వారి కాలము

| ౧. ఆరుద్ర గారి నిర్ణయము | ౨ తేవాల సత్యనారాయణశర్మగారి నిర్ణయము |
|---|---|

(సమగ్ర ఆంధ్ర సాహిత్యం IV సం. 13 పుట)

| క్రీ. శ. | |
|---|---|
| 1335-1336 | ఆశీతివరాల సింగమ నాయకుడు * |
| 1361-1384 | రాచకొండలో అనపోతా నాయకుడు దేవరకొండలో మాదానాయకుడు. |
| 1384-1399 | రాచకొండలో కుమార సింగభూపాలుడు దేవరకొండలో పెద వేదగిరి నాయకుడు |
| 1399-1421 | రాచకొండలో రెండవ అనపోతా నాయకుడు. దేవరకొండలో పెద వేదగిరికుమార మాదా నాయక రామచంద్ర నాయకులు. |
| 1421-1430 | రాచకొండలో మాచా నాయకుడు. |
| 1430-1475 | రాచకొండలో ముమ్మడి సింగ నాయకుడు. దేవరకొండలో కుమార మాచా నాయకుని కొడుకు లింగమనేడు. |

* (ప్రతాపరుద్రుడు మెచ్చి అశీతి [80] వరాలు ఈయటమువల్ల — అశీతివరాల సింగమ నాయకుడు)

(ప్రారంభము నుండి)

| | క్రీ. శ. |
|---|---|
| 1 బేతాళనాయుడు | 1225-1262 |
| 2 దామా - ప్రసాదిత్య రుద్రానాయడు | 1235-1265 |
| 3 వెన్నమ - సబ్బి నాయడు | 1265-1295 |
| 4 ఎఱదాచనేని - నల దాచనేని | 1295-1326 |
| 5 I సింగమనేని | 1326-1361 |
| 6 I అనపోతానేడు | 1361-1384 |
| 7 II సింగ భూపాలుడు | 1384-1400 |
| 8 II అనపోతానేడు | 1400-1425 |
| రావుమాదానేడు (II అనపోతానేని సోదరుడు) | 1420-1430 |
| 9 III సర్వజ్ఞరావు సింగ భూపాలుడు | 1425-1475 |
| లింగమనేడు | 1420-1482 |

---

౨. రాచకొండ చరిత్రము - మొదటి పేజీలో

ఈ సంస్థానాన్ని గురించి రాజుల గురించి ఎన్నో కథలు వాడుకలో గలవు. అచ్చటికి సమీపంలో భైరవ విగ్రహము గలదు, ఆ రాజ్యమేలిన ఒపతి ప్రభువు విధించిన రొమ్ము పన్ను పరీక్ష భరింప లేక మరణించిన ఒక చాకలి వనిత - యీ విగ్రహ మని చెప్పుదురు (చూ. ఆంధ్రప్రభ వారపత్రిక - 4-3-64)

అనపోతా నాయకుడు ఆంధ్ర సామ్రాజ్య ముఖ్యపట్టణమైన ఓరుగల్లును జయించినా రాజధాని మాత్రము రాచకొండనే చేసుకొని - తమ్ముడైన మాదా నాయకునికి దేవరకొండ దుర్గము నిచ్చి - పాలన సాగించినాడు - ఇక వీరి కాల మున వర్థిల్లిన కవిపండితులు - వారి రచనలు——

ప్రభువులు యుద్ధతంత్రమున ఎంత కుశలులో - సాహిత్యరంగమున అంతటి ప్రవీణులై - రసికులై - సాహితీసమరాంగణసార్వభౌము లైనారు, దానికితోడు — రాజులే స్వయముగా ఉద్దండకవిపండితు లగుటవలన-'విద్వానేవ విజానాతి———' అనే నానుడి వీరి కన్వర్థ మయినది.

కవి పండితపోషకులు - దానధర్మదయాశౌండులునైన వీరియందు- సర్వజ్ఞ బిరుదాభిరాముడైన — కుమార సింగభూపాలుడు - రసార్ణవసుధాకర మను అలంకారశాస్త్రమును, శార్‌ఙ్గదేవుని సంగీతరత్నాకరమునకు సంగీత సుధాకర మనువ్యాఖ్యను వ్రాయుటయేగాక - రత్నపాంచాలిక (కువలయావళి) యను నాటకమును వ్రాసినాడు, కందర్పసంభవ భాణముకూడా ఇతని రచనయే అని కొందరి యూహ, రసార్ణవసుధాకరము సమగ్రమైన అలంకారశాస్త్ర గ్రంథము, అమరకోశమునకు వ్యాఖ్య వ్రాసిన బొమ్మకంటి అప్పయార్యుడు - చమత్కారచంద్రికాకర్త విశ్వేశ్వరుడు - ఇతని శిష్యుడు నాగనాథుడు - వీరి యాస్థానమున నున్నవారే నాగనాథుడు - విష్ణుపురాణమును ఆంధ్రీకరించినాడు (అలభ్యం) మదనవిలాస మనే భాణము వ్రాసినాడు, ప్రబంధరత్నావళియందు దీనిలోని దని యొకపద్య ముదాహరింపబడినది, విశ్వేశ్వరుడు చమత్కార చంద్రికనే గాక — వీరభద్రవిజృంభణము, కందర్పసంభవము, కరుణాకంద ళములరచించినట్లు చమత్కారచంద్రికయందు తెల్పినాడు.

సింగభూపాలపుత్రుడైన మాధవనాయకుడు శ్రీమద్రామాయణమునకు రాఘవీయవ్యాఖ్య వ్రాసినాడట. ముమ్మడి సింగభూపాలుడు మహాపరాక్రమ వంతుడుగ అభివర్ణింపబడెను. శ్రీనాధమహాకవి ఇతనినే దర్శించి—కనకాభిషేక మును చేయించుకున్నాడు —భాస్కర రామాయణకర్తలలో నొకడైన అయ్య లార్యుడు పెదవేదగిరినాయని కాశ్రితుడు ముమ్మడి సింగభూపాలుని కాలము లోనే పోతనమహాకవి విచ్చేసినాడు. వీరేగాక - ప్రథమాంధ్రకవితాపితామహు డైన కొరవి సత్తెనారన — రామాయణమువ్రాసి - ఈ రాజులమన్ననల పొంది నాడు ఇతనిమనుమడైన గోపరాజు సింహాసనద్వాత్రింశిక యనుచక్కని గ్రంథమును వ్రాసినాడు — ద్విపదకవితకు ఎనలేని ఆదరమును కల్గించి హరి శ్చంద్రోపాఖ్యాన — నవనాధచరిత్ర లనుద్విపదలనే గాక, లక్షణగ్రంథమును, నవగ్రహ స్తవమును రచించిన గౌరన —* ఇతని పుత్రుడు - శ్రీరంగమాహా త్మ్యకర్తయగు భైరవుడు - ఇచటివారే.

సంస్కృతమునందు నిరోష్ఠ్యరామాయణము. ఉదారరాఘవమును, నాట కము — అవ్యయ సంగ్రహనిఘంటువును వ్రాసిన శాకల్యమల్లన -౧ సర్వజ్ఞ సింగమనాయకుని కొలువులో నున్నప్పుడే — వేదాంతదేశికులవారి కుమారుడు

---

* గౌరనామాత్యపౌత్రుడు - రామయమంత్రిపుత్రుడు - 'త్రిలోకభేది' అనుకవికలడు. (ఇది ఇతని బిరుదమో ! నామమో ? అనుమానము) ఇతడు 'సకలధర్మసారమను గ్రంథమును వ్రాసెను. అసమగ్రముగానున్న యీ ప్రతిని గూర్చి — కవిని గూర్చి - డా॥ బి. రామరాజుగారు ఒక వ్యాసమును వ్రాసినారు. రామయమంత్రి - భైరవునకు అగ్రజుడా ? అతనిప్రసక్తి భైరవుని రచనల్లోలేదు. పరిశోధించవలసిన అంశము. ఉస్మానియా విశ్వ విద్యాలయం సంస్కృత ఎకాడమిలో గల అసమగ్ర ప్రతి రామరాజుగారి వ్యాసానికి ఆధారము. (చూ. త్రిలోకభేది - 1 ఉదయభాను పత్రిక డిసెంబరు 1961 - సంపాదకులు — శ్రీ వల్లపురెడ్డిబుచ్చారెడ్డిగారు.

(శిష్యుడైన) వరదాచార్యులవారు వేంచేసి - వాదించి - విజయము నందినాడు. రాజు సంతోషించుటయే గాక - అప్పటినుండి - శైవమును వదిలి శ్రీవైష్ణవమును స్వీకరించెనట.

ఈ కవిపండితులే గాక - మరికొందరు శాసనకవులు గలరు. వారిని గూర్చిన సమాచారముసైతము లభించుట లేదు, ఉమామహేశ్వరశాసన రచయిత (క్రీ. శ. 1376) మూలు ఉపాధ్యాయుడు 'పదవాక్యప్రమాణజ్ఞుడు' చిత్రకవితారచనాశక్తి గలిగిన ఈ శ్లోకమయ శాసనములో నొక చక్రబంధశ్లోకమును రచించినాడు.

రావు మాధవభూపాలుని ధర్మపత్ని వేయించిన (నాగాంబికాదేవి తటాక నిర్మాణ సమయమందు) శాసనకర్త శంభునాథుడు. ఈ శాసనమున శైలీ పటుత్వము గలిగిన రచన గలదు పీరేగాక మరికొందరు శాసనకవుల నామధేయములు తెలియుటలేదు

ఈ సంస్థానముతో అంతగా సంబంధము లేకున్నను చుట్టుపట్ల వర్తిల్లిన వారిలో - సూర్యాపేట తా॥ పిల్లలమర్రి గూర్చి ప్రశంసించిన, పినవీరభద్రుడు, హరివంశము, భాగవత షష్ఠస్కంధకర్తయగు - సింగన, నరసింహ పురాణమును వ్రాసిన హరిభట్టు (ఖమ్మంమెట్టు ఇతని నివాసము) మొదలగు వారు-గలరు.

"కళ్యాణమస్తు జగతాం సతతం త్రయాణాం
సంవర్ధితోభవతు వైదికఏవ మార్గః

---

౧ శాకల్యమల్లనను గూర్చి — అతనిరచనలగూర్చి — చూ॥ దశరథరాజ నందన చరిత్ర పీఠిక, ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ వారు దీనిని 1971 లోను. 1979 లోను ముద్రించిరి. తెలుగువారు సంస్కృతమునకు చేసిన సేవ — వారి రచనలు, ముద్రితాముద్రితాల గూర్చి, డా॥ బి. రామరాజుగారి contribution of Andhra to Sanskrit Literature - అను గ్రంథమున గలదు (అముద్రితము)

సారస్వతాని సరసాని కవీశ్వరాణాం
మాత్సర్య దిగ్ధ హృదయా నకలంకయంతు"

ఇక వీరియందు ముఖ్యులు - తండ్రికొడుకులైన — గౌరన-భైరవుల-కాలము - వారి రచనలగురించి తెలిసికొందము.

## గౌరన-భైరవుల- కాలనిర్ణయము.

పాలకురికి సోమనాథుని తరువాత. ద్విపదకవితకు ప్రాచుర్యము కలిగించి- సలక్షణమగు కవిత్వమును వ్రాసి 'ప్రతివాది మదగజ పంచాననుడై - సాహిత్యలక్షణ చక్రవర్తియై నుతి కెక్కిన శివకవి-గౌరన,హరిశ్చంద్రోపాఖ్యాన, నవనాథ చరిత్రము అను ద్విపద కృతులనేగాక-లక్షణదీపిక యనుసంస్కృత కృతిని, పద్యరూపముగా నవగ్రహస్తవమును ౧ రచించినవాడు

ఈమహాకవి పుత్రుడే భైరవుడు, మన సాహిత్యమున తండ్రికొడుకు లిద్దరు మహాకవు లగుట తక్కువగా కన్పించును, నేటివరకు మనపరిశోధకులు గౌరన కాలనిర్ణయమున భిన్నమైన యభిప్రాయములను వెలువరించుచున్నారు, ఇతడు రాచకొండ సామ్రాజ్యమునందలి మంత్రుల కుటుంబమునకు చెందినవాడు- రాచకొండప్రభువు లేయేకాలములం దెవ్వరున్నది(౧౫,పుటలో)ప్రత్యేకముగా జాబితా ఈయనైనది

ఇంతకు పూర్వము ఈకవికాలనిర్ణయవిషయమై జరిగినవాదోపవాదముల వివరించుటకన్న-పరిశోధన చేసి నిగ్గుతేల్చి పెద్దలైనవారు నిర్ణయించిన కాలముల తెలుసుకుందము

---

౧ నవగ్రహస్తవములోనివని రెండుపద్యములు ప్రబంధరత్నావళి. ౩౦—౩౧పుటలలో గలవు, (1976ము, ఇచ్చట గ్రంధములో పేజీలు వ్యత్యస్తముగా పడినవి.) పీఠికాకర్త నిడుదవోలు వెంకటరావుగారు, మొదట 1918లో వేటూరివారు దీనిని ప్రచురించిరి,

| | |
|---|---|
| వీరేశలింగంపంతులుగారు— | 1380-1440 |
| చాగంటిశేషయ్యగారు— | 1385-1445 |
| ఆరుద్రగారు— | 1385-1445 |
| శ్రీమతియశోదారెడ్డిగారు— | 1380-1455 |
| తేరాలసత్యనారాయణశర్మగారు— | 1356-1425 |

ముఖ్యముగా వీరు గౌరనకాలము-ఈవిధముగా నుండగలదని నిశ్చయించి నారు. అందరి అభిప్రాయాలలోను పదిసంవత్సరాలు అటు-ఇటు తేడా కన్పించును.

గౌరన-రాచకొండపాలకుడైన మాధవక్షితిపాలుని పుత్రు డగుపోతరాజు నకు అనుంగుతమ్ముడైన అయ్యల మంత్రికి పుత్రుడు-(ఇది అతని గ్రంథాలలోని వ్రాతవలన తెలియుచున్నది.)ఈఅయ్యలమంత్రి దేవరకొండలో రాజ్యము చేయు చున్న మాదానేని(1376క్రీ.శ.)వద్ద మంత్రిగా పనిచేసినాడు. గౌరనమహాకవికి-అటురాచకొండతోను. ఇటు దేవరకొండతోను విడదీయరాని సంబంధ మేర్పడు టకు ఇది యొకముఖ్యకారణ మనవచ్చును.

రాచకొండవారిలో మాధవనామధేయులు ముగ్గురు తెలియుటవలన గౌరనను—అటూ యిటూ లాగినారు, దానితో కాలనిర్ణయములు వ్యత్యస్తము లైనవి.-

'ఇతడు మొదటి సింగయ పుత్రుడైన మాధవునికాలపువాడే (1361—1384)గానిరెండవసింగయపుత్రుడైన మాధవుని కాలమువాడుంమాత్రముకాడని-తేరాల సత్యనారాయణశర్మగారి వ్రాతం దీనిప్రకారము, 1356-1425 గౌరన కాలము కాగలదు. దీనితోశ్రీనాధునిఅవసానదశయందు గౌరన యున్నట్లు తెలియును.

---

౧ అవతారికలు—చరిత్ర 122 వుట,

ఆంధ్రప్రదేశసాహిత్య ఎకాడమీవారు ప్రచురించిన గౌరనహరిశ్చంద్రో పాఖ్యానము పీఠికలో యశోదారెడ్డిగారు-1380-1455అని గౌరనకాలమును నిశ్చయించినారు. ప్రతివారికి తమతమఅభిప్రాయములను వ్యక్తపరచుకునే ఆధారాలు లభించుచునే యున్నవి.

ఇట్లుండగా-శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు-''నవనాథచరిత్రకృతి నందుకున్న శాంతభిక్షావృత్తి శాసనము శ్రీశైలములో ఉన్నది కాబట్టి గౌరన ఆకాలమువాడే-''అని వ్రాసినారు ౧ శ్రీనాధుని శివరాత్రిమాహాత్మ్యమును అంకితము నందిన శాంతభిక్షావృత్తి, గౌరన కృతినందిన శాంతభిక్షావృత్తి-ఒక్కరా? కాదాఅనేదికూడా సంశయమే. ఈభిక్షావృత్తులు ఎక్కువగానే యున్నారు.౨

గౌరనకాలము-1380-1455 అని. 1356-1425అని-యశోదారెడ్డి గారు—తేరాలవారు నిర్ణయించినారు. వీరి అభిప్రాయములు సమంజసముగా కలవు. వీని ననుసరించి ఇతని పుత్రుడగు భైరవునికాలమును తెలిసికోవలెను.

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు భైరవుడు1570ప్రాంతములో నుండుటకు అవకాశ మున్నదని-కొన్ని యుపపత్తులతో శ్రీరంగమహత్త్వము పీఠిక యందు వ్రాసిరి. (గౌరన1500ప్రాంతమువా డని వారిభావన)

భైరవుని - శ్రీరంగమహత్వమునుండి - ముద్దరాజు రామన తన లక్షణగ్రంథమునందు కొన్ని పద్యముల నుదాహరించెను. అప్పకవియు రెండు పద్యముల నిచ్చినాడు. గణపవరపు వేంకటకవి - విద్యావతీ దండకమున భైరవుని పేర్కొనెను. మరియు - వీరభూపాలీయమునందు భైరవుడు ప్రామాణికుడుగా పేర్కొనబడినాడు. సులక్షణసారకర్త భైరవుని కవిగజాంకుశపద్యముల నుదాహరించెను. వీ రందరియందును ముద్దరాజు రామన పూర్వుడు, తన కవిసంజీవనిలో-కవిగజాంకుశపద్యముల నిచ్చెను. ఈ యుపపత్తు లాధారముగా కవిగారు భైరవుని - 1570 వాడని నిశ్చయము

---

౧ భారతి. 1965 అక్టోబర్ పుట. 77. ౨ శాంతభిక్షావృత్తి శాసనము కాలము. క్రీ.శ. 1449 అని కూడా యిచ్చినారు.

చేసిరి. వారి అభిప్రాయము సరిగా దసునంతటి శక్తి లేదు - కాని - మరియొక ఆధారముతో నిర్ణయింపవచ్చును.

భైరవకవి శ్రీరంగమహాత్మ్యమును చాగయరామదేవ పండితునకు అంకితము చేసినాడు. ఈ చాగయరాముడు - బహామనీరాజ్యమందు ఒక మాండలికుడుగా నున్న సైఫఖాన్‌వద్ద మంత్రియగు విఠలేంద్రునికి సోదరుడు

క్రీ. శ. 1443-1444 సంవత్సరములలో బహమనీ సుల్తానులు విజయనగరముపై దండయాత్ర చేసిరి. ఈ సమయమునందు - రాచకొండలో - ముమ్మడి సింగనాయకుడు (1430-1475) దేవరకొండలో లింగమనేడు - అధికారమునందు గలరు. వీరికాలములోనే దేవరకొండ రాచకొండల్లో రాజకీయ ములైన మార్పులు వచ్చినవి. అందులో ముఖ్యమైనది. రెండవ అల్లాఉద్దీన్ బహమనీరాజ్యాధిపతియై (1435 లో) తన తమ్ముడైన మహమ్మద్ ఖానుకు రాచకొండ జాగీరుగా నిచ్చినాడట - దానితో రాచకొండ తురుష్కప్రభువుల హస్తగత మైనది. రాజ్యమునందు అల్లకల్లోలములు జరిగినవి - దేవరకొండ ప్రభువు తన రాజ్యమును వదలి వెళ్ళి - ఎచ్చటనో తలదాచుకొనుటయో ? లేక వీరస్వర్గ మందుటయో జరిగియుండును - రాచకొండ - దేవరకొండ - రాజులయందు వీరే చివరిరాజులు, (1458 నాటిశాసన మొకటి సింగభూపాలునిది బెల్లంకొండయందుండుట దీనికొకసాక్ష్యము)

మహమ్మదీయుల దండయాత్రలు-రాజ్యాక్రమణ - హిందూప్రభువులు - అందున ఆదరించేవారు - కరువైనారు - అప్పటికి రాచకొండ కొలువులో నున్న కవిపండితులు తురుష్కప్రభువుల నాశ్రయించి బ్రతకవలసినస్థితి దాపురించినది, ఇట్టి స్థితిలోనే భైరవకవి - ఇమ్మడిసైఫ్‌ఖానువద్ద మహామంత్రిగానున్న చాగయరామపండితుని ఆశ్రయించి గ్రంధము నంకితముచేసి యుండవచ్చును. ఈ పై కారణాలవలన - భైరవుని కాలము - ఇట్లుండును.

| | |
|---|---|
| గౌరన- | 1380-1455—1351-1425 |
| తురుష్కులదండయాత్ర- | 1443-1444—1443-1444 |
| భైరవుడు- | 1400-1460—1376-1460 |

ఈవిధముగా సీతనికాలమును—1376-1460 మధ్యలో నిశ్చయింప వచ్చును,౧ దీనివలన అంతగా విప్రతిపత్తి యుండదు. చివరి దినాలలో శ్రీరంగమహత్వమును వ్రాసి చాగయరామునికి అంకితముచేసి యుండును. ఇంతకన్న మరిన్ని చక్కని ఆధారములు లభించిన-ఇతనికాలనిర్ణయవిషయమున మార్పుల నంగీకరింపవచ్చును. భైరవకవి పేర్కొనిన సైపఖాన్(ఇమ్మడి)ను గూర్చిగాని-కృతిభర్తయగు రామదేవపండితునిగూర్చిన విశేషములు ఎచ్చటా లభింపలేదు.

('శ్రీరంగమహత్త్వము'నుగూర్చిన శీర్షికలో-కృత్యాదిలోని వ్యక్తులు-వారినిగూర్చి తెలిసినంత-తెలుసుకుందము.)

సైపఖాన్‌వద్ద మంత్రిగానున్న విరలేంద్రునిగూర్చి-భైరవుడు కొద్దిగా తెల్పినాడు ఆపద్యము లివి.

పటుధాటీముఖ జృంభమాణ కలహప్రౌఢార్వ సంఘాత వి
స్ఫుట రింఖాపుటకోటి ఘట్టన పరిక్షుణ్ణక్షమోద్య ద్విశం
కట ధూళీపటల ప్రశోషిత మహాకర్ణాటసేనా సము
ద్భట పాథోనిధి విర్ఠలేంద్రుఁ బురణింపన్ మంత్రు లేరీధరన్. (౧-౩౦)

చండ దిగ్వేదండ కాండధూర్వహ మహీ
మండలోద్ధరణ సమర్థ మగుచు,
దుర్వార పరిపంథి సర్వ సంపద్గర్వ
నిర్వాపణక్రియా నిపుణ మగుచు,
వేదాదివిద్యా వినోద విద్వజ్జనా
మోదాతిశయ సముత్పాది యగుచు

---

౧ భైరవుని రత్నపరీక్షను అంకితముగొన్న ముదిగొండవీరభద్రునకి-ధనాభిరామకర్తయైన నూతనకవి సూరన శిష్యుడు. ఇతనికాలము 1420-1475 (చాదాపు). ఇది, భైరవుని కాలమున కుపకరించును (భైరవుని కృతులు' శీర్షికన రత్నపరీక్ష-గలదు.)

జంభజిన్మదకుంభి కుంభీనసా ధీశ
శంభుభూభృత్ ద్యుతి స్వచ్ఛ మగుచు—

బరఁగు నేమంత్రి భుజబల ప్రకటశౌర్య
దాన సత్కీర్తు లప్రతిమాన మహిమ
నాతఁ డిమ్మడి సైపఖానాది రాజ్య
భారధుర్యుఁడు విరల ప్రభువరుండు. (౧-౩౧)

ఇక — కృతిభర్తను గూర్చి చెప్పిన వానిలో—నొకటి—(౧-౭౧)

సింహతలాటాంకున కుప
సంహృత కర్ణాటకటక జననాథ చమూ
రంహునకుఁ జారులక్షణ
సంహననుకు నమితభాగ్య సంపన్నునకున్,— అని తెల్పినాడు.
చారిత్రకముగా పనికివచ్చుట కీ పద్యములు కొంత తోడ్పడును.

క్రీ. శ. 1443-'44 సంవత్సరాలలో బహమనీసుల్తానులు విజయనగరం మీద దండయాత్ర చేసినప్పుడు - దానిలో విరలుడు పాల్గొని — తన బలపరాక్రమమును ప్రదర్శించియుండగా — దానినే 'పటుధాటీ...' పద్యమున వర్ణించి నట్లు భావింపవచ్చు. దీనితోపాటు గల పద్యము ('చండదిగ్వేదండ...') కూడ విరలప్రభు శౌర్యమును - 'వేదాది విద్యావినోద విద్వజ్జనామోదమును వ్యక్తపరచు చున్నది, ఈ ౧-౩౧ పద్యములోనే ఇమ్మడి సైపఖాను తెలియుచున్నాడు. ఇత నిని గూర్చిన వివరా లేమీ పేర్కొనబడలేదు, (సైపఖాన్‌కు 'ఇమ్మడి' విశేషణ మెందుకు ?)

రామదేవ పండితుని గూర్చి - కవి కొంత తెల్పినాడు - ఆ పద్యాలలో నొకటి 'సింహతలాటాంకున...'౧-౭౧, ఇతడుకూడా - మహమ్మదీయులు కర్ణాటపైన జరిపిన దండయాత్రయందు పాల్గొనినట్లు —'ఉపసంహృత కర్ణాటకటక జననాథ చమూ రంహునకు'— అనే విశేషణము తెల్పుచున్నది, ఈపద్యాలేగాక - ౩-౮౩ పద్యముకూడా - ఆనాటి రాజకీయ గందరగోళములో - ముఖ్యముగా ముస్లిం ప్రభువుల దురాగతాలతో ప్రజ లెట్లు బాధపడినది వ్యక్తమగును. ఈవిధ

ముగా భైరవుని కాలమును — 1376–1460, 1400–1460 అని భావింపవీలగు చున్నది. ఇంతకుముందు తెల్పినట్లు క్రొత్తగా నింకేమైనా ఆధారములు లభించి కాలనిర్ణయమున కుపయోగించినచో — సంతసింతును. సైపఖాన్ విషయము - తెలిసిన మరింత ఉపయోగకరముగా నుండేది.

## గౌరన రచనల వైశిష్ట్యము

భైరవుడు - తన తండ్రియైన గౌరన రచనలద్వారా ప్రభావితుడైనాడు (ముందు తెల్పుదును)

తెనుగుకవులకు - అనగా గౌరన తరువాత వచ్చినవారికి నవనాథచరిత్ర భిక్ష పెట్టినది. అల్లసాని పెద్దన హిమాలయవర్ణనకు - మూలము - నవనాథ చరిత్రలోని వర్ణ యే అనిన ఆశ్చర్యపడవలసిన అవసరము లేదు.

భైరవుడుకూడా ఋతువర్ణనల సందర్భమున నవనాథచరిత్ర నుపయోగి-చుకున్నాడు. శ్రీగిరి పద్యకావ్యము నీతడు ద్విపదలో వ్రాసినను - గౌరన ప్రతిభ ప్రతి సందర్భమున వ్యక్త మగుచు ఈ గ్రంథమును పైదృష్టితో విమర్శనాత్మకదృక్పథముతో - పరిశీలించి - ప్రచురించుట యవసరము, దీని విశిష్టతను తెలిసికొన్న బ్రౌను పండితుడు - 1842 లో అచ్చువేయించినాడు. దీనిలో వ్యావహారికభాషాపదాలు ఎక్కువగ గలవు. 1937 సం. మద్రాసు విశ్వవిద్యాలయమువారు - దీనిని ప్రకటించిరి. ౧ శబ్దచర్చలకే ప్రాముఖ్యముగా పీఠిక గలదు.

ఇతని హరిశ్చంద్రోపాఖ్యానముసైతము విశిష్టమైన రచనయే, సాంఘిక చరిత్రకు పనికివచ్చు గ్రంథములలో నీతని ద్విపదకావ్యములు ముఖ్యములు -౨

---

౧ Madras University Series – 7. సంపాదకులు - కోరాడ రామకృష్ణయ్యగారు,

౨ ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ వారు - డా॥ పి. యశోదారెడ్డిగారి సంపాదకత్వమున 1967 లో, ఈ గ్రంథమును ప్రకటించినారు.

'లక్షణదీపిక' యను గ్రంథమును వ్రాసి సాహిత్య 'లక్షణచక్రవర్తి' గా పేరొందినాడు. తెనుగువ్యాకరణము సంస్కృతములో-ఆంధ్రశబ్దచింతామణి పేర రాగా – తెనుగు ఛందస్సు లక్షణదీపిక పేర సంస్కృతమునందు వచ్చినది, నాటి ప్రభువులు సంస్కృతభాషాభిమాను లనుటకు – ఈ గ్రంథ మొక సాక్ష్యము, గౌరన లక్షణదీపికకు రెండుతాళపత్రగ్రంథాలు – ఆం. సా. పరిషత్ భాండాగారమున గలవట, ౧ ఒకదానియందు – ప్రారంభమున రాముని స్తుతి మఱియొకదానియందు శివునిస్తుతి గలదు. రెండుద్విపదకావ్యాలు శివస్తుతి గలవే, అయినా – నవనాథచరిత్రయందు – మీనానాథుడు శిష్యులకు రామకథ చెప్పి – (4 ఆశ్వాసము – పుట 200-1937 ముద్రణ)

అని''మహాపాతకహర మైనరాము
వినుతచరిత్రంబు''విని శిష్యు లలర-'

అనినాడు ఇట్టిఆధారముతో చూచిన లక్షణదీపికయందలి రామస్తుతి గౌరనచేసినదే యనవచ్చు, గౌరన తనలక్షణ దీపికలో పేర్కొనిన (రెండు ప్రతులయందు) సంస్కృతాంధ్రగ్రంథాల జాబితాను అకారాదిగా-ఆరుద్రగారిచ్చినారు (సమగ్రఆంధ్రసాహిత్యం 5సం. 41-42పుటలు) పాపయ్యశాస్త్రిగారు తమవ్యాసంలో అనేక విషయాలను తెల్పినారు, చక్కగా పరిష్కరించి పెద్దలెవరైనాఈగ్రంథమును ముద్రించి ఆంధ్రమహాజనుల కందించిన బాగుండేది.

ఇతడు ద్విపదకవితను మాత్రమేగాక చక్కనైన పద్యరచనముకూడా చేసినా డనుటకు సాక్ష్యము-'నవగ్రహస్తవము'-ఇందుండి రెండుపద్యములు ప్రబంధరత్నావళికారు డుదాహరించెనని తెల్పితిని-ఆపద్యము లివి ౨

---

౧ 'లక్షణదీపిక – గౌరన, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి వ్యాసము ఆంధ్ర సాహిత్యపరిషత్ పత్రిక – ౩౧ సం ౩-౪ సంచికలు (పుటలు ౮౯-౧౧౩)

౨ ఇప్పటివరకు ప్రచురింపబడిన గౌరన కృతులలోగాని-సమగ్రఆంధ్రసాహిత్యము(5సంపుటము)న. గౌరనను గూర్చి వ్రాసినప్పుడు గాని ఈపద్యా లుదాహరించ బడలేదు.

'గౌర కవి(నవగ్రహ స్తవము)[జ]'

'ఉ. మ్రొక్కులయిక్కకాంతిగల ముప్వురు వేల్పులమూర్తిచేఁకటిన్
మెక్కెడిమిత్తి-పద్మముల మేలు-నవగ్రహరాజు-మింటిపై
నెక్కెడుమాసికంబు-దినమేలిక-సింహవిభుండు-ముక్తిపెన్
జక్కెర యిందుమిత్రుఁడు ప్రసన్నత మాకు ప్రసన్నుఁ డయ్యెడిన్
(జ) 135.

చ హరుతల పూ చకోరములయామిని పొల్కడ లుబ్బుమందు శ్రీ
వరుని మఱంది తారకలవల్లభుఁ డిందిర తోడఁబుట్టు వం
బురుహముదాయ కల్పలతప్రోది యనంగునిమామ జేవిభుం
డరయఁగఁ గర్కటేశుఁ డమృతాంశుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.
(జ) 136''

చక్కనిరచన-పద్యములు పూర్తిగా లభించిన మరింత యానందింతుము. ఇందలి- 'మాకుప్రసన్నుఁ డయ్యెడిన్' అనునది-నన్నయగారి ఉదంకోపాఖ్యాన పద్యముల స్ఫురింపచున్నది. నన్నయ్యగారి ప్రభావమీతనిపై గల దనుటకు ఇది యొక తార్కాణము.

గౌరనరచనల విశిష్టతయే యిందు తెల్పుట ముఖ్యోద్దేశ్యము కావున-రచనలసమీక్ష చేయలేదు. భైరవునకు గౌరనతండ్రి యగుట. ఇతనిరచనల ప్రభావము కుమారునిపైయుండుటవలన-రచనలగూర్చి తెలుప నైనది. ఇక భైరవుని కృతులగూర్చి తెలుపుదును--

## భైరవుని రచనలు

భైరవకవి శ్రీరంగ మహత్త్వముసేగాక
౧ కవి గజాంకుశము
౨. రత్నపరీక్ష

అను గ్రంథములను వ్రాసినాడు. తన యే రచనలోను మిగిలిన రచనల

ప్రస్తావన చేయకపోవుటవలన — వీనియందు ఏది ముందు — ఏది వెనుక అని తెలిసికొనుట కవకాశము లేదు. వీనిలో—

'కవి గజాంకుశము'

దీనియందు మొత్తము ౭౮ పద్యములు గలవు. మానవల్లి రామకృష్ణకవిగా రిచ్చిన ప్రతి యాధారముగా ఆంధ్రసాహిత్య పరిషత్తువారు (సం.-౧౮. సంచిక-౨, పుటలు-౧౧౫-౧౨౧) దీనిని ప్రకటించినారు, ఇందులోని పద్యముల వివరములు

| | | |
|---|---|---|
| కందములు | — | ౫౦ |
| గీతములు | — | ౮ |
| సీసములు | — | ౫ |
| ఉత్పలములు | — | ౨ |
| చంపకములు | — | ౨ |
| మత్తేభము | — | ౨ |
| వచనములు | — | ౯ |
| | | ౭౮ మొత్తము |

గలవు, పరిషత్ పత్రికయందు చేరని ౨ పద్యములు - అని చాగంటి శేషయ్య గారు కవితరంగిణి (౬ సం.244 పుట) యం దుదాహరించిరి, ఈ శ్రీరంగమహాత్త్వము అనుబంధమునందు - ఆ ౭౮ పద్యములు చేర్చనైనవి.

కవి దీనిని కేవలము లక్షణ గ్రంథముగానే వ్రాసినాడు. లక్ష్యములు లేవు మానవల్లివా రీప్రతులగూర్చి - 'కవి గజాంకుశ ప్రతులు భిన్న దేశప్రతులు నా యొద్ద నాల్గు గలవు, చెన్నపురి యడయారు సంస్కృత పుస్తకశాలలో నొకటి గలదు—' అని తెల్పినారు, (శ్రీరంగమహాత్త్వము—పీఠిక) దీనిని వావిళ్ళవారు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు, తిమ్మావఝల కోదండరామయ్యగారి పరిష్కరణతో - 1950 సంవత్సరమున ముద్రించినట్లు - 'మానవల్లి కవి రచనలు' సమీక్షించుచు - తి కో. రామయ్యగారు (భారతి 1975 అక్టోబర్ 24 పుట) తెల్పుచున్నారు, పేరు సమీక్షించిన గ్రంథమునకు సంపాదకులు నిడుదవోలువారు

మదసు దూలంగ గీపెట్ట మలపువాద
నని ప్రతాపించి పలికిన పలుకు వినుడు-

అవి-ప్రతాపించి-కుకవి మత్తమాతంగముల గర్వ మణచుట కీతడు 'కవి గజాంకుశము'ను చేతబట్టినాడు.

ఈ గ్రంథమునందు -గణములు - వానివర్ణములు - బీజాక్షరములు-కృతి ప్రారంభమునం దుంచవలసిన గణ వివరములు - వాని ఫలములు - గ్రహ రాసులు - మొదలగునవి తెల్పబడినవి

కవి తనను గూర్చి -

భ్రమరాంబికా మహావర
సముదిత నిరవద్య హృద్య సాహిత్యకళా
క్రమ విమల ప్రతిభాచం
క్రమణ క్రమశాలియైన గౌరనసుతుఁడన్. ౬

భైరవుఁడ నుభయభాషా
పారీణుఁడ లోభిభవన భవభూమి వ్యా
పార సవికార దుష్కవి
ఘోరపిశాచుల నదల్చుకొను భైరవుఁడన్. ౭

అనియు - చివరి పద్యమున -

గణవర్ణాదుల మేలుకీడు వెలయంగాఁ జెప్పె సాహిత్యల
క్షణదీక్షాగురుఁడైన గౌరన సుధీసత్పుత్రుఁ డత్యుల్లస
ద్గుణ రత్నాభరణుండు భైరవకవీంద్రుం డెందుఁ దద్జ్యుల్ దనుం
బ్రణుతింపం గవిరాడ్గజాంకుశము భూప్రఖ్యాతమై మించఁగన్ ౮

అట్లు తెల్పుచున్నాడు - కవిగజాంకుశ రచన వరకే యాతఁ డుభయ భాషా పారీణుడు-దుష్కవి ఘోరపిశాచుల నదల్చినవాడు. ఈ విధమైన పద్ధతి చూడగా

ఇతడు - నూనూగు మీసాల నూత్నయౌవనమునం దీ కవిగజాంకుశమును సిద్ధము చేసినాడేమో యనిపించును. కవి-తన పేరునందుగల భైరవత్వమును నిరూపించుకొనుట కీ పద్యమును వ్రాసినను - పేరులోనేగాని - క్రియయందు భైరవత్వము మాత్రము లేదు - అందుకు - 'సద్గుణరత్నాభరణుండ'నని (౭వ పద్యము) కవి తెలుపుకొనుట యొక దృష్టాంతము ౧

భర్తృహరి 'సుకవితాయద్యస్తి రాజ్యేన కిమ్—' అన్నాడు, భైరవుడు అట్టి రాజ్యమున కవిని ఒకజోదుగా భావించి - యిట్లు-

గ్రహము మిులికి, గణము కరి, యక్షరము పింజ,
పద్య మెసఁగుకోల, చోద్యమైన.
జిహ్వవిల్లు మనసు శింజిని, లక్ష్యంబు
ధూర్తజనుడు, సుకవివార్తజోదు (౨౪)

చక్కగా చమత్కరించినాడు.

ఈ కవిగజాంకుశమే - గౌరనకు భైరవుడు పుత్రుడు గాదేమో? యను నట్టి యనుమానమును పరిశోధకులకు కలిగించినది అందుకు కారణ మేమనగా- గౌరన వ్రాసిన లక్షణ దీపికయందు - ఈ పద్యములు కొన్ని చేరుట

గౌరనకు తాను పుత్రుడ నని - కవిగజాంకుశము చివరి పద్యములో తెల్పినాడు - శ్రీరంగమహత్వమునందును వ్రాసినాడు. తండ్రికొడుకు లిద్దరూ భ్రమరాంబా ప్రసాదలబ్ధకవిత కలవారే-ఇన్ని ఆధారాలున్నా-గౌరనకు భైరవుడు పుత్రుడు కాడని భావించుట సమంజసముగా నుండదు.

తండ్రి లక్షణదీపికలోని కొన్ని శ్లోకాలను భైరవు డాంధ్రీకరించి తన గ్రంధమున చేర్చుకొనవచ్చును అనంతరము వ్రాయసగాండ్రు - ఈ పద్యములు గౌరనవేమో నని—లక్షణదీపికలో చేర్చవచ్చు, ఇంతమాత్రమున వీరి సంబంధము

---

౧. సద్గుణరత్నాభరణుడ-అనుటవల్ల వ్యంగ్యముగా రత్నపరీక్ష పేర్కొనెనా? అని అనుమానము.

కాదనజాలము-శ్లోకాలు-పద్యాలు - వాని పూర్వాపరాలు-తెల్పుచు - ఆరుద్రగారు వివరించినారు - మరల వానిని నేను తెల్పుటలేదు - జిజ్ఞాసువులు వారి గ్రంథ మును చూడగల రని కోరిక,౧ శ్రీరంగమహత్వము 1-14 పద్యమునందు - (శబ్దార్థరూఢిర సస్థితి-అనేది) అనేక విషయముల తెల్పినాడు — ఇవి కొన్ని శ్రీరంగ...'కు వర్తించినా - కవి గజాంకుశమందు ఈ విషయా లన్నిటిని తెల్పియుండవచ్చును - లభించిన 78 పద్యాలలో - ఈ లక్షణాలను సమన్వయ పరచుకొనలేము.

'కవిజన సంజీవిని వ్రాసిన ముద్దరాజు రామన-సులక్షణసార కర్త-లింగమగుంట తిమ్మన - మొదలైనవా రీతని కవిగజాంకుశమునుండి పద్యము లుదాహరించిరి.

కామినేని మల్లారెడ్డి - తన షట్చక్రవర్తి చరిత్రమునందు శ్లేషలో కవి గజాంకుశము నిట్లు పేర్కొనెను.

కడు గతాగతియని కందు డిందఁగ మోది
శశికిఁ గళాశాస్త్రసరణి దెలుపు -
మందబుద్ధివి యని ముందె చెక్కిలి గొట్టి
'కవిగజాంకుశ' మింద్రకరణి ఁజూపు - అనినాడు.

అప్పకవి పేర్కొనని 'పూర్వగ్రంథ నామసంగ్రహము' నందు-కవిగజాంకు శము' గలదు (1-5) దీనినుండి రెండు పద్యములనుకూడా ఉదాహరించినాడు. (2-168, 2-398)

తవర్గాక్షర భేదములకు - ఇందలి - ఈ పద్యము ముదాహరింపబడినది. కిదుకుచు లక్షణ...అని పద్యమారంభమగును. అప్పకవి 'బదుగుచు లక్షణ-' అని వ్రాసినాడు

'రాజమాతృకార్చనసమంత్రః' అనే శీర్షికతో - జిలుగుచందురు కావి బీరయు-' అనే పద్యము నిచ్చెను (2-398) కవిగజాంకుశ పద్యములం దీ పద్యము లేదు

---

౧. సమగ్ర ఆంధ్రసాహిత్యం VI సంపుటం. 51-56 పుటలు.

కవిగజాంకుశమును - చక్కగా సంస్కరించి - పాఠభేదాల సమన్వ
పరచి విపులమైన వివరణతో ప్రకటించుట అవసరము.

## రత్న పరీక్ష (METALLURGY)

మన తెనుగు సాహిత్యమునందు కావ్య ప్రబంధ వాఙ్మయమున మిక్కిలి యాదరణ ప్రచారము గలదు. వీనితోబాటు శాస్త్రవాఙ్మయముకూ ప్రసిద్ధి చెందవలయు నన్నచో అముద్రితముగా పడియున్న శాస్త్రగ్రంథమ వెలుగునకు తెచ్చుట- వానినిగూర్చి పరిశ్రమ చేయుట ఎంతేని అవసరము.

ఇతర దేశభాషలయందు నున్నట్లుగాక— మన సారస్వతమునందు శా వాఙ్మయము పద్యరచనలుగా నున్నది అందుకే కావ్య గౌరవము కలిగి వీనినుండి లాక్షణికులు పద్యముల నుదాహరించిరి. నిఘంటుకర్తలు వీనియంద పదములను ప్రామాణికములుగా గ్రహించిరి మడికి తిమ్మన తన సకలనీ సమ్మతమునందు- సుమారు 13 శాస్త్ర వాఙ్మయ గ్రంథములనుండి పద్యమ లను సేకరించినాడు ఇట్టి శాఖయందు పరిశోధన చేసిన వారిలో సింగనం యాద్యుడనవచ్చును

బైరవ కవి వ్రాసిన రత్నపరీక్ష- సంస్కృతమున అగస్త్యుడు వ్రాసి కృతికి అనువాదము. దీనియందలి రత్నశాస్త్ర పారిభాషిక పదము లింకా నిఘంటువుల కెక్కలేదు. చాలకాలము క్రితము ముద్రణమైన యీ గ్రంథము 79 పద్యములు గలవు.

భైరవు డీ గ్రంథమును— దేవరకొండకు 6 మైళ్ళ దూరమున గ ముదిగొండ గ్రామమునందలి వీరభద్రునకు అంకితమిచ్చినాడు.౨

---

౧. సకల నీతి సమ్మతము- ఆం ప్ర సా. ఎకాడమీ ప్రచురణ 1970 సం నిడుదవోలువారు పి యిస్ ఆర్. అప్పారావుగారు.

౨. ధనాభిరామ కర్తయైన నూతనకవి సూరన ఈ వీరభద్రుని శిష్యుడ బైరవునకు సూరనకు ఈ కారణముగా సంబంధము కలదేమో! ఇద్దర సమకాలమువారే, మరింగంటి సింగరాచార్యులవారు ద్విపదలో ధనాభిరామమ ప్రేమాభిరామమును వ్రాసిరి సూరన, తిప్పన- సింగరాచార్యులు వీ

తన గ్రంథమును గూర్చి-

తన్ను బ్రియమార వేడిన
మున్ను మునీంద్రుల కగస్త్యముని చెప్పిన యా
సన్నుత మణి లక్షణములు
చెన్నుగ క్రోడీకరించి చెప్పెద తెలియన్, అనెను.

కేవలము దాని కనువాదముగానేగాక- మరికొన్ని విషయములను (లక్షణములను) క్రోడీకరించి- దీనిని వ్రాసి- వీరభద్రున కంకిత మొసంగినాడు. 'ఆ విషయమును-

శ్రీ వెలయఁగ బద్యములను
బావన నవరత్న కుసుమపంక్తుల పూజల్
గావించెద ముదిగొండల
శ్రీ వీరేశునకు భక్తచింతామణికిన్.

ఆ వీరేశ్వరు పేరిట
నావల కేదారపుత్రుఁ డనిభక్తులు సం
భావింప నధిక విద్యా
ప్రావీణ్యుండైన వీరభద్రుం డెలమిన్,

ముదిగొండ కేదారయ్యగారి పుత్రుడైన వీరభద్రుని కోర్కెపై దీనిని తెనిగించి అంకిత మిచ్చినట్లు తెలుపుచున్న వీ పద్యాలు.

ఈ వీరభద్రుడు ఎవరు? ఒకనాడు ముదిగొండ గ్రామం శైవులకు నిలయము. ఇప్పటికీ ఆ గ్రామమందు- ఆరాధ్య సంప్రదాయానికి చెందిన శైవ కుటుంబాలు గలవు.౧ శివుని వీరభద్రు డందురుగదా! ఈయనను అపర శివావతారునిగా భావించుచుండిరా? అందులో ఈయన 'అధిక విద్యా ప్రావీణ్యుడు' అని చెప్పబడినాడు.

---

౧. గౌరన భైరవుల స్వగ్రామముకూడా ఇదే యని- మిత్రులు తేరాల సత్యనారాయణ శర్మగారు- రాచకొండ చరిత్ర మను గ్రంథమందు వ్రాసిరి. రాచకొండ ప్రభువులు హనుమత్ప్రతిష్ఠలకన్న ఎక్కువగా 'భైరవ' ప్రతిష్ఠలు చేసినారు. వేలకొలది భైరవ విగ్రహాలు నల్లగొండ జిల్లాలో (ముఖ్యముగా- దేవరకొండ- నల్లగొండ తాలూకాలో గలవు. వారి భైరవభక్తి కారణమే. గౌరన తన కుమారునకు 'భైరవ' నామ మునుంచినాడు. ముదిగొండలోని వీరభద్రాలయము వెనుకగల విగ్రహము 'భైరవ' విగ్రహమని కొందరందురు. ఇది చాలా పురాతనమైనది.

నేడు ముదిగొండ గ్రామమునకు దక్షిణమున వీరభద్రాలయము గలదు. చాలా ప్రాచీనమైనది. ప్రతి శివరాత్రినాడు ఇచ్చట జాతర జరుగును. అప్పుడే వీరభద్ర విగ్రహమును దెచ్చి దేవాలయమందుంచి- తరువాత ఊరిలోనికి తీసుక పోదురు. ఈ దేవాలయము వెనుక గోడకు ఆనుకొని ఒక పెద్ద రాతి విగ్రహము అందమైనది గలదు. దానిని కూడా 'పాత వీరభద్రుడు' అందురు, ఇవన్నీ ఆలోచించినచో- ఈ వీరభద్రుడు (అంకితము నందిన) మహిమలు గలిగి- ప్రసిద్ధుడై యుండును. ఆయన శివైక్యము చెందిన తరువాత- భక్తులు ఆలయము గట్టించి- విగ్రహమును నెలకొల్పవచ్చును

రాచకొండ రాజుల కాలములో- భైరవ ప్రతిష్ఠలు- శివ ప్రతిష్ఠలు ఎక్కువగా జరిగినవి. మొత్తముపై ఈ వీరభద్రుని గూర్చి పరిశోధించవలసి యున్నది.

రత్నశాస్త్రమునందు కవి- రత్నాలు- వాని విశిష్టత- ధారణా పద్ధతి- మంచిచెడులు- వివరించినాడు- పరీక్షింపనిదే- లోపముగల వజ్రముల ధరించినచో వెంటనే పంచత్వ మందుదురట. సున్నము పూసినను బాలసూర్యునివలె ప్రకాశించు పచ్చ అరువదినాలుగు దీనారముల వెల చేయ గలదట

శుద్ధమైన వజ్రము ఎట్లుండునో ఈ విధముగా తెల్పుచున్నాడు

దాకటిమీదఁ బెట్టి బెడిదంబుగ సమ్మెటవేయ భిన్నమై
పోక జలంబులో మునిగిపోవక యెప్పుడు లోహపత్రికిన్
జేకొనివ్రాయ రేఖ విలసిల్లని వజ్రము వజ్ర మిద్ధరన్
బ్రాకటరీతి దాల్చుసట భర్గుఁ డొసంగు శుభంబు లెప్పుడున్.'

చెడ్డవజ్రమును ధరించిన వెంటనే మరణింతురట. మంచి వజ్రమును ధరించినవారికి భర్గుడు శుభ మొసంగునట కుక్కుటాండ సమమైన ముత్యములు గలవని యిట్లు తెల్పుచున్నాడు.

'నిర్ధమ్మశల్ దిగంతముల నిండి పటుస్ఫుట గర్జితంబు లే
ఘోర మహోగ్రవృష్టి గురియం బ్రభవించునితాంతకాంతితో

నారయ కుక్కుటాండసమమై పడుముత్యము లంతరిక్ష సం
చారులు పట్టుకొంద్రు వసుధన్ బడకుండగ నేర్పుపెంపునన్

ఆంధ్రప్రబంధముల వ్యాఖ్యానములందు - ముత్యములు - రత్నాలు. వీని ప్రసక్తి వచ్చినపుడు ఈ రత్నపరీక్షయందలి పద్యములనే ఎక్కువగా నుదాహరింతురు (ముఖ్యముగా వసుచరిత్ర వ్యాఖ్యయందు).

ఇతని రత్నపరీక్ష' చాలావిలువైనది. ఇది అగస్త్యునికృతికి అనువాదము * ఇందులోని కొన్ని సాంకేతికపదాలు వాచస్పత్యంలో కూడా లేవు (చూ-జీర్ణ రము-రత్నదోషము)" - అని నిడుదవోలువారి యభిప్రాయము (భారతి 1975 అక్టోబర్ 80 పుట) ఇక రెండు విషయములను ఈ సందర్భముగా తెలుసుకొనవలసి యున్నది

అందొకటి కృతికర్త గ్రామమైన 'ముదిగొండ'ను గూర్చి. రెండవది - ఇతడు రత్నపరీక్ష' వ్రాయుటకు కారణము - అనునవి-

మొదట 'ముదిగొండ'ను గూర్చి తెలుసుకుందము:

ఈ గ్రామము - నల్లగొండ జిల్లాలో ఒకతాలూకా కేంద్రమైన దేవరకొండకు 6 మైళ్లదూరమున గలదు. ఇచ్చట ప్రాచీన మగు కట్టడాల అవశేషాలు

---

* "రత్నపరీక్ష-నవరత్నలక్షణము, నవరత్నపరీక్ష, అగస్త్రీయ రత్నపరీక్ష యను పేళ్లతో నుండు కృతులును బై మణిపరీక్షయు నొక్కటి కావచ్చును, స్కాందపురాణాంతర్గతము (తృతీయభాగము) అగస్త్యసంహిత, ఈ సంహితలో నొకభాగము హాలాస్య మహాత్మ్యమట, అగస్త్యకృత మనబడు రత్నపరీక్ష హాలాస్యమాహాత్మ్యమున (నొకభాగమట, New catalogus Catalogorum Provitional baseiculus. P. 14" ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము(196/ము) 'సాహిత్య కుసుమాంజలి'లో 49పుట 'మణిపరీక్ష'ను గూర్చి శ్రీమాన్ ఈయుణ్ణి వేంకటవీర రాఘవాచార్యులు గారు తెల్పిన యభిప్రాయము.

గలవు, కూలిపోయిన దేవాలయములు గలవు, ప్రస్తుతము – వీరభద్రాలయ మొకటి గ్రామమునకు దక్షిణదిశగా గలదు, ఇందు వీరభద్రుని విగ్రహ మున్నది, ప్రతి సంవత్సరము శివరాత్రి సందర్భమున యిచట జాతర జరుగును. అప్పుడే ఆ విగ్రహమును తెచ్చి పూజింతురు (మిగతా రోజులలో గ్రామమందు ఆ విగ్రహము నుంతురు.)

దేవాలయము వెనుకగోడకు ఆనుకొని ఒక పెద్ద శిలావిగ్రహము గలదు. దీనిని అచ్చటివారు' పాతభైరవుడు' అందురు. ఇది బహుశః రాచకొండరాజుల నాటి విగ్రహము గావచ్చు. ప్రసిద్ధ శైవపీఠముగా నాడు ముదిగొండ గలదు.

రాచకొండ- దేవరకొండ ప్రభువులలో చివరివాడైన మాధవరావు లక్ష్మారావు*(1565) దేవరకొండ పాలకుడుగా నున్నప్పుడు- గోలకొండ నవాబులు౧ ఈ దుర్గముపై దాడిచేసి 12 సంవత్సరములు భీకరముగా పోరాడి నను దుర్గము వశముగాలేదట. చివరకు మాధవరావే వచ్చి- సగౌరవముగా వారికి దుర్గము నప్పగించి- వేంకటగిరి యందలి 14 పరగణాలకు వెళ్ళుచు- మార్గమధ్యమున నేటి మహబూబ్‌నగరం జిల్లా రామగిరిలో కొంతకాలముండి- దాని నభివృద్ధి చేసినాడట. ఈతని వంశములో ఒక శాఖకు చెందిన సురభి బాబూరావుగారి వద్ద ఇందుకు సంబంధించిన సనదులు గలవు. వీరిప్పుడు- రాచకొండ గ్రామమున నున్నారు) ఇతనిపై దండెత్తుటకు వచ్చునప్పుడు గోల

---

* ఈ మాధవరావుగారి సనదొకటి ఫారసీ భాషలోగలదు దేవరకొండయందున్న 'హజారి సంతతికి చెందిన కడువృద్ధు - ఏనుగుల బుచ్చయ్యగారనే మునసబుగారివద్ద నేటికి గలదని తే. సత్యనారాయణ శర్మగారు తెలుపు చున్నారు. (రాచకొండ చరిత్ర-120 పుట)

౧. గోలుకొండను పాలించిన నవాబులలో కులీకుతుబ్ షా (1496–1543), జంషీద్ షా (1543–1550) మల్కిభరాం (1550–1580) గలరు. వీరి యందు చివరివాడు దేవరకొండ ప్రభువులయొద్ద ఒకసారి తల దాచుకొని యుండి తరువాత వెలమలతో యుద్ధము చేసెను' (రాచకొండ చరిత్ర-121 పుట)

కొండ నవాబులు ముదిగొండతో విడిగి చేసినారు. బహుశః ఈ సమయమున హిందువుల కట్టడాలేమైన ధ్వంసము చేయబడినవేమో ?

భైరవుడు 'రత్నపరీక్ష' వ్రాయుటకు కారణము- ఏమైయుండును. అని ఆలోచింపగా- ఈ క్రింది విషయ మందుకు కొంత సమాధానముగా నుపకరింప వచ్చునను భావనతో పొందుపరచుచున్నాను. విజ్ఞులు పరిశీలింతురు గాక.

మహబూబ్‌నగరం జిల్లాలోని- అచ్చంపేట తాలూకాకు చెందిన- నేటి అమరాబాదు (గ్రామము) పీఠభూమికి పూర్వము ప్రతాపగిరిసీమ యనిపేరు. ఈ పీఠభూమిపై గల మద్దిమడుగు ఒకనాడు పట్టణము. అప్పుడిది 'రవ్వల పేట' దీని సమీపములోనే గల 'తీగలమాను' వద్ద ఆనాడు వజ్రములు త్రవ్వి తీసేవారు. అప్పుడు త్రవ్వి విడిచిన గనులు నేటికీ గలవు, కాకతీయులనాడు రవ్వలు- వజ్రముల పరిశ్రమ ఇక్కడ గలదని జనశ్రుతి.

ప్రతాపగిరి సీమపై 'మానువద్ద వాగు' తీరమునందు 'పచ్చగట్టు' పేర ఒక గట్టు గలదు. దీనిపై 'పచ్చ' యుండేదట. ప్రాతఃకాలమున ఆ ప్రాంతము నకు వెళ్ళినవారు పచ్చగా కన్పించుట- నేటికిని చెప్పుకొందురు. ఇప్పుడీ పచ్చ మాసిపోయిన దందురు, ఈ విషయాలన్నిటిని క్రీ శ. 1923 లో అమరాబాదు తహశీల్దారుగా నున్న శ్రీ సయ్యద్ గౌసు- రికార్డు రూపముగా రిపోర్టుతో పేర్కొనినాడు

(ప్రస్తుతము అమరాబాదు పీఠభూమి (అప్పర్‌ప్లాట్-అని నేడు ప్రభుత్వ వ్యవహారమునందు) దేవరకొండ తాలూకాలోనే చేరియుండేది - తరువాత అచ్చంపేట తాలూకాలో చేరినది) రాచకొండ - దేవరకొండ - పద్మనాయకుల పరిపాలన సమయమందీ ప్రాంతము-దేవరకొండలోనిదే, ఆనాడు భూమిలో గల రత్నాల వెలికి తీసి పరీక్షించుట - వ్యాపారము జరుగుట - సంభవించుట వలననే - భైరవుడు రత్నపరీక్షను తెనిగించి-మరికొన్ని విషయముల క్రోడీక రించియుండవచ్చు.

మరియొక చారిత్రక విషయ మేమనగా —

ప్రతాపగిరిసీమపై 'పదర' గ్రామమునకు సమీపమున- పెద్ద సొరంగము గలదు. ఇది మూడు తంతెలుగా నున్నది ఒక్కొక్కటి ఉమామహేశ్వరపు

లోయలంత యుండును. ఈలోయదారిలో బోయిన దేవరకొండకు దగ్గరి మార్గము, దీనిపై నిలబడి చూచిన దేవరకొండ దుర్గము కన్పించును ఈ సొరంగ మును 'భైరవసెల' అందురు, చాలకాలముక్రిత మీసెలలో అందమైన బైరవ విగ్రహ ముండెడిదట, ఈ బైరవప్రతిష్ఠకూడా రాచకొండప్రభువులదే కావచ్చు, రహస్యమార్గాలలో ఇదియొకటిగావున – వారు బైరవస్థాపన చేసియుందురు. (పదరనుండి పూర్తిగా ఈలోయలోనికి దిగినచో—అప్పర్‌ప్లాటుద్వారా మిక్కిలి దూర మగుపరాటివానిపల్లె—ఈమార్గమువసమీప మగును. ఇది దాటినచో దేవర కొండసమీపము) ఆనాడు (1923) సయ్యద్‌గౌసుగారు 11 వేలరూపాయిలు వ్యయముచేసి ఇచ్చట ఒకపర్వతమును పగలగొట్టించి దేవరకొండకు దారి వేయించినాడు ఈనా డీమార్గము వాడుకలో లేదు.

ఈవిషయ మంతయు వ్రాయుట ఎందుకనగా—ఇదంతయు రాచకొండ—దేవరకొండ—పద్మనాయకుల పరిపాలనగల దేశము. దేవరకొండకు సుమారు 30 మైళ్ళదూరమున ఈఅమరాబాదు గలదు. నాటిత్రవ్వకాల అవశేషాలు, రత్నాలకడిగినతొట్లు నేటికీ గలవు. ఈ ప్రాంతము పరిశోధింపదగినది

(ఈవిషయాలన్నీ - శ్రీ సయ్యద్‌గౌసుగారి 'అమరాబాదుప్రాంతవిశేష ములు'—అను ఉర్దూరిపోర్టు 12 పుటనుంచి గ్రహించినాము ఆరిపోర్టు 1923లో ముద్రింపబడినది.)

ఈరెండు రచనల తర్వాత ముఖ్యమయినది - బైరవుని శ్రీరంగ మహత్వము—దానినిగూర్చి వివరించుటకుముందు—కవిగారే దీనిని మలిముద్రణ చేయించిరా? అని అనుమానము—దానినిగూర్చి తెల్పుదును ——

## శ్రీరంగమహాత్త్వము మరల ముద్రింపబడినదా ?

భైరవకవి శ్రీరంగమహాత్త్వ కవితా విశేషముల గూర్చి తెలిసికొనుటకు ముందు-పై శీర్షికను గూర్చిన అనుమాన నివృత్తి చేసికొనుట యవసర మని పించుచున్నది, ఎందుకనగా - ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారు ప్రక [illegible]ంచిన—'[illegible] కవి [illegible]', అన్న గ్రంథమున-తత్సంపాదకులు కవిగారిని

గూర్చి-వారి రచనల గూర్చి తెల్పుటయేగాక - వారు ప్రకటించిన గ్రంథముల పీఠికలను కూడా యధాతథముగా చేర్చి-సాహిత్యోపజీవులకు మిక్కిలిగా తోడ్పడునట్లు చేసి-కృతజ్ఞతా పాత్రులైనారు.

పై గ్రంథమున 117-125 పుటలలో శ్రీరంగమహాత్మ్యము 'పీఠిక' గలదు ఈ పీఠిక చివరన కవిగారు. 'ఇది వనపర్తిరాజుగారి సహాయమున మొదటను ముద్రింపఁబడి ప్రాచీన గ్రంథముల నూరక యిచ్చినను జదువువారు లేని యీ కాలమున నీ భాగమైనఁబునః ప్రచుర మగుటకు సంతసించుచున్నాడ1

1929 మా-రామకృష్ణకవి.

అని యున్నది, ప్రథమ ముద్రణ 1912 పీఠికలోని కొన్ని విషయము లీ పీఠికలో లేవు, వరదరాజు శ్రీరంగమహాత్మ్యమందలి పద్యము లుదాహరణములుగా నిచ్చినవి-రెంటియందును వేర్వేరుగా గలవు, సరి.

కవిగారి (1929) పీఠికను పూర్తిగా చేర్చిన తర్వాత శ్రీ - నిడుదవోలు వారు - దాని క్రింద.

(1 ప్రథమ ముద్రణము 1912లోనే వెలువడినది (చెన్నపురి - 5 జూన్ 1912) అని పుట్‌నోట్సు చేర్చిరి.

ఈ 'మానవల్లి కవి రచనలు' గ్రంథమునకు నిడుదవోలు వారు 81 పుటల పీఠిక వ్రాసిరి, దానిలో 22 పుట యందు,

"అయి దాశ్వాసములలో 1293 గద్య పద్యములలోనున్న యీ ప్రశస్త ప్రబంధము ముద్రితమై ఏభయి యెనిమిదిదేండ్లైనను నేటివరకు తిరిగి ముద్రితము గాలేదు, విపుల పీఠికాదులతో పునర్ముద్రణము కాదగినది. ఇంతవరకు దీనిని గూర్చి యొక్క విమర్శ వ్యాసమైన ప్రకటితము కాలేదు" అని వ్రాసిరి, పైన గల కవిగారి పీఠిక చివరి వాక్యము 'ఈ భాగమైన'-నిడుదవోలు వారి "పునర్ముద్రణ"-అనేవి చూచినచో-వీనియందలి యధార్థము అనుమానముగా గలదు, మరియొకటి-

12 పుటయందు (మానవల్లి కవిరచనలు) కవిగారు ఏయేసంవత్సరమునందు ఏయే గ్రంథమును ప్రకటించినది జాబితా (కొంత పీఠియూహతో) నిచ్చిరి

1912లో శ్రీరంగమహాత్త్వము అని చేర్చిరి, 1923 సకలనీతి సమ్మతము' గందు.

"సకల నీతి సమ్మతము తరువాత ఈ శీర్షిక క్రింద కవిగారు ప్రాచీన కావ్యముల ముద్రింపలేదు" అని నిడుదవోలువారి వ్రాత. 1929 లో కవిగారు శ్రీరంగమహాత్వమును ముద్రించినట్లు కవిగారి పీరిక తెల్పుచున్నది గదా ! మరి- 'కవిగారు ప్రాచీన కావ్యముల ముద్రింపలేదు' అని వ్రాయుటకు కారణమేమి ? ఆంధ్ర వాఙ్మయ సూచిక (1929) శ్రీరంగమహాత్వము 1912 ముద్రణనే పేర్కొనినది.

కవిగారి వ్రాత- పుస్తకము 'పునర్ముద్రణ' అని తెల్పుచున్నది. నిడుదవోలువారు ఏదీ తేల్చక రెండువిధాలా తెల్పినారు. శ్రీరంగమహాత్త్వము పీరిక (1928) సూచిన కొంత భేదించుచున్నది (ప్రథమ ముద్రణకన్న) ఇవన్నీ అనుమానాస్పదములు కవిగారు 1904 లో వనపర్తి రాజాగారివద్ద చేరినారు. (త్వరలోనే అక్కడనుండి వెళ్ళినట్లున్నారు). వనపర్తిలో 'బ్రహ్మ విద్యా విలాస ముద్రాక్షరశాల' యుండగా- శ్రీరంగమహాత్వము 1912 న 'చెన్నపురి జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలయందు' ముద్రింపబడుటకు కారణమేమి ?

వీనన్నిటిని జూడగా- నా యూహా యేమన- కవిగారు 'పీరిక'ను మాత్రము (1929 లో ద్వితీయ ముద్రణ చేయదలచి- ?) మొదట ముద్రించి రాజాగారి సాయ మర్థించియుండవచ్చు అది ఫలవంత మాయెనో ? లేదో ? (ఎందుకనగా 1929 వరకే కవిగారు మద్రాసు నందున్నట్లు 'ఆంధ్ర భాష'ను గూర్చిన యుపన్యాసము చివరితేదీ తెల్పుచున్నది).

అందుకే కవిగారు పీరిక చివరలో 'ఈ భాగమైన' అని వ్రాసి యుండవచ్చు. మన తెనుగువారి యదృష్టము కలిసి మలి ముద్రణ వారి అజమాయిషీలో జరిగితే- గ్రంథము మిక్కిలిగా సంస్కరింపబడునదేమో ? పూజ్యులైన శ్రీ నిడుదవోలువారివద్ద 1929 ప్రతి గలదా ? (లేనిచో ఆ పీరిక ఎక్కడిది ?) ఆ గ్రంథము ఎప్పుడు [illegible]పబడినది. వివరాలు ఈయలేదు. ప్రతిదానికి వారు

'స్పష్టము' అని తెల్పుచురు గదా ? దీనికి తెల్పలేదేమి ? (వీరు పేర్కొనినట్లు అందలి పద్యముల సంఖ్య 1293 గాదు. ౧౩౦౬ గలవు. ప్రథమ ముద్రణలో సంఖ్యలు తప్పు పడినవి.- పంచమాశ్వాసము చివరి పద్య సంఖ్యను చూచి వీరు వేసినారు) కావున కవిగారు గ్రంథమును మరల ముద్రించినా రనుట అనుమానమే ! ఇక - శ్రీరంగమహాత్మ్య మందలి కథాసంగ్రహము-



# శ్రీరంగమహాత్వ్యము

## (కథాసంగ్రహము)

## ప్రథమాశ్వాసము

త్రిభువన పుణ్యప్రదేశమైన నైమిశమున నొకప్పుడు శౌనకాదులు ద్వాదశ వార్షికసత్రము జేసిరి అప్పుడు దానిని జూచుట కనేక సంయమీశ్వరులు శిష్య కోటితో వెళ్ళిరి వారిని జూచుటకు రోమహర్షణు డచటికి వెళ్ళెను అప్పు డతనిని జూచి మునులు మహర్షీ ! మీ రిప్పు డెచ్చటినుండి వచ్చితిరి యని యడుగ- నేను జనక మహారాజుచేయు యజ్ఞమును చూచుటకు వెళ్ళి యచ్చట తార్క్ష్యపురాణ కథలు వినుచు నిలిచితిని అందు మోక్షపదాధారమైన పుండరీ కాక్షుని నిజాగారమగు శ్రీరంగమహాత్వ్య మతి విచిత్రమైనది అని చెప్పెను. అది విని కుతూహలులై వా రా కథను వివరింపు మని వేడిరి అంత నతడు ఆ యజ్ఞాంతమున నాగదంత మునికి వ్యాసమహర్షి చెప్పిన విధముగా దానిని వినిపింప నారంభించెను

శ్రీహరి ఎచ్చట నివసించునో, సంచరించునో, ఎచ్చోటిపై మక్కువ పడునో, అవన్నియు పుణ్యతర ప్రదేశములగును అతని పాదరేణువు సోకిన మాత్రాన తీర్థములు పావనమై నుతికెక్కెను. గంగ అతని పాదములందు పుట్టుటచే నదులందు మేటియైనది. అటులే గౌతమి, నర్మద, యమున, దేవిక, చంద్రభాగ, భవనాశిని, తుంగభద్ర, పెన్న, విపాశ హరికి లీలావిహారయోగ్య ములై ప్రసిద్ధి కెక్కినవి అని చెప్పగా నాగదంతుడు అనఘ ! తీర్థములలో ఏ తీర్థము సారతరమైనది దేనిని పేర్కొనిన, వినిన, చూచిన దురితములు తొలగునని యడిగెను అప్పుడు బాదరాయణుడు ఇట్లు చెప్పెను

కావేరీ మహిమ : శ్రీరామునిచే నీయబడి విభీషణునిచే తేబడి భుజగ శాయికి కేళీసదనమైన శ్రీరంగము ఏ నదీతటమున గలదో అది తీర్థములన్నిటిదా శ్రేష్ఠమైనది శ్రీరంగము కావేరి నడుమ నున్నది. దాని పాయలు ఆలయ

మున కిరువై పులనుండి ప్రవహించుచుండగా ఆ నదీ లలామ గళిత, కంకణ, మౌక్తికద్యుతులతో చిరాగతుడైన ప్రాణనాయకు నాలింగనము చేసుకొను మృగాక్షివలె నున్నది. మునులు, దేవతలు ఆ స్వామిని సేవించి సిద్ధి పొందిరి కనుక అది స్వర్గద్వారము వంటిది అచ్చటచేయు పిండ ప్రదానములు పితృ కోటికి అక్షయప్రీతిప్రదములు తిలధేనుదానాదులు అనంత పుణ్యప్రదములు. అచ్చటి సరస్సులలో పుండరీకము ప్రధానమైనది. అచ్చటగల వటవృక్షము హృషీకేశుని కావాసము. దాని సమీపమున కుశల మను పర్వతమున్నది. శివుడు దానిపై తపస్సుచేసి బ్రహ్మహత్యా పాతకమును పోగొట్టుకొనెను. ఆ గిరికి తూర్పున వకుళ తీర్థమున్నది. పూర్వ మింద్రుడు బలిచే సురాధిపత్యము హరింపబడినపు డచ్చటనే శ్రీహరిని గూర్చి తపముజేసి మరల తన రాజ్యమును పొందెను. అనగా నాగదంతుడు మునివరా! విభీషణుడు శ్రీరంగము తెచ్చె నంటిరి. దానిని కావేరీ తీరమున ఎచట నుంచెనో చెప్పుడని యడిగెను

అది విని వ్యాసుడు నాగదంతా! ఇప్పుడు వకుళతీర్థమని చెప్పితినిగదా! దానికి దక్షిణమున అనంతశయనతీర్థ మున్నది. అది మిక్కిలి మహాత్మ్యము కలది. అచ్చట సిద్ధులు తరులతా గుల్మ రూపముల నుందురు. కనుక నా ప్రదేశమున వానిదళములు త్రెంచినను పాపములు వచ్చును. ఆచోటు ప్రవేశించిన చాలును, చెవిటి వినజాలును అంధుడు చూడగల్గును, మూఢుడు విజ్ఞాని యగును, విభీషణుడు తాను తెచ్చిన శ్రీరంగము నచ్చట ఉభయ కావెరి మధ్యమున చంద్ర పుష్కరిణీ తటమున నిలిపెను, అది వైష్ణవకోటికి సదారాధ్య ప్రదేశము, అనగా నాగదంతుడు అనఘా! దానికి సంబంధించిన పూర్వకథ లన్ని వినవలెనని యున్నది చెప్పుమని వేడెను, వ్యాసుడు మరల ఇట్లు చెప్పెను.

సుబోధుని కథ - పూర్వము సుబోధుడు, సత్యుడు అని ఇద్దరు మహర్షు లుండిరి. వారు బ్రహ్మసమానులు. ఆమహా ఋషులు గంగాతీరమున తపము చేయుచుండ ఇంద్రుడు దానికి వెఱచి వారికి నిరంతరము అంతరాయములు కల్పించుచుండెను. అంత వా రింద్రునితో ఘర్షణపడ నిష్టము లేక—ఆ చోటు విడిచి ప్రసిద్ధ తీర్థములందు గ్రుంకువేడ్కతో సంచారము జేయుచు-కావేరి చెంతకు వచ్చి దాని సౌందర్యమునకు ముగ్ధులై మహత్త్వమునకు ప్రభావితులై అచ్చటనే కొన్ని దినము లుండిరి, ఒకనాటి సాయంకాలము వారు సంధ్యావందన

మునకై కావేరీ తీరమునకు రాగా అప్పు డది పొంగులు వారు చుండెను. వారు తమ దండాజినముల నొకచోట నుంచి దాని యొరవడిని చూచుచు తీరమువెంట కొంత నడిచిరి అప్పుడు ఇక్కడ నది యొరవడికి వారి దండాజినములు కొట్టు కొని పోయెను వారు తిరిగి తమ చోటికి వచ్చి దండాజినములకై చూచిరి. అవి లేకుండుటకు సత్యుడు దైవము యొక్క అమానుషలీల అనుకొనుచుండ బాడబ సమానకోపు డగుసుబోధుడు ఈ నది యిటులే ఉద్వేలముగా పారుచున్న తన వీచికలచే లోకములన్ని ఏకము చేయును కనుక దీనికి తగిన ప్రతీకారము చేయ వలయును-లేకున్న ఇదిలోకమును బ్రతుకనీయదు. దీని త్రుళ్ళు అడగునట్లు ఈతోయమునంత ఇపుడే గ్రహింతునని ఆపోశనమునకై అర చేతిలోనికి తీసు కొనెను. అది గని దశదిశలు కంపించెను అంత నంబరమునుండి ఓభూసురా ! ఇట్టి అనుచితకృత్యము నీకు తగునా యని గంభీరముగా నొకవాక్యము వినిపిం చెను సుబోధు డది విని చేతిలోనికి తీసుకొన్న జలమును విడిచెను, అప్పు డంతరిక్షమున అంతర్హితుడైయున్న దివ్యపురుషుడు ఓయీ ! ఈ కవేర కన్య భువన మాన్య. దీని తోయము ప్రజా జీవనోపాయము. సనకసనందనాదులు దీనిని సేవింతురు శేషశయనుని నివాసమైన శ్రీరంగము దీనిప్రవాహములచే పాలింపబడుచున్నది, గనుక ఇది విరసమునకు తగదు. నీవు దీనియెడ భేదము మాని నీకేది ప్రియమో కోరుము-ఇచ్చెదను. అనగా సుబోధుడు అది విని ఇది కలయో ! లేక నాపూనికి వృధాసేయ పన్నిన విష్ణుమాయయో ! యని తలచి ఓస్వామీ ! నీకు నాయెడ ప్రసాద బుద్ధి కలదేని నీదివ్యరూపము చూపు మని కోరెను. అపుడు అతడు ఓభూసురా ! నేను దేవాది చతుర్విధ భూతములకు కారణము. నన్ను బ్రహ్మేంద్రాదులైన కన జాలరు. అని పలుకుచు ప్రత్యక్ష మయ్యెను అప్పుడు సుబోధు డతనిని పెక్కువిధముల నుతించి దేవా ! నీకు నాయందు దయ కలదేని ఈ తీర్థమున సకలతీర్థములు కలిసి చరించునట్లు దీని యందు స్నానమాడినవారిని నీవారిని చేసుకొనునట్లు — ఇచ్చటి జపదానహోమ ములు అక్షయ మగునట్లు - వర మిమ్మనివేడెను, ఆదేవుడు అతని కోరికను మన్నించి అచ్చట వెలిసినది తానేయని ఆసుబోధుని కిట్లు చెప్పెను

శ్రీరంగావతరణము - పూర్వము నేను క్షీరాబ్ధియందు శేషతల్పమున శయనించి యుండ బ్రహ్మ నన్నుగూర్చి తీవ్రమైన తపస్సు చేసెను, అప్పుడు

నే నతనికి ప్రత్యక్షమై నీయభిమత మేమనగా దేవా! నీరూప మెల్లప్పుడు దర్శించు భాగ్యము కలిగింపు మని కోరెను. అందుకు నేను అంతర్హితుడనై దుగ్ధాబ్ధిమధ్యమున ధగధగమనుకాంతులతో నాసద్మమగు శ్రీరంగము నా విర్భవింప జేసితిని. అంత వేత్రహస్తుడైన నందుడు దానిని బ్రహ్మకు చూపి నీతపస్సు ఫలించినది. ఇదిగో చూడుము. దీనియందు హరి యోగనిద్రాపరుడై యున్నాడని నన్ను చూపెను. బ్రహ్మ ఆమందిరమునకు ప్రదక్షిణాభివందన ములు చేసి లోపలికి ప్రవేశించి అందు శయనించిన రంగశాయినగు నన్ను వినుతించెను. నేను ప్రీతుడనై నీయభీష్ట మేమన నీ వవతరించిన నీవిగ్రహమును నే నెల్లప్పుడు అర్చించునట్లు అనుగ్రహింపు మని కోరెను. అప్పుడు నేను అందు లకేగదా ఇట్లావిర్భవించితిని. నీయభిమతానుసారముగా నన్ను కొలువుము. ఏనరుడు నన్ను పంచకాలవిధానమున పూజించునో వానికి శాశ్వతపదము నొస గుదును. నేనీబ్రహ్మాండముపై వ్యోమమున ప్రాకృతశరీరుడనై యుందు నని తన యవతారములు మహత్వములు అర్చాదిరూపములు వివరించి తాను వెల సిన స్థలమాహాత్మ్యమును చెప్పి భూలోకమునగాని, అంబరమునగాని శ్రీరంగము ఎప్పుడు ఎచ్చటనుండునో ఆదిక్కునకు మరలి నాకు నమస్కరింపు మని చెప్పెను.

పిదప బ్రహ్మ శ్రీహరిశాసనమున నావిమానమును సత్యలోకసీమాంత మందు విరజానది ప్రాంతమున విశ్వకర్మ నిర్దేశముచే ప్రతిష్ఠించి తన్మహోత్స వము సలిపి అవభృథస్నానము చేసి అప్పు డచ్చటికి వచ్చిన వివస్వంతునకు పాంచరాత్రము సమంత్రకముగ నుపదేశించెను. ఆమంత్రమును అతడు తన కుమారు డగువైవస్వతునకు అతడు తనపుత్రు డగుఇక్ష్వాకునకు నిచ్చిరి. ఇక్ష్వాకువు తనతపమున బ్రహ్మను మెప్పించి సత్యలోకసీమాంతమునుండి శ్రీరంగమును భూలోకమునకు కొనివచ్చెను అటుల వారికి పరంపరాప్రాప్తమైన ఆవిమానము శ్రీరాముడు విభీషణున కీయగా అతడు దానిని కావేరితీరమున నుంచెను. అని వ్యాసుడు నాగదంతునకు వినిపించెను.

## ద్వితీయాశ్వాసము

శ్రీరంగావతరణము విన్నపిమ్మట నాగదంతుడు మహాత్మా! భుజగతల్పు డేకారణమున ఇక్ష్వాకునిచే భూలోకమునకు కొనిరాబడెనో ఎరిగింపు డని యడి గెను. అప్పుడు వ్యాసుడు ఇట్లు చెప్పెను

## ఇక్ష్వాకు వృత్తాంతము:-

ఇక్ష్వాకుమహారాజు ఒకనాడు "మా తాతతండ్రులు అమితానుభావులు గనుక వారు స్వయముగా సత్యలోకమునకు వెళ్ళి శ్రీరంగము నర్చించిరి. నేను వారియంతవాడనుగానందున అచ్చటి కరుగుట నాకే దుర్లభముగుచుండ ఇంకా నాపుత్రపౌత్రుల నడుగనేల" యని యాలోచించి అతడు ప్రాణులకు నావలన ముక్తికలుగు విధానము చేకూరువరకు విష్ణువును గురించి తపము చేయుదు నని తలచి కులగురు వగువశిష్ఠునకు తెలిపెను అది విని వశిష్ఠుడు దానిభవిష్యద్వృత్తాంతమును ఇంతవరకే మహాఋషులవలన వింటిని అనిచెప్పి అతనికి అష్టాక్షరీమంత్ర ముపదేశించి శ్రీవల్లభుని సేవింపు మని యానతిచ్చెను

ఇక్ష్వాకువు గుర్వాజ్ఞచే అతని ఆశ్రమసమీపముననే తనదేవి పరిచర్య చేయుచుండ తపమునకు బూనెను అతడు తపము జేయుచుండ గ్రీష్మ, వర్ష హేమంతములు గడిచి వసంతము వచ్చి పికశుకాళికూజితములు బలిసెను. అప్పుడు దేవతలు అతనితపమునకు తనపదవులు బోవునేమో యని జడిసి ఇంద్రునిచెంత కేగి చెప్పుకొనగా నతడు మన్మధుని తలచుకొనెను అటుల తలచుకొనగా సాకారుడైన మన్మధుడు తగినవేషమున కొలువునకు వచ్చెను. ఆతడు రాగానే ఇంద్రుడు పెక్కువిధముల సంభావించి రావించిన కార్యముచెప్పి నీవు ఏకమనస్కులైన విరక్తులనే సందుచూచి డెందముచించెదవుగదా ! అట్టి నీకు మహిళాసహచరుడైన ఇక్ష్వాకుని పరిభవించు టొకలెక్కయా? అని అగ్గించి దేవగణికలను సహాయముగా నిచ్చి పంపెను. వారు మన్మధునికంటె ముందుగనే ఇక్ష్వాకువు ఉన్నవనమునకు వచ్చి వనవిహారము సలిపి తమ విలాసములు - ప్రదర్శించి ఏవిధముగను అతనిని చలింప జేయలేక రిచ్చవడి నిలిచిన సమయమున మన్మధుడు వచ్చి-వారిని కలుపుకొని-రాజుముందర కేగి-తనబాణములు ప్రయోగించి-అవి వ్యర్ధ మయిపోగా మ్రాన్పడి నిలిచెను. అప్పు డిక్ష్వాకువు కన్నులు తెరచి ఎదురుగా నున్నమన్మధుని అతని పరివారమును కుశల మడిగి సంభావించెను అది చూచి వా రతనితాలిమి నగ్గించిరి మన్మధుడు "కామక్రోధములు అబ్జనాభుని ఆజ్ఞలోనివి. నీ వతనిభక్తుడవుకనుక ఆతనితో సమానుడవు" అని ప్రశంసించి శాపభయముచే అచ్చటి నిలువలేక ఇంద్రుని చెంత

కేగి తనపరాజయమును చెప్పెను అది విని ఇంద్రుడు తానే స్వయముగా ఐరావతముపై వచ్చి అతనిపై వజ్రమును ప్రయోగించెను, అప్పుడారాజు సుదర్శన చక్రమును తలచుకొనెను. అది రాగా దానిని దూరముననే చూచి వజ్రాయుధము వెనుదిరిగెను. జంభారి సిగ్గుచే బ్రహ్మచెంతకు వెళ్ళి జరిగిన వృత్తాంతము జెప్పెను. అది విని బ్రహ్మ ఇక్ష్వాకుచిత్తము తెలియగోరి నిమీలితనేత్రుడై అతడు శ్రీరంగమునకై తపము చేయుట నెరిగి నివ్వెఱపడి తనస్వామియగు రంగనాధుని చెంతకేగి సాష్టాంగపడి విషాదవదనముతో నిలువగా నతడు "ఓ పద్మజా ! నేను నీతల పెరిగితిని. నీయెడ ఎప్పుడు ప్రసన్నుడనేగనుక విషాదము వలదు. నేను తరణివంశీయుల రాజధాని కేగవలయును. ఇది తప్పదు. అచ్చట నేను ఏడుమన్వంతరములు నిలిచి నీకు దివసాంతమైనప్పుడు మరల నీవున్నచోటికి వత్తును ఇటుల నీయొక్క ప్రతిదినమున వర్తింపుము నీకు ద్వితీయపరార్ధము పూర్తియైనపిమ్మట ముక్తినిత్తు"నని చెప్పి ప్రసంగవశమున ఆరాధనాదోషములు వివరించి అట్టివి శ్రీరంగమునకు లేవు దానిని ఇక్ష్వాకున కిమ్ము పొమ్మని పంపెను. అంత రంగనాధుపంపున బ్రహ్మచే శ్రీరంగమును గొని ఇక్ష్వాకువు అయోధ్యకు చేరి దాని నాపట్టణమునకు ఉత్తరగోపురమునెదుట క్రోశార్థమున సరయూతమసానదుల నడుమ ప్రతిష్ఠించి దానిచుట్టు తోటలు నెలవులు ఏర్పరిచి ప్రతిఫాల్గుణమున పూర్వఫల్గుణీనక్షత్రమున అచ్చట మహోత్సవములు చేయుచుండెను

ధర్మవర్మకథ:— కొంతకాలమునకు ఇక్ష్వాకువంశమున దశరథుడు పుట్టి సంతానార్థమై అశ్వమేధము చేయగా దానిని చూచుటకు దేశదేశముల రాజులు వచ్చిరి. వారిలో చోళభూపాలుడగు ధర్మవర్మ యొకడు, అతడు రంగధామమును కని దానిపై మనస్సుపడి ఇక్ష్వాకు వెయిల విష్ణువును మెప్పించి దానిని పొందెనో నేనుకూడ అట్లే పొందెద ననిభావించి ఇంటికి వచ్చి చంద్రపుష్కరిణీసమీపమున కేగి తపమునకు పూనెను. అప్పు డచ్చటనున్న ఋషులు నీతపమునకు కారణ మేమని యడుగ వారితో అతడు తనకోరిక చెప్పెను, అదివిని వారు ఓరాజా ! నీకోరిక తీరినది కనుక ఇంక తపస్సొనర్పుటకు చాలింపుమని ఇట్లు చెప్పిరి.

ఇచ్చటికి ఉత్తరమున క్రోశ మాత్రముపై నీపూర్వపట్టణ మున్నది. దానిని శివుడు కోపమున మన్మధుని దహించినట్లు దహించెను.ఆపురప్రాంతమున దాల్భ్యముని ఆశ్రమ మున్నది. ఒకనాడు మేమచ్చటికి వెళ్ళి అతనితో మాట్లా డుచుండగా ఆమహర్షి దగ్గరకు శ్రీహరి వచ్చెను ఆయన మా పూజలు గైకొని మాతో ఓ తాపసులారా! "నేను మీ కోరికలు తీర్చుటకై కావేరీ తీరమునందలి చంద్రపుష్కరిణీ తటమున రంగమందిరములో వచ్చి నివసించెదను. అంత వరకు మీ రెచ్చటికి బోవలదు. నేను అర్యమాన్వయమున శ్రీరాముడనై పుట్టి అయోధ్యయందలి రంగమందిరమును విభీషణున కిత్తును దానిని అత డిచ్చటికి తెచ్చినపుడు మీరు నన్ను చూతురని చెప్పెను. అప్పుడు మేమాపరమపురుషుని సాగనంపుచు మార్తాండమండలమువరకు వెళ్ళితిమి అచ్చట నీవంశకర్తయైన వికర్తనుడు మమ్ములను చూచి "ఓమునులారా! నేను పూర్వము సత్యలోకమున సేయు రంగశాయిని పూజించుచు స్వామీ! మా వంశీయు లందరు మీచరణసేవ వర మీయుడని మ్రొక్కిన అతడు నే నయోధ్యాపురి సరయూతీరమున చిర కాలమునుండి నీవంశీయులచేత పూజలు గొని కలివేళ ప్రాణితతికి సులభుడ నయ్యెదను. లోకము ధర్మరహిత-మైనపుడు నా ఆశ్రయము దుర్లభ మగునని చెప్పెను మే మతని మాటలు విని శ్రీ రంగనాయకు డిచటికి వచ్చుట తప్ప దని తిరిగి మరల యిచ్చటికే వచ్చితిమి. ఇప్పు డచ్యుతుడు శ్రీరాముడై పుట్టి నాడు గనుక ఇక అచిర కాలముననే మన కోరిక సిద్ధించును. అతని అను గ్రహమున విభీషణుడు శ్రీరంగ మెప్పు డెచటికి తెచ్చునో అప్పుడు మేము నీకు తెల్పెదము. అంతవరకు నీవు నీ పట్టణముననే యుండి రాజ్య పాలనము చేయుచుండు మని చెప్పిరి. అది విని ఆరాజు తన పట్టణమునకు వెళ్లెను.

అయోధ్యయందు శ్రీరాముడు పుట్టి రావణుని చంపిన పిమ్మట అశ్వ-మేధ యాగము చేసెను. దానిని చూచుటకు ధర్మవర్మగూడ వచ్చెను. ఆయాగాంతమున శ్రీరాముడు వసంత ఋతువున సూర్యుడు మీన రాశియం దుండగా సిత సప్తమీ శనివారము రోహిణీ నక్షత్రమున శ్రీరంగమును విభీష ణున కిచ్చెను. అప్పుడతడు దానిని గైకొని తన బలగముతో నిజ పట్టణమునకు వెళ్ళుచు అభిజిన్ముహూర్తమగు వరకు దారియందు కావేరీ తీరమును చేరి చంద్ర పుష్కరిణీ తీరమున రంగధామమును దించెను. అప్పు డచటికి అయోధ్యనుండి

వచ్చుచున్న ధర్మవర్మ మఱియు అచ్చటి ఋషులు వచ్చి రంగశాయిని పూజించిరి. పిమ్మట విభీషణుడు మాధ్యాహ్నికము తీర్చుకొని వెడలిపోవ నుద్యమింప ధర్మవర్మ అతని నచ్చట కొన్ని దినము లుండగోరెను. అప్పుడు విభీషణుడు రేపు దేవికి ఇక్ష్వాకువు ఉత్సవము సలిపిన దినము. కనుక ఇల్లు చేరవలయు ననగా నతడు దాని నిచ్చటనే జరుపుము. నే నుత్సవమునకు కావలసిన వన్ని సమకూర్చెద నని చెప్పెను. అంత విభీషణు డందుల కంగీకరించి అచ్చట నిలిచెను. ఆయుత్సవము తొమ్మిది దినములు నడిచెను. పిమ్మట విభీషణుడు అవభృథమాడి అర్ధమాస వ్రతమువరకు అచ్చటనే నిలిచి మరునాడు అరుణోదయమున దానిని గొని పోవుటకు బూని ఎంత ప్రయత్నించినను రంగమందిరము కదలక అతడు అలిసిపోయెను. అపుడు రంగనాథుడు విభీషణునితో నిట్లు చెప్పెను.

కావేరి కథ :- "ఓవిభీషణా ఈ కావేరీ తీరము పరమాహ్లాదకరము ఈ చంద్రపుష్కరిణి సుధానుకారి. కనుక నేనిచ్చటనే నివసింతును నీవు లంకకు వెళ్ళుము. దీనికొక కథ గలదు వినుము" అని ఇట్లు చెప్పెను.

పూర్వ మొకప్పుడు వింధ్యాద్రి సమీపమున నదులన్ని కూడియుండగా అప్పు డా దారిని దక్షిణ సముద్రమున కేగు విశ్వావసు డను గంధర్వుడు వానికి నమస్కారము చేసి వెళ్ళినపిమ్మట నదులు ఆతడు నాకు మ్రొక్కె నాకు మ్రొక్కె నని వాదులాడుకొనసాగెను. ఆ గంధర్వుడు సముద్రతీరమున దిగి పుష్యమాసము దానితీరమున గడిపి ఉత్తరాయణము రాగా మరల నిజస్థానమున కేగుచు అదే దారిని వచ్చి ఆనదులకు మరల నమస్కరించెను. అప్పు డవినీవు మాలో ఎవరికి నమస్కరించితివి అని అడిగెను. ఆతడు మీలో మహిమాధికులైన వారికి అని చెప్పుచు వెళ్ళెను అది విని వాని వాదు మ్రగ్గెను, కాని—గంగాకావేరులు మాత్రము తమ వాదము విడువక బ్రహ్మ చెంతకు వెళ్ళి మాలో నెవ్వ రధికులు అని యడిగిరి. ఆతడు మహత్వమున గంగాదేవి గొప్పదని చెప్పెను ఆది విని కావేరి మారు మాటాడలేక దీనవదనయై సహ్యతటమునకు వచ్చి గంగ కంటె అధిక్యతను కోరి బ్రహ్మను గురించి పెక్కు వర్షములు తపస్సు చేసెను. అపుడు బ్రహ్మ ప్రత్యక్షమై "కావేరీ ! నేను నీకు సురధునీ సామ్య మీయగలను గాని అధిక్యత నీయజాల"నని చెప్పెను అప్పుడు కావేరి బ్రహ్మను విడిచి

నా ప్రతి బింబమును ఒకచోట నిలుపుకొని పెక్కేండ్లు భజించెను. అప్పుడు మెచ్చి వరము కోరుమంటిని. కావేరి నన్ను గంగను మీరు వరము కోరెను. అంత నేను రంగమందిరముతో నీప్రవాహ మధ్యమున నివసింతునని చెప్పితిని," అని రంగశాయి చెప్పగా విని విభీషణుడు చేతులు మోడ్చి స్వామీ! నీకోరిక ఇట్టి దైన యెడల నేను కూడ నిచ్చటనే యుందును. రఘువరు డిచ్చిన నీ మంది రమును విడిచి నే నెటుల భవాంబుధి దాటుదు ననగా ఆస్వామి "విభీషణా! నేని పుడు కర్మభూమివాసుల నుద్ధరించుట కీయవతార మెత్తితిని, నీ విచ్చట నుండరాదు నీ పట్టణమునకు వెళ్ళి శ్రీరామునిచే నీయబడిన రాజ్యసుఖము ననుభవింపుము. పిమ్మట నీవు మోక్షపదము చేరుదువు, నీవు మోక్ష పదము చేరుదువు; నీవు నన్ను తలచుచుండుము. నేను నిన్ను మరువను. నీవుగాని నీవారు గాని ఇచ్చట కెప్పుడు రావలదు. నే నెల్లప్పుడు నీపట్టణమువైపే చూచు-చుందును. నీద్వీపము పుణ్యభూమి కనుక నీవచ్చటనే యుండుము ఒక్కొక్క-యేట పుణ్య దినములలో మాత్రము నాదర్శనమునకు రమ్ము-పొమ్ము" అని పలుక విభీషణుడు మారు మాటాడలేక లంకకు వెళ్లెను. అది మొదలుకొని రంగ మందిర మిచ్చట నున్నదని వ్యాసుడు నాగదంతమునికి చెప్పి నారాయణుని అవ తార ప్రసంగముచేసి కావేరిని పొగడి చంద్ర పుష్కరిణి ప్రభావము తెలుప గోరి యిట్లనెను

చంద్రపుష్కరిణీ మాహాత్మ్యము :- పూర్వము సనత్కుమారుడు వాయు భక్షణముచేత పంచాగ్నిమధ్యమున చంద్రపుష్కరిణీసమీపమందు ఘోరతపము జేసెను. అందుల కింద్రుడు భయపడి దేవతలతో బ్రహ్మచెంతకు వెళ్ళి "సనత్కుమారుడు ఘోరతపము చేయుచున్నాడు. దానిని మాన్పకున్న లోక ములు భస్మ మగును. అతనికి ఇంద్రపదమో మరియేదో యిందు మేము నిన్ను శరణు జొచ్చితిమి," అని పలికి మిన్నకుండెను. ఆసమయమున శివు డచ్చటికి వచ్చి ఇంద్రాదులు వచ్చిన కారణము తెలిసికొని బ్రహ్మతోఇప్పుడు మన మేమి చేయవలయు ననగా నతడు సనత్కుమారుడు మోక్షము గోరి తపము జేయు చున్నాడు అది పంకజనాభుని చేతిలోని పని మన మిప్పు డతనిదగ్గరకు వెళ్ళి చెప్పుద మనును. వారందరు కదలి క్షీరసాగరతీరమునకు వెళ్ళి శ్రీహరిని "భవచ్ఛరణాగతుల మగు మమ్ము రక్షింపుము అఖిలంబు నీవే యెరుగుదు"వని

ప్రార్థింపగా అతడు సముద్రమధ్యమున వానికి ప్రత్యక్షమై సనత్కుమారుని తపోవిషయ మెరిగి చిరునవ్వుతో పద్మసంభవా నాదృష్టిలో పడిన వా డెవ్వడైనను ఆపదలు తొలగి ఐశ్వర్య మందును. కనుక నీవంటివారిని అడుగ నక్కరలేదని పలికెను. అది విని వారంద రతనికి నమస్కరించి సంతోషముగ తమనెలవులకు వెళ్ళిరి.

## తృతీయాశ్వాసము

విష్ణువు ఇంద్రాదులను పంపి తానొక ఆధ్యాపకుడై ఖగేశ్వరుని పంచాయుధములను వటుగణముగా జేసికొని వారితో వేదపారము చదివించుచు సనత్కుమారు డున్నవనమునకు వెళ్ళెను, అతడు హరిని దూరముననే చూచి లేచి ఎదురుగా వెళ్ళి సమస్కరించి వారి ఆకారములనుబట్టి సామాన్యులు కారనితలచెను. అధ్యాపకరూపమున నున్నవిష్ణువు అతనిని చేరి ఓయతివరా ! నీ వెవరని యడుగ'' నేను సనత్కుమారుడను ఇక్కడ తపము జేసికొనుచున్నాను'', మీ రెవరు ? ఎక్కడినుండి వచ్చితి రనివిష్ణువు నడిగెను. విష్ణువు నేను ఇచ్చటి నుండి వచ్చితి నని చెప్పలేను. కాని నిన్నొక మాట నడుగ వచ్చితిని. ఓ భూసురా ! సర్వకరణములకు కార్య మేది వాచ్యమేది. భూతములకు చక్షు వేది. ఒక్కటియై పెక్కైనది ఏది ? —

ఘనాశ్రయమై ఘనమైన దేది. అల్పతరమై వ్యాపకమైన దేది. సదసత్తు లేవి. దానికి పరమేది. అజాతమై బహుప్రజాతమైన దేది అని యడుగ ఆ ప్రశ్నలు విని సనత్కుమారుడు అనఘా ! మిమ్ము మీ శిష్యులను చూడ నీవు లక్ష్మీపతివలె నున్నావు లేకున్న ఇట్టి ప్రశ్న లెవరు నడుగ జాలరు మీ ప్రశ్నలకు సమాధానము నేను చెప్పజాలను సకల వేదాంతరహస్యవేదివైన నీవు తప్ప మరొక రీ ప్రశ్నలకు సమాధానములు చెప్పజాలరు కాన నీవే తెలుపుము', అనగా నతడు తాను వేసిన ప్రశ్నలకు సమాధానములు తానే చెప్పి పిమ్మట సనత్కుమారుడు అడిగిన ప్రశ్నలకు గూడ సమాధానము చెప్పెను. అంత సనత్కుమారుడు మహాత్మా ! వేదాంత వేద్యమైన యర్థము సరసముగా చెప్పితివి. నేటికి నీచేత నాసందేహములు బాసినవని కొనియాడెను. పిమ్మట విష్ణు వేగెను అతడు వెళ్ళిన పిదప బ్రహ్మ అచ్చటికి రాగా సనత్కుమారు

దతనికి మ్రొక్కి ఓ తండ్రీ! ఇప్పు డిచ్చటి కొక భూసురుడు వచ్చి వెళ్ళెను. అత డెవ్వరు? అని యడుగ, బ్రహ్మ-అతడు నారాయణుడు. వెంటనున్న శిష్యులు అతని ఆయుధములు-నీకు మరల అతనిని రంగమందిరమున కన్గొను భాగ్యము కల్గును. అంతవరకు పరమాత్మ చింతతో ఈ పుష్కరిణి తీరముననే యుండుము. దీని మహిమ చెప్ప శక్యము గాదు. ఇది తీర్థసారము. ఇందు 'జితంతే' అను మంత్రమున స్నానము చేసినచో నఘములు తొలగి సాయుజ్యము కలుగునని చంద్ర పుష్కరిణీ మాహాత్మ్యము చెప్పి దీనికి నాచే తీర్థ రక్షకులుగా కల్పింపబడిన పుష్కరాక్ష కుముదకాల సుప్రతీపు లనువారు నాల్గు దిక్కులందు మరియు తీర్థమధ్యమందు నుందురు. కనుక వారిని తలచి ఇందు స్నానమాడ వలయును. సర్వపర్వములందు చంద్రు డిందు స్నానమాడును. కనుక దీనికి చంద్రపుష్కరిణి యని పేరు. నీవు దీనిలో స్నానము చేసి రంగధామమున కేగి సుఖముగా నుండుము. తపముచేత లోకము లుద్విగ్నము చేయవలదు. నీవు ఈ తీర్థవాసముననే కృతార్థుడ వగుదువు. అని చెప్పి వెళ్ళి పోయెను. అది విని సనత్కుమారుడు తండ్రి చెప్పినట్లు ఆ తీర్థమందు స్నానమాడి రంగ మందిరమునకు వెడలిపోయెను. ఈ విషయము వ్యాసమహర్షి నాగదంతునితో చెప్పి ఇంకను ఇట్లనెను.

చోరుని కథ .— పూర్వ మొక దస్యుడు బాటలు కొట్టి ధనము దోచు కొనుచుండెను వానిచే పెక్కురు బాపలు చచ్చిరి. ఒక్కనా డా దారిని ఒక బ్రాహ్మణుడు పోవుచుండ చోరు డతనిని చూచి నిలువు మని గద్దించి సిగ బట్టి ఈడ్చి పడవేసి దారి బత్తెమునకుగూడ ఒక్కపైస అతని దగ్గర లేకుండుట జూచి తల నరుకబోవ ఆ బ్రాహ్మణుడు భయపడి వానితో నన్ను చంపవలదు. చేత గవ్వలేని నన్ను చంపిన నీ కేమి లాభము? కాపాడి పుణ్యము కట్టుకొమ్మని వేడెను, అది విని చోరుడు ఓ యీ! నీ వెక్కడినుండి యెక్కడికి వెళ్ళు చున్నావు అని యడుగ నేను భూప్రదక్షిణము చేసి వచ్చుచు చంద్ర పుష్కరిణిలో స్నానము జేసి రంగనాథుని సేవించి మాదేశమునకు పోవుచున్నా నని పలికెను. అప్పుడు పుణ్యుడగు ఆ బ్రాహ్మణునితోడి సంభాషణము వలన చోరుని మనస్సు మారి చేతులు జోడించి వినయమున స్వామీ! ఆ చంద్ర పుష్కరి ణియెక్కడ? మావంటి పాపులకు శ్రీరంగము కనిపించునా? నాకిది చెప్పి

నీదారిని నీవు వెళ్ళు మనగా ఆమాటలకు బ్రాహ్మణుడు సంతసించి చోరునితో ఇచ్చటికి అర్ధయోజనము మీదనే చంద్రపుష్కరిణి యున్నది. దాని తీరమున శ్రీరంగ మున్నది. అచ్చటికి వెళ్ళి దానిలో స్నానము చేసిన యెట్టి పాపులైన శుద్ధులగుదురు. ఇదిగో దారి అని చూపి ఆతనిని వీడ్కొని తన దారిని తాను వెళ్ళెను.

ఆతడు వెళ్ళినపిదప చోరుడు ఆ సంభాషణావిశేషమున తన పాపములు తూలిపోవ నిర్వేరపడి పుణ్యాచరణ పరిణతుడై కావేరీ తీరముచేరి కొంత కాల మచ్చట వృజినానుకూలుడై యుండి పిమ్మట చంద్రపుష్కరిణి కేగదలచి దాని తీరము చేరునప్పటికి ఆతని కాయువుమూడి భయంకరులగు యమకింకరులు కన బడిరి. వారు ఆతనిని కాలపాశమున కట్టి కొట్టుచుండ ఆ బాధకు తాళలేక వా డాక్రోశించెను. అప్పు డా తీర్థమునకు నలువైపుల ద్వి్త్రి గవ్యూతి దూర మున రక్షార్థమై యుంచబడిన విష్వక్సేనుని దూతలగు గజవదనాదులు యమ భటులచే బాధింపబడు ఆ శూద్రునిపై జాలిపడి క్రోధమున యమదూతలను కకా వికలు కావించిరి అప్పుడు తమ వెంటబడిన విష్ణుదూతల గని యమభటులు దీనులై మీ రెవ్వరని యడిగిరి అంతవారు కోపము విడచి ఓదూతలారా ! మీరు పారవలదు. నిలిచి మాకు నమస్కరింపుడు, అనిరి. వారు భయము దక్కి నమస్కరించిరి అపుడు విష్ణుదూతలు ''మేము ఈ తీర్థమునకు రక్ష కులము. ఈ ప్రదేశమునకు మాజ్ఞాతులు కాక మరెవ్వరు రాకూడదు ఇచ్చట సూర్య చంద్రాదులు గూడ తమ తీవ్రత చూపుటకు భయపడుదురు. ఇచ్చటి జనులు నిరామయులు. తిర్యగ్జంతువులు బుద్ధిమంతములు ఇది పుండరీ కాక్షుని పాలిత ప్రదేశము. మీరు శ్రీరంగమును ఎప్పుడు వినలేదా ? సీసు లారా ఇచటి మాహాత్మ్యము మీరెరుగరు. ఇచ్చటికి చేరిన వారిని బాధింప తల పెట్టినారు ఇచ్చట మాకు పరితాపము కల్గించి ఇంద్రుడు కూడ బ్రతుకలేడు మీ రెవ్వరు? మీప్రభు లెవ్వరు ? ఇచ్చటి కెందులకు వచ్చితి''రని గద్దించిరి. వారు-''మేము కాలునిదూతలము. మమ్ముల నెవ్వ రడ్డుపెట్టలేరు, జీవులు తమ కర్మ ఫలము ననుభవింతురు.ఈ కాల చక్ర ప్రవర్తకుడు విష్ణుదేవుడు మేము కలు షాత్ములకే భయంకరముగాక న్పింతుముగాని అన్యులకు గాదు.కాలము తీరినవారిని వెళ్ళి యమునిముం దుంతుము. వీడు చేసిన దురితములకు లెక్కలేదు మే మిపుడు

వీనికొఱకు వచ్చి మీచే నోడితిమి. ఇది సుకృతాత్ములుండుచోటు వీని నిచ్చట నిలుపగూడదు. కనుక మీ రడ్డమురాకుడు అంత్యమున దేవాది చతుర్విధ భూతములలో ఎవరైనను కాలుని ఎదుటకు రావలసిన వారేగదా'' ! యని పలుక వారితో వాసుదేవ పార్షదులు కర్మఫలము ననుభవించువారికి యముడు కర్తగాని అది లేనివానికి కాడుగదా ! భూత సముదయము ఈ ప్రదేశమును ప్రవేశించిన చాలును సుకృతముకనుసు ఇచ్చటి వారికి కాలస్పర్శలేదు. మీరు వచ్చిన దారిన పొండు. ఇచ్చటికి యముడు శాస్తగాడు. వీనిని గొనిపోవ మీతరముగాదు అనగా వారు వెళ్ళిరి పిదప ఆపార్షదులు ఆచోరుని వెఱవకు మని కరములచే నిమిరిరి. వాడు వారికి భక్తితో మ్రొక్కి ఆపుష్కరిణిలో స్నానము జేసి అచ్చటి మునుల సేవించి వారితో బాటు శ్రీరంగ భువనమున కేగి రంగవిభుని దర్శించి మ్రొక్కెను. అప్పుడు విష్వక్సేను డతని నచ్చటి భూతవరుల కను చరుని జేసెను

విష్ణుకింకరులచే దెబ్బలు పడిన యమదూతలు యముని చేరి మేము నీ యాజ్ఞచే పాతకుడైన యొక శూద్రుని తేబోయి విష్ణుభటులచే పరిభూతులమైతి మని చెప్పిరి. యము డది విని మొదట మిమ్ముల పటుల చేసినవా రెవరు అని కినుక పొంగి పిదప తా నంతవరకు కావేరీ తీరమునకు విభీషణుడు రంగమందిరము తెచ్చియుండుట వినియుండెను గనుక ఆశూద్రు డపు డున్నది శ్రీరంగము కావచ్చును, వారు విష్ణుదూతలు కావచ్చు నని తలపోసి శ్రీరంగ మచ్చటికి వచ్చినవృత్తాంతము తెలిపి ఆ ప్రదేశ మాహాత్మ్యమును వినిపించి అచ్చటి భూతము లన్నియు సుఖసంపన్న మైనవి ఆ ప్రదేశమును రక్షించుటకు ధాతచే భూతేశులు నియమితులైరి కర్మవశమున పుట్టి గిట్టువారినే శిక్షించు నధికారము నాకు గలదు కాని మహానుభావులను నియమించు సామర్థ్యము నాకు లేదు. కనుక మీ రచ్చటికి పోవలదని చెప్పెను వ్యాసు డీవిషయము నాగదంతమునికి చెప్పగా నతడు మునీంద్రా ! చంద్రు డే కారణముచే ప్రతిపర్వమున నాపుష్కరిణిలో స్నానము చేయునో చెప్పు మని యడిగెను

చంద్రుని వృత్తాంతము - పూర్వము చంద్రుడు దక్షుని కూతుం డ్రగు అశ్విన్యాదులను వివాహమాడి అందరితో సమానముగా వర్తింపక ఒక్క

రోహిణియందే బద్ధానురాగుడై యుండెను. ఆ విషయమును తక్కినవారు తమ తండ్రితో చెప్పిరి. అతడు చంద్రుని పిలిచి మందలించి భార్య లందరిని సమానముగా చూడు మనెను. అటులే యని చంద్రు డింటికి వచ్చి మరల నెప్పటి వలెనే యుండెను. ఇటుల పెక్కుమారు లతనిని మందలించి ఫలము గానక దక్షుడు కోపమున ''నిన్ను యక్ష్మదుర్దశ చెందుగాక''యని శపించెను. అంత చంద్రు డారోగమున కృశించి భూలోకమునకు వచ్చి చంద్ర పుష్కరిణి చెంత పది వర్షములు విష్ణువు నారాధించెను ఆపూజకు విష్ణువు ప్రీతుడై యక్ష్మ రోగము మాను నట్లు వరమిచ్చి నీవు మరల ఎప్పటివలె నీపురమును పాలింపుము. నీయుదయము లోక లోచనోత్సవ మగును నేటి నుండి నీవు తపము చేసిన ఈ పుష్కరిణి చంద్రపుష్కరిణి యనబడును అని చెప్పెను. పిమ్మట చంద్రుడు దేవా! నీ యొక్క ఈ రూపము నామనసులో నిలుపుము. అల్పాత్ములు, అసత్కర్మ బోధనులు అగువారు ని న్నెట్లు దర్శింపగలరో ఆరూప మిచ్చట నిలుపుము. అని కోరగా ఓశశీ! నీవు కోరినది జరుగును. ఇచ్చటి మునులు ఇంతవరకే నన్ను చూడగోరుచున్నారు కనుక విభీషణుడు రంగమందిరము తెచ్చి ఇచ్చట నిలుపును. అందు నే నా కల్పాంతమువర కుందు. అప్పుడు నీవు నన్ను దర్శింప గలవు. ఇంక ప్రతి పర్వమున నీ విచ్చటికి రమ్మని పొమ్మని ఆదేవు డంతర్ధాన మొందెను. ఈ వృత్తాంతము వ్యాసుడు నాగదంతునకు చెప్పి ఓమునీ! ఈ సరస్సు కృతయుగమున పదియోజనములు త్రేతాయుగమున దానిలో సగము ద్వాపరమున దానిలో సగము నగుచు, కలియుగమున దినదినము అంతంతకు తరుగునని ఆ సరస్సు ఎప్పు డెప్పు డేరూపములు పొందునో సవిస్తరముగా వినిపించి దీనితీరమునం దున్నకలి దోషములు కలుగ నేరవు అందులకు పూర్వపు ముదు లొక కథను చెప్పెదరు దానిని వినుమని యిట్లు చెప్పెను

బ్రహ్మహత్యా పిశాచి కథ - పూర్వము చోళమండలమున రాజదోషముచే పన్నెండేడులు అనావృష్టిపీడ కలిగెను ఆ సమయమున మృత్యుదేవత దేశ మంతట నాట్యముచేసెను ఒక్క శ్రీరంగ విభుని ఆశ్రయించు సిద్ధులకు మాత్రము కావేరి శరణమై యుండెను కొంతకాలమున కదికూడ ఇంకిపోవ ఆ నదీ తీరవాసులు మాకిక దిక్కెవరని తనూత్యాగము కు సిద్ధపడిరి. అది గని అచ్చటి తీర్థరక్షకులు వారిపై దయదలచి ఆకాశమునకు వెళ్ళి మేఘ

ముల నాక్రమించి వానిదేహము చిల్లులువోవ బొడిచిరి. అప్పుడు జన మాశ్చ ర్యపడునట్లుగా ఆ మేఘములు ఉరుములు మెరుపులు లేకుండగనే కుంభవర్షము కురిసి కావేరి వెల్లువయైపారెను. దానివలన ఆ నదీ తీరవాసుల కరువు పాసెను. అప్పుడు ఆ రాజుచే చేయబడిన బ్రహ్మహత్య పిశాచిరూపము ధరించి కావేరీ నీరము నొక్కగ్రుక్కలో త్రాగెను. అప్పుడు ఆ తీరమున మరల మునుపటి దశ దాపురించగా తీర్థరక్షకులు కారణ మన్వేషించుచు నదీతీరమువెంట వచ్చిరి. ఆ పిశాచి ఒక చోట ప్రవాహమున కడ్డముగా నోరు తెరుచుకొని పడియుండెను. అది వారిని చూచి భయపడి పారిపోగా దానివెంట తగిలి ఓసిదురాత్మురాలా ! ఎందు పోయెదవు ? అని పట్టుకొనిరి. అప్పు డది తనను గురించి యిట్లు చెప్పెను.

సోమక భూపాలుని కథ - పూర్వము ఈ జన పదమును సోమకుడను రాజు పాలించుచు ఒకప్పుడు అపరాధి యొకచోట నుండగా దోష మెరుగని వేరొకశ్రోత్రియుని పట్టి వంపించెను. అప్పు డతని మంత్రులుగాని ఆప్తులుగాని ఇది గూడ దని మందలించి విడిచిపెట్టలేదు తమ ఎమచునా నెపడైన పరితము చేయుచుండ దానిని వారింపనినాడు వారంద రాపాపఫలమున భాగస్వాము లగుదురు కనుక ఆకారణమున ఈ ప్రదేశము దోషదూషితమై నాచే సరోవర తటాకాదులందలి జలము గ్రోలబడినది. మీ రెవ్వరు ? నన్నెవ్వరుగూడ అంతయు చేయలేరు. మీ కీవృధాప్రయాస ఎందుకు అనగా వారు కోపమున ఓ పిశాచీ ! ఇది నీవు సామాన్య ప్రదేశ మనుకొంటివి కాని ఎట్టివారకిని చేర వీలుకాదు ఈప్రదేశ మంతయు విష్ణుభూతేశరక్షితము కనుక నీ విక్కడినుండి వెడలి పోకున్న నిన్నుపట్టి వధింతుము అని పలుక ఆబ్రహ్మహత్య అచ్చట సద్యో నాశ మందెను. అని చెప్పి ఓ నాగదంత మునీ! ఇట్టిదే మరియొక కథ చెప్పె దను విను మని ఇట్లు చెప్పెను.

చిత్రసేనుని కథ - పూర్వము ఇంద్రసఖుడైన చిత్రసేను డనుగంధ ర్వుడు మదిరాపానమత్తుడై తనతోడివారితో ఆకాశమార్గమున వెళ్ళుచు శ్రీరంగ విమానచ్ఛాయను దాటెను. అతని తోడివారు అది దాటరాదని తెలిసి అచ్చటనే నిలిచిరి అపుడు అచ్చటి తీర్థరక్షకులు ఆఛాయను దాటిన చిత్రసేనుని ముందు

లకు పోనీయకుండ కడతలుబట్టి బిరబిర త్రిప్పి పారవేసిరి. అప్పుడు వాడు మారీచునివలె సముద్రమున కావలపడెను; అతని తోడివారు అతడు అట్లు పడుట చూచి అచ్చటికి వెళ్ళి తేజోవిహీనుడైన అతనిని ప్రబోధించిరి. అపుడు చిత్ర సేనుడు వారితో నన్నెవ రిట్లు పడవేసిరో మీ రెరుగుదురా! చెప్పినయెడల నేడు వానిని హోమము చేసెదను. అని పలికి అప్పుడు ఆకాశగమనమున మీకు నాకు సమానమేగదా! నే నొక్కడనే ఎందుల కిటుల పడితిని. ఈపక్షపాత మెందువలన కలిగె నని యడిగెను. అప్పుడు వారు నీవు తామసమున శ్రీహరి దివ్యధామచ్ఛాయను లంఘించితివి. అందువలన నిట్లు పడితివి. నిన్ను పడవే సినవా రెవ్వరో మేమెరుగము అది అంతరిక్షభూతము లెరుగును. ఇప్పుడు నీవు పడినచోటు మనము వచ్చెడుదారికి ప్రక్క సముద్రద్వీపాంతరముగా నున్నది. ఇచ్చటినుండి నడిచి పోవుటకు కొన్నివందలఏండ్లు పట్టును. కనుక దురితనిష్కృతి కల్గువరకు నీ విచ్చటనే యుండుము. మేము వెళ్ళి నీ సంగతి ఇంద్రునకు తెల్పెదము. అని వారు వెళ్ళిరి పిమ్మట ఆగంధర్వుడు అతికరుణముగా ఏడ్చుచు శివుని స్తుతించెను అపుడు శంకరుడు ప్రత్యక్షమై అతని ఆపదకు జాలిపడి అతనిని అచ్చట పడవేసినవారి నెరింగి తనకింకర గణములను పిలిచి ఆజ్ఞాపించెను. వారు భయంకరాకారమున శ్రీరంగక్షేత్రమునకు వెళ్ళి కావేరీజల మంతయు త్రాగిరి. అప్పుడు తీర్థరక్షకులు మొదటివలె కారణ మరయుటకు ఆనదీతీరమువెంట వెడలి ఒకచోట దాని కిరువైపుల నోరు తెరుచు కొని సముద్రఘోషతో నీరము గ్రోలు పిశాచులను చూచి వారిని పరిఘాసి చక్రములతో మోదగా తల్లడిల్లి పరుగెత్తిరి అప్పుడు వారివెంట నున్న కుమారస్వామికూడ పరుగెత్తెను. అది గని శివుడు తమ పరివార మెందులకు పారివచ్చుచున్నదని మనసులో తలచుచుండ కుమారస్వామి వచ్చి జరిగినవిషయము చెప్పెను. అది విని శివుడు బలవంతులతో విరోధము కూడ దని ఆగంధర్వుని మరెచ్చటికైన నరుగుమని చెప్పి తా నంతర్థానమందెను

ఈలోపల చిత్రసేనుడు పడిపోవుటను చూచినవారు వెళ్ళి ఇంద్రునకు చెప్పగా ఆతడు దిక్పాలకులతో తీర్థరక్షకులపైకి యుద్ధమునకు వచ్చెను. వారికి ఘోరయుద్ధము జరిగెను ఆయుద్ధమున ఇంద్రుని వజ్రాయుధము మొక్కవోయెను తీర్థరక్షకు లతనిసైన్యమును పరిమికొట్టి విజయోత్సవము - మరల తాము న్నచో

టికి వచ్చిరి. ఇంద్రుడు పరాభవమున దీనుడై వెతలుచుండ బ్రహ్మ ఆతనిదగ్గ రకు వచ్చి కారణ మడిగి తెలుసుకొని విష్ణుభూతనాథులచెంతశివపాశుపతముగాని నావరముగాని పనికిరావు ఇంక నీవజ్రమెంత అప్పు డితనివెంటనున్నగంధర్వులు బ్రహ్మతో తమప్రయాణము మొదలుకొని చిత్రరథుడు పడిపోవుట ఆతనికి శివుడు సహాయముగా వచ్చుట మొదలుకొని అప్పటివరకు జరిగినవిషయ మంత చెప్పి ఆసమయమున శివుడుగూడ నచ్చటికి వచ్చి తనకు జరిగిన అవమానమును జెప్పెను అది విని బ్రహ్మ ఆగంధర్వుడు కానిపని జేసెను. వానిని రక్షింపబోయి మీ రిట్టియవమానముల పాలైతిరి. వాడు ధర్మమార్గమును దప్పిచక్రి దివ్యాలయచ్ఛాయ నతిక్రమించి ఆపాపమున ఇట్టి కష్టపా టొందెను అనగా ఇంద్రుడు అది విని హరిభవన చ్ఛాయాలంఘనపాప మెట్టిది? అది ఎట్లు తొలగు నని యడిగెను అప్పుడు బ్రహ్మ ఆతనికి ఛాయాలక్షణ మెల్ల నుపన్యసించి పిన్నవా డెప్పుడు పె ద్దలఛాయదాటరాదని తెలిపి చిత్రరథుని దురితనిష్కృతికి విష్ణుసమర్చనము తప్ప వేరొకటి లేదని తెలిపెను. అది విని ఇంద్రుడు చిత్రరథుడుపడినచోటికి వెళ్ళి బ్రహ్మచెప్పినవిషయము చెప్పి తననివాసమునకు వెళ్ళెను ఆమాటలు విని గంధ ర్వరాజు నిర్వేదపడి అచ్చటినుండి వెడలి కాశ్యపుడనుమునిని దర్శించి విష్ణువును సేవించువిధానమడుగ ఆతడు దానిని తెలిపి నీవు చంద్రపుష్కరిణికి వెళ్ళి అందు స్నానమాడుము నీపాపములు తొలగి పూర్వశక్తి గలుగు నని చెప్పెను అది విని గంధర్వుడు ఆమునిని వీడ్కొని వచ్చుచు దారిలో చంద్రపుష్కరిణిని కాంచి అందు స్నానమాడి విష్ణుబిరుదాంకితములైన గానముల పాడెను దానికి విష్ణువు ప్రీతుడై ఆతనిదురితములు హరించి పూర్వశక్తి నిచ్చెను దానితో చిత్రరథుడు తనవిమానమున నెక్కి నిజాలయమునకు వెళ్ళెను. అప్పుడు మరల పూర్వశక్తిని పొంది వచ్చిన ఆతనిమిత్రునిజూచి ఇంద్రుడు సంతోషించెను

## చతుర్థాశ్వాసము

ఇటుల పుష్కర తీర్థమాహాత్మ్యమును విన్న పిమ్మట నాగదంతుడు వ్యాసు నితో అనఘా! ఇచ్చట మరి ఏయే తీర్థములు గలవో చెప్పు మనెను. అప్పుడు వ్యాసుడు ఇచ్చట పదితీర్థములు గలవు వానిని గురించి చెప్పెదను విను మని యిట్లు చెప్పెను

పూర్వము భరద్వాజుడు తన శిష్యులతో తీర్థ తత్పరుడై కంచి, గంగా ద్వారము మొదలైనవి దర్శించుచు చంద్రపుష్కరిణికి వచ్చి దానియందు స్నాన మాడి రంగని సేవించి అచ్చటివసమున గలమునుంతో తమ గురువగు వాల్మీకి మహర్షి ఆ సమీపమునసే యున్నాడని విని వెళ్ళి అతనిని దర్శించి నమస్కరించి మహాత్మా ! నే నెన్నియో తీర్థములను చూచితినిగాని ఏదిగూడ చంద్రపుష్కరిణికి సాటిగావు అనగా అతడు అవును అందుచేతనే విభీషణుడు రంగ-మందిర మిచ్చ టికి తెచ్చినప్పటినుండి నేనన్ని విడిచి ఈ పుష్కరిణిలో స్నానము చేయుచు రంగనాధుని భజించుచు నిచ్చట నున్నాను ఇక్కడుండగా విమలమైన నామన స్సునకు ఇచ్చటగల అనేక విచిత్రములు తోచుచున్నవని చెప్పెను, అది విని భరద్వాజుడు మహాత్మా! మీ రిచ్చట నున్నకాలమున కనిన విశేషములు వినిపింపు డని వేడెను అప్పుడు వాల్మీకి ఓ భరద్వాజా ! ఈ చంద్ర-పుష్కరిణికి ద్విత్రిగ వ్యూతి ప్రదేశ మాత్రమున అశ్వత్థ, వకుళామ్ర, కదంబ, జంబూక, బిల్వ తీర్థంబు లని ఆరు తీర్థము లున్నవి వానిలో స్నానము చేసిన నెట్టి పాపియైన చిరవిశుద్ధి చెందును. వానిని వినిపించెదను వినుమని ఇట్లు చెప్పెను.

అశ్వత్థ తీర్థమహిమ :- (మాధవి కథ) :- పూర్వ మిచ్చట మాధవియను బ్రహ్మవాదిని జలమధ్యమున నిలిచి తపము చేయుచుండెను అటులుండ నొకనా డామెకు అంబరమునుండి రక్షింపుడు రక్షింపుడు, చచ్చితిని చచ్చితిని అని ఆడు కూయి వినిపించెను. అది విని ఆమె తలయెత్తి చూచినచో అచ్చట నొకస్త్రీని యమ భటులు బాధించుచుండిరి. మాధవి కామెపై జాలి గలిగి ఓ స్వామీ ! ఈ దీనురాలిని కృపామతివై రక్షింపు మని ప్రార్థించెను అది విని యమ భటు లామెతో ఓ తపస్వినీ ! ఈమె లోకమున చేయని పాపములు లేవు అందుచేతనే ఈమె నిట్లు హింసించుచున్నాము. మేము యమదూతల మని చెప్పిరి అది విని మాధవి "కావచ్చుగాక లోకమున విధి నెవ్వరును తప్పించుకొన లేరు. కాని ఇప్పు డీమె నాదరి చేరినదిగనుక నే నే విధముగనైన ఈమె వెగులు తీర్చవలయును. అందులకు నేనేమి చేయవలయునో చెప్పుడు చేసెదను " అనగా వారు నీవు విష్ణు శాసనము సతకరించుచున్నా వని బెదిరించిరి వారి నామె లెక్క చేయక ఈమె ఏ పుణ్యము చేయకున్న యెడల నేను నాపుణ్యములో కొంచె మిచ్చెదను ఈమెను వదలుడని తా నాతీర్థమున నియమముతో వసించిన దినములలో ఒక నాటి ఫలం

మిచ్చెను. దానితో ఆమెయమభటులచే విడువబడి సిద్ధులచే సంభావింపబడుచు వైవస్వత సభ కరిగి సమవర్తిని గని నమస్కరించెను అప్పుడు అత డామెను తండ్రివలె నాదరించి ఓ నెలతా! నీ వీ జన్మమున చేసిన పుణ్యము లేశమాత్రము గూడ లేదు. క్రిందటి పన్నెండవ జన్మమున నొకనాడు నీ యింటికి ఒక సాధువు వచ్చెను. అప్పుడు నీ వొక రాత్రి అతని సన్నిధిని గడపితివి గనుక ఆ సన్నిధాన ప్రభావమున నీ కీ జన్మలో అశ్వత్థ తీర్థవాసము అచ్చటగల బ్రహ్మవాదిని యగు మాధవి యొక్క ఒక దిన ఫలము నీకు సంక్రమించినవి ఇక ఈ ఫలము వలన నీవు కల్పక్షయము వరకు బ్రహ్మలోకమున నుండు మని యామెను పంపెను. అప్పు డామె సురలు వెరగు పడి చూడ దివ్య విమానము నెక్కి బ్రహ్మలోకమున కేగెను. మాధవి కూడ అటులే కమలాపతి నారాధించుచు విష్ణు పద మందెను అని చెప్పి వాల్మీకి ఇంకను ఏమి వినగోరెద వని యడిగెను. అది విని భరద్వాజుడు మహర్షీ! నాకింకను అశ్వత్థ మహిమనే వినవలయు నని యున్నది అని పలికెను. అప్పుడు వాల్మీకి మరల నిట్లు చెప్పెను.

కణ్వుని కథ – పూర్వము కణ్వు డనునొకముని యుండెను అతడు రంగపతిని భజించు వేడ్కతో కావేరికి వచ్చి స్నానము చేసి రంగపతి మందిరములోనికి వెళ్ళి స్వామిని దర్శించి, సేవించి వెలుపలికి రాగా అతనికి ఇద్దరు ముగ్గురు భక్తులు మరియు నొక కాంతతో గూడిన దివ్య పురుషు డొకడు కావేరీ తీరమున కనిపించెను అత డచ్చముగా రంగపతివలెనే యుండెను కణ్వు డతనిని చూచి విస్మయపడి రంగమందిరమునుండి నే నిపుడే వెడలితిని. ఇత డెక్కడి నుండి వచ్చెను. నేను చూచిన రంగపతి ఇతడేనా వేరా యని విస్మయ పడు చుండ నతడు కణ్వునితో ఓమునీంద్రా! నీ వేమి ఆలోచించుచున్నావు. అది మాకు చెప్పదగినదైన చెప్పు మనగా నతడు చేతులు జోడించి స్వామీ! నే నిపుడే రంగ మందిరమునుండి బయటకు వచ్చితిని ఇక్కడ మీరు కనిపించితిరి. మీయందు ఆ దేవుని లక్షణములు పొడకట్టు చున్నవి. అతడే మీరగునో కాదో సెలవిచ్చి నన్ను ధన్యుని చేయుడు అనగా నతడు ఎలనవ్వున ఓ మునీంద్రా! ఈ ప్రదేశము మిక్కిలి హృద్యము కనుక నాకు ప్రాణప్రదము నే నిచట రంగశాయినై వసించితిని ఈ చోటు తప్ప నాకు మరేది రుచించదు అందువలన నేను ఈమె ఎల్లపుడు ఇచ్చట సంచరింతుము అని చెప్పి అచ్చట

గలవనము ప్రవేశించి అందు విహరించి చంద్ర పుష్కరిణిలో జలకేళి సలిపి అచ్చట గలమునులు ఈతఁ డెవ్వరో యెఱుగము. రంగనాథు డేమోయని భావించు చుండఁగా వత్స తచ్చటినుండి అశ్వత్థ తీర్థమునకు వెడలి తన వారితో గూడ నా వృక్షమున ప్రవేశించెను. అప్పుడు అటుల అంతర్ధానమైన అతనిని కానక కణ్వుఁడు సంతప్తుఁడై దుఃఖించుచు అనేక వర్షము లచ్చట తపస్సు జేసెను. అంత నొకనాడు అతనికి అంతరిక్షమునుండి ఓమహర్షీ! దుఃఖము మానుము. ఈ తీర్థము మిక్కిలి పవిత్ర మైనది. కనుక దీనియందు స్నానమాడిన వారు సకల పాప విముక్తు లగుదురు. నీవు ఇచ్చట నన్ను పూజించి రంగమందిరమున నారూపమును దర్శింపు మని చెప్పెను. అది విని కణ్వుఁడు పుండరీకాక్షుని శాసనమున బ్రహ్మోపాసనాపరాయణుఁడై అచ్చట చిరకాలము నివసించెనని చెప్పి వాల్మీకి భరద్వాజునితో మరల నిట్లనెను.

కేసరతీర్థమహిమ— (సుకీర్తికధ) :- అనఘా ! దీనిసమీపమున కేసర మనుపేర నొకతీర్థము గలదు. దానిని విన్నను పేర్కొన్నను కల్మషములు తొలగును. దాని తీరమున పూర్వము కాశ్యపు డనుముని తపము జేసెను. అపుడు ఒకనా డచ్చటికి సుకీర్తియను కాశీరాజు తనసైన్యముతో వెళ్ళి కాశ్యపునకు నమస్కరింప అతడు నీ వెవ్వరు ? ఎచ్చటినుండి వచ్చితి వనియడిగెను. అది విని సుకీర్తి మునీంద్రా ! నేను కాశీరాజగు సుబలుని కుమారుఁడ ననిచెప్పగా కాశ్యపుడు ఓరాజా ! నీతండ్రిని నే నెరుగుదును, ఆయన కుశలమా ! నీ వతనికి రాజ్యపాలనమున తోడ్పడక తాపసులవలె ఇట్లేటికి తిరుగుచున్నా వనియడిగెను. అంత నతడు మహర్షీ ! మాసైన్యము నానాటికి వివిధరోగములతో కృశించు చున్నదిగనుక దానిని మాన్పుటకు వారి నిచ్చటికి స్నానమునకు గొనివచ్చితిని మీతపోవనమున కలజడి గలుగు నని వెలుపల నిలిపి మీదర్శనమునకు వచ్చితి ననెను. అది విని కాశ్యపుడు మహారాజా ! బుద్ధిబలముచే సైన్యమునకు మేలు కలుగుటకై మంచిపని జేసితివి. నీకింకేమి కావలయునో చెప్పు మనగా నాకు ముక్తితెరువుబోధింపు మనికోరెను, అందులకు కాశ్యపుడు అతనికి శ్రీవిభుని సేవించువిధము లెల్లచెప్పి ఈలోకమున నీకడు కావేరీతీరమున నున్నాడు నీ వచటికి వెళ్ళి దర్శింపుమని చెప్పెను అది విని సుకీర్తి అనఘా ! మీదుగహప

నావెంట నచటికి రండు అనివెళ్ళెను. కాశ్యపు డందుల కంగీకరించి శిష్యులు వెంటరాగా మహారాజునకు ముందట బయలుదేరెను అతనివెనుక రాజు సైన్యముతో కదలెను. దారిలో వారు జంబూతీర్థమును చేరిరి అపుడు కాశ్యపుడు సుకీర్తి కిట్లు చెప్పెను.

జంబూతీర్థమహిమ—(ఇంద్రుని వృత్తాంతము):— ఓరాజా! దీనిని జంబూతీర్థ మందురు. ఇది దేవఖాతము. పూర్వ మింద్రుడు వృత్రుని చంపిన పాపమున తేజోవిహీనుడై ఎక్కడ తిరిగినను తనను వెన్నాడుబ్రహ్మహత్య తొలగక పితామహుని చేరి తనతెరువు చెప్పుకొనెను. అందుల కతడు నీవు అచ్యుతుడు వెలసిన తీర్థము లన్ని సేవింపు మని చెప్పెను. అది విని ఇంద్రుడు పుష్కరమున నెనిమిది, గంగాద్వారమున పది సంవత్సరము లుపవసించి కాళిందిలో స్నానము చేసి సాలగ్రామశైలమున నారాయణుని, కాశిలో కృత్తివాసుని, సరస్వతీతీరమున సరస్వతిని అర్చించి — తన పాపమును పోగొట్టుకొనలేక చంద్రపుష్కరిణికి వచ్చి ముప్పదిమూడేండ్లు సరోజాక్షుని పూజించెను అప్పుడు విష్ణువు ప్రత్యక్షమై ఏమి కావలె ననగా ఇంద్రుడు తన పాపమును బాపు మనివేడెను. అంత పుండరీకాక్షుడు నీవీతీర్థమున మజ్జన మాడుము. ఎట్టివారైన దీనియందు స్నానమాడి సకలదురితములు బాసి నన్ను చేరుదురనిచెప్పి అంతర్ధానమయ్యెను. పిమ్మట విష్ణుని యాజ్ఞచే ఇంద్రు డాతీర్థమున స్నానమాడి పాపములు పోగొట్టుకొని తన పూర్వవైభవమును పొందెను కనుక ఓరాజా! నీవు నీసైన్యముతో గూడ నిందు స్నానమాడుమని చెప్పెను అది విని సుకీర్తి తనసైన్యము నందు స్నానము చేయించి తాను కశ్యపసమేతముగా స్నానము చేసి అచ్చటినుండి కదలి ఆమ్రతీర్థమును చేరెను.

ఆమ్రతీర్థమహిమ :— అచ్చటికి వెళ్ళి రాజు ఆతీర్థమున స్నానము చేయగానే నితాంతతేజమున వెలుగొందెను. అతనిసైన్యము అందు స్నానమాడి నక్షత్రములవలె ప్రకాశించెను. పిమ్మట కశ్యపు డచ్చటికి వచ్చినది తెలిసి అసమీపమందలిమును లేతెంచి అతనిని పూజించిరి. వారిని చూచి కశ్యపుడు ఓయునఘులారా! ఈ తీరమేలనో రుచిరాక్షతపుష్పఫలోపహారములతో కన్పించుచున్నదని యడిగెను అది విని ఆ మునులందరిలో పెద్దవాడగు భార్గవు డిట్లు చెప్పెను

పుష్కరుణికథ :- ఓకశ్యపా ! పుష్కరు డనునొక బ్రాహ్మణుడు భూమిపై గల తీర్థములన్నిచూచుచు దీనిమహిమ విని దర్శింపవచ్చుచుండ దారిలో ఒక భయంకరమైన పిశాచి బెబ్బులి రూపమున వచ్చి అతనిపై బడెను. అప్పు డతడు దాని ఘాతను ధైర్యముగా విడిపించుకొని అకారణముగా ఉత్తమ వ్రతుడ నైన నన్నుసీ విట్లు పట్టుకొనుటకు కారణ మేమని యడిగెను. అది విని పిశాచి ఓయీ ! నీ యందే తప్పులేదు. ఇది నన్నీ విధముగా పుట్టించిన దైవము తప్పనెను. అందులకు బ్రాహ్మణుడు ఇది నీవు చేసికొన్న కర్మ ఫలము కాని దైవము తప్పెట్లగును. అనగా ఆపిశాచి ఓ బ్రాహ్మణా ! తత్త్వము తెలి యని మాటలేల? జగత్తున చరాచరములం దీశ్వరుడు తప్ప మరొకడు లేనప్పుడు కర్మచేత భూతములు మేలుకీడు ఎట్లు చేయును. కర్మఫలమునకు కర్త, భోక్త ఈశ్వరుడే యని శ్రుతులు చెప్పునుగదా ! యనెను. అటుల వారు కొంత తడవు వివాదపడిరి. చివరకు బ్రాహ్మణుడు దానితో ఓపిశాచీ ! ఇచ్చటికి సమీపమున అత్రమతీర్థమున్నది. అచ్చట మహామును లున్నారు. మన మచ్చటికి వెళ్ళి ఈ వాదము వినిపింతము. వారి తీర్పును బట్టి నీవు గెలిచిన నన్ను భక్షింపుము. నేను గెలిచిన నిన్ను వధింతు ననెను.

అందులకు భూతము సమ్మతింప వా రచ్చటికి వెళ్ళిరి. బ్రాహ్మణుడు అచ్చటి మునులను కని తమ వివాదమును దాని కారణమును చెప్పెను. పిమ్మట పిశాచి మే మిద్దరము తీర్పునకు ఇచ్చటికి వచ్చితిమి. నే నొక కర్మయోగమున పిశాచ మైతినిగాని నాబుద్ధి బలము మాత్రము తప్పలేదు మీరు మా వాదమున జయాపజయములు నిర్ణయింపు డనగా వారు ఉభయపక్ష సిద్ధాంతముల విని వితర్కమున పడిరి. అప్పుడు పుండరీకాక్షు డొక కళ్యాణమూర్తియై తనవంటి వేషధారులు ముగ్గురు నలుగురు వెంటరాగా లక్ష్మిగూడ తనవెంట నుండగా గంధ వహసంచారమునకు వచ్చినటుల అచ్చటికి వచ్చి ఆమునులను చేరెను. వా రత నిని చూచి లేచి మ్రొక్కి అనఘా ! మీ రెవ్వరు ? మీ వెంట నున్న ఈ పుణ్య పురుషు లెవ్వరు.ఇచ్చటి కేలవచ్చితి రని యడుగ నతడు నే నీవనమున సంచరించు చుందును. ఈమె నాభార్య ఇప్పుడు మీ వాదము విని ఇచ్చటకు వచ్చితిని. సాధు సంగమము శ్రేయఃప్రదము గదా !యనగా వారు ఆతనిని విష్ణువని తలచిరి.

పిమ్మట మునులు అతనికి ఆపిశాచి బ్రాహ్మణులవాదము వినిపించి మేము దీనిని నిర్ణయింపలేకున్నాము. అనగా ఆతడు ఇది ప్రాగల్భ్యవాదము తెగునది కాదు. దీనిలో జయమెవ్వరికి కలుగదు వీరిద్దరు నిశ్శ్రేయసపదము నొందుదురు. అని చెప్ప అచ్చటివారు ఆపిశాచీ భూసురులను చూచి మీమూలమున మా కీ ఉదాత్త గుణధాముని దర్శనము కలిగెను. మీరు అమరత్వము బొంది సుఖింపుడని పలికిరి. అంత నాయిద్దరు ఆతీర్థమున స్నానమాడి వారు చూచుచుండగనే దివ్యాకృతుల ధరించి స్వర్గమునకు వెడలిరి

తర్వాత విష్ణువు ఎప్పటివలె నావనమున విహరింపవెళ్ళెను. ఆతని వియోగమును సహింపలేక ఋషులుగూడ వెంటవెళ్ళిరి. అప్పుడు విష్ణువు వారి చిత్తము తెలియగోరి యంతర్ధాన మయ్యెను.మునులు ఆహారనిద్రలు మాని చెట్టు చెట్టుచాటున నతనిని వెదుకసాగిరి. అపుడు కొంతకాలమునకు వారికి ఓతాపసులారా! మీకు పరితాప మేటికి?నేను రంగధాముడను.మీరు నన్ను అచ్చట భజింపుడు. మీకోరిక తీరును. మీభావమున ఇతరతలంపులు మాని నన్ను భజింపుడు మీకు కైవల్యము కలుగునని చెప్ప వా రచ్చటికి మరలివచ్చి నిత్యము త్రికాలములయందు ఈసరస్తీరమున చతుర్భుజుని పూజించుచున్నారు, ఈ గంధాక్షతలు వారు పూజించినవే. అని చెప్పగా సుకీర్తి ఆతీర్థమున తన చతురంగ బలములతో స్నానము చేసి బలవిశేషముచే తేజరిల్లు తనసైన్యమును చూచి కాశ్యపునితో మునీంద్రా! మీయనుగ్రహమున నాసైన్య మున కిచ్చట మేలు చేకూరినది నే నిచ్చట ఏమి చేయవలయునో చెప్పుమనియడిగి అచ్చట చేయవలసిన దానములు తెలిసికొని తనపేర అచ్చట నొక అగ్రహారము నేర్పరిచి మూడువేలమంది ఉత్తమ బ్రాహ్మణులను రావించి వారికి వేయేసి గోవులు, ఇంకను రత్నభూషణములు, దాసదాసీజనముల సమర్పించి అచ్చటినుండి రంగధామమున కరిగెను. అప్పుడు అతనికి అచ్చటి పార్శ్వచరులు ఎదురుగా వచ్చిరి. సుకీర్తి వారికి మ్రొక్కి కానుక లిచ్చి ప్రధాన పురోహిత సమన్వితముగా రంగమందిరము ప్రవేశించి ప్రతీహారుల అనుమతిచే ఆవరణత్రయము ప్రదక్షిణ చేసి అష్ట దిక్కులందు గల కుముదాదులగు తీర్థరక్షకులకు మరియు ద్వారపాలకులకు మ్రొక్కిలోనికి వెళ్ళగా విష్వక్సేనుని ఆజ్ఞచే పార్షదులు అతనిని రంగధామములోనికి కొనిపోయిరి. అతడు అచ్చట రంగనాథుని ఆపాదమస్తకము చూచి సాష్టాంగపడి

లేచి చేతులు జోడించి పరవశమున నిలువగా లోకనాధు డతనితో ఓరాజా ! నీ వెల్లప్పుడు నా పాదార్చనమున నుందువు గనుక నాకత్యంత హితుడవు. ఏమి కావలయునో అడుగుమనగా దేవా ! నీ పదాంబుజములు గంటిని. ఇంతకన్న ఇంకేమి, కావలయు నని ఆదేవుని పూజించి రంగ ధామమును వెడలి ఆకాశమున ఇంద్రనీల శిఖరములవలె ఉద్ధామమైన ఒక ధామమును చూచి కశ్యపునితో మునీంద్రా ! ఆకాశమున కనిపించు ఈ ఇంద్రనీలధామ మేమిటి ? యని యడి గెను. అతడు ఓరాజా ! అది చక్రి నివసించుధామము దాని నెల్లప్పుడు శేషుడు ధరించుచుండును. లోకములన్నీ నశించినను, ఆధామము శాశ్వతముగా నుండును, ఇప్పుడు నీకు కనిపించు నది దాని ఛాయ. నీపూర్వ సుకృత మున అది నీకు కనిపించుచున్నది. ఆధామము ప్రతియుగమున నటుల వెలు గుచు శ్రీవిభుడు ఏ యుగమున ఏ వర్ణమున నుండునో అదిగూడ ఆ వర్ణమునే ధరించుచుండును జలజనాభునికి ఆధారమయిన ఈ ధా మ ము ను శేషుడందురు అని చెప్పెను. అది విని సుకీర్తి దానికి నమస్కరించి అచ్చటి నుండి దక్షిణముగా వెళ్ళి ఒక పెద్ద పర్వతముగని దాని శిఖరము నెక్కి సమీప మందలి కావేరీ ప్రవాహమున గలరంగమందిరమును దర్శించి శేషశాయికి కానుకలు సమర్పించి తానాచోటు విడువలేక ఆపర్వతమునకు పడమట కావేరీ తీరమున తన పేర మరియొక పురమును గట్టించి దానిని పెద్దకాలము పాలించి పిమ్మట తనకుమారుని పట్టము గట్టి విరక్తుడై మనస్సు పన్నగ తల్పునిపై నిలిపి అతని పదమును పొందెను.

## పంచమాశ్వాసము

కదంబ తీర్థమహత్యము .— సుకీర్తి వృత్తాంతము చెప్పగా విని భరద్వా జుడు వాల్మీకి మహర్షితో తపోధనా ! ఈ వృక్షమేదియో తపోజన పూజితమై గిరివలెనున్నది దీనిని గురించి వినగోరుమన్నా ననగా నతడు ఇది కదంబ వృక్షము. ఈపేరున నిచ్చట నొక తీర్థమున్నది అచ్చటికి పోవుదము రమ్మని వాల్మీకి భరద్వాజుని తోడ్కొని వెళ్ళగా నచ్చటిమునులు వారి కెదురేగుదెంచి నమస్కరించిరి. వాల్మీకి వారి నుచితరీతి సంభావించి కదంబము చేరజని మ్రొక్కి పూజించి పావనమైన దాని ఛాయను వా రందరు కూర్చుండిరి. అప్పుడు భర

ద్వాజుడు అచ్చటి నివృత్తి యాగచిహ్నముల చూచి మునివరా! పూర్వ మిచ్చట ఎవరు యజ్ఞము చేసి రని యడిగెను. అప్పుడు అచ్చటి మునులందు గొప్పవా డగు గౌతముడు పూర్వ మిచ్చట మిధిలానాధు డగు విదేహుడు పెక్కు యాగ ములు చేసెనని చెప్పెను. అది విని ప్రాచేతసుడు ఇచ్చట సుస్వరమైన వేద ఘోషకూడ వినిపించుచున్నది. ఇట్టి చిత్రము నేనెచ్చట గనలేదు. అనగా గౌతము డిట్లు చెప్పెను.

విదేహభూపతి వృత్తాంతము :- పూర్వ మిచ్చట విదేహరాజు గొప్ప దానములతో ఒక యజ్ఞము చేసెను. అప్పు డొకనాటి రాత్రి ఋత్విక్కు లందరు నిద్రించి యుండగా తలుపులు తెరిచియున్న ఆ యాగశాలలోనికి ఒక శునకము ప్రవేశించి యజ్ఞద్రవ్యములను కొన్నింటిని తిని కొన్నిటిని వాసన జూచి వెళ్ళి పోయెను. పిమ్మట వారు మేల్కొని క్రతు సమాప్తికి హోమము చేయదొడగ నెవ్వరికిని మంత్రము స్ఫురింపలేదు. అప్పుడు వారు విషణ్ణులై దానిని వృద్ధ కశ్యపునకు తెలిపిరి. అతడు భయాతురుడై నేనెన్నియో యజ్ఞములు చేసితినిగాని ఎప్పుడు ఇటుల ప్రయోగ విస్మృతి కలుగలే దనెను. సదస్యులెల్ల జడులైరి. అప్పుడు విదేహుడు వారిని చూచి మీకిట్టి పాటేల వచ్చెనో యని యడిగెను. వారు మేమెరుగ మనిరి. అతడు ఇంక నీ యజ్ఞ మెట్లు పూర్తియగునని చింతా కులితు డయ్యెను. అంత మును లతనితో ఓరాజా! ఈ యజ్ఞ మే దేవునిగురించి చేయ సమకట్టితివో అతనినే ఆశ్రయింపుము హృద్గతమైన మోహము తొలగు ననిరి. అది విని రాజు తన మనస్సున విష్ణువును నిలువుకొని నిశ్చలు డయ్యెను. అప్పు డాయజ్ఞవాటికకు ఒక సంయమి వచ్చి వారిని చూచి మీక్రతువిఘ్నేల విఘ్నము పొందెనని యడుగ వారు మహాత్మా! మాబుద్ధి కెందుకో మంత్రభాగము తోపకున్నది కారణము తెలియ దనిరి. అది విని వారితో నతడు దీనికేదో కారణ ముండును. అంబుజనాభుడు ఎల్లప్పు డీ వృక్షము నాశ్రయించి యుండును. కనుక ఆతని కిది తెలియును. మీ రీ వృక్షమును పూజించి అడుగుడని చెప్పెను. అంత వారు దానిని పూజింప అందుండి లక్ష్మీపతి ఓ విప్రులారా! నేను మీ పూజలకు సంతసించితిని వలసినది కోరుడనెను. వారు ఓ వృక్షమా! ఈ మహా రాజు సర్వలోకపతిని గురించి యజ్ఞము చేయుచుండ మామనస్సుల కేమంత్రము స్ఫురించుటలేదు. కారణ మేమో తెలిపి యీ మఖమును పూర్తిగావింపుము

అనగా నావిటపి యందున్న రంగనాథుడు ఓ మునులారా! రాత్రి మీరు నిద్రలో నుండగా ఒక శునకము వచ్చి హోమద్రవ్యము లన్ని మూర్కొనిపోయెను. అందువలన మాకు మంత్ర విస్మృతి కల్గినది. కనుక శుచిద్రవ్యములతో చేసిన ఈ క్రతువు సంపూర్ణమగును. మీరీ అపవిత్ర పాత్రల తొలగించి నూతన ద్రవ్యములతో యాగ మారంభింపుడు. మీకు సర్వమంత్రములు స్ఫురించును. అనిన వారటుల చేసి యజ్ఞము నిర్విఘ్నముగా నిర్వర్తించిరి. అందులకు మునులు మరియు రాజు సంతసించిరి. పిమ్మట వారు తమ చెంతకు వచ్చిన భూసురునితో మహాత్మా! మీ యనుగ్రహమున మామోహము తొలగినది, కనుక మీరెవ్వరు? ఎచ్చట నుండి వచ్చితిరి యని యడుగ నేనంతట నుందును నాకు వాలాయమైన పని ఒక్కటిలేదు. ఇచ్చట ఈ విదేహాని యజ్ఞమున కంతరాయము కలుగ దానిని సమాప్తి చేయింపవచ్చితిని క్రతువు సంపూర్ణమైనది. మీ భూపతికి భద్రమగుగాక! నేను పోయి వచ్చెదనని వెళ్ళగా వా రతనిని విడువజాలక వెనుక నేగిరి. అతడు వారిని కరుణా లోకనముల దనిపి ఆ కదంబము కడకు వచ్చి అచ్చటి మునులు తన కొనర్చు పూజలు స్వీకరించి వారితో ఓ తాపసులారా! నేటినుండి ఇచ్చట శ్రవణమంగళమగు వేదఘోష వినిపించునని వరమిచ్చి తా నంతర్హితు డయ్యెను. అది మొదలుకొని ఇచ్చట ఈ ఘోష వినిపించుచున్నది, అనెను. అంత వాల్మీకి ఆ పుణ్యతీర్థ ప్రభావమునకు అచ్చెరువందుచు భరద్వాజునితో అచ్చటినుండి కదిలి బిల్వతీర్థమున కేగెను. ఇటుల చెప్పి వ్యాసుడు నాగదంతునితో ఈ తీర్థసామర్థ్యము తెలుపు కథ యొకటి గలదు. వినుమని ఇటుల చెప్పెను.

## బిల్వతీర్థ మహిమ (సోమకుని కథ)

పూర్వము సోమకుడను రాజర్షి యుండెను. అతడు పెక్కేండ్లు రాజ్యము చేసి సంతానహీనుడై నందువలన నొకనాడు వృద్ధ పురోహితులను, బంధుమిత్రులను పిలిచి ఎన్ని సత్కార్యములు చేసినను అపుత్రవంతులకు పరలోకము లేదుగదా! మీరు వైదిక, లౌకిక ధర్మము లెరిగినవారు. నాకు సంతానము కలుగు నుపాయము చెప్పుడనగా వా రతనితో ఓ రాజా! వగపేల? పూర్వము ధుంధుమార సగర దిలీపాదులు హృషీకేశు నారాధించి సుగుణవంతులగు పుత్రుల

గనిరి, కనుక నీవును వారివలెనే చేయుమనిరి. అప్పు డతడు గొప్ప యజ్ఞము చేసెను. దానిని చూచుటకు అచ్చటికి మార్కండేయ మహర్షి వచ్చెను. రాజు అతని కెదురువెళ్ళి- పూజించి తోడ్కొనివచ్చి ఉచితాసనముపై కూర్చుండజేసి కుశల ప్రశ్నలువేసి మహాత్మా ! మీ రాకకు కారణమేమని యడిగెను. అప్పుడు మార్కండేయుడు ఓరాజా ! నేను నీవుచేయు యజ్ఞము చూడవచ్చితిని, దీని వలన నీ కోరిక తీరదు. మానవుని పూర్వజన్మ పాపము అతనికి సుకృత ఫలము దక్కనీయదు. ఆ పాపము పుణ్యక్షేత్ర తీర్థ సేవవలన క్షీణించును. అనంతరము అతడుజేయు కార్యములు ఫలించునుగనుక నీ విపుడు అపని చేయవలెనని చెప్ప సోమకుడు మహర్షీ ! నాకు తీర్థములగురించి ఎరిగింపుడని వేడెను అపుడు మార్కండేయు డిట్లు చెప్పెను,

ఓ రాజా ! శ్రీరంగ క్షేత్రమునగల చంద్రపుష్కరిణి తీర్థము లన్నిటికి చక్రవర్తి. దానికి అష్టదిక్కులందు కేసర, కదంబ, ఆమ్ర, బిల్వ, జంబు, పలాశాశ్వత్థములను పేర నెనిమిది తీర్థములున్నవి. వానిలో పున్నాగ తీర్థమున వర్చస్సుడను బ్రాహ్మణుడు బ్రహ్మజ్ఞాన నిరతుడై నిత్యానంద మందెను, కేసర తీర్థమున భార్గవ కులుడగు తారకుడను ఋషి తపముజేసి భవమును బాసెను. కదంబతీర్థము నుపాసించి గర్గగోత్రుడగు రుక్మదృష్టి యనువాడు బ్రహ్మపదము పొందెను. ఆమ్రతీర్థము నాశ్రయించి కాశ్యపముని అమృతత్త్వ మందెను. ఇంకను అనేకు లీ తీర్థముల నాశ్రయించి మనోరథములు పడసిరి. ఓ క్షితినాయకా ? ఒక కథ చెప్పెదను వినుమని ఇట్లు చెప్పెను.

జయధరుని కథ — పూర్వము చంద్రవంశీయుడగు జయధరుడను రాజుండెను. అతడు క్రూరుడై భూసురుల కెగ్గుచేయుచుండ ఆ బాధలు పడలేక వారు రాజ్యము విడిచి వెళ్ళిరి. దానివలన అతని రాష్ట్రము శ్రుతిఘోష రహితమై దుర్భిక్షమున దీన దశ నొందెను. అతని నూరుగురు పుత్రులు నానావిధ వ్యాధులచే మరణించిరి. అంత నతడు భార్యలతోగూడి దుఃఖించుచుండ నా మార్గమున వాల్మీకిని దర్శింపవేగు భరద్వాజుడు తనకు శిష్యుడై ఒక పురో హితుని వలన జయధరునకు కల్గిన కష్టములు విని కనికరించి తాను తమ గురువగు వాల్మీకి చెంతకు వెళ్ళినవు డా విషయము చెప్పెను. అప్పుడు వాల్మీకి

అచ్చటినుండి వెడలిపోయిన మిత్రులను పిలిపించుకొని వారితో మీరు వెళ్ళుట వలన ప్రజలు ఆపద నొందినారు. రాజు పరితాప పీడితుడై నాడు. కనుక మీరు నా మాట విని వారి నుద్ధరింపుడనగా ఆ బ్రాహ్మణులు కోపముడిగి పశ్చాత్తప్తులైన రాజును కలిసిరి. అప్పుడు వారిని తోడ్కొని వాల్మీకి బిల్వతీర్థమున కేగెను. అచ్చటి మునులు వారల పూజించిరి. ఆ సమయమున వారిపై కోమల గంధ వహాంతు వీచెను. బిల్వమూలమున పుష్పవృష్టి కురిసెను. మనోహర గానము వినవచ్చెను. ఉభయసంధ్యలయందు అచ్చట ఆ మంగళాచారములు జరుగు చుండగా జయధరుడు మరియు వాల్మీకి దానిని గని అద్భుతమందిరి. ఆ సమయమున అచ్చటికి తీర్థనిషేవణార్థమై సనత్కుమారుడు వచ్చెను. అంత అతనిని చూచి భరద్వాజుడు మహాత్మా; ఈ తరుమూలమున పుష్పవృష్టి కురియుచున్నది. ఇచ్చట గానము వినిపించుచున్నది. దీని కారణము మాకు తెలుపుడనగా సనత్కుమారు డిట్లు చెప్పెను.

అనఘా! పూర్వము ఇంద్ర సఖుడగు చిత్రసేనుడు భార్యాసమేతుడై ఒక నా డాకాశవీధి నేగుచు శ్రీరంగ మందిర చ్ఛాయ దాటగా తీర్థరక్షకు లత నిపై కోపించి అతనిని సప్తార్ణవముల కవతల పడవేసిరి. అప్పు డది తెలిసి ఇంద్రుడు బ్రహ్మచే నా పాపము తొలగు ఉపాయము నెరిగి చిత్రసేనుని వద్దకు వెళ్ళి చెప్పెను. అంత దానిని విని ఆగంధర్వుడు పుణ్యక్షేత్రములు తీర్థములు సేవించుచు వచ్చి వచ్చి అఖిల లోకపావనమైన ఈ తీర్థమున స్నానమాడి తన విద్యచే శేషశాయిని సంతోషింప జేసి మరల తన పదవిని పొందెను. అది మొదలుకొని అత డీతీర్థమున ప్రతి శుక్లపక్ష పంచమినాడు నారాయణుని ఆరా ధించుచుండును. ఈనాడు ఆదినము కనుక అత డిచ్చటకు వచ్చి గానము చేయుచున్నాడని చెప్పెను. అది విని భరద్వాజుడు శుద్ధ పంచమినాడు ఆ తీర్థ మున చేయవలసిన పూజా విధుల నడుగ సనత్కుమారుడు వానిని వివరించుచు ఏకాదశీ మాహాత్మ్యమును విశేషముగా తెలిపి ఇట్లు చెప్పెను.

పుష్కర తీర్థ మహిమ-దేవవ్రతుని కథ:-పూర్వము దేవవ్రతు డను బ్రాహ్మ ణుడు పుష్కర తీర్థమున చాలా కాలముండి పిదప పరాశరుని శిష్యుడైన మైత్రే యుని వద్దకు వెళ్ళి మహాత్మా! ఎచ్చటి కరిగిన మనుష్యుడు మరల మాతృ గర్భము ప్రవేశింపడో తెలుపు మనగా అతడు ఓ భూసురా! నీ వడిగిన దానికి

కర్మక్షయము కారణము. అది తపోశౌచాదులచే కలుగునందురు. తపమను పవిత్రము చేతపట్టినగాని కర్మబంధములు తెగవు. కనుక నీవు పావన తీర్థావగాహ మతివై చరింపు మనెను. అప్పు డతడు తీర్థములలో ఏది శ్రేష్ఠము? మనుష్యుడు ఏనెలలో ఏ దినమున నేదేవుని సేవింపవలయును? అని యడుగ మైత్రేయు డతనికి-నేను నీకు చెప్పినటుల వ్రతోత్తమమును చెప్పెను. దేవ వ్రతుడు దాని నాచరించి అనేక కల్పములు విష్ణులోకమున నుండెనని చెప్పి సనత్కుమారుడు మరల యిట్లనెను

కుశలుని కథ :- పూర్వము సూర్యవంశమున కుశలుడను రాజుండెను. అతడు ద్వాదశీవ్రత పరాయణుడు. ఒకనా డతడు యముని చూచుటకు వెళ్ళెను. అప్పు డతడు తనయెదుట బాధించుటకు లాగుకొనిపోవు నారకులను గని భయమున వణకి దీనాననుడయ్యెను. అది చూచి యముడు ఓరాజా! నీకిప్పు డీభీతి యేల కలిగెనని యడిగెను.అందుల కాతడు బాధల నందు నీ జీవు లను చూచి అనగా విధిని ఎవరు దాటలేరని యముడు సమాధాన మిచ్చెను. అప్పుడు కుశలుడు పాపము వీరు పూర్వజన్మమున బలవద్విషయ వ్యసనాతి సక్తులై ఎట్టి పాపములు చేసిరో ఈ బాధ లనుభవించుచున్నారని యమునితో ఓ కృతాంతా! నీవు సకల జంతువుల పుణ్యపాపము లెరుగుదువుగదా! నేను చేసిన పుణ్య మేదైననున్న చెప్పుము. అనగా యముడు నీవు ద్వాదశీవ్రతము నిష్ఠతో నొకయే డాచరించితివి. దాని ఫలము ఇంతంతని చెప్పలేను అనెను. అప్పుడు కుశలుడు నేను నావ్రతఫలములో వీరికి కొంత నీయదలచితిని. ఎంత ఈయ వలెనో చెప్పు మనగా యముడు నీయొక్క ఒకనాటి వ్రతపారణఫలము చాలును వీరందరు దేవలోకమునకు బోవుదురని చెప్పెను ఆది విని కుశలుడు తత్ క్షణమే తానాచరించిన ఒకనాటి ద్వాదశీవ్రత ఫలము వారి కొసగెను. దానితో ఆనారకు లందరు సిద్ధ చారణులు గొలువ దివి కేగిరి. అప్పు డతని కారుణ్య భావమునకు వైవస్వతుడు సంతసించి నరేశా! హరిభక్తి పుణ్యఫలము చూచి తివి గదా! యని సంభావించి వీడ్కొలిపెను. అందువలన హరిదిన వ్రతఫలము సకల పాపహరమని చెప్పి సనత్కుమారుడు భరద్వాజునిచే పూజలుకొని వెళ్లెను.

జయధరుడు ఇటుల వాల్మీకిచే ప్రబోధితుడై ఆవ్రత మాచరించి సకల సంపదలను మరియు నూరుగురు కుమారులను బడసెను. పిమ్మట నొకనాడు

అతడు రంగధాముని సేవింపనేగి బిల్వతీర్థమున భరద్వాజాది శిష్యులతో గూడిన వాల్మీకిని గని మ్రొక్కి ఆ తీర్థమున స్నానముజేసి రంగనాథుని సేవించి ఆ ప్రదేశమును విడిచి వెళ్ళుచు ఒకచోట పులినముపై ఆసీనుడైన ఒక శకుంత శ్రేష్ఠుని చూచెను. అతడు సంతోషమున హరిని స్మరించుచుండెను. జయధరుడు అతని చెంతకు వెళ్ళి నమస్కరించి స్వామీ! విద్యారతినున్న నాకు దప్పిగొన్న వానికి చన్నీటివలె నీదర్శన మబ్బినది. నాకు నిత్యసుఖ మెట్లు గలుగునో చెప్పు మనగా అందు కా శకుంతవల్లభుడు సంతసించి ఓ రాజా! పూర్వము మునులు యోగులు తరచి తేర్చిన తత్త్వామృతము నీకు చెప్పెదను వినుము. చావుపుట్టుకలు ప్రాణికోటికి సహజములు. కనుక వైరాగ్యమునకు కనుమరుగైన పాపములు గూడ తీర్థభజనము తుడ్చివేయును. అన్ని తీర్థములలో చంద్రపుష్కరిణి మిక్కిలి గొప్పది. నేను దాని తీరమున చాలాకాల ముంటిని సకల కల్మష హరమైన కథ యొకటి గలదు వినుమని ఇట్లు చెప్పెను.

ప్రభాకరుని కథ· పూర్వము గర్గగోత్రమునకు చెందిన ప్రభాకరుడను ముని యుండెను. అతడు తన తపశ్శక్తిచే పరమాయువు బొంది కలకాలము వేదాభ్యాసముచేసి దానిని పాఠముగా చదువుచుండ అతని తపోగ్నికి ఇంద్రుడు చిన్నబోయెను. ఆ కఠిన తపమునకు వేదములు భయపడి పెక్కు విఘ్నములు చేసెను. అయినను అతడు చలించలేదు వాణినిగూడ తృణీకరించి యోగశక్తిచే చిత్రరూపమువలె నిశ్చలత్వమునొంద దేవతలు ఇంద్రుని పురస్కరించుకొని బ్రహ్మదగ్గరకు వెళ్ళి లోకనాథా! ప్రభాకరుడను భూసురుడు ఉగ్రతపము చేయుచున్నాడు. దానివేడిమి లోకములు భరింపలేకున్నవి. ఎటులైన నీవీ యాపద పాపుమని ప్రార్థించిరి. అపుడు బ్రహ్మ ప్రభాకరుని దగ్గరకు వచ్చి నేను నీ తప మునకు మెచ్చితిని వరము వేడుమనగా నతడు కమలాసనా! నాకు వేదములన్ని కడముట్ట చదువుకోరిక యున్నది దానిని ఇమ్ము అనెను అది విని బ్రహ్మ ప్రభాకరా! నీవు చేసిన ఈతపమువలన పుణ్యలోకములన్ని సులభమైనవి. ఇంక అందని ఫలముల కేల చేతులు చాచెదవు అనెను అది విని ప్రభాకరుడు భాషాధిపా! నీవెన్ని చెప్పినను నేను వేదపారముతప్ప తక్కినవి యొల్లననెను. అంత బ్రహ్మ దాని కంగీకరింపక అంతర్హితు డయ్యెను. ప్రభాకరుడు తనపట్టు విడువక అటులే తపము చేయుచుండెను. బ్రహ్మ మరి రెండుపర్యాయము లత

నికి ప్రత్యక్షమై అతని ఆపూనికిని మాన్పలేక నిజలోకమున కేగెను. బ్రహ్మ వెళ్ళిన పిమ్మట అతనితపమునకు మెచ్చి సూర్యుడు ప్రత్యక్షమై నీకోరిక ఏమనగా నాకు నిగమపారము కావలె ననికోరెను. అపుడు సూర్యు డతనితో ప్రభాకరా ! పురుషుని పురుషార్థములను పూర్వజన్మపాపములు అనేకవిధ ములుగా నరికట్టును. అవి నశింపక అభీష్టఫలములు సిద్ధింపవు కనుక పాపక్షయ మార్గము చెప్పెదను వినుము. నీవు రంగధామునిమందిరమున కేగి అచ్చట సర్వోత్తమమైన పుష్కరిణి యున్నది, దానితీరమున దపము చేయుము. అపుడు నీదోషము లణగి సంకల్పము ఫలించును మరొక విశేషము వినుము.

సునేత్రుని కథ .— సునేత్రు డనుపక్షిపుంగవు డున్నాడు అతడు బ్రహ్మచే వేదములన్నియు తుదముట్ట కనునట్లు వరము వడసి నిర్మలజ్ఞాన పరుడై తనవంటివారు కొందరు తనను సేవించుచుండగా కావేరీతీరమున నున్నాడు నీ వచటికి వెళ్ళి ఆమహనీయుని సేవించి నీకు కావలసినవి అడుగు మనగా ప్రభాకరుడు అబ్జమిత్రా ! అత డెందువలన ఖగత్వము నొందెనని పలి కెను. అది విని సూర్యుడు ఓప్రభాకరా ! మహాత్ములు ఒక్కొక్కప్పుడు ఖగ మృగాదిరూపములు ధరింతురు అది వారివారి ఇష్టము పూర్వము చిక్లితుడుఅను బ్రాహ్మణుడు విష్ణువునుగురించి ఘోరతపము జేసి అతడు ప్రత్యక్షముకాగా నాకు వేదపఠనము చేయుకోరిక యున్నది ఆవరము నొసగుమని వేడెను. శ్రీవిభు డతని చిత్తశుద్ధికి మెచ్చి ఓభూసురా ! వేదములు గలయంతవట్టు నీ వెరుగునట్లు వర మిచ్చితిని కాని సరస్వతి విద్యాధిదేవత నీ వామెను సేవింపుము. ఆమె నీకుప్రసన్నయై నిగమాదివిద్యలు సమస్తము నిచ్చునని చెప్పి విష్ణు వంతర్హితు డయ్యెను. పిమ్మట నతడు సమగ్రపూజావిధానమున ఆదేవి నారాధింపగా నామె ప్రత్యక్షమై అతనికోరిక నడిగి అచ్చటగల నాలుగుపక్షులను జూపి ఇవి ఇపుడు నాముందట నుమిసిన ఈ యామిషమును నములుము. నీ కభిమతసిద్ధి యగుననగా నటులేయని అతడు గూడ పక్షిరూపము ధరించి అది యించుకకూడ మిగులకుండ భక్షించెను. దానితో అతనికి సమస్తశాఖలతోగూడిన వేదములు స్ఫురించెను. అందువలన అత డానాటినుండి ఆపక్షిరూపమును వదలకున్నాడు, కనుక నీ వాభూదేవునిచెంతకు పొమ్మనగా ఓతిగ్మదీధితీ ! ఆపక్షు లేవి ? ఆబ్రాహ్మణుడు సందేహింపక వాని ఉచ్ఛిష్టము నెట్లు తినె నని యడిగెను. అది విని తపనుడు ఓరాజా ! ఆవిహంగములు వేదములు, ఆమాంసము సమస్తవిద్యలు ఒకటైనవిద్య

పక్షులకు మాంసము ఇష్టముకనుక అతడు పక్షిరూపము ధరించి దానినితినెనని చెప్పి సూర్యుడు వెళ్ళిపోయెను. పిదప ప్రభాకరుడు సునేత్రునిదగ్గరకు వచ్చి నమస్కరించి తన వృత్తాంతము చెప్పుకొనగా సునేత్రు డతనితో నీవునారాయణు నారాధింపుము. అతడు కరుణించిన పొందరానిది లేదని చెప్పెను. అది విని ప్రభాకరుడు చంద్రపుష్కరిణిదగ్గరకు వచ్చి సురలు వెరగందునట్లు తపముజేసెను. దానికి శ్రీహరి మెచ్చి ప్రత్యక్షమై నీకోరిక యేమన ప్రభాకరుడు నాకు ఎల్లవేదములు పారము ముట్ట జదువు విజ్ఞానశక్తి నిమ్మనివేడెను అంత శ్రీహరి అతనికి ఆవర మిచ్చి, వేదము లపారము, ఆయువుకొంచెము. వానిని పారముముట్టుట కష్టము. దేహికి పాపములు పీడిన నవి సాధ్య మగును. బహుజన్మార్జితమైన పాపము లడచు ఆమహాతీర్థమున మదీయశక్తి చోదితుడై సునేత్రుడు నీకుసమస్త శ్రుతుల నెరిగించును. పొమ్మని చెప్పి లక్ష్మీపతి యరిగెను. అపుడు ప్రభాకరుడు మరల సునేత్రుని దగ్గరకు వెళ్ళి నారాయణుని వరప్రకారము చెప్పి అతని అనుమతిచే సమంత్రకముగా నా తీర్థమున స్నానముజేసి గురువచనానురూపముగా తానుగూడ పక్షిరూపము పొందెను. అప్పుడు సునేత్రు డతనికి సకలవేదము లుపన్యసించెను.

ఆప్రభాకరునకు నలుగురు శిష్యు లేర్పడిరి. వారిలో సుదర్శను డనే పేరుగల నేను,సువర్ణబిందుడు,సుతామ్రచూడుడు,బృహన్మయుడు క్రమముగా ఋగ్,యజుస్సామాథర్వణములను శాఖాసహితముగా నభ్యసించితిమి ఈపక్షులు నాతో చదువు మునికుమారులని తెలిపి అతడు జయధరునితో మరియు నిట్లనెను. ఓరాజా ! నేను పరమమైన తపమును, పరమపదమును పరికించుచు నాదేశము పరదేశ మనుభేదము వదలితిని. ఇచ్చటితరులతాగుల్మములు పుణ్యాత్ములైన మహర్షులుగా నెరుగుము నీవు ఈపుష్కరిణిలో స్నానముచేయుటవలన నీకులము నీదేశము ధన్యమైనది నీకుమారులు పరలోకసౌఖ్యభాజను లైనారు అని చెప్పెను. అంత జయధరుడు తనను కృతార్థునిగా భావించి ఆపక్షిపుంగవునకు సాష్టాంగపడి సైన్యసమేతముగా తనపట్టణమున కేగెను. అతనికి నూరుగురు కుమారులు కల్గిరి వారుతన పంపుసేయగా పెక్కుయజ్ఞములుచేసి అంత్యమున త్రిదివమున కేగెను అని చెప్పి మార్కండేయుడు ఆరాజుతో ఓసోమకా ! నీవు సోమకుల సంజాతుడవు వివేకవంతుడవు కనుక చంద్రపుష్కరిణిలో స్నానముచేసి అచ్చటి

విప్రులకు కనకాదివస్తువులు దానముచేయుము నియమము లడగునని చెప్పి వెళ్ళిపోయెను.

మార్కండేయుడు వెళ్ళినపిమ్మట సోమకుడు పుత్రమిత్రకళత్రసమేతముగా చంద్రపుష్కరిణి కేగి స్నానముచేసి వివిధదానములచే విప్రులను తృప్తిపరచి రంగధామమునకేగి భుజగశాయిని పూజించి అచ్చటిభాగవతవరేణ్యులను సత్కృతులచే ప్రీతినందించి మరలి నిజపురమునకు వచ్చి సమంచితసామ్రాజ్యభోగము లనుభవించుచు ప్రజలను పాలించెను. అతనిరాజ్యము సతతవిష్ణుమహోత్సవమై యొప్పెను

ఈశ్రీరంగమహత్త్వము చదువువారికి సమస్తకళ్యాణములు చేకూరును. ఇది భైరవునిగ్రంథమందలి సంగ్రహవిషయము. శ్రీరంగమహత్వముగల తమిళగ్రంథ మొకటి, రెండువచనగ్రంథముల-పరిశీలించినతరువాత భైరవుడు చెప్పని విషయములు కొన్ని దొరికినవి-వాని నిట పొందుపరచుచున్నాను.

౧. ధర్మవర్మది నిచుళాపట్టణము.

౨. విశ్వావసుడు అనంతపద్మనాభస్వామిదర్శనమున కేగి-అతనిని భూపాల రాగమున సేవించినాడు.

౩. కావేరి హిమవన్నగమున తపస్సుచేసినది.

౪. రెండవసారి కావేరి చోళదేశమందలి 'తిరుచ్చేరై' అనుప్రదేశమున తప మొనరించెను

౫. ఇంద్రు డహల్యాజారత్వదోషనివారణార్థము జంబూతీర్థమున తపమొనరించెను (బ్రహ్మహత్యాదోష నివారణార్థమని దీనియందు గలదు)

౬. విష్ణువును తన గర్భమునం దుండవలసినదిగా-కావేరి కోరెను.

౭ చంద్రునకు కశ్యపశాపము గలదు-(దీనియందు దక్షుని శాపము).

ముఖ్యములైన వానిలో నివి కొన్ని మాత్రమే, చిన్న మార్పులు గలవు, కాని-అవి అంతగా చెప్పుకొనదగినవిగావు

# తీర్థదర్శిని

(కేంద్రము చంద్ర పుష్కరిణి)

| తీర్థము | దిశ | వృక్షము | అధిపతి | అధిదేవత | రక్షకులు | దానము |
|---|---|---|---|---|---|---|
| చంద్ర పుష్కరిణి | — | సుర పొన్న | చంద్రుడు | వ్యాసుడు | పుష్కరాక్ష, కుముద కాల, సుప్రతీప | తిల |
| బిల్వతీర్థము | తూర్పు | బిల్వము | శుక్రుడు | శ్రీనివాసుడు | గణనాధ, కుముద | రజత, హిరణ్య |
| జంబూతీర్థము | ఆగ్నేయము | జంబు | అగ్ని | శివుడు | — | — |
| అశ్వత్థ | దక్షిణము | అశ్వత్థ | గౌతముడు | అనంత, వాసుదేవ | ఇంద్రుడు | కన్య |
| పలాశ | " | — | — | — | — | గోవు |
| పున్నాగ | పశ్చిమ | పున్నాగ | మరీచి | అగ్ని | శ్రీపతి | ఘృత |
| వకుళ | వాయువ్య | పొగడ | బృహస్పతి | ఇంద్రుడు | మాధవ, చండకోప- | వస్త్ర. జలకుంభ |
| కదంబ | — | కదంబ | జనకుడు | బ్రహ్మ | గరుత్మంతుడు | రజత-గో-మహిష-చాగ-తిల |
| రసాల | కావేరికి ఉత్తరము | రసాం | వశిష్ట | సూర్య్య. హృషీకేశ | విష్వక్సేన- | భూ— |

శ్రీరంగమహత్వమున చెప్పబడిన తీర్థము లన్నియు-జాబితాగా నున్నచో బాగుండునని-యీ 'తీర్థదర్శిని' నిచ్చినాను

రాబోవుప్రకరణమందు శ్రీరంగమహత్వసమాలోచన చేయుదము—

# శ్రీరంగమహత్త్వము — సమాలోచన

సంస్కృతపురాణపాథోధినుండి కొన్ని రత్నములవంటి భాగముల గ్రైకొని తెలుగుకవులు-తమప్రతిభాపాండిత్యములచేత వానికి మెరుగులుపెట్టి అద్వితీయమైన-కావ్య-ప్రబంధరచనలుగా సిద్ధముచేసి చిరయశస్కులైనారు.

అట్టివానియందు-ఎఱ్ఱన నరసింహపురాణము,శ్రీనాధుని-భీమఖండ-శివరాత్రిమాహాత్మ్యములు,తెనాలిరామకృష్ణుని పాండురంగమాహాత్మ్య ఘటికాచలక్షేత్రమాహాత్మ్యములు,ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యము ముఖ్యముగా పేర్కొనదగినవి పురాణములనుండియే వీరు ఆయాభాగముల గ్రైకొని ఆంధ్రీకరించినను అవి పురాణములవలెనే యుండక శైలీపాటవము కలిగి-కవితాకళను నిరూపించునవై స్వతంత్రరచనలా యనుభావన కల్గించును.

ఈపద్ధతికి చెందినదే-గౌరనమహాకవి పుత్రుడు గౌతమగోత్రుడగు భైరవకవి రచించిన—

## శ్రీరంగమహత్త్వము

ఇది యైదాశ్వాసములలో ౧౩౦౬గద్యపద్యములుగల రచన-ఆశ్వాసాలవారీగా ఇందలి గద్యపద్యముల సంఖ్య—

| | |
|---|---|
| ప్రథమాశ్వాసము | ౨౨౧ |
| ద్వితీయాశ్వాసము | ౨౨౬ |
| తృతీయాశ్వాసము | ౩౦౫ |
| చతుర్థాశ్వాసము | ౨౮౮ |
| పంచమాశ్వాసము | ౨౬౬ |

మొత్తము ౧౩౦౬ గద్యపద్యములు,

శ్రీరంగమహత్త్వము గారుడపురాణాంతర్గ మైనది ఇది శతాధ్యాయసంహిత, దీనినే శతాధ్యాయియని యందురు గారుడమునందు నూరధ్యాయము

లుగాను,బ్రహ్మాండపురాణమునందు తొమ్మిది అధ్యాయములుగాను-శ్రీరంగ మహత్త్వము గలదు.

భైరవకవి గరుడపురాణాంతర్గతమగు భాగమునే తెనిగించినట్లు—ఈక్రింది పద్యమున తెల్పినాడు——

వ్యాసప్రోక్త మహాపురాణములు సుఖ్యాతింటియందుం -జగ—
ద్వాసుండైన రమామనోహరు మహత్త్వవ్యక్తిమూలంబులై
భాసిల్లుం దగునాలు గందును బహూపాఖ్యానవిఖ్యాతమై
యాసౌపర్ణపురాణ మొప్పు బహువేదాన్తార్థ గంభీరమై ౧-౨౪

ఇదియే గాక-ఆశ్వాసాంత్య గద్యయందును- ''శ్రీరంగమహత్వంబను పురాణకథయందు-'' అని తెల్పెను. ఇచట- (మరల గరుడపురాణకథ యనక-) కేవలము 'పురాణకథ'యే యనినాడు

ఈశ్రీరంగమహత్త్వకథను - మునులకు దెల్పిన రోమహర్షణుడు - జనక మహీతలేశ్వరుని సత్రమహోన్నతిఁ జూచువేడుకతో చని-అచ్చట- 'తార్క్ష్య పురాణ సత్కథావినుత సుధాసరిద్విపుల వీచిక ఉల్లమునిల్ప-' ఆగితి సనితెల్పి- (౧-౮౦)

సారంబై మోక్షపదా
ధారంబై పుండరీకదళనయన నిజా
గారంబై మహిఁ బరఁగిన
శ్రీరంగమహత్త్వ మతివిచిత్రము దలఁపన్. (౧-౮౨)

అని-శ్రీరంగమహత్త్వప్రభావమును వివరించినాడు. ఈయాధారముల వలన -భైరవుడు శ్రీరంగమహత్త్వమును-గరుడపురాణాంతర్గత మైనదాని నుండియే గ్రహించి యనువాదము చేసినట్లు స్పష్ట మయినది

6)

భైరవుడేగాక మరియొక కవియు గారుడాంతర్గత శ్రీరంగమహత్త్వమును(౧) తెనిగించినాడు-అతడే

కట్టావరదరాజు (1650)

ఈయన యతిరాజాచార్యులవారి శిష్యుడు, శ్రీవైష్ణవమతాభిమాని, వేంకటేశ్వరస్వామి యీతని కిష్టదైవముగావున తనరచన లన్నింటిని ఆస్వామికే యంకిత మొనరించినాడు, ఇతని కృతులు-

౧ పరమభాగవతచరిత్ర
౨ ద్విపద రామాయణము-౨
౩ శ్రీరంగమాహాత్మ్యము౩-

అనునవి (౨ ౩. సంఖ్యగలగ్రంధములు ముద్రణ మయినవి ) వరదరాజు తన శ్రీరంగమాహాత్మ్యమునుగూర్చి-

'చేయరె తొల్లి సత్కవు లశేషపురాణములున్ దెనుంగునం
దీయితిహాస మెందు రచియింపమి తావకపుణ్యమెంత-యా
మ్నాయచతుష్కసారము సనాతనగారుడసంహితా-శతా
ధ్యాయి తెనుంగుసేయ నొకఁ డర్హుఁడ నేటికవీంద్రకోటిలోన్-' అనినాడు

గారుడ సంహిత 'ఆమ్నాయ చతుష్కసారమ'ని విశేషించి దాని విశిష్టతను వ్యక్తపఱచినాడు. కాని - ప్రథముడుగా శ్రీరంగమహత్త్వము నాంధ్రీకరించినది తానే యనుచున్నాడు. ఇది పొరపాటు. ఇతనికన్న ముందు - శ్రీగిరి

---

౧ శ్రీరంగమహత్త్వముల తెనుగుచేసిన మరికొందరు కవులు గలరు. వారిని గూర్చి ముందు ప్రకరణములో తెల్పబడును ౨ నిడుదవోలువారి పరిష్కరణతో 1950సం. ముద్రితము

౩ ఇది మొదట (1912లో) కవిగారివలన సాహిత్యలోకమునకు తెలిసినది. తరువాత చెలికాని లచ్చారావుగారు 'అముద్రితాంధ్రసర్వస్వము'గ్రంథావళిలో ౬వదానిగా 1921లో ముద్రించిరి. (శ్రీరామవిలాసముద్రాక్షరశాల-చిత్రాడ)

కవిం, భైరవుడు-శ్రీరంగ మహత్త్వము లవ్రాసినారు శ్రీగిరి రచన లభ్యము, నాలుగు పద్యములు లభించినవి వరదరాజు ఆశ్వాసాంత్య గద్యయందు - 'గారుడ పురాణ శతాధ్యాయి శ్రీరంగ మాహాత్మ్యంబను మహా ప్రబంధంబునందు సర్వంబును దశమాశ్వాసము' - అని తెల్పును.

పింగలి సూరనయు 'గారుడ సంహిత' - తెనుగు చేసినట్లు తెల్పినాడు. (కళా పూర్ణోదయము - ౧ - ౧౪)

మరింగంటి సింగరాచార్యులవారు 12 వ యేట శతసంహితను తెన్గు చేసినట్లు వ్రాసినాడు - (శుద్ధాంధ్రనిరోష్ఠ్య సీతాకల్యాణము - ౧ - ౧౪)

ఇందరు - గారుడము - శతసంహిత - అందుండి శ్రీరంగ మహత్త్వ కథను గైకొని వ్రాసినామని తెల్పగా - కొందరు - "గారుడము - ఉత్తర క్రియలలో చదువునదేకాని - మంచిదికా"దని వ్రాయుట విడ్డూరము - వారిలో-

ఆరుద్రగారు — "సూరపరాజుగారు గరుడ పురాణాన్ని తెనిగించారు. ఇది అష్టాదశ పురాణాల్లో ఒకటైనా సూరపరాజుగారి కాలందాకా దీనిని తెనిగించ డానికి ఎవరూ ముందుకు రాలేదు ఇది విష్ణుసంబంధమైన పురాణమేగాని ఉత్త 'ఓషూయిత్యపు' పురాణం, ఎవరింటనైనా పీనుగు లేచినప్పుడుగాని దీనిని చదు వరు — ఇది సాక్షాత్తూ విష్ణుమూర్తి గరుత్మంతునికి చెప్పింది—"* (సమగ్ర ఆంధ్రసాహిత్యం VII-190 పుట)

---

౧ ఇతనినే చెన్నమల్లు శ్రీ గిరి యందురు ఇతని పద్యరూపమగు నవనాథ చరిత్రనే గౌరన ద్విపదలో వ్రాసినాడు, కావున గౌరనకన్న పూర్వుడు, ఈయన శ్రీరంగ మహత్త్వములోని ౪ పద్యములు ప్రబంధ రత్నాకరమున గలవు

* 1951 సం వావిళ్ళవారొక శ్రీగరుడ పురాణమును ప్రకటించినారు అది - 16 అధ్యాయములు గలది. దీనిని ఉత్తరక్రియంలో చదివెదరు (సంస్కృతమున గలదు) ఇట్టిదానినే సూరనాదులు తెనిగించినట్లు వీరిభావన గావచ్చు

పైన నేను తెల్పిన విషయా లన్నిటిని పరిశీలించిన తరువాత - వీరి వాక్యము ఎంతవరకు తగునో ? పాఠకు లూహింతురుగాత - సాహిత్య ఎకాడమీ వారు 1967లో ప్రకటించిన కళాపూర్ణోదయమునకు పీఠిక వ్రాసిన శ్రీ మరుపూరు కోదండరామరెడ్డిగారు - ''—రెండవది గరుడ పురాణము - ఉత్తర క్రియలలో చదువవలసిన యీ గ్రంథము మనలేకపోవుటలో ఆశ్చర్యములేదు-'' (పీఠిక ౪ పుట) అని వ్రాసిరి—

గరుడపురాణ మనగానే అశుభమైనదని వీరి భావన, అందుకే ఈవ్రాతలు, ఉత్తరక్రియల కుపకరించే రచనను - సూరన '—సంహిత' అని యనునా ? వీరేగాదు వీరికన్నముందు - 'ఆంధ్ర కవుల అపరాధములు' అను శీర్షికన వేంకటరామకృష్ణకవులు - కొన్ని పద్యములు వ్రాసిరి - వానిలో సూరనను గూర్చి—.

శ్లేషకావ్యంబుఁ జేసి విశేషయశము
గనిన పింగళి సూరన గడుసువాఁడె
కాని. శుభమస్తని యదేమి గారుడంబుఁ
దెలుఁగుఁజేసినవాఁడు వైదికునిపగిది—'

అని వ్రాసిరి (ఆంధ్రపత్రిక కాళయుక్తి)

కొంత విస్తరమైనను ఈవిషయ మంతయు వ్రాయుట ఎందుకనగా—గారుడము అశుభమైనది గాదు, వైష్ణవ - నారదీయ భాగవత - పురాణాల తరువాత గల నాల్గవ పురాణము, శుభమైనదేగాక సాత్వికము - విష్ణుకథా పారమ్య ప్రతిబోధక మైనది, 'సంహిత' అనబడినది, కావుననే తెనుగుకవులు శ్రీరంగ మాహాత్మ్యమును తెనిగించినారు.

శ్రీ గిరియు - భైరవుడు - ఇద్దరూ శైవులే వీరిలో - భ్రమరాంబావర ప్రసాదలబ్ధకవిత్వము గలవాడైన భైరవుడు - శ్రీరంగ మహాత్త్వమును తెని

---

౧ చాగంటివారు కృతిభర్తయైన చాగయరాముడు మాధ్వుడని వ్రాసిరి, అందుకు ఆధారము ఎచటిదో (కవితరంగిణి - ౬ సం. 239 పుట) (వీరు నరసింహ భక్తులు - చూ శ్రీరంగ — ౧-౩౮)

గించినాడు. కృతిభర్త వైష్ణవ మతాభిమాని, కవి వైష్ణవమతాభినివేశముతో దీనిని ఆంధ్రీకరించినాడు,

## శ్రీరంగ మహాత్మ్యము-కృత్యాది-

షష్ఠ్యంతములు గాక - గద్యపద్యములలో కృత్యాది వ్రాసి భైరవుడు అనేక విషయముల చెప్పినాడు, వానియందు తెలియనగు వానిని కొంత సంగ్రహముగా తెలుపుదును. ప్రార్థన (స్తుతి)లో వరుసగా - శ్రీరంగ నాయకస్వామి, శేషుడు, గరుత్మంతుడు విష్వక్సేనుడు పరమ భాగవతోత్తములు, వాల్మీకి గలరు రెండు పద్యములలో సుకవిపుంగవుల గూర్చి తెల్పి - తరువాత తన సాహిత్య కళాప్రతిభా సంపదను వ్యక్తపరచినాడు. దీని తరువాత - సప్త సంతాన ప్రశంస, కావ్యగౌరవము చెప్పి - బుధ సభలయందు సత్కవీంద్రుని కృతి మెప్పుపొందవలయునని ఏయే లక్షణము లుండవలయునో వివరించి - ఇట్టి కావ్యమునకు లోకోత్తర గుణపుణ్యమైన విషయము ముఖ్యవస్తువుగానున్న - కావ్య మాకల్పముగానుండి - కవియు కృతార్థుడగునని తెల్పుచున్నాడు.

అనంతరము - కృతిభర్తయైన నాగయరాముని సభాభవనమును విపుల ముగా - హృద్యముగా - శబ్దార్థ చమత్కృతితో వర్ణించెను. ఈ సందర్భమున సభా సప్తాంగముల వర్ణన ప్రౌఢ రీతిలోనుండి - మల్లాంబ గుండయ శాసన మండలి విషయమును జ్ఞప్తికి దెచ్చును (నవనాథ చరిత్రలోను ఈ పద్ధతి గలదు పుట. 5) పిమ్మటనంతరము - శ్రీరంగ మహత్వ రచనోద్దేశము, కుకవి నింద, కావ్యమువలన కలుగు చిరస్థాయియైన కీర్తి - ఈ విషయముల చెప్పి - సౌపర్ణ పురాణ వైశిష్ట్యము వర్ణించి - తన కృతికి సుగుణోదారుడగు కృతిపతి లభిం చుట ముదావహమైన విషయముగా భావించి - సుకవులు మెచ్చునట్టుగా - రసము - వర్ణన చిత్రరచన - వీనితో - కూడిన రచన చేయగలనని తెల్పి - కృతిభర్త వంశవర్ణన చేసెను

ఇక ఇతని స్తోత్రపద్యములు సంప్రదాయబద్ధములుగా గలవు, వాని యందు కొన్నిటిని తెల్పుదును.

ప్రథమాశ్వాసప్రారంభపద్యము (కృతిప్రారంభము) శ్రీతోప్రారంభించుట సర్వసామాన్యము, అయినను శ్రీవైష్ణవసంప్రదాయమునందు 'శ్రీ'కి - విశిష్ట స్థానము గలదు, యామునాచార్యులవారు చతుశ్శ్లోకిలో 'శ్రీరిత్యేవచనామతే' అని శ్రీశబ్దముయొక్క వైశిష్ట్యమును ప్రవచించిరి. రహస్యత్రయసారములో—

శ్రయతీం శ్రీయమాణాంచ......' ఇత్యాది శ్లోకము గొప్పగా వ్యాఖ్యానింపబడినది

పై పద్యమున కవి హరిని స్తోత్రముచేసెను. శ్రీరంగమందలి రంగేశుడు సాక్షాద్విష్ణువు నారాయణుడు — (అష్టాక్షరీస్వరూపులు,) శ్రీసంప్రదాయము - విశిష్టాద్వైతము - ఒక్కటే కావున శ్రీకారమును కవి యుపయోగించెను, పై పద్యము — 'సప్తప్రాకారమధ్యే......' ఇత్యాది శ్లోకమునకు కొంత యనువాదముగా నున్నది

రెండవపద్యమున శేషునివర్ణన గలదు - కవి - 'అక్షయమేధానిధిం గాప్యలక్షణకళాచార్యున్ ప్రశంసించెదన్-' అని పద్యముపూర్తిచేసినాడు - వ్యాకరణభాష్యము శేషముఖోద్గత మనిభావన, పతంజలి - అపరశేషు దని యందురు, అందుకే కవి యిట్టి విశేషణము వేసినాడు, ఈపద్యము మిక్కిలి ప్రభావముకలదిగా కన్పట్టుచున్నది - స్తోత్రరత్నమందు-

నివాసశయ్యాసనపాదుకాంశుకో
పధాన వర్షాతప వారణాదిభిః
శరీరభేదైః స్తవశేషతాంగతైః
యథోచితం శేషయితే వితేజనైః॥ అని గలదు

శ్రీమద్రామానుజులవారు 'శేషశేషాసనాది సర్వంపరిజనం -' అని 'వైకుంఠగద్య' యందు నుడివిరి, యామునులవారు ఫణిపతికి ప్రథమస్థాన మిచ్చిరిగం, ఈభావనలు కవిమనస్సున మెదలగా శేషస్తుతి చేయగలిగినాడు

---

౧ విశిష్టాద్వైతమునందు శేషశేషిసంబంధము విపులముగా ప్రవచింపబడును, ఇదియును బైరవ కవి మనస్సున గలదేమో! దీనికి దేశికులవారి పుత్రుని ప్రభావము గలదు.

అనంతరము–గరుడాళ్వారు (గరుత్మంతుడు) కలడు-ఈయన విష్ణువునకు వాహనము, వేదాంతదేశికులవారు–'గరుడదండకము','గరుడ పంచాశత్తు'ల చెప్పిరి-౧ వాని ప్రభావము పూర్తిగా లేకున్నను-కొంతయైనను ఈ పద్యమున గలదని నాభావన-గరుడ పురాణమందలి భాగము శ్రీరంగమాహాత్మ్యము. కవి యందుకే 'సర్వవేదమయ సన్నుతకాయుని'-అని విశేషించినాడు - పురాణములు వేద తుల్యములు గదా!

వీరితర్వాత విష్వక్సేనుడు కందమున వర్ణింపబడెను. అతడు దానవవీర ఖగస్యేను దని విశేషింపబడెను. శ్రీమన్నారాయణులు తొలుత శ్రీసంప్రదాయమును లక్ష్మి కుపదేశింపగా ఆమె విష్వక్సేనున కిచ్చినది. అతని ప్రత్యేకతలో నిది యొకటి. ఇంతతో నితనిసంప్రదాయబద్ధమైన స్తోత్రము పూర్తిగాలేదు,-పరమభాగవతులను శ్రీవైష్ణవు లనుదినము ఈవిధముగా స్మరింతురు-

'ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాన్
రుక్మాంగదార్జున వశిష్ఠవిభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి-'

దీనికి అనువాదముగా భైరవుడు-

వినుతింతున్ హరిభక్తిపెంపున జగద్విఖ్యాతులై పుణ్యకీ
ర్తనులైనట్టి పరాశరుం, గపిలు, వేదవ్యాసుఁ, బ్రహ్లాదు,న
ర్జును, రుక్మాంగదు, నంబరీషుని, వశిష్ఠుం, బుండరీకున్, మరు
త్తనయున్, భీష్ము, విభీషణున్,సుకమునిం,దాల్భ్యున్,శుకున్.శౌనకున్.

పైశ్లోకమున పరమభాగవతులుగా చెప్పబడినవారందరు పద్యమునగలరు. వారితో పాటు కపిలుడు, మరుత్తనయుడు (హనుమంతుడు) కూడా చేరినారు.

---

౧ రాయల-ఆముక్తమాల్యదలోని ఖనటత్పయోద్ధి ... (1-8) పద్యము గరుడ పంచాశత్ ప్రభావముపూర్తిగా గలది,

కవికి గలవేదాంతశాస్త్రాభిమానము, సాంఖ్యము, కపిలునకు స్థానముకల్పించగా-చిరంజీవులయం దొకడైన-హనుమ-భాగవతులలో చేరినాడు

ఈవిధముగా కవి కృతిప్రారంభమందలి స్తోత్రమును సంప్రదాయాను సారియై చేసినాడు. ఐనను, ఆళ్వారులు, శంఖ-చక్రగదాదులు-లేవు. శైవుడైన కవి శ్రీవైష్ణవసంప్రదాయమును ఈమాత్రమైనను పాటించుట అతనిమతాభినివేశ మునకు తార్కాణ మనవచ్చును.౨

వీని తర్వాత 'అభీష్టదేవతాభివందనం బొనర్చి' వాల్మీకిని భజించెను, ఈపద్యం కాగానే సుకవిపుంగవుల ప్రణుతించినాడు, వారు 'హరిభక్తి దంబులై వెలయు పురాణ సత్కథలు వేడ్క రచించి జగత్ప్రసిద్ధులై పొలుచుమహాత్ము' లైన సుకవిపుంగవు లనినాడు- వీరియందు సంస్కృతాంధ్రకవు లుండవచ్చు. ఆంధ్రకవులలో-బహుశః ఎఱ్ఱన-శ్రీనాథ-పోతనలు గావచ్చు, ఎఱ్ఱన పోతనలు హరిభక్తి నిధానములైన గ్రంథములు వ్రాసిరిగదా! వీరితో పాటు నాగనాథుని (విష్ణుపురాణము-అలభ్యము) పేర్కొనెనేమో! ఈ పద్యము వెంటనే గల 'రహి నెక్కిన-' కందమునందు-నృపులచేత సత్కృతులై - కళలందు వహికెక్కిన నేటికవులు-అనినాడు-తన నాటివరకు-ఈ పద్ధతికి చెందిన కవులు — శ్రీనాథ మహాకవి, ఇతని తండ్రియైన గౌరన నూతనకవి సూరన-యిట్టివారు గావచ్చు.

ఈ మహానుభావుల కరుణతో—సాహిత్యకళాప్రతిభతో-చాతుర్య మొప్పార తను కృతి నిర్మాణము చేయుదునన్నాడు, సప్తసంతానముల ౧ బేర్కొని-యనంతరము-కృతి ప్రశస్తిని గూర్చి-

---

౨ ౧-౫ పద్యములవరకుగల పద్యములందలి సంప్రదాయముల వివరించుట కింత వ్రాయవలసివచ్చినది. (మరికొంత వ్రాయవచ్చునుగాని, విషయవిస్తృతి అగును) శ్రీరంగస్వామిగాక-శేష-గరుత్మత్-విష్వక్సేన-వాల్మీకులు ఈ గ్రంథమున వత్తురు-అందుకు మొదట ఈస్తుతి చేయబడినది

౧ సప్త సంతానములగూర్చి విపులముగా-చూ-'సప్తసంతానములు-వాని చరిత్ర' వేదం వెంకటరాయశాస్త్రిగారి 'నన్నెచోడుని కవిత్వము' అను గ్రంథమున-37-55 పుటలు, 1959 ముద్రణ.

కలుగు ధన, మఖిల దిశలను
వెలుఁగు యశం బతిశయించు విద్యలు ప్రీతిన్
జెలఁగు సుధీతతి యెదనెద
దలఁగు శివేతరచయంబు దగుకృతిఁ జెప్పన్' (౧–౧౨)

అనెను. పై పద్యము-

కావ్యంయశసేఽర్థకృతే వ్యవహార విదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే–

అను శ్లోకమును వలపించు అనువాదము

వీని యన్నింటి తర్వాత సత్కవీంద్రునికృతి యెట్లుండవలయునో తెల్పుచున్నాడు-

* శబ్దార్థరూఢి రసస్థితిబహువిధ
వ్యంగ్యభేదములు భావములు గలుగు
శయ్యా లలంకార సరణులు రీతులుఁ
బరిపాకములు దశప్రాణములును
వృత్తులు వస్తువివేకంబు గుణములుఁ
గవిసమయములుఁ జమత్కారములును
వర్ణనంబులు గణవర్ణ ఫలంబులుఁ
దత్త్వలంబులు నధిదైవతములు

గ్రహములును శత్రుమిత్ర యోగములు దశలు
నంశ వేధయు భూతబీజాక్షరములు–

---

*ఈ పద్యమందలి కుండలీకరణ భాగము ఛందస్సునకు సంబంధించినది, ఈ భావనగల పద్యమేయితని కవిగజాంకుశమున 13 సంఖ్యా పద్యముగా గలదు (చూ-అనుబంధము).

పొత్తువులు దెల్పి శాంతవిస్ఫురణఁ దనరు
సత్కవీంద్రునికృతి బుధసభల వెలయు–                (౧–౧౪)

ఇందలి కుండలీకరణభాగమును వదిలినచో- (కుండలీకరణ గుర్తుకై నేనుంచినది) మిగిలిన లక్షణము లన్నియు సత్కవీంద్రునికృతికి అవసర మను చున్నాడు. - తనరచనయైన శ్రీరంగమహత్త్వమునం దీలక్షణములు గలవని కూడా కవియభిప్రాయము (ముందు వీనిని వివరింతును)

లోకోత్తరగుణపుణ్యశ్లోకకథా పూరితకావ్యము ఆకల్పముగానుండుటయే గాక-కవివరుడును కృతార్థు డగునని కవిభావన - దీనికిమూలమగుశ్లోకాను వాదములు.

వీనియనంతరము చాగయరామునిసభాభవనవర్ణన గలదు నన్నయ్యగారి 'అఖిలజలధివేలావలయిత- (ఆదిపర్వము ౧-౮) వచనము ఇట్టివానికి భిక్ష పెట్టిన దనవచ్చును. అనంతరకవు లెందరో-యిట్టి వచనముల వ్రాసిరి. భైరవుని చమత్కారవచనరచన దీనినుండియే ప్రారంభము-కాదంబరిలోని గద్యవలె- విరోధాభాసయందు కొంతచెప్పి-యనంతరము సభాసప్తాంగముల వివరంచి- ఆస్థాన నట- విట-కవి- పండితగాయకాదులను-పౌరాణికులను పేర్కొనినాడు- దీనినిపరిశీలించి చూడగా-ఆనాటికి మల్యాలగుండయదండనాథుని-బూదపుర శాసనము (క్రీ శ.1260) వ్యాప్తిలోనికివచ్చెనా యనిపించును. వర్ధమానపుర-బూదపురశాసనములం దీసభాసప్తాంగపద్ధతి-వర్ణన హృద్యముగా గలదు. వర్ధమాన పురశాసనమందుచక్కని చిత్రకవిత గలదు.-౨

ఈవిధమైనప్రభావములు - భైరవునిరచనపై గలవనినావిశ్వాసము.

---

౧ పుణ్యశ్లోకస్యచరిత ముదాహరణ మర్హతి। నకశ్చిత్తాదృశః పూర్వైః ప్రబంధాభరణీకృతః॥ ప్రబంధానాం ప్రబంధౄణామపికీర్తిప్రతిష్ఠయోః। మూలం విషయభూతస్య నేతుర్గుణనిరూపణమ్॥ (ప్రతాపరుద్రీయము. ఉపోద్ఘాతము) (౬-౭, శ్లోకాలు)

౨ తెలంగాణశాసనములు (1.2. భాగములు.)
మరియు 1375నాటిదగు ఉమామహేశ్వరశాసనమున చిత్రకవిత గలదు. (సంస్కృతము)

## -:కృతిపతివంశము:-

శ్రీరంగమహత్త్వమున కవి-కృతిభర్తవంశమును - అందుముఖ్యులైన వారిని 33 పద్యములలో వర్ణించెను-దానిప్రకారము వారివంశవృక్షము.




కశ్యపునితో ప్రారంభింపబడిన యీ వంశవృక్షమున గలవారియందు - ఎక్కువ భాగము 'పండిత' విశేషణము గలవారుగా నున్నారు మరి వీరి రచనలుగాని - కృతినందిన రచనలుగాని తెలియవచ్చుటలేదు. ఒక్క చాగయ పుత్రుడగు రాఘవుడు (రామదేవుడు) మాత్రము - ప్రస్తుతగ్రంథ "కృతిభర్త"

అందరి శౌర్యపరాక్రమాదులను దానశౌండీర్యమును కవి విపులముగా తెల్పినాడు - వానికే యితరమైన ఆధారములు (ముఖ్యముగా కృతులు) లేనందు వలన-కేవలము వర్ణనములుగానే గలవు, ఈ పండితుల రచనలుగాని - అంకితమందిన రచనలుగాని లభించిన బాగుండెడిది.

కాకతీయుల పరిపాలన సమయమందు రాచకొండవారు - సైన్యాధిపతులుగానో - సామంతులుగానో ఉండి తమ బలపరాక్రమాదులచే రాజభక్తిని ప్రదర్శించియుండవచ్చు, అట్టి వానిని మనస్సునందుంచుకొని భైరవుడు వర్ణించెనేమో! కాకతి ప్రతాపరుద్రుని కాంచీ దండయాత్ర సమయమందును. క్రీ. శ. 1323 సం. మహమ్మదీయులతో జరిగిన యుద్ధమందును - రేచర్ల సింగమనీడు

ప్రతాపరుద్రునకు సాయముగా గలదు - అప్పటికి రేచర్లవారు కాకతీయులకు సామంతులుగదా ! వీరి ననుసరించియున్న - చాగయామాత్యుని పూర్వులుకూడ- సింగమనీనితో కలిసి పోరాడియుండవచ్చును - వీనిని భైరవుడు వర్ణించెనాయని యనుమానము,

విఠలుని — చాగయరాఘవుని కవి వర్ణించినపద్ధతి ప్రత్యేకముగా గలదు 'చండదిగ్వేదండ...'(౧-౨౧) అను పద్యమున - విఠల ప్రభుగు సైపఖానాది రాజ్యభారధుర్యుడుగా వర్ణింపబడుట - ఆనాడాతనికిగల అధికారబలము వ్యక్త మగుచున్నది.

కృతిభర్త రామదేవుని ౯ పద్యాలలో వర్ణించినాడు - వీరిపరాక్రమాదులు - (ముందు ప్రకరణములో పేర్కొనినట్లు) కర్ణాట దండయాత్ర నాటివి, ౧-౩౫ పద్యమున కవి — కృతిభర్తను - శ్లేషలో క్రమాలంకార పద్ధతిని వర్ణించినాడు. దానిలో -

బలధర్మ ధైర్యశోభన మహత్త్వంబులఁ
గరికాల నరదేవ గరిమఁ బొదలి — 'యనినాడు

బలమునకు - కరి, ధర్మమునకు కాలుడు, ధైర్యమునకు నరుడు (అర్జునుడు) శోభన మహత్వములకు దేవగరిమల చెప్పవచ్చును, మరియు - బల ధర్మ ధైర్య శోభనమహత్వములకు కరికాల నరదేవ గరిమ గలవారని చెప్ప వచ్చును, కరికాలుడు కాశ్యపగోత్రుడు.

వీరును కాశ్యపగోత్రులు, అనవసరముగా కరికాలుని ప్రశంస చేయడు గదా ! మొత్తముపై-ఈ కృత్యాదియందు తెల్పబడిన వారిని గూర్చి తెలియసి విషయములు, తెలుసుకొనవలసిన విశేషములే ఎక్కువగా గలవు.

గౌరన-భైరవుల కాలనిర్ణయ శీర్షికలో-విఠలేంద్రరాఘవుల గూర్చి-తెలుప బడినది, మరల ఇచట వ్రాయుట పునరుక్తమగును, కావున-తెల్పలేదు.

~~[illegible]~~ కవిత్వము—దానివిశిష్టతల వివరింతును-

'చెప్పెద కావ్యము, రసములు
చిప్పిల, వర్ణనల నింపుచియిక౯గ౯ జాకం
బుప్పతిల౯ జిత్రరచనల
చొప్పడ, శబ్దార్థఘటన సుకవులు మెచ్చన్' (౧_౨౨)

అని భైరవుడు-తన రచనను గూర్చి తెల్పినాడు-ఇదియేగాక - ముందు పేర్కొనిన 'శబ్దార్థరూఢి-' పద్యము (౧-౧౪) నందు-బుధ సభలయందు సత్క వీంద్రునిత్కృతి ప్రశస్తి వహించుటకు ఈ లక్షణము లవశ్యమనినాడు, ౧౦వ పద్య మున, 'శతముఖముల పరిఢవించు సాహిత్యకళా ప్రతిభా సంపద పెంపున చతు రుడ'ను- అనియు తెల్పెను. స్థూలముగా నీతని కవిత్వరచనోద్దేశ్యమిది.

తాను పురాణమును తెనిగించుచున్నను-దానికి చక్కనైన కావ్యకళా గౌరవము నాపాదించ నుద్దేశించినవాడు కావుననే-ఈ లక్ష్యముల పేర్కొనెను, రచనయు అట్లే గలదు, మూలమునకు ఎట్టి కొరతయు రానట్లు ఆంధ్రీకరించి నను-భైరవుడు-ద్వితీయాశ్వాసమందలి ఋతువర్ణనమును, చతుర్థ పంచమాశ్వా సములయందలి పురవర్ణనములను - స్వతంత్రించి చేసి తన ప్రతిభాపాండిత్య ప్రకర్షలను ప్రదర్శించెను. లాక్షణికులు (కావ్య)-ప్రబంధములం దుండవలసిన లక్షణముల తెల్పిరి-వాని ప్రకారము కవి- అష్టాదశ వర్ణనల చేసినాడు. (కొన్ని దప్ప) సప్తసంతాన ప్రశంస గలదు, షష్ఠ్యంతములు గలవు, కవి సమయములు చక్కగా పాటింపబడినవి, రసపోషణయందును, వర్ణనలయందును, కవి మిక్కిలి సంయమనమును పాటించినా డనవచ్చును, క్షేత్రమాహాత్మ్య విషయ ముల వ్రాయు కవికి ఇట్టి పద్ధతి-తప్పనిసరిగదా! భైరవుని ఋతువర్ణనముల పద్య ములు స్వతంత్రము లనునట్లున్నను-తన తండ్రియైన గౌరన వ్రాసిన నవనాథ చరిత్రమందలి ఋతువర్ణనలను- కొద్దిగా మార్చి యథాతథముగా తన గ్రంథ మున పద్యరూపములుగా చేసినట్లు గలవు. (చూ-నవనాథ చరిత్ర 8-9, పుటలు) ఇంత మాత్రమున నితని ప్రతిభను శంకింపరాదు, మిగిలిన వర్ణనలు — పద్య గమనము-కథాకథన చాతుర్యమును చూచినచో-అనంతర కవుల కీతడు మార్గ దర్శకుడా అనిపించును, పంచమాశ్వాసమున 'దండచి మ్రొక్కునప్పుడు - (౯ పద్యము) అను పద్యమును చూడగా - కళాపూర్ణోదయములోని

కొండఱం గడకంటి చూపుల గొండఱన్ నెఱచూడ్కులన్ (౨-౮) ఇత్యాది మత్తకోకిలము స్ఫురణకువచ్చును, ఈ రెండు పద్యాల సందర్భము కూడా ఒకటేయగుట విశేషము౧,

భైరవకవి - కొన్ని సంస్కృత సూక్తులను జొప్పించుటయేగాక - మరి కొన్ని సూక్తులకు - శ్లోకాలకు - అనువాదములా యన్నట్లు పద్యరచన గలదు, అట్టి వానిలో కొన్నిటిని జూపుదును,

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ' అను గీతాశ్లోకము శరణాగత మార్గమును బోధించునది, గీతా వ్యాఖ్యాతలు దీనిని విశేషముగా వివరించిరి, దీనికి అనువాదముగా -

ధర్మములు సకల కర్మఫలంబులు
పరిహరించి శరణుఁ జొరుము నన్ను
నదియె నీకు మోక్ష పద పరప్రాప్తికి
నతి రహస్యమైన-యట్టిమతము - (౨-౧౯౦)

(దీనియందలి 'రహస్య' పదము—ద్వయమంత్రము గావచ్చు) గీతలోనిదే యగు-
యద్యద్విభూతి మత్సత్వం శ్రీమదూర్జితమేవవా—'

ఇత్యాది శ్లోకమునకు—

ఏ వస్తువు లత్యూర్జిత
మై వీక్షణ గోచరంబులగు మునివర-నీ

---

౧ ఇతని రచనలోని — అనుసరణలు — అనుకరణలు, ప్రాస విశేషములు, అలంకారములు, ఛందోవిశేషములు-, ఆశ్వాసాల వారీగా ప్రత్యేకమైన జాబితా ఈయనైనది గావున ఇచట వానిని పేర్కొనలేదు, పుస్తకము మీ చేతిలో గలదు కావున - శ్రమయనక వీనిని చూచుకొన గోరుచున్నాను,

వా వస్తువుల నెఱుంగుము
శ్రీవిష్ణుని దివ్యశక్తిజృంభితములుగాన్ (౩–౩౦)

అనునది కొంత వర కనువాదమనవచ్చును,

బ్రహ్మహాచ సురాపశ్చస్తే యీ చగురుతల్పగః
మహాపాతకి నశ్చైతే తత్సంయోగీచ పంచమః–'అనేది-
పంచమహాపాతకాలను తెల్పు శ్లోకము – దీనికి -

గురుతల్పగ శిశుఘాతక
హరినిందాపర కృతఘ్న నాస్తిక మదిరా
నిరత పతితాదులకు నీ
సరసీ స్నానమున బాపచయశాంతి యగున్ (౩-౫౬)

అని యనువాదము, ఇట్టి యనువాద పద్యము (౫-౧౧౬) మరియొకటియు గలదు,

'సతాం సద్భిస్సంగః కథమపిహి పుణ్యేన లభతి–' ఈ శ్లోక పాదము – మిక్కిలి ప్రాచుర్యమందినది - దీనిని –

మిముఁ బొందగంటి – శుభములు
సమకొనియె మనోరథంబు సఫలంబయ్యెన్
సుమహితసాధుసమాగమ
మమితశ్రేయః పరంపరావహముగదా–

అని - ఉత్తర భాగపద్యమును చక్కనిసొమెతగా తీర్చిదిద్దినాడు–
'అపుత్రస్యగతిర్నాస్తి' అను ప్రసిద్ధమగువాక్యమును-

వరపుత్రవంతులకుఁ గల
దరయఁగ సద్గతిసుఖంబు 'నాపుత్రాణాం
పరలోకస్థితి' యనఁగా
బరిగెడు వాక్యంబు వినమె బహుశాస్త్రములన్–' (౫-౬౩)

అని పద్యమునం దట్టిదానినే పొందించినాడు

'రాజాకాలస్యకారణమ్ -' అందుము-దాని నిట్లు తెల్పెను.

నాలుగుపురుషార్థములకు
నాలుగువర్ణములవారినడవడికిని భూ
పాలకుడు కారణము—త
న్మూలంబున నెపుడు సర్వముం దలపోయన్ — (౫-౯౨)

ఈవిధమైన సూక్తులు - అనువాదములు మరికొన్నిగలవు - మచ్చున కివి చూపినాను,

భైరవకవి తనకవిత్వంబద్ధతులగూర్చి కొన్ని పద్యములను వ్రాసినాడు గదా (ఈశీర్షికప్రారంభమున ఈయనైనవి) వానిప్రకారమీతని కావ్యమును పరిశీలించుట యవసరము

కృత్యాది పదవపద్యమున 'సాహిత్యకళాప్రతిభాసంపద పెంపున చతురుడ' అని తెల్పుకొనిన భైరవుడు సాహిత్యమును ఒకకళగా భావించినాడు, ఈ 'కళా' అని ప్రయోగించుట ఇతనియందు విరళము (కవిగజాంకుశమందును గలదు) గౌరవ—'సరససాహిత్యలక్షణచక్రవర్తి' నని యనగా-నీత డిట్లనినాడు. ౧౪ పద్యమున సత్కవీంద్రకృతిప్రశస్తికి ఈలక్షణము లవసరము,౧శబ్దార్థరూఢి ౨ రసస్థితి. ౩ బహువిధవ్యంగ్యభేదములు ౪ భావములు, ౫ గతులు, ౬ శయ్య. ౭ అలంకారములు. ౮. రీతులు ౯ పరిపాకములు ౧౦ దశప్రాణములు. ౧౧ వృత్తులు. ౧౨ వస్తువివేకము. ౧౩ గుణములు. ౧౪ కవిసమయము. ౧౫ చమత్కారములు. ౧౬ వర్ణనములు -(మిగిలినవి ఛందస్సునకు సంబంధించినవి).

వీనియందు - గతులు — దశప్రాణములు — వస్తువు - అనునవి నన్నెచోడుడు తెల్పినాడు - ఆతనితర్వాత వీనిని తెల్పినది భైరవుడే గావచ్చు, పాకముల దెల్పి - పరిపాకములు అని యనెను, ఇతనికి పూర్వుడైన కావ్యాలంకారచూడామణికర్త ద్రాక్ష నారికేళపాకములనే పేర్కొనెను, ఉపపాకములు లేవుగదా ! సింగభూపాలుని 'రసార్ణవసుధాకరము'న ఎట్లుగలవో! భైరవుడు ధానిని అనుసరించెనా ? అనియూహ.

[illegible]లో శబ్దార్థరూఢిత్వములు, శబ్దరూఢి-అర్థరూఢి-శబ్దార్థరూఢి ప్రత్యే[illegible]గా గమనించుము('రూఢి'ప్రత్యేకముగా చెప్పలేదు) శృంగార-కరుణ - వీరాది రసములతోబాటు ఆయా సన్నివేశముల ననుసరించి భక్తిరసమును విపులీకరించెను,వ్యంగ్యరచన యీతనికి ప్రీతిపాత్రము-౧-౫౯లో వాగయతాముని వర్ణన - ౩ - ౧౬౮లో - విష్ణువు మాయారూపమున వచ్చి తన గుణముల తెల్పినప్పుడు-వ్యంగ్యముగా దశావతారములు వచ్చును. చతుర్థాశ్వాసమున ౯౪ పద్యము-ఈడు లాటు – అవతారములు, మరియు విప్రవరుల వర్ణించునప్పుడును (౨౩౧ పద్యం) వ్యంగ్యముగా దశావతారములు వచ్చును, తనపద్యములయందు శ్లేషను కలుగనట్టు భావములను ప్రతిబింబింపచేయవలయు ననియేగాక-వానికి చక్కని గమకమును గూడా కల్పించి-ఆలంకారికులు చెప్పిన శయ్యాపద్ధతిని అనుసరించినాడు. అందు కుదాహరణములుగా-పోతన రచనను స్ఫురింపచేయు -

హరిదివ్య నామధేయామృతం బింపార

జెలఁగి యాస్వాదించు జిహ్వ జిహ్వ—ఇత్యాది. (౧—౯౧)

సతతానేక మునీంద్ర బృంద కృతపూజావందనం బందనా
గత మందానిల కందలీకృత తరంగ స్యందనన్ దీరసం
గత మాకందమరందబిందు సహితార్క స్యందనం గాంచిర
య్యతు లింపొందఁ గవేరనందనఁ ద్రిలోకానందనానందనన్- (౧-౧౪౧)

ఇట్టి శయ్యగల పద్యములు మనకు హెచ్చుగా గన్పట్టును,

(చూ-1-౧౭౩, ౨-౩౭, ౬౧, ౩-౨౨౦. ౨౯౪, ౪ — ౬౫,౮౮, ౯-౨, ౨౬౧, ౫-౭౧, ౧౧౪, ౧౪౮, ౧౭౧ - ఇవి మచ్చునకు మాత్రమే-)

భైరవుడు కవిసమయములను చక్కగా పాటించినాడు-కాని-

అప్పుడు పుష్పబాణు రుచిరాకృతి దప్పక చూచి చిత్తముల్
ద్రిప్పఁగలేక కోర్కితతితీపులఁ బ్రేమలెలర్ప మానముల్
దప్పి చలించి ఘర్మసలిలం బెసగం బులకించి నివ్వెఱల్
గప్పి విచిత్ర రూపములకై వడి నిల్చి రమర్త్యభామినుల్—(౨-౫౪)

7)

ఈ పద్యమున-మన్మధుడు-(అనంగుడైనా) రుచిరాకృతికలవా డని చెప్పి-దేవతా స్త్రీలను-సామాన్య మానవతులవలెనే వర్ణించినాడు-అంతతో చాలక వారికి 'ఘర్మసలిలము'-పులకాంకురముల కల్పించినాడు-ఇది ఎంతవరకు తగును? ఔచిత్యము కొరవడినది గదా!

చతుర్థాశ్వాసమునందుకూడా-ఆదిమ దంపతుల పుష్పాపచయ-జలక్రీడల వర్ణించినప్పుడు వారిని సామాన్యమానవులవలెనే భావన చేసినాడు (చూ ౪-౭౭ పద్యంనుండి-౧౦౧ వరకు) ఇట్టివి ఒకటి రెండుదప్ప మిగిలిన వానియందు ఔచిత్యము పాటింపబడినది, 'కవిసమయము' కావున వీనిని తప్పింపలేక పోయి నాడేమో?

ఈ విషయములనేగాక-భైరవుడు 'వర్ణనల నింపు చిలుకఁగ' చేయుదు నన్నాడు-గదా-అట్టి వానిసి కొన్నిటి బేర్కొందును,

ఋష్యాశ్రమవర్ణనమును-నన్నయగారు-శ్రవణ సుఖంబుగా-ఇత్యాది పద్య మును వ్రాసిరి, నవనాథ చరిత్రయందు ఇట్టి పద్ధతి వర్ణన గలదు-భైరవుడు మాత్రము-ఆశ్రమ వర్ణనను-విపులముగా వచన రచనయందు చేసెను, కథారంభ మున- (కావ్యమునందు) మొట్టమొదటి వచన మిది విరోధాభాసతో నొప్పారినది.

౧౦౧ పద్యమున - 'వివిధతాపనివారి భూవినుతవారి
కలితకావేరి భవకరికలభవైరి'-

అను విశేషణముతో కావేరిని వర్ణించినాడు - లాటానుప్రాస గలదు. శ్రీరంగ నాయకస్వామి ఉభయకావేరీమధ్యస్థుడు గాబట్టి - ఈ పద్ధతి. ౧౦౪ పద్యమున - ఉభయకావేరీప్రవాహములు బాహువు లనియు - రంగ నాధుడు నాయకు డనియు - తన కలితాయతకంకణమౌక్తికద్యుతిచ్ఛన్న మృదుప్రవాహములు సాచి - చిరాగతుడైన ప్రాణనాయకుని కౌఁగిట చేర్చు నాయికవలె కావేరి గలదట (కంకణ - మౌక్తికములు శ్లేషింపబడినవి)

ఆశ్రమమృగముల వర్ణన - అందరి కవులవలెగాక వినూత్న పద్ధతిలో చేసినాడు - అవి - 'సహజజ్ఞానయుతంబులై సరసభాషల్ ప్రీతిఁ జేతస్సు ఖావహముల్ గా దగ బల్కుచున్-సత్యస్ఫూర్తితో మెలగుచున్న వట-(౧-౧౧౩)

ఈ విశేషణము లన్నియు మునుల ప్రసంగములకు తగును - వారి ప్రభావము మృగములపై బడినది.

౧-౧౭౧ లో - సుబోధుడు విష్ణువును స్తుతించుట-విశ్వరూపసందర్శన-స్ఫురణయే గాక-స్వామివారి విరాడ్రూపము వర్ణింపబడినది, నన్నెచోడుని కుమారసంభవమున (6-141) గల-

**ఆతపభీతి** నీడలు రయంబున మ్రాకులక్రింద దూఱెనో--
అనునది నిదాఘవర్ణనమున ప్రసిద్ధమైన పద్యము-దానివలెనే.

మునికన్యార్పిత జలములఁ
దనుపగు తమపాదులందుఁ దరువులనీడల్
గనుపట్టి నిలిచె దినకర
ఘనతర పరితాపభీతిఁ గదలని కరణిన్ (౨-౨౩)

అని చమత్కరించినాడు.

ఇదే యాశ్వాసమున ౨౦ పద్యమునుండి - ౮౭ పద్యమువరకు - కవి - ఋతువర్ణనలు - తపోవర్ణన - మన్మథవర్ణన అద్భుతముగా చేసి-తన సాహిత్యకళానిష్ణాతృత్వమును నిరూపించుకొనినాడు - వీనిలో ౩౨ పద్యమున - అనంగుడైన మన్మథుని - సరూపునిగా వర్ణించుట౧ ఆశ్చర్యము, ఇట్టి వలరాజు

---

౧ నన్నెచోడుని కుమారసంభవము (౪-౮౩) నందు మన్మథవర్ణన గలదు. నేటివరకు తెనుగు కవులలో నెవ్వరు చెప్పని విధముగా-విపులముగా భైరవుడు వచనమున మన్మథవర్ణన చేసెను (౨-౭౮)

ప్రబంధమణి భూషణము (48 పుట) నందు 'మన్మథాగమనము' ద్విపద గలదు-దానికి భైరవుని వచనానికి దగ్గర సంబంధమున్నది, (ద్విపద కర్తృత్వము తెలియదు)

ఈ విధముగా కవి యనేకవర్ణనల హృద్యముగా చేసినాడు,

రూపరేఖావిలసనముల చూచిన అమరపాలునకు సహస్రాక్షత్వము సార్థకమైనదని కవి యుత్ప్రేక్షించుట - సరసముగా గలదు.

ఈ వర్ణనలయందు హంసలు - చకోరములు - వేర్వేరు పద్యముల లో వర్ణింపబడెను. ఇట్టివానికి ఇతఁడే ఆద్యుడేమో ! వీనితోపాటు అతివచందన- (౬౨ పద్యము,) తరువాత కందుకకేళి కూడా భైరవుని ప్రథమత్వమునే చాటునవి గావచ్చు.

౩-౪౨లో బ్రహ్మవర్ణన-నూతనపద్ధతిని గలదు. అంతేగాక విష్ణువు ఆయుధాలు రూపము ధరించి వచ్చినట్లు తెల్పినాడు. (అనంతరము ఇట్టివర్ణన కంఠీరవ రాజు 'పంచాయుధకట్టె'లో కలదు.)

౪-౬౦శ్రీరంగవర్ణన, ౨౧౯విష్వక్సేనవర్ణన, ౨౪౮-పర్వతవర్ణనలు గలవు. పంచమాశ్వాసమున-౧౦పద్యము-కదంబవర్ణన. ౨౦౧- సూర్యవర్ణన-ఇట్లుగా-అనేకములగు వర్ణనములు గలవు.

వచనరచన :—

పద్యములను మించిన ప్రతిభ ఇతనివచనరచనలో పరిస్ఫుట మగును-ఏరెండుమూడు వచనములనో తప్పించిన అన్నియును-సుదీర్ఘములై-అలంకార శోభితములై - విరోధాభాసతో కూడి-కాదంబరిని తలపించుచు - ప్రౌఢిమను వెలువరించు వర్ణనలు గల అట్టి పెద్దవచనములు ఆశ్వాసాలవారీగా ఇట్లు గలవు.

| | | |
|---|---|---|
| ప్రథమాశ్వాసము | — | ౧౭చాగయరాముని సభావర్ణన. |
| | | ౭౫ నైమిశారణ్యము- |
| | | ౧౦౨ కావేరీనది, |
| | | ౧౪౬ కావేరీనది. |
| | | ౧౯౩ శ్రీరంగనాయకస్వామి (చిన్నవచనము) |
| | | ౨౦౫ స్వామివారి ప్రభావము, |
| ద్వితీయాశ్వాసము | — | ౭౮-మన్మథప్రయాణము, |
| | | ౨౦౮-సముద్రవర్ణన- |

తృతీయాశ్వాసము — ౮౦ – యుద్ధవర్ణన.
౨౯౩– అర్చావిశేష వర్ణన-(సంగీతము)

చతుర్థాశ్వాసము — ౭౭ – ఉద్యాన వనవర్ణన,
౨౨౨-స్వామివర్ణన-(అంగవర్ణనవచనము)
౨౭౭ – పురవర్ణన-(పూర్తివిరోధాభాస)

పంచమాశ్వాసము — ౧౧౨-ఏకాదశినాడు-స్వామివారి అర్చన.

ఇవిగాక-౧-౧౯౮-సంస్కృతమున పెద్దదండకము – బ్రహ్మ – విష్ణు మూర్తిని స్తుతించుసందర్భమున గలదు. సందర్భోచితముగా – వాణీపతి ముఖ నిర్గత మగుదండకము సంస్కృతమున చెప్పుటయేగాక-అందు-వేద-వేదాన్తవిషయములను-శ్రీసమ్ప్రదాయమును అవతారవిశేషములను ప్రపచించినాడు. దీనిచివర నొకశ్లోకము గలదు. ఎఱ్ఱన నరసింహపురాణము (౩-౨౧౧)నందు ప్రహ్లాదుడు నరసింహమూర్తిని స్తుతించు సందర్భమున దండకము గలదు – కాని – తెనుగుభాగము గలదు. తృతీయాశ్వాసము ౨౧౩ సర్వలఘుగద్య, దీనియందు ౭౯౩ అక్షరములు గలవు. (వీనిలో మూడు గురువులు పడినవి) పాహిమాం, పాహిమాం; అను అంత్యమకుటము లఘువులలో చేరకున్నను – అక్షర సంఖ్యలో చేర్చినాను, దీనిని సర్వలఘువుగా వ్రాయుటకు చక్కని సందర్భము గలదు.

చిత్రసేను డనుగంధర్వుడు తన గర్వముచే మహిమలను పోగొట్టుకొని – చుల్కనయై (సర్వము లఘువుగా మారి) శివునిస్తోత్రము చేయుట – ఈ సందర్భము, కవి-సమయోచితముగా దీనిని వ్రాసినాడు.

చతుర్థాశ్వాసమున – ౨౨౨ – స్వామివారివర్ణన గలదు. ఇది అంగ వర్ణన వచన మనవచ్చును. నరసింహ పురాణమున – విష్ణువును వేడికోలు సందర్భమునందు ఎఱ్ఱన వర్ణించినాడు-రెండు గ్రంథములందును 'సందర్భమొకటే యగుట నిదర్శనము, భైరవునిపై ఎఱ్ఱన నృసింహపురాణప్రభావము మిక్కుటముగా గలదు, పంచమాశ్వాసమునందు ౨౨౧. సరస్వతిని సంస్కృతగద్యలో వర్ణించెను, దీని సందర్భము సైతము సార్థకముగా వాడబడినది.

చిక్లితుడను విప్రుడు సాంగవేదపఠనానిష్ణాతృత్వము అలవడవలెనని తప మొనరించి విష్ణుని ప్రత్యక్ష మొనర్చుకొనగా – ఆయన-సర్వవిద్యాధిదేవతయైన వాణిని సేవింపు మనుసు-సమగ్ర పూజా విశేషములచే నాద్విజన్ముడు దేవి నారాధించి ప్రస్తుతించుట యీ సందర్భము

ఆమెవాణి, విద్యాధిదేవత. పైగా గీర్వాణభాషామతల్లికదా ! అందుకే గైర్వాణియందు ఈగద్యరచన చేయబడినది, శ్రీనాథనైషధమున (౪-౧౩౮) సరస్వతి – దండకమున స్తోత్రము చేయబడినది). ఈగద్యము పూర్తికాగానే వచ్చు-పద్యముకూడా – 'మాణిక్య వీణాముపలాలయంతీ' మిత్యాది శ్లోకమున కనువాదముగా గలదు.

ఈవిధముగా భైరవుడు – తన వర్ణనోత్సుకతను-పద్య-గద్యములయం దనన్యసామాన్య మగునట్లు నిరూపించెను, కవిత్వమం దీతడు చూపిన చమత్కారములును హెచ్చుగా గలవు –

భైరవుడు రచించిన గద్యములు – వచనములు – ఎక్కువ భాగము – ఉత్కలికా-చూర్ణము–వృత్తగంధులుగా గలవు.

ఈ విధమైన గద్యభేదములు–వచనరచన విశేషములగూర్చి డా॥ ముదువు కులశేఖరరావుగారి ఆంధ్రవచన వాఙ్మయ వికాసమున వివరముగా గలదు.)

గ్రంథము మీచేతియందు గలదు భైరవుని కవితా రసాస్వాదన చేయుదురు, ఇతని సమాసరచన-వర్ణనలు–పద్యగమనము–వీని ప్రత్యేకతలు–ప్రత్యేకముగా వివరింపలేదు,-తినబోవుచు రుచులెన్నుట తగనిది గదా !

శ్రీరంగమహాత్మ్యమున కవి యుపయోగించిన వివిధ ఛందస్సులను ప్రక్కపుటలో జాబితాగా చేర్చినాను.– పోతనగారివలె ఇతనికి కందము ప్రీతిపాత్రమేమో ? ౪౬౬ కందాలు వ్రాసినాడు–

| పేరు | ప్రథమాశ్వాసము | ద్వితీయాశ్వాసము | తృతీయాశ్వాసము | చతుర్థాశ్వాసము | పంచమాశ్వాసము | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| ఉత్పలమాల | ౧౪ | ౨౬ | ౨౨ | ౨౭ | ౨౫ | ౧౧౪ |
| చంపకమాల | ౧౨ | ౨౫ | ౨౧ | ౩౭ | ౩౯ | ౧౩౪ |
| మత్తేభము | ౨౨ | ౧౬ | ౨౨ | ౭ | ౧౩ | ౮౦ |
| శార్దూలము | ౧౦ | ౮ | ౧౦ | ౬ | ౧౦ | ౪౫ |
| సీసము | ౨౭ | ౨౭ | ౨౪ | ౨౭ | ౨౦ | ౧౨౫ |
| తేటగీతి | ౧౪ | ౧౬ | ౨౮ | ౨౪ | ౧౭ | ౯౯ |
| ఆటవెలది | ౬ | ౧ | ౨ | ౧ | ౧ | ౧౧ |
| తరల | — | ౧ | — | — | ౧ | ౨ |
| మాలిని | ౧ | ౧ | ౧ | ౧ | ౧ | ౫ |
| ఉత్సాహ | — | — | ౧ | — | ౧ | ౨ |
| కందము | ౭౪ | ౫౯ | ౧౧౮ | ౧౧౫ | ౯౭ | ౪౬౩ |
| లయగ్రాహి | — | ౧ | — | — | ౧ | ౨ |
| స్రగ్ధర | ౧ | — | — | — | — | ౧ |
| మహాస్రగ్ధర | — | ౧ | ౧ | — | — | ౨ |
| శ్లోకము | ౧ | — | — | — | ౧ | ౨ |
| దండకము | ౧ | — | — | — | — | ౧ |
| వచనము | ౩౮ | ౪౪ | ౫౦ | ౪౩ | ౩౬ | ౨౧౩ |
| గద్యము | — | — | ౧ | — | ౧ | ౨ |
| మొత్తము | ౨౨౧ | ౨౨౬ | ౩౦౫ | ౨౮౮ | ౨౬౬ | ౧౩౦౬ |

## పదప్రయోగములు :-

శ్రీరంగమహాత్మ్యమున కవి కొన్నిపదములను వింతగా ప్రయోగించినాడు. గొప్పలాక్షణికుడైన భైరవు డిట్లు పదప్రయోగము చేయుట గౌరన - నవనాథ చరిత్ర ప్రభావము గావచ్చు, వ్యావహారికభాషాపదాలతోబాటు - ఈ విధమైన పదములు నవనాథచరిత్రలో గలవు.

ఆశ్వాసాలవారీగా భైరవునిపదాలను చూపుచున్నాను. ఇందు వేయబడినది - పద్య - లేదా - గద్యసంఖ్య.

## ప్రథమాశ్వాసము

౮౫. ఏమిటందభిరుచి, ౧౪౪ క్షితిగల నదులందలి.

## ద్వితీయాశ్వాసము

ఇట్టివి - లేవు.

## తృతీయాశ్వాసము

౧౨౦ - కావలై మెలఁగు, ౨౮౦ కైలాసముకు, ౨౮౧ ప్రదేశముకేగి

## చతుర్థాశ్వాసము

౧౩. సముదయంబుకు, ౪౬ తనువుకు ౭౨ చేక్రవాకలు, (చక్రవాకములు అనుటకు) ౧౦౩ తీర్థముకై, ౧౪౧ యోగంబుకు, ౨౫౧ నెలవుకు, ౨౫౨ తిల్క (తిలకకావలె)

## పంచమాశ్వాసము

౪౧ మతేమాయెనొ, ౧౦౬ ఒక్కపూటశనము ౧౪౫ లోకముకు, ౧౮౦ మనసుకు ౨౪౭ పదముకు,

పరిశీలనమునందు పైపదాలు కన్పడినవి. నా దృష్టినుండి తప్పినవి యింకను గలవేమో ! దిద్దుటకు వీలగునట్లు కొన్ని యీపదాలు గలవు. కాని నేనాపని చేయలేదు. కవి స్వతంత్రించి వీనిని ప్రయోగించినాడని సంతృప్తి.

మానవల్లివారీపదాలగూర్చి ప్రథమముద్రణపీఠికలో ఇట్లు వ్రాసిరి.

భైరవుఁడు గొప్ప లాక్షణికుఁడని ప్రఖ్యాతి వహించియు నాంధ్రవ్యాకరణదోషములు పెక్కులు పరిహరింపఁజాలఁడయ్యె... * స్వర్గమును మొదలుగఁ జొచ్చె ప్రాగమంబురాని శ్రవణసుభగము గాదు. ఇట్టి ప్రయోగములు దీనిలోఁ బెక్కులు గలవు. ప్రౌఢవ్యాకరణములో నుదాహరింపఁబడిన సన్నయభట్టారక ప్రయోగములును వీనికిని జాలభేదము గలదు. ఆంధ్రమున లాక్షణికులే లక్ష్యైకవేద్యులగు కవులకంటె పెక్కు దుష్ప్రయోగముల గూర్చి వానికి సాధుత్వ ముద్ఘోషింపఁ బ్రయత్నించిరి. ఇట్టిదోషముల సూచించుట కర్తవ్యమని చూపితిమి గాని నేటికాలమునఁ బాణినిపతంజలుల యంతరంగమును గుర్తించి విచిత్ర వ్యాఖ్యానవైఖరీప్రభావంబున మునిత్రయంబును - ముని సప్తకంబుగాఁ జేయఁజాలిన గ్రామ్యభాషోద్ధారకుల కివి హాస్యభాజనములు గాక తప్పవు'' (viii పుట)

ఈ విధమైన పదములను ప్రయోగించుట భైరవునకు పూర్వము క్వాచిత్కమేయైనను - అనంతరకవులు విరళముగా నిట్టివానిని వాడిరి, తెనుగు వ్యాకర్తలు వీనిని గ్రహించి - వివరించినారు.

## పదప్రయోగవిశేషములు :-

## ప్రథమాశ్వాసము

పదప్రయోగ విశేషములు :-

౧. వహి:-'- వహినెక్కిన కవుల నేటివారల ప్రీతిన్' - అనినాడు. ఇది కవిస్తుతిలోని పద్యము, కవిత్వమునందేగాక ఇతరకళలయందును ప్రసిద్ధి కెక్కినవారని కవిభావన. బహుశః శ్రీనాథ, పోతనలు, గౌరన, సూరన (నూతన కవి)లు గావచ్చు. 'వహి' యనగా-లెక్కపుస్తకము ప్రసిద్ధి అని నిఘంటువులు తెల్పుచున్నవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికయందు 'బహి' ('వహి' అనుటకు) అను దానిని కోమట్లు లెక్కలు వ్రాసే పుస్తకమనే అర్థమున ప్రయోగించెను

---

* ఈ పదము ప్రస్తుతగ్రంథములోనిది గాదు, కేవల ముదాహరణమునకై దీని నుదాహరించియున్నారేమో !

తెలంగాణలో పుస్తకాన్ని 'వొయ్యి' అందురు. ఇదే అర్థమున ('వొయ్యి' అందురు. ఇదే అర్థమున ('వొయ్యి' అనునది. వొయి. వొయ్. వహి. అయినది) భైరవుడు వాడియుండును, అనగా గ్రంథస్థమై-ప్రసిద్ధులైన కవులని యర్థము, ఇది వికృతి పదముగాదు. కేవలం మాండలికము, నవనాథ చరిత్రలో గౌరన 'వహి కెక్కు నిజనిరవద్య చిహ్నముల' వాడినాడు. శ్రీరంగమహత్త్వమున ఇదే ఆశ్వాసము ౪౬ పద్యమునందును 'వహి' గలదు. ఈ పదమును పుస్తకము అను అర్థమునందే చాలమంది కవు లుపయోగించిరి.

౧౪. పొత్తువు:— 'పొత్తువులు దెల్పి శాంత విస్ఫురణఁదనరు'- అని ఈ పదమును ప్రయోగించినాడు, కవిగజాంకుశమందు 'పొత్తువు' గలదు.

పొత్తు-అనుదానికి 'వు' కారము చేరినది, దీనికి - 'పొందిక', 'అనుకూల్యము', 'మనోహరము'-అని — సూ ని. (ఇదే పద్యము ప్రయోగమునకు) పొందు. పొత్తు-అనేవి—వాడుకలో ప్రసిద్ధములు

'అంచనుచు పొత్తువుఁబల్కులు జూపి' అని మరియొక కవిప్రయోగము'

## ద్వితీయాశ్వాసము

౧౭౨— 'సువాసి' - 'అనుచు నీసువాసికై కడంగి'—' గంధర్వుని — కవి 'సువాసి' అని నాడు, చక్కని పదము, గురుబాల ప్రబోధికలో—'సౌరభం గన్ధం అర్వన్తి గన్ధర్వాః—సువాసనను బొందువారు— 'అర్వగతౌ'—గంధర్వులు- అని వివరణ.

## తృతీయాశ్వాసము

౪౯ - 'జితంతే' సుమహిత పుష్కరిణీ తీ
ర్థమున గృతస్నానుఁడై 'జితంతే' యను మం
త్రమున హరిఁదలఁచునతఁ డఘ
సమితిఁ దొఱఁగి.........'

అని - పుష్కరిణీతీర్థప్రభావమును చెప్పుచున్నాడు, ఇందలి -'జితంతే' యనునది వేదమంత్రము, భైరవునకు - వైదికవిద్యయందుప్రవేశముగల ధను ట్నతు ఇదొక నిదర్శనము, ఆమంత్ర మిది -

ఓం. జితంతేదక్షిణతోవృషభ ఏధిహవ్యః ఇంద్రోజయాతివపరా

జయాతాఅధిరాజో రాజసురాజయాతి విశ్వాహిభూయాఃపృతవా

అభిష్టిరుపసద్యోనమస్యోయథాసత్ అస్యేదేవప్రదిచేమహిత్వం

దివస్పృథివ్యాఃపర్యంతరిక్షాత్ స్వరాడింద్రోదమఆవిశ్వగూర్త

స్స్వరిరమత్రోవవక్షేరణాతు అభిత్వాశూరనోనుమోదుగ్ధాఇవ

ధేనవః ఈశానం (౨-౪-౪౫)

౮౦ బత్తెముకలు – 'గుండె లవిసి బత్తెముకలు నెట్టుమోవబడి–' యుద్ధ వర్ణనలోనిది – ఈవచనభాగము, (పటియ = బ్రద్దఅని. (శ. ర) ఉరఃపంజ రము క్రిందరెండువైపుల గల్పముకలు అనుఅర్థమున కవి వాడినాడు. 'పటుచు కొనియుండు ఎముకలు' అని, పటుచు – పటు. అయి, పదాది సరళముగా మారి బత్తెముకలు అయినది. 'పత్తెవాసినది – పత్తెచూపినది, అని తెలంగాణలో ఎక్కువగా వాడుదురు. పగిలినది అను అర్థమున ఈశబ్దము రూఢ మయినది, అదే పత్తెముకలు, బత్తెముకలు – అయి – వాడుకలో 'బత్తెంక' అయినది. ఉరఃపంజరము క్రిందిభాగము పొట్టకు రెండువైపులా పటుచుకొని (పత్తెలుగా) యుండు ఎముకలు అని భావన.

౧౭౬ 'వళ్లు' — 'వఱలు కాంతారపంక్తులు పెళ్లుపోయె–' వేసవిలో కాంతారపంక్తులు – 'వడిసిపోయినవి' అనుటకు. వడి–వళ్ళు అయినది,

(వడియు = ఇంకు. కృశించు. అని.)

## చతుర్థాశ్వాసము

౯–౨ – చక్రవాకలు — చక్రవా – 'కలుఁదన లోనవీడుకడికన్నులపండు వౌనల్చెలఁజక్రికిన్, మనోహరమైన సరోవరవర్ణన, చక్రవాకులు తప్పనిసరి యుండవలయును. కవి–చక్రవాకలు. అని 'క' యతిస్థానమున ప్రయోగించి నాడు. ఇది – సంస్కృతమున చక్రవాకి; తెనుగులో చక్రవాకులు కావలయును

గదా ! కవి స్వతంత్రించి దీని నిట్లు ప్రయోగించెనేమో ! ప్రయోగాంతరములు నాకు లభింపలేదు,

## పంచమాశ్వాసము

౪౫ శుచిషత్తు : - 'సుచిరక్రతువాసఁగుఁ బ్రియము శుచిషత్తునకున్' ఇది మంచి వైదిక ప్రయోగము. యాగపద్ధతి-దాని విశిష్టత-లను గూర్చి చెప్పు సందర్భములో ప్రయోగింపబడినది. కవి 'శుచిషత్తు' అని వాడిన్నాడు, ఇది 'శుచిసత్', 'శుచిసత్తు' కావలయును, దీనికి సకార స్థానములో షత్వమురాదు. అందుకు కారణం-షకారము కేవలము లౌకిక పదాలకే విధింపబడును.

శుచౌ అవిముక్తాది పుణ్యక్షేత్రేషు సీదతి-తిష్ఠతీతి-'శుచిసత్' అని. ఇది వైదిక ప్రయోగముగదా షత్వము వచ్చు వీలే లేదు, కవియెట్లు ప్రయోగించును, ముద్రారాక్షసుడు శుచిసత్తులో ప్రవేశించెనేమో! ముందు పేర్కొనిన 'జితంతే' తరువాత-ఇది-భైరవుని వైదికర్మ కాంశ పరిచయమున కుదాహరణము.

కవి-తన రచనలో ఇట్టి విశిష్టములైన పదముల ప్రయోగించి తన ప్రౌఢిమను నిరూపించుకొనినాడు. నేను ముఖ్యములని భావించి — కొన్నిటినే తెల్పినాను.

ఇంకొకటి - మొదటనే చేర్చవలసినా చివరను తెల్పుతున్నాను

౧-౧౯౦ బకలము-బకలంబుఁ జేసె హాటక వేత్రపాణియై'—విష్వక్సేనుని గూర్చి తెల్పునది, ఈ పదము బగళముచేయు-'బగళము' అనియును గలదు, సూ. ని. 'బకళము సేయు' పదానికి—ఇదే ప్రయోగము నిచ్చెను, ఇది-'భగ్నము' అను దానికి-బగనము—బగళము-బకలముగా మార్పు చెందుచు వచ్చి నట్టి రూపము, 'తొలగుడు-' అను అర్థమున రూఢి చెందినది, బగలము - నృసింహపురాణము (1-80) నందును-మరికొన్ని ప్రబంధములందును గలదు

ఇతని పదప్రయోగవిశేషములలో నివి కొన్నిమాత్రమే! సూర్యరాయ నిఘంటువునందు శ్రీరంగ... పదములు గ్రహింపబడినవి వాని జాబితాను కూడా చేర్చినాను (ప్రక్క-పుటలో) వీని తరువాత- శ్రీరంగ ...' ఛందో విశేషాలు గలవు.

# సూర్యరాయని ఘంటువులో

## శ్రీరంగ మహాత్త్వమందలి పదములు-

| | | ఆశ్వా-ప. సంఖ్య |
|---|---|---|
| ౧ | ఆరచించు | ౪-౨౧౧ |
| ౨ | ఆరరే | ౪-౨౨౪ |
| ౩ | ఈడ | ౨-౫౯ |
| ౪ | కల్లెడ | ౧-౧౪౬ |
| ౫ | కవేరుఁడు | ౨-౧౮౧ |
| ౬ | కెరలు | ౨-౭౮ |
| ౭ | గిజిగిజి | ౩-౭౯ |
| ౮ | చెరలు | ౨-౭౮ |
| ౯ | జిర(రు)గు | ౩-౧౭౬ |
| ౧౦ | జివజివ | ౩-౧౭౬ |
| ౧౧ | రవణించు | ౧-౧౮౧ |
| ౧౨ | డగ్గుపడు | ౨-౪౪ |
| ౧౩ | తటతట | ౩-౧౭౬ |
| ౧౪ | తఱుము | ౧-౧౪౬ |
| ౧౫ | తవణించు | ౩-౧౪౯ |
| ౧౬ | తాప | ౧-౧౯౪ |
| ౧౭ | నమురు | ౧-౧౪౬ |
| ౧౮ | నేము(రా) | ౬-౧౨౦ |
| ౧౯ | నిమురుకొను | ౨-౩౪ |
| ౨౦ | పంచాఁ | ౩-౭౨ |
| ౨౧ | పఱిపఱి | ౨-౩౧౧ |

| | |
|---|---|
| ౨౨ పిచపిద | ౧-౧౪౬ |
| ౨౩ పొడవడు | ౧-౧౪౬ |
| ౨౪ పొతపు | ౨-౯౪ |
| ౨౫ పొత్తువు | ౧-౧౪ |
| ౨౬ పోరె | ౧-౭౫ |
| ౨౭ ప్రతిష్ఠాపించు - | ౨-౧౦౬ |
| ౨౮ బకలముసేయు | ౧-౧౯౦ |
| ౨౬ బిసబిస | ౩-౧౭౬ |
| ౩౦ బుడిబుళ్ళుపోవు | ౫-౨౫ |
| ౩౧ మమ్మ | ౪-౨౨౪ |
| ౩౨ మసరుకొను - | ౧-౧౪౬ |
| ౩౩ మిలమిల | ౨-౪౭ |
| ౭౪ ముంపు | ౧-౧౪౬ |
| ౩౫ మెదుగు | ౩-౭౫ |
| ౩౬ లంపు | ౨-౪౪ |
| ౩౭ లోఁగు | ౪-౨౬౦ |
| ౩౮ లోతమి | ౧-౧౪౬ |
| ౩౯ వసి | ౪-౫౩ |
| ౪౦ వాగము(వాగె) | ౨-౭౮ |
| ౪౧ వెలది | ౨-౪౮ |
| ౪౨ వెలుపు | ౪-౨౭౬ |
| ౪౩ సరకు | ౨-౫౭ |
| ౪౪ సవడి | ౪-౨౬౦ |

## ఛందోవిశేషములు :-

శ్రీరంగమహాత్త్వమున కవి యుపయోగించిన వివిధములగు పద్యాలను ఆశ్వాసాలవారీగా ప్రత్యేకముగా చూపుచున్నాను కావున వానిని గూర్చి వ్రాయుటలేదు,

'కవిత నేరుపు యతి కూర్పునైపు దెలుపు' - అనినట్లు భైరవకవి-తన రచనలో-పద్యముల నడిపినాడు. అందులో లక్షణగ్రంధమునుకూడా వ్రాసిన వాడుగదా! అచ్చటచ్చట కొన్ని యతిప్రాసలను వింతగా ప్రయోగించినాడు వానిని తెల్పుదును.

౧-౧౨౨ వరగీతాపతనంబు గల్గునొకొ బన్నంబందు.'...

దీనియందు మ-వ యతిగలదు. లాక్షణికులు దీనిని-'అగ్రాహ్యభేదవర్గ యతి'గా పరిగణించిరి.

ము-బులకు ద్వైరూప్యపుంప్వాదేశాదులబట్టి యతి చెల్లును. కాని-పఫబభ మవలతోను-రలలు-లథలు-యతిలో చెల్లవు. అభేదవర్గయతిలో పఫబభలు-వకారముతో యతిచెల్లును. కానిమకారముమాత్రము చెల్లదు. మరి భైరవునిప్రయోగ మిట్లెందుకుగలదు పూర్వలాక్షణికులలో ఎవ్వరూ ఈయతిని చెప్పలేదు. కాని-భైరవునకు కొంతముందు-ఈయతులు గలవు. కావ్యాలంకారచూడామణి (3-44) 'ధీర'నుగూర్చి చెప్పుచు-

'వసుమతిగౌరవించుచు శ్రమంపడకుండిన'- ప్రయోగించెను.

మరికొన్ని—

మదిమదినుండి యేను బలవంతుఁడనై - (ఎఱ్ఱన - హరివంశము.
ఉ-8-199)

వ్రస్సి యెంతయు శ్రమంపడి యిట్లు - బసవపురాణము

ముదమున బ్రాచిదేవుండును గలసి - పల్నాటివీరచరిత్రము.

వీని ప్రభావము భైరవునిపై గలదేమో?

రఘునాదయ్య లక్షణదీపికలో - మరుదీమము శేలుకీరవాణియనంగన్ గలదు. కవిసంశయవిచ్ఛేదము - 'మత్వము పకు పత్వంబగు' - అనినాడు (75 పుట 1955 ముద్రణ) పూర్వలక్షణగ్రంధములలో తెలుగువారు దీనిని చెప్పకున్నను. తమిళములో-మ-వయతి గలదు

౩-౧౧౨- సప్తర్షిపదము నగతి స్త్రీకరించు-
సప్తతీర్థమయము చంద్రసరసి

సర్వపుణ్యమయము చర్చింప నీరావు
సర్వవేదమయుఁడు శార్ఙపాణి-

ఇది సరసయతియేగాక - పవడగీతము.

౩-౧౨౬- 'మార్గవశమున కావేరి దగ్గరుటయు-' గలదు. దీనిలో వలపల గిలకప్రాస. (ప్రాసయతివేసినాడు) మాగణ - దగ్గరు - అని, రక్రిందగల గావత్తుతోను-దగ్గరులోగల 'గ' తోను యతి వేయుట ఈ కవిభావనగాదు.

నన్నెచోడునిలో-భగణ-తగణ-ప్రాస (భర్గ-తర్గ) గలదుగదా.[1]

౩-౨౧౫- శివుని స్తుతించునప్పుడు సర్వలఘుగద్య పెద్దది గలదు. దీనిలో 789 లఘువులుగలవు. ఇది సర్వలఘుగద్యయేగాని-మధ్యన 8 గురువులు గలవు-ఎట్లు పడినవో? ౫-౨౦౩లో లయగ్రాహి (సర్వలఘువులు) గలదు.

౩-౨౪౮. కాలచక్రమైన గరుడధ్వజునిచేతి
చెక్రమైనవారిఁజే-రకంత—

ఈపద్యమునందు ద్వితీయపాదములో 'చెక్రము' యతిలోప్రయోగింపబడి నది. చక్రము - అనుటకు- 'చెక్రము' అనినాడు.

భైరవకవిఛందోవిశేషాలను కొన్నిటినే యిచట పేర్కొనినాను. పరిశీల నార్హములైన యతిప్రాస లింకనుగలవు.

వృత్తనామసార్థకత :—

వృత్తము - లేదా - పద్యముయొక్క పేరును- ఆయావృత్తములో నిమి డించు సంప్రదాయము - దీనినే ముద్రాలంకారమని జయదేవాదులు పేర్కొనిరి. తెలుగులో ఈపద్ధతి నన్నెచోడునినుండి వ్యాప్తిచెందినది.[1] సంస్కృతమున-అతి ప్రాచీనకాలమునుండి ఈపద్ధతి గలదు[2] కన్నడమున ప్రవేశించినతర్వాత - తిక్కనాదులు దీనిని వాడిరి.

---

౧ కుమారసంభవము - (నన్నెచోడుడు) 1965 ముద్రణ పీఠిక. 30-34 పుటలు

౨ భరతుని నాట్యశాస్త్రమున 'ముద్రాలంకారములు హెచ్చుగా గలవు'

[illegible]

శార్దూలంపాటలిపుత్రమధ్యనగరీ.....శార్దూలవిక్రీడితమ్

ఇది శార్దూలము. దీనియందు శార్దూలవిక్రీడితమ్ - గలదు. దీనిని క్రీ. శ. 400 ప్రాంతమువాడైన జైనసమయాచార్యుడు రచించెను. క్రీ. శ. 660 ప్రాంతమున నున్న మయూరుడు - శృంగారాష్టకములో

ఏషాతా నవయౌవనా శశిముఖీ కాంతాపథాగచ్ఛతి
.......... .......... ......
.......... .......... .. ...
కేనేదం రతిరాజసేన రచితా శార్దూలవిక్రీడితా- ! అవిప్రా.సెమ.

పంపభారతమందు-

బక కిమ్మీరజటాసురోద్ధత......మత్తేభవిక్రీడిత...' గలదు.
ఇది మత్తేభముగదా !

దీని ననుసరించిన తిక్కనగారి —— 'బకవిధ్వంసి జటాసురాంతకు' (ఉద్యోగ. 2-172) ఇత్యాది పద్యము గలదు - దీనియందు నాగాయుత సామ్యకీర్తి-' అని ఓచరణము - మత్తేభపద్యము - నాగ – (మత్తేభము) వచ్చినది.

రానురాను తెనుగుకవు లెందరో యిట్లు సార్థకముగా వృత్తరచన చేసినారు.

భైరవుడు శ్రీరంగమహత్వమున నిట్టిరచనల చూపెను వానిని - పేర్కొందును.

౧-౨౩. లో - లలితమరుసమయ సముదిత
మలయానిలచలిత మధురమాకంద-సము
జ్జ్వలకుసుమవిసరసౌరభ
కలితవచస్స్ఫురణ వెలయగా నిట్లనియెస్-'

అని పద్యము ఇది '౫౫ అక్షరాలున్న కందము' పద్యముపేరుతోబాటు - పద్యము లోను 'కంద' గలదు. కందములో కందము - ఇదిగూఢ ముద్రాలంకారము.

మరియొకవిశేష మేమనగా - ఇందలి ౫౫ అక్షరాలలో - 46 లఘువులు - 9 గురువులు - కవియొక్క వచన స్ఫురణ వ్యక్తమగుటతోబాటు - సర్వలఘు రచన లనిన కవికి గల యభిమానము తెల్లమగుచున్నది.

౨-౧౧౪- ముద్రాలంకారములేదు. కాని - దశరధుని వర్ణించుచున్నాడు లఘువులు, శకారాలు ఎక్కువగా గలవు

౩-౬౪- బ్రాహ్మణుడు-చోరునకు భయపడి వికలహృదయుడై-తడబడు చున్నప్పుడు-

పొడగని యదరెడుభయమున...' ఇత్యాది-పద్యము గలదు. సందర్భో చితముగా- 'వడకెడువిప్రుని' వర్ణించెను. ఇది పోతనగారి 'అడిగెదనని కడువడి జను' పద్యాన్ని జ్ఞాపకంచేయును.

౩-౧౪౨- చంద్రునిగూర్చి చెప్పునది-

'అప్పుడు కైరవప్రియుఁ డుదంచితసమ్మదవార్ధివీచులన్-'అని చెప్పెను ఉత్పలము పద్యనామము. 'కైరవ' శబ్దప్రయోగముతో - పద్యనామము నిమిడించెను.

౩-[illegible] స్తుతి, గంధర్వుడు [illegible] మహత్త్వ మును పోగొట్టుకొని శంభుని స్తుతించును. మహత్త్వరహితుడై-లఘువుగా మారిన గంధర్వుడు- సర్వలఘువులలో స్తోత్రము చేయుట చక్కగా కుదిరినది. శైవుడైన భైరవుడు-తన శివభక్తిని ఈసందర్భమున వ్యక్తపరచినాడు.

౪-౭౮ మాకందము కడునిది ర
మ్మా కందము డాయఁబోయి మంజీరులకున్
మాకందఁగ వెఱ గవిసిన
మాకందము మగువ మధుర మాకంద మిలన్-

ఇదియును గూఢముద్రాలంకారము- (కందములో కందము) అంతేకాక- భైరవుని కందములు మాకందములు, కవి పుష్పాపచయము (రగడలోకన్న వర్ణించుచు, 7 కందాలువ్రాసెను. వానిలో ఈమాకంద మొకటి. ఇచ్చట) భైరవుని ప్రాసక్రీడలు వ్యక్తమగును.

౪-౨౬౭. మలయపవనుని వర్ణన - సీసము తర్వాత - గలగీతము - ఎక్కువగా-సర్వలఘువులు గూడి. ఇచ్చట వాయువుకూడా-కథాసందర్భమును [illegible] లఘువుగా మారును. అందుకే కవి- మలయపవనుఁడు పురిలోన గలయబోలయు' అని- 'మలయపవన' శబ్దమునుకూడా సర్వలఘువు చేసెను.

౫-౧౮౯- అవధరింపుము లోకనాథ ప్రభాకరుం డనుభూసుర...'

ఇది 'తరల' పద్యము. సూర్యుని దేవతలు ప్రార్థించుసమయమున చెప్పబడినది. సూర్యుడు తరలివెళ్ళువాడు (చలనంకలవాడుగదా) కావున- 'తరల' వాడినాడు. అందులో సూర్యుడు ప్రభాకరుడుకావున-ప్రభాకరు డనువిప్రుని పేరు మొదట చేర్చెను. ఇది సందర్భోచితమైన రచన, ఇకనితని-ప్రాసలు-అలంకారములు-(ఎర్రన-అరణ్య పర్వము (5-217) నందు

తరళదీధితి పుంజ నిర్భరదారుణాయుధపాణులై' యని తరలను - పేరు వచ్చునట్లు వ్రాసెను)

## ప్రాసలు - అలంకారములు,

(దీనిలోనివి పద్యసంఖ్యలు)

| [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
|---|---|---|---|---|---|---|
| ద్విప్రాస | ౭౨,౯౩- | ౧౯౫ | ౧౭౮.౧౮౨, | ౧౪,౧౩౩.౧౯౬, | ౧౦.౧౮ | ౨౩ |
| | ౧౭౮ | ౧౮౦ | ౨౦౪ | ౧౯౭ | ౨౪ | |
| | | | | ౨౫౬.౨౫౯.౨౪౩ | ౨౭.౩౦, | |
| | | | | | ౫౦.౫౯ | |
| | | | | | ౨౪౩. | |
| త్రిప్రాస | — | ౬౦.౬౫ | — | — | ౧౫౦. | |
| | | | | | ౨౨౬ | ౪ |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అంత్యప్రాస | — | — | — | ౮౫ | ౧౦,— | ౨ |
| అనుప్రాస | — | ౫౯, ౬౮ | — | — | | ౨ |
| లాటానుప్రాస | — | — | — | — | ౨౩౫ | ౧ |
| సర్వలఘు | — | ౨౨౫. , | ౬౪.౧౮౫. ౨౦౯. | — | — | ౫ |
| లఘు | | | ౨౧౫. | | | |
| ముక్తపదగ్రస్త | — | ౬౬ | — | ౨౭౮ | — | ౨ |
| మొత్తము | ౪ | ౭ | ౭ | ౯ | ౧౨ | = ౩౯ |
| ఉపమ | ౫౯,౧౦౪ | - | ౨౧౮. | - | ౧౭౦,— | ౪ |
| మాలోపమ | - | ౧౧౪. | - | - | - | ౧ |
| ఉత్ప్రేక్ష | ౧౪౧. | ౭౩. | ౨౨౮. | ౯౬ ౧౦౦ ౨౫౭ | - | ౬ |
| స్వభావోక్తి | ౭౭ | ౨౧౩ | ౩,౧౫౬ | ౬౪,౧౩౦, ౧౪౨ ౧౬౦, | ౨౨౩, ౨౩౫, | ౧౦ |
| అర్థాంతరన్యాస | - | ౮౨ | - | - | - | ౧ |
| శ్లేష | - | ౧౭౯ | - | ౯౪,౨౦౯ | - | ౩ |
| అపహ్నవ | - | - | - | ౨౬౨ | - | ౧ |
| తద్గుణ | - | ౭౧ | - | - | - | ౧ |
| భ్రాంతి | - | - | - | ౨౬౫ | - | ౧ |
| ఉదాత్త | - | - | - | - | ౧౬౨. ౧౬౪ | ౨ |
| పర్యాయోక్తి | - | - | - | - | ౨౦౧, | ౧ |
| మొత్తము | ౪ | ౬ | ౪ | ౧౧ | ౬ | = ౩౧ |

# బంధకవిత్వము

భైరవకవి యీ గ్రంథమునందలి పంచమాశ్వాసము చివర-చక్ర-నాగ-గోమూత్రికాబంధముల రచించినాడు, కాన ఇట్టి కవితాప్రక్రియను గూర్చి సంక్షిప్తముగ తెలుసుకొన్నుట యవసరము.

చిత్ర కవిత-గర్భకవితయనునవి-చతుర్విధకవితా భేదములలో చేరినవి, ఆశు-మధుర-చిత్ర-విస్తర-అనునవి చతుర్విధ కవితలుగదా ౧ నన్నయ-వీని ప్రస్తావన చేసెను (ఆది-౧-౮) తరువాత కవులలో శ్రీనాధుడు తన నైషధమున ప్రస్తావించెను, కాని యట్టి కవిత మాత్రము చెప్పలేదు.

మనకు తెలిసినంతవరకు చిత్ర-గర్భకవితలు నన్నెచోడుని కుమార సంభవమునందు ప్రధమముగా గన్పట్టును, ౨ ఇతని తరువాత-విక్రమార్క-చరిత్ర రచించిన జక్కన-తన తాతయైన పెద్దయ-చిత్రకవిత చెప్పినట్లు తెల్పినాడు (౧-౨౦) కాని అతనిరచన లేవి లభింపలేదు గదా! కావ్యాలంకార చూడామణియందు- (6 ఉల్లాసము 66-71 పద్యములు) విన్నకోట పెద్దన లక్షణము లక్ష్యములతో బంధకవితను చెప్పెను-ఇతనిది లక్షణ గ్రంధముగదా! వీరి తర్వాత మన భైరవుడు కన్పడుచున్నాడు-అనగా-నన్నెచోడుని తర్వాత ఈ కవితను కావ్యమునందు చెప్పిన వారిలో నీతడే ప్రధముడు (పెద్దనది లక్షణ గ్రంథముగావున).

ఇంతకు-ఈ కవితా పద్ధతి-తెనుగువారి సొంతము గాదు-సంస్కృతము నుండి దిగుమతి చేసికొనినదే, సంస్కృతమున చాలకాలముముందు నుండియే

---

౧ వీని విషయమున అభిప్రాయ భేదములు గలవు,చూ శృంగార నైషధ సర్వంకష-పీఠిక.

౨ వేదం వెంకటరాయశాస్త్రిగారి మతమున నన్నెచోడుడు 1300 ప్రాంతము వాడు కావున-ఈ పద్ధతికి ఆద్యుడుగాడు, జక్కన తాతయే మొదటివాడగును వారి-'నన్నెచోడుని కవిత్వము' అను గ్రంథమున విపులముగా వీని విషయమును చర్చించిరి.

యీ పద్ధతి వర్థిల్లినది. సాహిత్యరత్నాకరము, శిశుపాలవధాదులయందీ కవిత కలదు.

నన్నెచోడుని తరువాత-విన్నకోట పెద్దన (1402) భైరవుడు ఈ రచనలయందు గలరంటినిగదా! భైరవునికి-విన్నకోట పెద్దనకు-అంతగా కాలవ్యత్యాసములేదు. (1402 అనినచో-శ్రీనాధుడు కొండవీటియందు విద్యాధికారియైన వత్సరము) అనగా-పెద్దన-శ్రీనాధ-జక్కన-భైరవులు, కొద్ది తేడాలతో ఒకే సమయమందు గలరు, వీరిలో-జక్కన తాతను గూర్చి భైరవునకు తెలియునో లేదో? పెద్దన కావ్యాలంకార చూడామణి ప్రభావము గలదా? నన్నెచోడుని రచనను చదివియుండవచ్చునా? లేనిది ఎట్లు వ్రాయగలిగినాడు, ఇది-యిట్లుండగా-

జక్కన - ఎఱ్ఱనలకు ముందువాడగు మడికిసింగన - తన 'నీతితారావళినుండి-

పలుకులతీపును సరసము
చెలువము నడబెడఁగు 'బంధచిత్రము' సొబగున్
గలకలనఁ జూపవలదే
కలకంఠియు బోలెఁ గవితకందనమంత్రీ

అనుపద్యము సకలనీతి సమ్మతము (1-30) నందుదాహరించెను — దీనిలో 'బంధచిత్రము' గలదు గదా? మఱి యిట్టికవిత సింగనదేది? ఎఱ్ఱనను జక్కన 'చిత్రకవిత్వవాగ్వి భవజృంభితు డనినాడు - ఈ చిత్రకవిత్వము' అతని విషయమున అలంకార విశేషముగా భావించెనేమో! జక్కన.

ఇక శాసనముల విషయమును పరిశీలింతము - తెలంగాణమందలి మహాబూబునగరంజిల్లా - తా॥ నాగరకర్నూలు, వర్ధమానపుర (వడ్డెమాను) గ్రామమున శా. శ. ౧౧౬౭ (క్రీ. శ. 1245) కాకతీయుల శాసనము గలదు - అభినవమయూరసూరి లేఖకుడు — దీనియందు చక్రబంధము గలదు. మహాబూబునగరం తా॥ బూదపురగ్రామసమీపమున గల మల్యాలగుండయ శాసనము — చిత్రకవిత — అనేకవిధాలుగా చెప్పబడినది. దీనికాలము. శా. శ. ౧౧౮౪ (క్రీ శ 1262) ఈశ్వరసూరి - లేదా ఈశ్వరభట్టు. సంస్కృ

తాంధ్రభాషలతో చిత్రకవితాభిరామముగా గల యీ శాసనములు – 18 శతాబ్ది మునకు చెందినవి. జక్కనతాత పెద్దయ – ఈశ్వరసూరి సమకాలమువారు కాగలరు.

ఈరెండుశాసనాలేగాక – అచ్చంపేట తా॥ ఉమామహేశ్వరశాసనమునందు చక్రబంధము (సంస్కృతము) గలదు – క్రీ. శ. 1375 శాసనకాలము, ఇది రాచకొండ ప్రభువులు వేయించినది.

వీనినిబట్టి చూడగా భైరవునకుముందు గర్భచిత్రకవిత లతి-ప్రచురముగా గలవు. కాని గ్రంథస్థము చేసినవారు అరుదు, ఉమామహేశ్వరశాసనము – భైరవునకు పరిచయమైయుండును. ఇట్టి పీఠికాప్రభావమున శ్రీరంగమహా త్మ్యమందు గర్భకవిత చేరినది. పైన తెల్పిన కారణాలవలన నన్నెచోడుని తరువాత భైరవుడే ఈ పద్ధతిని గ్రంథస్థము చేసినా డనుటలో విప్రతిపత్తి లేదు ఈ విషయమున తండ్రిని మించి-నాటి సమకాలీన కవులను మించి-భైరవుడు ముందడుగు వేసినాడు.

రానురాను – చిత్ర – గర్భకవితలు ప్రాచుర్య మందినవి – ప్రత్యేక గ్రంథములు వ్రాసి కవు లీ పద్ధతిని పరాకాష్ఠ దశకు చేర్చినారు – అందు కుదాహరణముగా ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము ఇందలి 808 నెం. సీసము వింశతి భేదబంధకందము – చక్రబంధమున నిమిడ్చి వ్రాయబడినది, ఇదియేగాక విశిష్టమగు యతి ప్రాసవిశేషములుగూడా దీనియందు గలవు,౧ చిత్రకావ్యములందు, దీనితో సాటిరాకున్నను – ఇట్టివి మరికొన్ని – గుడారు వేంకటదాసరచితమైన – ప్రబంధరాజ శిరోభూషణ ప్రకృష్టబలరామ చరిత్ర

---

౧ ఇట్టి విశిష్ట కృతి-వేదం వేంకటరాయశాస్త్రి గారి సంపాదకత్వమున 1977లో ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీ వారిచే ప్రకటింపబడినది, పీఠికలో-చిత్ర కవితను గూర్చి విశేషముగా గలదు.

౨ రావూరి దొరస్వామిశర్మగారు తమ 'తెలుగుభాషలో ఛందోరీతులు' అను గ్రంథము (380 పుట) నందు చిత్రకవితను ప్రదర్శించిన కొన్ని గ్రంథముల పేర్లను చూపిరి. వారు చేర్చని గ్రంథాలు మరికొన్ని గలవు, వానిలో 'శ్రీరంగమహత్మ్యమొకటి.

మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారి - బంధశత లక్షణముల వివరించు 'ప్రబంధ సంబంధ నిబంధన గ్రంథము' - (దీనికి లక్ష్యముగా కవితావినోదకోశమును గూడ వీరు రచించిరి) సుప్రసిద్ధులైన నాదెండ్ల పురుషోత్తమకవి అద్భుతోత్తర రామాయణము - చిత్రకవితా నిలయములు-

ఇట్లు ప్రత్యేక గ్రంథములేగాక - తమ రచనలయందు బంధకవితను కొద్దిగా చేర్చిన కవులు గలరు-౨

ఈ చిత్ర-బంధ-కవితలను ప్రత్యేకముగా సేకరించి-సచిత్రములుగా ముద్రించుట అవసరము.

విస్తరభీతివలన-కవిత్వబంధముల నిర్మాణపద్ధతిని వివరించుటలేదు-భైరవుని చక్రబంధమున వచ్చు పేరు,-ప్రత్యేక అక్షరాలతో ఆబంధ పద్యమున చూపబడెను, దీనిలోని పొరపాట్లు-సవరణలు-'మార్పులు చేర్పులు' శీర్షికయందు చూడవచ్చును

ఆనుకరణలు -

శ్రీరంగమహత్వపద్యములపై - భైరవునకు పూర్వముగల కవుల గ్రంధముల ప్రభావము హెచ్చుగా గలదు అందులో - ఎర్రన నరసింహ పురాణము - శ్రీనాధుని భీమఖండ కాశీఖండములు, గౌరన నవనాధచరిత్ర పోతనగారి భాగవతములు-ముఖ్యములు. ఏ కవియైనను తనకు ముందున్నవారిని అదర్శముగా గొననిది - రచన సాగుట శ్రమయే కాని ఇట్టి కాలముద్రను తిరస్కరించినకవులు అతిస్వల్పముగా నుందురు.

ఈ గ్రంధపద్యములకు ఇతర రచనలలోగల పోలికల కొన్నిటిని తెల్పుదును. పూర్తిపద్య మిచ్చుటలేదు. కొంతసూత్రమే సూచింతును, ముందు ప్రకరణాలలో అచ్చటచ్చట సందర్భానుసారముగా ఈ అనుకరణ లుట్టంకించనైనవి.

ప్రథమాశ్వాసప్రారంభమున - రెండవ పద్యము -
శయనంబై యుపధానమై నిలయమై సచ్ఛత్రమై......' గలదు.
'కృత్యాది'ని గూర్చిన విషయములో ఈ పద్యానికి మూలము తెల్పినాను.

దీనిని చదువగానే పోతనగారి-

'ఇంతింతై వటుడింతయై...

'పరుఁడై యీశ్వరుడై మహామహిముఁడై-' అనే పద్యాలు స్ఫుర ణకు వచ్చును.

పోతనగారు - ఏవేళ - పుట్టంబుట్ట శరంబునన్ మొలవ...' పద్యము వ్రాసిరోగాని - అనంతరకవులెవ్వరు వాల్మీకిని వర్ణించినా 'పుట్టన్ పుట్ట' పదమును వడిలినవారుతక్కువ,-ఆ పుట్టనుపుక్కిటిపట్టినవారిలో-భై రవుఁడు- పుట్టకుబుట్టికోమలికిబుట్టిన ప్రాగవులాదరించి...' (౧-౨౦) అని ప్రారం భించినాడు. ఇతని సమకాలమువాడు. స్నేహితుడు (?) నూతన కవిసూరన - ధనాభిరామములో.

పుట్టంబుట్టి మహానదిఁ
బుట్టియు......... (1-10)అనినాడు.

శ్రీరంగ-౧౮౨ లో, సారంబై మోక్షపదా
ధారంబై.........' గలదు. ఆశ్రమవర్ణన.

పోతన పుణ్యంబై మునివల్లభ
గణ్యంబై......'గలదు.రెండూ ఒకేవర్ణనలు.

ఒకే పద్ధతి

శ్రీరంగ-౧-౯౧. హరిదివ్యనామధేయామృతం బింపార
చెలగి యాస్వాదించు జిహ్వ జిహ్వ.

పోతన— కమలాక్షునర్చించు కరములు కరములు -
శ్రీనాధు వర్ణించు జిహ్వ జిహ్వ,

తిక్కన— కలగెం దోయధిసప్తకంబు -

శ్రీరంగ - (౧-౧౩౪) జలధుల్ పిండలివండుగాఁ గలఁగె...'
నన్నయగారి - 'విమలమతింబురాణములు'- పోలిక. శ్రీరంగలో-౩-౮౪
ఎఱ్ఱనగారి 'ఊసరక్షేత్రముల్-' పోలిక - శ్రీరంగ--౩-౮౦.

ద్వితీయాశ్వాసమున గల నిదాఘవర్ణన తపోవర్ణన-నన్నెచోడుని ప్రభావ మును సూచించేవిగా గలవు. (౨౨౬,౭౫ శ్రీరంగ...)

నన్నయగారి సౌపర్ణోపాఖ్యానమున సముద్ర-ఉచ్చైశ్రవవర్ణనలు శ్లేషలో గలవు - ఆ ప్రభావమే - 'అశ్వరత్నంబునుంబోలె ససమసుధాసారంబై -' (శ్రీరంగ-౨౧౨౦౮వ) అని పడినది.

తృతీయాశ్వాసమున- (౧౪) ఇందుండి వచ్చితి నిప్పుడే ననరాదు......' పోతన — ఇది నాకు నెలవని యేరీతి పలుకుదు

భైరవుని కందపద్యములు - (వృత్తనామ సార్థకతలో వివరించినాను) అన్నీ ప్రాసక్రీడలు-ఋతువర్ణనములయందు-పోతనగారిని బాగా అనుకరించి నాడు. చతుర్థాశ్వాసమున అట్టివి గలవు.

పోతన్నగారి ప్రభావము భైరవునిపై మరింత గాగలదు మచ్చుకు మాత్రమే యివి చూపబడినవి.

ఎర్రన 'కన్నులు జాత్యంధునకున్' (నృసింహ, ౫.167)
శ్రీరంగ-విననేర్చుం చెవిలైన (౧—౧౧౬)
ఇట్లే ఎర్రన భైరవుల రచనలో దగ్గరి పోలికలు గలవు

(1) శ్రీరంగ-౧-౧౨౨ పోలిక
నరసింహ-5—149.

(2) శ్రీరంగ—౨—౬౦
నరసింహ—౨౬౯

(3) నరసింహ—1—54 మందానిలవర్ణన.
శ్రీరంగ—౪—౨౬౬ '' ఇంతేగాదు—ఎర్రన

మందానిలవర్ణన పూర్తికాగానే విరోధాభాస వచనము వ్రాసెను(1-55) వైకుంఠమును ఎర్రన వర్ణింప—అదే పద్ధతిలో-ముక్తపదగ్రస్తము కూడా చేర్చి. భైరవుడు పురవర్ణన చేసెను ౪-౨౬౮)

సముద్ర వర్ణన–నరసింహ–లో 1–26 నుండి 37 వరకు గలదు. భైరవుడు ౨–౨౦౦లో దీన్ని కొంత అనుకరించుచు వివరముగా వర్ణించెను.

ఇదే వచనమునందు – నరసింహాలోని తెక్కలితోడి కొండల – ఇత్యాది పద్యానికి–'పక్షవిచ్ఛేదనారంభ......శిఖరంబులబోలె' గలదు.

నరసింహాలో–హిరణ్య కశిపుని తపస్సు (2–13 నుండి 28 వరకు)

శ్రీరంగ–లో వశిష్ఠుని తపస్సు – కొంత పోలిక ఋతువులన్నీ వర్ణింప బడినవి. (౨–౨౦ నుండి ౩౦ వరకు)

నరసింహాలో-3-14 అంగవర్ణన వచనము.

శ్రీరంగలో - ౪-౨౨౩ అంగవర్ణనవచనమే - రెంటికీ అన్ని పోలికలు గలవు.

శ్రీనాధుని భీమఖండములో-

మెఱుఁగు కోఱలతోడి మృత్యుదేవతనోరు
ధట్టించి యఱకాల ధట్టినాడు' - గలదు

శ్రీరంగలో— మెఱుఁగు కోఱలతోడి మృత్యుదేవత గర్వ
మడఁచితి వెందేని యద్భుతముగ (౩-౮౦)

ఈ విధముగా భైరవునిరచనపై యితరకవులప్రభావ మున్నదని నా భావన - అట్లే - భైరవునిప్రభావము అనంతరకవులపై పడినది. ఇతడు ప్రథమాశ్వాసములో—

చెప్పెదఁ గావ్యము రసములు
చిప్పిల వర్ణనల నింపుచిలుకఁగ......(౨౭) పద్యము

చదివినచో-

చెప్పవలె కప్పురంబులు
కుప్పలుగా బోసినట్లు......(వాల్మీకిచరిత్ర. 1 - 15)

పద్యము జ్ఞప్తికి వచ్చును. ఈ పద్ధతిపద్యానికి భైరవుడే మొదటివాడు. అట్లే - కందుకక్రీడ - మన్మథుల (ప్రత్యేకత) వీనినిగూడా భైరవకవి మొదట వర్ణించినాడు.

పంచమాశ్వాసము ౨౫౹౦ పద్యమిట్లు గలదు, ఇది బహుశః ఆనాటి రాచకొండ పరిస్థితియేమో ?

ఆతనిరాజ్య మొప్పె నిగమాయత జానపదప్రకీర్ణమై
యాతతవేదశాస్త్రపరనారవశోభితమై యుపద్రవ
వ్రాతవిదూరమై సకలవృత్తవిశేషసమృద్ధిమంతమై
వీతకళంకమై సతతవిష్ణుమహోత్సవ రమ్యదేశమై

(ఈ పద్యమందలి'రాజ్యము'బదులు 'కావ్యము'ను చేర్చిన - శ్రీరంగమహాత్మ్యమునకు చక్కగా వర్తించును)

## సవరణలు :—

శ్రీరంగమహాత్మ్యము ముద్రితప్రతి (1912) యొక్కటే నాపరిష్కరణకు ఆధారము. కవిగారు ముద్రించిన యీప్రతిలో-నాకు కలిగిన సంశయాలను-పేర్కొని-వానికి సవరణల చూపినాను. ఇవి ఆశ్వాసాలవారీగా గలవు సవరణలకు ముందు- 1912 నాటి ప్రతినిగూర్చి కొద్దిగా తెల్పుతాను

ఈపుస్తకము పీఠికపేజీలుగాక మొత్తము 177 పుటలు, సన్నని అచ్చుతో - దగ్గర - దగ్గరగా పద్యాలు వేయబడినవి. (సీసము గీతముతో కలిపి 6 చరణాలు, కందముగీతము రెండుచరణాలుగానే ముద్రింపబడినవి) మొదటి పద్యమునుండి ౫ ఆశ్వాసము చివరిపద్యమువరకు ఒకేక్రమసంఖ్య వేయబడినది. (ఆశ్వాసాలవారీగాలేవు) చివరిపద్యము 1293 అని గలదు. మధ్యన కొన్నిటికి సంఖ్యలు లేవు. మరికొన్ని రెండుమారులు పడినవి. పద్యాలశీర్షికూడా సరిగా వేయలేదు. అచ్చుతప్పులు (?) బాగా ఉన్నాయి.

నేను దీనికి ఆశ్వాసాలవారీగా పద్యసంఖ్యను వేసినాను. అచ్చుతప్పు లనిపించినవి దిద్దినాను. 'ఆశ్వాసాంతము' శీర్షిక నేనుంచినదే, కవిగా రుంచినవి ప్రశ్నార్థకాలు - అట్లే యుంచి - మార్పులు చూపినాను. ఒకవిధముగా చెప్ప వలెనన్న - యథాతథముగా - కవిగారిప్రతి గలదు. సవరణలు - మార్పులు - చేర్పు లన్నీ ఇచ్చట చూపుచున్నాను. ఇది నాయూహకు తట్టినపద్ధతి. అంతే గాని - సిద్ధాంత మనజాలను. ఆనాడు కవిగారిదృష్టినుండి తప్పినవే - ఇవి యనుకుందును. పదమునకు ముందు వేసినది. ఆ ఆశ్వాసమందలి - పద్య 'గద్య - సంఖ్య.

## ప్రథమాశ్వాసము

౭౩ - పోరెలు

'—బిడాలంబులపోరెలుసారెలం దెరలక మరిగి తిరుగు గిరికలును—' ఇది ఆశ్రమవర్ణనసందర్భమున చెప్పబడిన వచనములోనిది. ఆశ్రమమందు పిల్లుల కలహానికి చెదరకయున్న ఎలుకలు అనిభావన.

పోరు = కలహము, గిరిక = ఎలుక, 'పోరుల' అనిన - కలహము లకు - అగును. కవి దీనినిపదమధ్యఎకారముగా ప్రయోగించెనేమో? 'బిడాలం బులపోరుల - అని సవరించుకోవచ్చు. లేదా - పోరి - పోర (అ) గాడు - అని తెలంగాణలో వాడుక - ఆవిధముగా చిన్నచిన్నబిడాలములపోరెలు - అని నాడా! పోరగాడు అనుటకుబదులు పోరెగాడు - అనివాడుదురు--

—ఈపదము - సూ. ని. గ్రహించినది—

ఋషివర్ణన (?) ఇదికూడా పై ౭౩ నెం. వచనభాగమే - ప్రశ్నార్థకము కవిగా రుంచినదే!

'నాగంబుల కెండరాకుంద వికివిగంపురులు విచ్చి చేరవచ్చుఋషివర్ణన(?) మయూరంబులు గలిగి' అని గలదు దీనితోవచనము పూర్తియై - ముందు పద్యము వచ్చును - అనిఋషివర్ణనపద్యము, చేరవచ్చు .. మయూరంబులు మధ్యన ఈఋషివర్ణనయేమి? కుమరపు

రాబోయే పద్యానికుంచదలచిన 'ఋషిపర్ణన' అను శీర్షిక లేఖకుని పొరపాటువలన మధ్యస చేరినది. దీనిని తిసివేసి - '—విచ్చిచేరవచ్చు మయూరంబులు గలిగి—' అని చదువుకోవలెను. ఋషివర్ణన - శీర్షిక.

౧౦౨ క్రమేయ (?) ప్రవర్థిత, ఈప్రశ్నార్థకము కవిగా రుంచినదే 'మేదురామోద ముదితాయమాన మానసమానవనికాక్రమేయ (?) ప్రవర్థితపులకంబులై ...తిలకంబులును' ఇదిపాఠము

ఇచ్చట 'క్రమేయ' బదులు 'వనికామేయ' లేదా - 'వనికాక్రమ' అని చేర్చుకున్నచో - ప్రశ్నార్థకమనవసరము. అర్థము కుదురును.

౧౪౨. కుశలప్రశంసాను గుణములుకణములు విధ్వస్తదుర్భవవీచిపీచి—'

కావేరీనదీవర్ణన, పద్యమంతయు లాటానుప్రాసతో చక్కగా గలదు. క్రీగీతభాగము మారినది. అర్థము సరిపడునట్లులేదు. దానిని - 'గుణములు — గుణములు' అనిగాని, 'గణములు — గణములు' అనిగాని సవరించిన - కుదురును.

౧౭౮ మెట్టలుం గిఱుతలబంటి-భక్తివిషయమున చెప్పబడిన చంపకము. (భగవద్భక్తునకు ఎంత ఎత్తైన ప్రాంతమయినను) భవాంబుధినీదుటకు. నీదయ అవసరము - అప్పుడది - చిన్నగా మారును - శ్రమయుండదు అను భావన

మెట్ట - బదులు - 'మిట్ట' అనియు, గిఱుతలబదులు 'గిఱక' అని సవరించుకొనవలెను. మిట్ట యనగా - ఎత్తు, గిఱక = పొట్టి. అప్పుడు - 'మిట్టలంగిఱకలబంటి' అనుకున్నచో - అర్థము సమన్వయ మగును (గిటక = పొట్టి - అందురు. ప్రాసస్థానమున ఈ మార్పు కుదరదు.)

౧౯౬ 'కంళజంఘి మఘ్నచంచత్స్రోతద్వీపవర్యాగ్ర-'శ్రీరంగనాయకస్వామి వర్ణన క్షీరాబ్ధి - ఇచ్చట ముఖ్యము. సంస్కృతములో పెద్దదండకమిది,

దండక మంతయు తగణములతో గలదు. మధ్యన 'కలశజలధి' (నగణములు పడినవి). కుదరదు, దీనిని-

పాథోధిమధ్యస్థ -' లేదా - 'క్షీరాబ్ధిమధ్యస్థ' అని సవరించినచో గణభంగము బాధ తప్పి - అర్థసమన్వయము కాగలదు.

౨౦౩. ద్వేతౌర్థ (?) ఇది కవిగా రుంచిన ప్రశ్నార్థక చిహ్నము.

'మత్ప్రతిభావంబున నీ స్వయంవ్యక్తాదులకుఁ గ్రమంబున ద్వేతౌర్థ (?) పాదయోజనమాత్ర క్షేత్రంబు పరమ పవిత్రంబునై యతిశయిల్లు -' అని - శ్రీరంగనాయకస్వామి తనమాహాత్మ్యాలను - అవతారవిశేషాలను తెల్పుచు - మనుష్యస్థాపితాలైన బింబములరూపాలను చెప్పి - ఆయన వెలసినక్షేత్రాలకు ఎంతదూరమువరకు పవిత్రత గలిగియుండునో వివరించు సందర్భము.

'ద్వేతౌర్థ -' కుదురదు గాబట్టి, 'ద్విత్రిచతుర్థార్ధ' పాదయోజన అని దిద్దుకొనినచో - బాగుండును.

## -: ద్వితీయాశ్వాసము :-

౨౨. నిదాఘవర్ణనమునందు గల ఈపద్యము - ప్రథమపాదమును -

'ప్రాణికి పసువాసఁగు - బడుచు -

నొసఁగు' లేదా తనుపొసఁగు -' అని దిద్దుకున్నచో బాగు, (తనివి - ఒసఁగు, తనుపు - ఒసగు) అట్లే జగ త్ప్రాణపయః పాంటపాంత రంబుల దపకున్' అని మార్పు ('త్రాణ' పడినది అచ్చుపొరపాటు గావచ్చు.)

౬౭. 'తలమూ పులుకక చరింపఁ దరుణీయిచటన్'

వసకేళీ సందర్భమున - ప్రియ ప్రహసగల కందమిది ఎలమావులవలనాయని - అని ప్రారంభము, కవిగారికిపైపద్యపాఠము నకు పుప్పొడి దృష్టంబి - 'తలమూ + ఉలుకక ఈసంధి బాషణికమతవిరుద్ధము' - అని వ్రాసినారు, పీఠికలో - ''తలమావులు

కక" 'యిత్యాదిస్థలములయంచు యడాగమమునకు మాఱుగా ద్రమిళ భాషలో వలె వకారాగమంబు వచ్చుట వ్యాకరణసిద్ధముగాదు",అని తెల్పిరి,'దీనిని తలమా యయులుకక' అని సవరించిన బాగు. కవిగా రెందుకుమార్చలేదో? ('తరమా' అను టకు 'తలమా' అని ప్రయోగము).

ఉ. 'కేలు సాచిన నివ్వగిలు కక్షకాంతులు'—

అని యున్నది, 'నివ్వటిల్లు' అనుటకు - కవి'నివ్వగిల్లు' అని యతి స్థాన మున ప్రయోగించినాడు, 'నివ్వటిల్లు'కు బదులు 'నివ్వగిలు' అనురూపముగలదా? పరిశీలింపవలయును.

'నివ్వటిల్లు' ప్రయోగములు మిక్కిలిగా గలవు.
'నివ్వటిలు జగము లన్నియు
నెవ్వనిచే నమ్ముకుందు నెప్పుడు గొలుతున్' (భార - శాంతి ४ - ౨౧౮
౯౦. 'ఔనఁగొన నంతరంగమునఁ బిమ్మిటిగొంచు రహస్యభాషలన్'

మాఱువేషాలతో వచ్చి రాజు తపోభంగమును చేయలేక బాధపడుచున్న రంభాద్యప్సరసలగూర్చి చెప్పిన సందర్భము.

'పిమ్మిటి' - అర్థము కుదురదు. 'పిమ్మట' - (మనోవ్యధ) అనే పదముం చిన సందర్భమునకు సరిపడును

౨౧౫. పర్విన నవ్వయెయ్యది సమస్తముఁజెప్పుడు నాకు -' అని గలదు దేవతలు విష్ణువును ప్రార్థింవగా ప్రత్యక్షమై - మీమనస్సునందుగల వేదన యేమని ప్రశ్నించు - సందర్భము

('నవ్వ' అనిన బాలకుడు అని అర్థము, ఇచ్చట సరిపడదు)
'నొవ్వ' = (వేదన) అని సవరించుకోవలెను,

'ఇవ్విధమున నిత్యంబును......

నొ వ్వొఱఁగకయుండ బహువినోదపరుండై' (అని - నిర్వచనోత్తర రామాయణము ౯ — ౮౬)

౨౨౪. ప్రతిభాషోదిత సర్వశాస్త్రకలనాపాండిత్య—'

ఆశ్వాసాంతమందలి పద్యము, కృతిభర్తయైన వాగయరామ పండితుని గూర్చి చెప్పినది, అతడు పండితుడని కృత్యాదియందును తెల్పినాడు, 'ప్రతిభాషోదిత' ఏమి ?

ఇది - 'ప్రతిభాశోధిత' కావలయును, 'ప్రతిభచే శోధింపబడిన సర్వశాస్త్రపాండిత్యము గలవాడా' - అనే అర్థము వచ్చును.

## -:తృతీయాశ్వాసము:-

౧౬. ఎదిరిన ఖండింతు ముదము లడఁగ -' ఈ పద్యమున శ్లేషలో దశావతారములు వచ్చును, పై పద్యపాదము పరశురాముని గూర్చి - ఇచ్చట ముదము స్థానమున మదము చేసిన బాగు.

౩౯ తత్ప్రథం బఖిలంబును - ' గలదు. అర్థమగుటలేదు. దీని సవరణ నాయూహ కందలేదు.

౩౦ 'గుణపప్రస్థ పరిమాణంబులైన -' ధాన పరిమాణముల చెప్పు సందర్భము, 'గుణప' కుదురదు. పుణ కాజాలదు. 'ప్రస్థ' అనిన నాలుగు మానికలు కావున - దీనిని 'గుణక' అని భావించవచ్చును. గుణక = లెక్క, ప్రస్థ = నాలుగుమానికలు - నాలుగుమానికలలెక్క యని అర్థమగును.

౮౦ 'మానంబు వెడలి పంప్రిడిలి పికాపికలై -' అని యున్నది. యుద్ధసందర్భము, పంప్రిడిలి - యనుటకు బదులు పంప్రటిలి' అని చేయవచ్చు. ('పంప్రటించు' = పన్నులతో పొడుచు) యుద్ధమున పండ్లతో పెదవులకొరుక్కొని ('ఔడుగరచి') అనుసమన్వయము చేసికొనవచ్చును.

౮౮ '...భుజంగశాయికి సపరాంతంబులగు (?) శ్రీరంగంబు—' ప్రశ్నార్థకము కవిగారిది.

దీనిని 'భుజంగశాయికి నుపాంతంబులగు శ్రీరంగంబు'—అని సవరించు కోవచ్చును.

9)

౧౧౦ మొనయు పడుకు జడుం కనయమును చేపొందున్'— దీని యందు జడుల - స్థానమున 'జడుం' చేర్చిన అర్థ మవగతమగును.

౧౧౦ 'కాయిని చండధరత్వము...

...వారలంబలు

కావింపుడు 'జముఁడు శాస్త్రగాఁ డీయెడకున్—' లకార ప్రాస చివరిపాద మందు 'వి' పడి ప్రాసభంగ మైనది, అప్పటి ముద్రణలో ఇది 'లి' బదులు 'వి' అయినదేమో ! '—పలు కాలింపుడు—' అని యుండవలయును.

౧౮౪ 'కని రాఘూతేశ లత్యుత్కట శకటమషూక ప్రతీకాశకేశిన్',

మహాస్రగ్ధరలో వర్ణింపబడిన పిశాచి, మిక్కిలి నల్లనైన వెంట్రుకలు గలది' అను అర్థము రావలయును, మషూక' అర్థమగుటలేదు, దీనిని - 'శకట మషీకప్రతీకాశ—' అని మార్చినచో - శకటము = బండి, మషీ = నల్లనైన (కందెన) 'బండి చక్రాలకు వేసే కందెననూనె (నల్లగా నుండును) వలె నల్లనైన వెంట్రుకలు గలది'— అనునట్టి అర్థము వచ్చును, కవి యభిప్రాయమేదో ?

## చతుర్థాశ్వాసము

౫౫ '...మహాత్ముని యొండొక్కటఁ గానఁగాఁబడిన నద్భూతాద్భుత స్వాంతులై' ఇది అచ్చుతప్పు గావచ్చు, 'నుద్భూతాద్భుత—' కావలయును ఉద్భూత - అద్భుత - స్వాంతులు అని యగును

౧౩౮ జంబీరామ్ర కపిత్థ తిందుక సలేశా శోభితంబైన—' ఈవృక్షముల మధ్యలో సలేశా చేరినది, ఇది 'పలాశా' కావచ్చు, అప్పుడు - 'జంబీరామ్ర కపిత్థ తిందుక పలాశా శోభితంబైన యీ జంబూకాహ్వయ తీర్థరాజము—' అగును.

౨౨౭ 'క్రొత్త మెఱుఁగు మొత్తంబులు చిత్తగింపం (?) బొరలెత్తిన—' పెద్ద వచనము. మధ్యలో కవిగారి ప్రశ్నార్థకము 'చిత్తగింప' అనిన సరిపడ దని కావచ్చు' లేక - పొరలెత్తిన కదళీకాండమువలె గలతొడలు—' అనుటకు -

'పొరలెత్తుట' బాగుండదనా? ఇచ్చట 'చిత్తగింప'యుటు 'అత్తమిల్ల' (అత్తమిల్లు = వ్యాపించు) అనినను సమన్వయ మగును, ఎత్తు = తెయు అని అర్థము, వచన భాగము—'క్రొత్త మెఱుంగు మొత్తంబు లత్తమిల్లఁ బొరలెత్తిన—' అగును, - 'పొరలు లేచిపోయి నునుపుగానున్న అరటిబోదెవలె నున్నతొడలు—' (రంభోరు) అని యర్థమగును. అప్పుడు ప్రశ్నార్థక చిహ్న మవసరములేదు.

౨౨౪ 'బాపురే మృదుపాద పల్లవంబులయొప్పు
మాయురే! యూరుల సోయగంబు
...................................
ఆరరే! యొప్పారు యూరుల భాగం...
బాగురే! బాహుల చక్కదనము, –

శ్రీరంగనాథస్వామి రూపవైభవమును ఆపాదమస్తకము వర్ణించుపద్యము. కవి వరసగా అవయవాల చెప్పుచు – 'ఊరువులు' రెండు పర్యాయముల చెప్పినాడు, వర్ణనయందు – 'ఉరము' లేదు, దానిబదులు పొరపాటున 'ఊరువులు' వచ్చినవి, ఇది ఉరము' కావలయును.

'అరరె! యొప్పారు నీ యురము సౌభాగ్యంబు' – అని పద్యపాదమును కొద్దిగా మార్చిన 'ఉరము' కన్పడును, (సూర్యరాయ నిఘంటువు 'అరరే' అనుటకు ఇదే ప్రయోగము చూపెను, వారు 'పదమునే' చూచినట్లున్నారు)

౨౭౦ 'తన పగవారిలోఁగొనిన తప్పున కప్పుర (?) నాథుఁడాప్యలన్
బెనుపగు కింక సంకెలలఁ బెట్టిన భీతిగఁ గన్పడిం గనీ
కనముల ముట్టిగిట్టెడును గ్గై పెడి చెంప నమందబృంహిత
ధ్వనులు దలిర్ప నొప్పు మదవారణముల్ జయకారణంబులై

ఇది కవిగారి పాఠము, ప్రశ్నార్థకము వారిదే- భైరవుడు గజవర్ణన చేయు సందర్భమున ఈ పద్యమును చెప్పినాడు, క్రింద గీతలుగల భాగాలు ఎటూ సమన్వయముకాక – పద్యము నాకెంతకూ అర్థముకాలేదు, తోచిన ఊహలతో మిత్రుల సాయమువల్ల పద్యము సవరించిన తరువాత – అర్థము కుదురుచున్నది, (ఇంతకన్న మంచిపాఠము దొరికిన గ్రహింపగలను) విజ్ఞులు పరిశీలించగలరు —

'తన పగవారిలోఁ గొనిన తప్పున కప్పురనాథుఁ డద్రులన్
వెనుపగుకింక సంకెలలఁ బెట్టిన భీతిగఁ గన్కొనిం గవీ
కనుమల బిట్టు గీఱుడిన గైవడి నెందు నమంద బృంహిత
ధ్వనులు దలిర్పనొప్పు మదవారణముల్ జయకారణంబులై'

(దీనియందు ప్రత్యేక పద్ధతిలో ఉన్న అక్షరాల భాగము సవరణ) పర్వతముల గుహలలో భయపడిన సైనికులు దాగుకొనియుండుట ప్రసిద్ధముగదా! ఈ నగర ప్రభువు - సమీపమునగల నగములు తన శత్రువుల కాశ్రయమిచ్చినవను కోపముతో - వాని నన్నిటిని (పర్వతాలను) తెచ్చి సంకెళ్ళువేసి తన పురములో బంధించినాడు, అట్టి యేనుగుల ఘీంకారములు - పర్వతముల గుహలనుండి వినవచ్చు ప్రతిధ్వనివలె గలవు, ఈ విధమైన ఘీంకారములుగల గజములు ఆ పట్టణమందున్న వని కవి భావన.

౨౭౧ జపం, బెనఁగఁగ గాలిమీఱు భువినెన్నికకెక్కిన ఖర్తులాణముల్

గజవర్ణన పూర్తికాగానే అశ్వవర్ణన వచ్చినది, కవి - 'ఖర్తులాణము' అని ప్రయోగించెను.

'కర్తలాణము = తెల్లని గొరిజలును తోఁకయు వెంద్రుకలున్నుగల నల్ల గుఱ్ఱము, అని-సూ-ని,శ, ర సూచించినవి, శివతత్వరత్నాకరమునుండి ఒక సంస్కృతశ్లోకము నిచ్చిరి-'కర్తలాణస్తురంగమః—' అని దాని చివరభాగము, 'కత్తలాని' అనినను-ఇదే అర్థమును శ-ర- సూచించి 'అందలి కత్తలాని గములు'-అచ్చతెనుగురామాయణ ప్రయోగమును చూపెను.

భైరవుడు-కర్తలాణము అని వ్రాయగా తరువాతివా రిట్లుపొరపాటున వ్రాసిరా? లేక-కవియే కావలెనని ఖర్తులాణముల్' ప్రయోగించెనా?

శ్రీనాధుఁడు నైషధమునందు (6 ఆశ్వా 96 పద్యం) తెల్లని యొకకర్తలాణ తేజోహయమున్' అని ప్రయోగించినాడు, (ఈ పద్యము సంస్కృత నైషధము 16 సర్గ 25 శ్లోకాని కనువాదము, ఈ శ్లోకవ్యాఖ్యలో ఏమి గలదో) సంస్కృత నిఘంటువులలో ఈ పదము కన్పడదు, 'ఖత్తులానితేజోహయమున్' అని ఒక తాళపత్ర గ్రంథమున గలదని-సూ,ని,

'కర్తలాణముల్' అని దిద్దినా పద్యము చెడదు, కవి కావలెననియే ప్రయోగించెనో ఏమో ?

౬౭. వైదిక ధర్మంబులెఱుఁగు వఱతలు-' గలదు, వఱత స్థానమున వఱలలు కావలెను, (వఱల=వృద్ధతపస్వి) నిఘంటువులలో వఱలశబ్దము 'అప్రసిద్ధము'గా చూపబడినది.

౭౪. క్షేమంబే మీకును శిష్య

స్తోమమునకు ... ...' ప్రథమ పాదమున గణభంగము, దీనిని 'క్షేమమె మీకును...' అని మార్చిన బాగుగా నుండును.

౮౩. క్రూరుఁడై భూసురకోటికి నెగ్గులు
గావించ వారు తద్గాపలోప
పావకజ్వాలలఁ బరిత ప్తహృదయులై
విసివి యా రాజ్యంబు విడిచి చనిన

జయధరుఁ డను రాజు క్రూరుడై అందరినీ బాధించుచు- భూసుర కోటికి ఎగ్గు సేయగా వారు వెళ్ళిపోయినారు. ఇది సందర్భము. బాగుగానే యున్నది కాని 'తద్గాపలోప' అర్థములేనిది, ఇచ్చట- 'తద్గ్రామలోప' అని యుండవచ్చును బ్రాహ్మణులకు అగ్రహారముగా ఆ గ్రామము కలదేమో ! రాజు బాధలు పెట్టుచుండగా భరింపలేక- బ్రాహ్మణులు వెళ్ళుచు- పరంపరగా అనుభవింపబడుచున్న తద్గ్రామలోపమనే పావకజ్వాలలచేత హృదయ పరితప్తులై వెళ్ళినారని- భావన చేసికొను అవకాశము గలదు 'తద్గ్రామలోప' అనినా కుదురును ఇది 'గ్రామలోప'- అనునంత మంచిగా కన్పట్టదేమో ! (మహమ్మదీయుల దండయాత్రలకు రాచకొండ- దేవరకొండ ప్రాంతాలు ఆనాడు ఇట్లుండినాయేమో)

౯౫. ఇది కంద పద్యము. చివరి పాద మిట్లు గలదు

'చొప్పడ గావించి యుచిత సత్క్రియమునన్' దీనియందు- గణ, యతి భంగములైనవి, ఈ పాదమును- 'చొప్పడ గావించి యునిచె సుందరపీఠిన్'

అనిగాని- 'చొప్పడ గావించి యుచిత శోభనపీఠిన'- అనిగాని దిద్దిన పద్య పాదము సరిగా నుండును.

౧౨౨. 'నిత్యుఁ డక్షరుఁ డాత్మనిశ్చలుఁ డవిరి- స
చ్చిదానంద భాస్వత్స్వరూపి'

పరబ్రహ్మవర్ణనగల పద్యభాగమిది, 'అవిరి' చేరినది అర్థం ? దీనిని 'అయిన' అని సవరించిన-

'నిత్యుఁ డక్షరు, డాత్మనిశ్చలుఁ డయిన-- స
చ్చిదానంద భాస్వత్స్వరూపి-' అగును.

(లేదా- 'అయిన' బదులు- అవిత = (రక్షకుఁడు) అని చేర్చినా కుదురును.)
౧౮౪. 'పారమొప్ప దానిఁ బరియింప శక్రుండు

నాక విపుల పాక కలితుఁ డగుచు-' అని గలదు- ప్రభాకరుఁ డనుముని- వేదమును సక్రమముగా- చదువలేనందుకు దుఃఖ కలితు డయినాడని చెప్పు సందర్భము. ఇచ్చట శక్రుడు చేరినాడు- రెండవ పాదము యతి భంగము వీనితోబాటు అర్థం కుదురదు, దీనిని-

పారమొప్ప దానిఁ బరియింప శక్తుండు

గాక- విపుల శోకకలితుఁ డగుచు-' అని కొద్దిగా మార్చిన- అన్నీ కుదురును. శక్తుడు బదులు ముద్రారాక్షస ప్రభావమున- శక్రుఁడు చేరినట్లున్నాడు. అట్లే క్రింది పాదము

౧౫౩. అవిన బరమేష్ఠి భూసురశ్రేష్ఠున కిట్లనియె'- ఇది వచనము. ప్రభాకరుని కథ లోనిదే, వేదమును- క్షుణ్ణముగా- కంఠపాఠముగా వచ్చునట్లు వరమీయవలసినదిగా బ్రహ్మను కోరుకట్టి సందర్భము. ఈ వచనము ౧౫౨- ౧౫౪ పద్యాల నడుమచేరి అర్థమును సరిపడనీయదు. ఇది,

'అని పరమేష్ఠికి భూసురశ్రేష్ఠుఁ డిట్లనియె'- అని యుండవలయును బాగుంటుంది, సమన్వయమగును.

౨౬౩. భైరవ కవి ఈ యాశ్వాసము చివర చక్ర, నాగ, గోమూత్రికా బంధముల రచించినాడు. ముద్రణ ప్రతిలో (లోగా) ఉన్న విధముగా 'చక్ర బంధము'ను చేర్చినచో కుదురలేదు. రెండుమూడు విధాలుగా ప్రయత్నించినా నిష్ఫలమే అయినది. సమగ్ర ఆంధ్ర సాహిత్యము (6 సం. 255 పుట) నందు ఆరుద్రగారుకూడా చిక్కులు ఎదుర్కొని- మిత్రుల స్సాయంతో సరిగా కుదరగల పాఠము నిచ్చి సచిత్రములుగా ముద్రించిరి వారికి కృతజ్ఞతలు తెలుపుచు- పాఠమును గ్రహించినాను.

<u>పూర్వపాఠము :-</u> 'భావ్యాళీనసురాదిశోవిభవశోభా భద్రభాస్వన్నిభా' గలదు.

<u>సవరించినది :-</u> 'భావ్యాళీనసురాభవాగ్విభవ శోభాభద్రభాస్వన్నిభా' అనిన బంధము కుదురును.

<u>ఇక నాగబంధము-</u> పద్యము సరిగానే గలదు. అప్పకవి పద్ధతి ననుసరించి- తలలో ఒక యక్షరము- తోక చివర నొక యక్షరము. ప్రక్కనున్న పుల యందు రెండు- అడుగు మలుపునందు రెండు- అక్షరాలుంతపలయును- భైరవుని నాగబంధములో మాత్రము తలయందు రెండు, వాలము చివర రెండు- ప్రక్కమలుపులం దొకటొకటి- అనుగున రెండు, అక్షరాలుంచిన కుదురు చున్నది. చక్రబంధమునందు- కవి పేరు, గ్రంథము పేరు వచ్చును ౧ (ఆ యక్షరాలు ప్రత్యేకముగా ముద్రింపబడినవి).

(మరియొక విషయము, నాగబంధము పద్యం చివర 'మంత్రిశేఖరా' గలదనియు, దానిని 'మంత్రిరాఘవా' అని దిద్దిన యెడల సరిపోగలదని ఆరుద్రగారు వ్రాసిరి నాపద్దగల ముద్రితప్రతి (1912) యందు 'మంత్రి రాఘవా' అని గలదు. 'శ్వరా' గాక, 'ఘవా'గాని తోక చివరకు చేరేదేగదా !)

---

౧. చక్రబంధమున- కవిపేరు, కృతిపేరు వచ్చుట ప్రాచీన సంప్రదాయము. (కావ్యాలంకార చూడామణిలో నిట్లే గలదు) అనంతర కవులు కృతినామము బదులు- కృతిపతినామమును చేర్చినారు

గోమూత్రికా బంధము- సరిగానేగలదు.

ఆశ్వాసము చివరలో ప్రాతపారము నొసంగి- బంధాలవద్ద సవరింప బడిన పాఠము నిచ్చినాను.

## భైరవకవి బహుముఖ ప్రజ్ఞ

భైరవుడు తాను భ్రమరా వరప్రసాదలబ్ధమైన సాహిత్యకళ గలవాడనని తెల్పుకొనెను. కవిగజాంకుశము అంకిత మెవ్వరి కిచ్చెనో ? రత్నపరీక్ష ముది గొండ (ఇది కవి నివాస గ్రామము) వీరభద్రున కంకితమిచ్చినాడు. శ్రీరంగ మహత్త్వము చాగయరామునకు అంకితము. తండ్రి- ఈతడు పుట్టిన దాదిశైవులే గదా ! శ్రీరంగమహత్త్వము వైష్ణవము. కవి దీనిని తెనిగించినాడు. అల్లసాని పెద్దనవలె కేవలము బ్రతుకు తెరువుకే ఈ పనిచేసినా దనిపించును. పెద్దనాదులు శఠగోపయతిని తెల్పిరి. భైరవుడు ఎవ్వరిపేరు తెల్పలేదు. కృత్యాదిలోని పద్యాలలో స్ఫురించు శ్రీవైష్ణవ పద్ధతి లోగా వివరించినాను. కవికి శ్రీ వైష్ణవ మతమునం దభినివేశమున్నను- పరిచయముమాత్ర మంతగా లేదనవచ్చును ఈ గ్రంథమున సందర్భానుసారముగా వైష్ణవ సంప్రదాయమును వివరింప వీలున్నను- భైరవుడందుకు పూనుకొనలేదు. కట్టా వరదరాజు తన 10 ఆశ్వా సాల గ్రంథమున శ్రీ వైష్ణవ సంప్రదాయమును వీలయినంతవరకు తెల్పినాడు అందుకు అతడు మొదటినుండి స్వీకృత వైష్ణవు డగుట కారణము

భైరవుని రచనలో చెప్పబడిన అనేక నీతి,ధర్మ,ఉపదేశ విషయములు- వానితోబాటు అటనట శ్రీ వైష్ణవ పద్ధతి గలదు. వానిని తెలిసికొందము

స్వయంవ్యక్తములైన అష్టోత్తర శతదివ్య క్షేత్రములలో ప్రసిద్ధమైనది శ్రీరంగము. ఇచ్చట అర్చనలు పాంచరాత్రాగమోక్త విధానముగా జరుగును. (తిరుపతి సన్నిధిలో వైఖానస పద్ధతి) ఇట్టి స్వయంవ్యక్త స్థానములో కొన్ని సంప్రోక్షణలు అనవసరము- ఈ విషయము- ౨-౧౦౬ లో చెప్పబడినది.

'సకల ధర్మంబులందును సాత్త్వికంబు పరమధర్మం బిది యవలంబించి చరియించు నిర్మలాత్ములు మనోవాక్కాయకర్మంబులఁ బరాత్ములగు నెల్లవారికి గురువులు-...' (౩-౨౬౮) అని తెల్పినాడు, ఇది సాత్త్వికమైన శ్రీ వైష్ణవమున

గల సంప్రధాయము. ఇందు శేషశేషి సంబంధము అర్థాంతరముగా వ్యక్తమగు చున్నది. శ్రీ మద్రామానుజులవారు ఈ విషయముల విశేషముగా తమ శ్రీభాష్యమున ప్రవచించినారు. భైరవుడు- ప్రాయపు ప్రొద్దు పడమటి వాలు సమయమున ఈ పద్ధతిని అనుసరించెనేమో!

ఇట్లే దీనిపైనగల ౨౬౭ పద్యము. ఆచార్య శిష్య సంబంధమును వ్యక్తపరచును, ఆచార్యులవారి సన్నిధియందు అంతేవాసి ఎంతగా క్రమశిక్షణతో నుండవలసినది- తెల్పును, ఇది అతి ప్రాచీనమైన పద్ధతి.

౩-౨౮౫ లో- పురుషోత్తమ భక్తిని చెప్పుచు- చివరలో 'గోప్యం బె నెఱింగించితిన్'- అనినాడు ఈ గోప్యము ద్వయమంత్రము, శ్రీ వైష్ణవులైన వారు, సమాశ్రయణము చేయించుకొనుట తప్పనిసరి, అప్పుడే వారు భాగవతోత్తముల సన్నిధిని- తీర్థప్రసాదముల సేవించుట కర్హులగుదురు. ద్వయ మంత్రోపదేశమును పొందుదురు. శ్రీమద్రామాయణమునకుగల వ్యాఖ్యలందొకటైన రామానుజీయమునందు ద్వయమంత్ర ప్రభావము చెప్పబడినది.

౩-౨౯౫. ఈవచనమున కవి సంగీత-నాద విద్యావిశేషముల వివరముగాపొందు పరచినాడు. వచనము చివరలో '-"సమతాళపదక్రమబంధురంబులగు నా సింధురవరదబిరుదాంకితంబులైన ప్రబంధంబులు పాడదొడంగె నపుడు కర్ణామృతాయమానంబగు గంధర్వరాగంబు నాకర్ణించి" అని వ్రాసినాడు.

దీనిలో సింధురవరదు బిరుదాంకితంబులైన ప్రబంధముల చెప్పెను, ఇచట ఒక సంప్రదాయము గలదు, అది వడహల-తెంగల-పద్ధతి తెలియపరచునది, భగవద్రామానుజులవారు వేద మంతయును దివ్యప్రబంధగతార్థమని- మొదట దివ్యప్రబంధములకు గౌరవ మిచ్చి-యనంతరము వేదమునకు ప్రాముఖ్యము నొసంగిరి. మొదట ప్రబంధము. అనంతరము వేదము-తెంగల పద్ధతి (అర్చన-ఉత్సవాదులలో) మొదట వేదము తరువాత ప్రబంధము-వడహల సంప్రదాయము, మొదటిదానికి రామానుజులవారు రెండవదైన వడహలకు- దేశికులవారు ముఖ్యులు, శ్రీరంగమున ప్రబంధములుపాడుట-చెప్పినాడు. నాటికీ నేటికీఅచ్చట తెంగలపద్ధతియే గలదు,(ఈ దివ్యప్రబంధములు-ఆళ్వారులు పాడినట్టి పాటలు, అవి నాలుగు వేలు గలవు. వానినే నాలాయిరం అందురు. వీనియందు ఎక్కువభాగము తిరుమంగైయాళ్వారులు పాడినవే, తరువాత స్థానమున మధుర

కవిత్వముగల నమ్మాళ్వారులరచన) రాయలు ఆముక్తమాల్యదలో 'నాగేంద్ర శయాను పుణ్యకథలుం దివ్య ప్రబంధాను సంధానధ్యానము-' అని నాడు, మొదట వేదము-తరువాత ప్రబంధము వీరిపద్ధతి-ఇది వడహాలసంప్రదాయము.

ప్రబంధములను గంధర్వరాగమున పాడినారట. ద్రావిడ ప్రబంధము రాగయుక్తముగా చదివిన-కర్ణామృతముగా నుండును, అందుకే భైరవకవి యీ వచనమునందు సంప్రదాయమును తెల్పినాడు.

४-౨౩౭ వచనమున-'పాంచరాత్రాగమ ప్రపంచిత విధానంబున-' అర్చన చేసినట్లు తెల్పెను, శ్రీరంగము పాంచరాత్ర పద్ధతికి చెందినదని ముందే తెల్పియుంటిని, ఈ పద్ధతిని బహుళప్రచార మొనర్చినది రామానుజులవారే గదా! వారు శ్రీరంగమునే సర్వస్వముగా భావించినారు, పెరియనంబియైన మహాపూర్ణుల వారు రామానుజులకు మూలమంత్ర ముపదేశించినారు, రామానుజులవారు అంద రకు తెలియునట్లు గోపుర మెక్కి అష్టాక్షరీమంత్రము నుపదేశించిరి-వారెక్కినది 'దామోదర గోపురము', ఇట్టి రామానుజులవారు శ్రీరంగమున సంప్రదాయ భంగము కానీయలేదు. పాంచరాత్రాగమోక్తవిధాన నిత్యార్చనలు-ఉత్సవాలు స్వామివారికి జరుగును.

ఈ విధముగా గ్రంథమున అటనట కవి విశిష్టాద్వైత పద్ధతిని తెల్పినాడు, అదియును స్వల్పమే.

భైరవునకు, వేదాంతము, నీతి, ధర్మశాస్త్రములు-మిక్కిలి యిష్టములు గావచ్చు, వీలయినపుడెల్ల వీనిని తెలిపినాడు.

౩ ఆశ్వాసమున-౧౮,౧౯ పద్యాలు 'యక్షప్రశ్న'ల పద్ధతిలో గలవు, మరల వీనికి సమాధానములు-౨౭-౩౧ పద్యములందున్నవి, అట్లే ౯౬,౧౦౬, ౧౮౯, ౨౬౦, ౨౬౧-చక్కని నీతిశాస్త్రమును దెల్పు పద్యములు, ఇట్టిదే ४-౧౨౦.

విగ్రహారాధనపద్ధతి-వానిని స్థాపించు దివ్యదేశములు-అవి వానిని గూర్చి ४-౧౨౬ లో గలదు, ఈ యాశ్వాసమునందే ౧౬౩, ౧౭౦ లో కర్మ సిద్ధాంత మును దెల్పినాడు.

దాన పద్ధతులు-యోగ్యాయోగ్యతలు-వాని ప్రత్యేకతలను-ఈయాశ్వాసము-౨౦౭ నుండి ౨౧౦ వరకు తెల్పెను, మరియు నీతికి సంబంధించి-౫-౨౨౬-౨౩౧ పద్యాలలోని పక్షికథ. భారతమున (ఆది పర్వము) జరితారి కథను స్ఫురింపచేయును, ఇవియేగాక-చంద్రపుష్కరిణి ఏయే సమయాలలో పేట్లుమారునో ! దానికి ప్రజలపాపకర్మ లెంతవరకు ముఖ్యములో వివరించుటే గాక-యుగధర్మములను-ఇతరములను తెల్పినాడు

వీనితోబాటు అటనట చక్కని సూక్తులు-కొన్ని సామెతలు-జాతీయముల ప్రయోగించెను. వానిలోకొన్ని.

2-94 వెలిపింపవచ్చివెలిచిన తెలుగు.
5-26 మే లొందగూడుచోట దుర్వారములైన విఘ్నములు వచ్చునసేకము

(శ్రేయాంసి బహువిఘ్నాని)

"-29 'నివాతదేశ సంభావితదీపభాతి'
"-66 నాపుత్రాణాం పరలోకస్థితిః'
"-135 'నియతిః కేన నలంఘ్యతే'
కొఱవిం దలగోకుకొనుట.

5-178 మూడేండ్లకులేని బుద్ధిముప్పదియేండ్లన్-' ఇట్టి సామెతలు-పలుకుబళ్లు-(తక్కువగానే) ఇతనిరచనలో కలవు.

శ్రీరంగమహత్వము అనువాద రచనయైనను కవి మధ్య మధ్య తన సంస్కృత పాండిత్యము ప్రదర్శించినాడు ఏకాదశీమాహాత్మ్యమును చెప్పుచు,

ఏకాదశ్యాం మహం కించిదనశ్నన్ పురుషోత్తమ
భోక్ష్యేఽహ్యాని పరేశ్రీమన్ పాహిమాం శరణాగతం (౫-౧౦౮)

అనినాడు, (ఈ ఏకాదశిని గూర్చే విరోధాభాసలో ఒక చక్కని శ్లోకము ప్రచారమున గలదు-అది.

ఏకాదశ్యామహోరాత్రం కర్తవ్యం భోజనద్వయమ్
రాత్రౌ జాగరణం కుర్యాత్ దివాచ హరికీర్తనమ్.
(భో! జన, ద్వయంకర్తవ్యమ్. ఏకాదశ్యాం, అని, భావన)

3-215 లోని సర్వలఘుగద్య, 5-221 లోని సరస్వతిని గూర్చిన దండకము-ఇతనికి గల సంస్కృత భాషాప్రౌఢత్వమును వ్యక్తపరచునట్టివి.
ఈ విధముగా-అనేక విషయములందు భైరవ కవి తన ప్రజ్ఞను ప్రకటించినాడు, కావుననే అనంతరు లితనిని పేర్కొనిరి.

భైరవుని పేర్కొనినవారు

ఇతని శ్రీరంగమహత్త్వమును లాక్షణికులు-సంధాతగ్రంధకర్తలు చదివినారనుటకు-వారు పేర్కొనిన పద్యములే నిదర్శనము, లాక్షణికులలో-అప్పకవి, ముద్దరాజు రామన, గణపవరపు వేంకటకవి, కఋవె వీరభూపాలుడు, ఇతని పద్యముల నుదాహరించిరి

ప్రబంధరత్నావళి, ప్రబంధమణి భూషణములందును శ్రీరంగమహత్త్వ పద్యములు గలవు

ప్రబంధరత్నావళిలో-హేమంతమున కితనిపద్య ముదాహరింపబడినది
ఇగముచే నంబరంబెల్ల నిమురుకొనఁగ. శ్రీరంగ 2-34

('హిమముచే' అని ప్రస్తుతపాఠము)

ఈ పద్యము క్రింద 'పోతరాజు భైరవుని శ్రీరంగమాహాత్మ్యములోనిది' అని గలదు. ఇతని యింటిపేరు పోతరాజువారని ఎట్లు గుర్తు ?

ప్రబంధమణిభూషణమునందు-తత్ గ్రంధ సంధాత-శ్రీనాధుని శృంగార నైషధము తరువాత-శ్రీరంగమహత్త్వము పద్యములనే ఎక్కువగా పేర్కొనెను, ద్వితీయాశ్వాసమునగల ఋతువర్ణన పద్యములలో 24 టిని పేర్కొనినాడు. చతుర్థాశ్వాసమునుండి, 3 పద్యముల గ్రహించినాడు, (ద్వితీయాశ్వాసములో ౨౧, ౨౪,౨౬,౨౮. ౩౦,౩౧,౩౨,౩౩,౩౫,౩౬,౩౯, ౦,౪౧,౪౩,౪౪,౪౬, ౪౮,౪౯,౫౦,౬౨,౬౬,౮౧-౮౩,౮౫ సంఖ్యగల పద్యాలు, చతుర్థాశ్వా

సములో-౨౮౯,౨౭౦,౨౭౩, సంఖ్యగల పద్యములు) అనగా 27 పద్యములిందలివి గలవు, ప్రబంధమణిభూషణము ప్రథమ ముద్రణలో (1910) కవిగారు ఈ పద్యముల నెంబ ర్లుదాహరించిరి (ప్రబంధమణిభూషణము సంఖ్య) వానిలో ౨౩౩ చేరలేదు. ఇది ప్రస్తుత శ్రీరంగమహత్వమున. ౨-౩౦ పద్యము (దీనినే అప్పకవి యుదాహరించెను) నిడుదవోలువారి పరిష్కరణతో వెల్వడిన ప్రబంధమణిభూషణము (1971) నందు-శ్రీరంగమహత్వములోని పద్యముల జాబితా-సంఖ్య (పీఠిక. 74-75 పుటలు) నిచ్చిరి. వారు ౨౩౩ చేర్పటమేగాక-145,226, సంఖ్యలుకూడా-ఇతని పద్యాలుగా గుర్తుపెట్టిరి-కాని ఆ పద్యములు భైరవుని రచనలోనివి గావు. వీరుభయులూ గుర్తుపెట్టని పద్యములు రెండు నా పరిశీలనలో లభించినవి-వాని సంఖ్యలు 243, 244 (౨-౪౩-౪౮) ఇక లాక్షణికాగ్రణియైన యప్పకవి-తనగ్రంథ మందు. శ్రీరంగలోని-ద్వితీయాశ్వాస ములో ౩౦,౧౪౨ సంఖ్యలుగల పద్యాల నుదాహరించెను,

అని-పెఱయతి'- 'ఆగమము రానందులకు శ్రీరంగమహత్వమునుండి'
గందపు గొండనెత్తముల ... ...' ౨-౩౦.
'ముకారయతులు' చెప్పునప్పుడు.
పరిచరుఁగాఁగ నేలె నిరపాయచరిత్రుని ... ...' ౨-౧౪౨.

(అప్పకవీయమున ఈపద్యాలు 74, 84 సంఖ్యలుగా 3ఆశ్వాసమునగలవు ఆ కులవృత్తి రాఘవు శరాగ్రమునందు ...' పద్యము శ్రీరంగమహత్వములోనిదనిలాక్షణికు లుదాహరించిరిగాని, అది భోజరాజవిభూషణము అనుగ్రంథమున గలదని, కవిగారే తెల్పిరి, సకలనీతిసమ్మతములో ఇది 22 నెం. పద్యము (1970 ము) ఇది-ఆంధ్రభోజుని నీతిపద్యాలలో ఒకటి (వివరాలకు-సమగ్రఆంధ్రసాహిత్యం. 2 సం. 185 పుట చూడవచ్చు).

ఈవిధముగా భైరవునికవిత పలువురిచే అంగీకరింపబడినది.
అందుకు-అతని ప్రౌఢశైలి, వర్ణనావైశిష్ట్యములు ముఖ్యములు......

భైరవకవి కవిత్వశైలి యిట్టిగలదని ప్రత్యేకముగా నేను తెల్పుటకన్న ఈ విషయమై మానవల్లివారు వ్రాసినవిషయము నుదాహరించుట సమంజస మనుకొందును ... ...

"ఇతని శ్రీరంగమహత్వ్యమును లాక్షణికు లందఱుఁ జదివియున్న ట్లుదాహృతపద్యములే ఘోషించుచున్నవి, ఈకృతి మనోహరమై శైలీపాటవముగలదై 'దుష్కరకవిఘోరపిశాచముల' నదల్చునట్లున్నది, భైరవునిపదబంధము ప్రౌఢమై యొక్కొకయెడ శ్రీనాధపెద్దనలఁ దలపించుచున్నది.......

అతఁడు (కట్టావరదరాజు) దీనిని పదియాశ్వాసములలో మనోహరముగా దెనిగించెను. అయ్యది మృదుపదవిన్యాసమై వైదర్భీరీతి నెలకొనుచున్నది. వీరిరువురు మూలమును కొఱవడనీయక రసపోషణకై యచ్చటచ్చట వర్ణనలఁ జేర్చుచు తమవిద్యావిలాసమును నెలకొల్పిరిగాని - యఖండమహాప్రవాహిని యగు భైరవునిశైలికి - సుకుమారపదబంధములు గల వరదునికవిత యాకాశగంగకును సమతలప్రవాహినియగు కావేరికిఁగల యంతరమేజూపుచున్నది, భైరవుఁడువేదాన్తశాస్త్రమున జక్కఁగా పరిశ్రమించినట్లు తద్గ్రంధపరనము వలన దెలియుచున్నది-"

దీనితరువాత వరదరాజుగ్రంధమునుండి కొన్నిపద్యము లుదాహరించినారు. అవి సంగీతవర్ణనగలవి, భైరవునిరచనయందు - అవి ౩-౨౯౪ పద్యమునుండి ఆసందర్భమునకు తగినవి. విస్తరభీతికి - భైరవ - వరదరాజ కృతులపద్యములు - వానితారతమ్యముల నీయలేదు.

పాంచరాత్రము - విష్ణుపంచాయుధముల దృష్టిలో నుంచుకొని
భైరవుడు పంచమాశ్వాసపరిమితరచన చేసెనేమో !
దశావతారదృష్టితో వరదరాజు ౧౦ ఆశ్వాసాలు వ్రాయవచ్చు-

## మరికొన్ని శ్రీరంగమాహాత్మ్యములు

మనకు లభించిన శ్రీరంగమాహాత్మ్య గ్రంధములలో - భైరవుని రచనయే మొదటిది. ఇతనికి ముందు అనగా - కీ. శ 1415 ప్రాంతముననున్న శ్రీగిరి కవి శ్రీరంగమహాత్త్వమును వ్రాసెనటగాని అది లభింపలేదు.౧ ఇతడు పద్య

౧ ప్రబంధరత్నావళి (1976ము) యందు దీతని శ్రీరంగమహత్వమందలివని నాల్గు పద్యము లుదాహరింపబడినవి. (97 - 98పుటలు) సకలనీతిసమ్మతము నందు - శ్రీగిరీశశతకపద్యా లుదాహరింపబడినవి, రంగనాధుడే శైవుడై ఈశతకమును వ్రాసినాడని అతడే శ్రీగిరియనుపేరుగలవాడని. బండారు తమ్మయగారి అభిప్రాయము (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం ౩౬. సం ౪, ౨౬ పుట)

రూపముగా వ్రాసిన నవనాథ చరిత్రనే గౌరన ద్విపద చేసినట్లు నవనాథ చరిత్రలో గలదు - ఈ రెండేగాక శ్రీగిరీశ శతకమును వ్రాసినాడట.

బైరవుని రచన తర్వాత-శ్రీరంగమహత్వములు—పద్య, ద్విపద, వచన రూపములుగా వచ్చినవి. ఆయారచయితలపేరు—వారి గ్రంధవిభాగము— దొరికి నంతవరకు ముద్రణవత్సరముల నిచ్చుచున్నాను,(వీరియందు కొందరు బ్రహ్మాండ పురాణము ననుసరించి—మరికొందరు గారుడము ననుసరించి వ్రాసినారు ) వీని యాకరములను గూడా పేర్కొనుచున్నాను.

| | కవి— | కాలము | గ్రంధవిభాగము— | ముద్రణ |
|---|---|---|---|---|
| ౧ | శ్రీగిరికవి | 1315. | పద్యము— | - |
| ౨ | కట్టావరదరాజు | 1600—1650 | పద్యము. | 1921 |
| ౩ | కస్తూరిరంగయ్య | - | పద్యము | - |
| ౪ | పులిపాకరామన్న | - | వచనము | - |
| ౫ | వెల్లనరసింహాచార్యులు | - | — | 1878 |
| ౬ | సరస్వతి వెంకటసుబ్బ రాయశాస్త్రి | — | — | 1913 |
| ౭ | శ్రీరంగనాధుడు | - | - | 1874 |
| ౮ | కర్తృత్వముతెలియనిది | - | వచనము | 1914 |
| ౯ | ,, ,, | - | ,, | 1966 |
| ౧౦ | ,, ,, | - | పద్యము. | 1930 |
| ౧౧ | వరమలనరసామాత్యుడు | ? | ............కందపద్యములు. | |

## -: అముద్రితములు :-

| | | | |
|---|---|---|---|
| ౧. | చేకూరిసిద్ధకవి | - | పద్యము |
| ౨ | విజయరంగచొక్కనాధుడు | 1706-1732 | వచనము |
| ౩ | ముకుందయోగి | - | ద్విపద |
| ౪ | రాజగోపాలము | - | పద్యము |
| ౫ | గుంటుపల్లిజగన్నాథకవి | - | ,, |
| ౬ | యామునాం వెంకటశాస్త్రి | - | ,, |
| ౭ | కర్తృత్వముతెలియనిది | - | ద్విపద |

౮ భాగవతులరామయ్య — ద్విపద

౯ వంగీపురంవెంకటరామానుజాచార్యులు- — తారావళి

౧౦ మరియొకటి ఎవరిదో ? — గేయము

ముద్రితముల పట్టిక వివరములు - ౧-౨ల గూర్చిముందు తెల్పబడినది. ౩-౫-౬-౭-౮ సంఖ్యలు-ఆంధ్రవాఙ్మయసూచికలోనివి,౯.౧౦.సంఖ్యలు నావద్ద గలవి, ౧౧, కవిగారి శ్రీరంగమహత్వముపీఠికలో పేర్కొనిరి

అముద్రితాలగూర్చి - ౧ ౪, ఆంధ్రవాఙ్మయసూచిక, ౨ - దక్షిణ దేశీయాంధ్రవాఙ్మయము - నిడుదవోలువారు. (1960ము) 330 - 332 పుటలు, దీనినుండిపుచ్చునకు కొంతవచన ముదాహరించిరి. ముద్రితమా ? కాదా ? తెల్పలేదు, ౩ ౫ ౭.౮. డా॥ జి. నాగయ్యగారి 'ద్విపదవాఙ్మయము'. 253 - 255 పుటలు, ౬. కృష్ణదేవరాయభాషానిలయమువారి గ్రంథముల పట్టిక. 1925, 24 పుట. ౯.౧౦ డా. బి. రామరాజుగారి - తెలుగుజానపద గేయసాహిత్యము (1978ము 378 పు)

వీరేగాక, శ్రీరంగమహత్వముల ? గారుడము తెనుగుచేసినవారుగా చెన్నమల్లు, పింగళిసూరన, మరింగంటిరంగరాచార్యులు గలరు, నాయీ పరిశీలనలో తప్పినవారెవరైన గలరేమో ?

ఈగ్రంథములు వ్రాసినవారేగాక - తమగ్రంథములలో శ్రీరంగప్రస్తావన - వర్ణనచేసినవారుగలరు, వారిలో

శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద ప్రసిద్ధమైనది ఇది గోదాదేవి శ్రీరంగనాథులకథ - కేంద్రము - శ్రీరంగమే

౧౩౨౦ ప్రాంతమువాడైన కృష్ణమాచార్యులు 'శ్రీరంగనాథవచనాలు' వ్రాసినాడు. అంతేగాక - సింహగిరివచనాలలో శ్రీరంగముగలదు - ఈయన అచటనే పరమపదించినాడని పరిశోధకులభావన. సంకుసాలనరసింహకవి - కవికర్ణరసాయనము శ్రీరంగనాథునకు అంకిత మీయనైనది, శ్రీరంగనాథదివ్యావతారవైభవము ప్రథమాశ్వాసమునందు - 30 పద్యమునుండి 91 వరకు వర్ణింపబడినది.

కళాపూర్ణోదయమునందు వీణాధరుని తీర్థసందర్శనములలో శ్రీరంగం కలదు,

వసుచరిత్రము ౧-౩౬సంమ శ్రీరంగనాయకస్వామికి కృతిభర్తకు అభేదప్రతిపత్తి చెప్పబడినది.

రఘునాథరాయలవాల్మీకి చరిత్ర 2-24 నుంచి 33 వరకు స్వామివారి వర్ణన గలదు.

విజయవిలాసములో 'శ్రీరంగేశుఁడె వచ్చియమ్మతథచరిత్రీకర్తయై'.

ఇత్యాదిపద్యము ఈవిషయమునే తెల్పును ఎందుకనగా, చెవ్వనృపతి పుత్రుడు అచ్యుతప్పనాయకుడు (1580 - 1600) శ్రీరంగపతికి సింహాసనము. పసిడిసెజ్జ, అష్టమప్రాకారము - గోపురము సమకూర్చి రత్నాంగదకిరీటము, అభయహస్తము - ప్రదానము చేసెను, ఈయన చివరిదినాలలో రఘునాథునకు రాజ్యమప్పగించి శ్రీరంగమునందే గడపినాడు. అందుకే చేమకూరవెంకన్న - పైపద్యమును వ్రాసినాడు.

ఇంతను 108 దివ్యతిరుపతుల వర్ణించిన - గణపవరపువేంకటకవి - ప్రబంధరాజమునందును, అయ్యలరాజు నారాయణామాత్యుని 'హంసవింశతి' లోను శ్రీరంగప్రస్తావన చేయబడినది.

తాళ్ళపాకవారి పరమయోగివిలాసమున శ్రీరంగనాథవైభవము వర్ణింపబడెను, తొండరడిప్పొడియాళ్వారు (భక్తాంఘ్రిరేణువు) నైన విప్రనారాయణుని చరిత్రం (మరియొకటిఇదేకథగలది - వైజయంతీవిలాసము) - జరుగుటకు కారణము శ్రీరంనాథుడేగదా ' ఇట్లు ఎందరోతమరచనలయందు స్వామివారిని వర్ణించి - తమభక్తిప్రపత్తుల వెల్లడించినారు,

---

౧ మహబూబ్‌నగరంజిల్లా కొల్లాపురంతాలూకాలోగల. ఎట్టూరినరసింహకవి - యక్షగానముగా - 'విప్రనారాయణచరిత్ర' వ్రాసినాడు. చక్కనిశైలి, దీనియందు శ్రీరంగనాయకస్వామివర్ణన ఎక్కువగా గలదు, దీని తాళపత్ర ప్రతి. మిత్రులు - కపిలవాయిలింగమూర్తిగారివద్దగలదు, నేటివరకు యక్షగానవాఙ్మయపరిశోధకులదృష్టికిరాని గ్రంథములలో నిదియొకటి, ఇట్టివి శతాధికముగా మహబూబ్‌నగరంజిల్లాలోగలవు.

కవిగారినిగూర్చి స్వల్పపరిచయముచేసితిని, ప్రథమముద్రణచేయించి వది వారేగదా! ఇది శ్రీరంగక్షేత్రకథగావున కొద్దిగా-శ్రీరంగమునుగూర్చి వ్రాసినాను, గౌరన-భైరవులు-రాచకొండ సంస్థానమువారు-అందుకే ఆ సంస్థాన సాహిత్యమును కొలదిగా తడవినాను.

వీలయినంతవరకు-కవినిగూర్చి-గ్రంథమునుగూర్చి వివరించినాను, నా యజ్ఞతవల్ల ఏమేనిపొరపాట్లు కలుగవచ్చు, సహృదయులు వానిని వెల్లడించిన కృతజ్ఞతాపూర్వకముగా గ్రహింతును.

గౌరన-భైరవులది-'ముదిగొండ' గ్రామమేయని-ఆప్రాంత మండలి మిత్రులు తెల్పుచున్నారు, మరికొన్ని ఆధారములసేకరించి ఈ విషయమై సాహిత్యలోకమునకు తెలియపరచగలను.

పీఠిక సంగ్రహముగానే యుండవలెనని యత్నించితిని. కాని విషయ వివరణవలన-'కథా సంగ్రహము' శీర్షికవలన-ఎక్కువగానేయైనది, ఓపికతో దీనిని చదివిన-నేనేమైన విశేషముల తెల్పినది అవగాహన మగును.

ఆంధ్రప్రదేశసాహిత్య ఎకాడమీవారు-ప్రాచీనరచనల మరల వెలుగులోనికి తెచ్చుసద్భావనతో ప్రచురించిన గ్రంథములలో నిదియొకటి-ఇంతకుపూర్వము-ప్రబంధమణిభూషణము, సకలనీతిసమ్మతము లను (ప్రథమముద్రణకవిగారిదే) పరిశోధనాపరమేశ్వరుల పీఠికలతో వేసినారు, వీనితోబాటు 'మానవల్లికవి-రచనలు'-గ్రంథరూపమున వచ్చుటకు-ఎకాడమీయే కారణము.

శ్రీరంగమహత్త్వమువలెనే-కవిగారు ఆనాడు ప్రచురించిన గ్రంథము లన్నియు-పునర్ముద్రణ కావలెనని ఆశించుచున్నాను, ఈ గ్రంథ సంపాదకత్వ బాధ్యత నాకొసంగి-ఈ మాత్రము కృషిచేయునవకాశము గల్పించిన సాహిత్య ఎకాడమీ కార్యవర్గమునకు-కార్యదర్శి-డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి-మిక్కిలి కృతజ్ఞుడను, నా కీసందర్భమునం దుపయోగపడిన గ్రంథములు-వ్యాసములు గలవు-ఆయారచయితలకు ధన్యవాదములు

పరిష్కరణ సందర్భమున-నాకు సహకరించి-మిక్కిలి ఓపికతో అనేక ముఖ్యైన విషయముల తెలిపిన-ఆత్మీయులు-శ్రీకపిలవాయి లింగమూర్తిగారికి-

కృతజ్ఞతల తెల్పుకొనుచున్నాను, ఇందలి సూచికలను-సిద్ధముచేసి యిచ్చిన-వర్ధిష్ణువులగు విద్యార్థులు-చి॥ వెలుదండ నిత్యానందరావు, పొనుగోటి అర్జునరావు నకు-మంగళాశాసనములు.

"ఎవరుఁ జీ కథా పఠన మెప్పుడు సేయునతండు పాపసం
తానముఁ బాసి శాశ్వతపదంబు చనుం బితృదత్త మక్షయ
శ్రీనొనరించు నత్తఱివసింప నృపాదులు సార్వభౌమతా
మానధనాఢ్యతా సుఖసమున్నతులన్ విలసింతు రెంతయున్."

పాలెం, మహబూబు నగరం జిల్లా
సిద్ధార్థి - ఆశ్వయుజము —శ్రీరంగాచార్య.
సోమవారం, 24-9-1979



# శ్రీ రంగ మహాత్త్వము

## ప్రథమాశ్వాసము

శ్రీమన్మూర్తిరుచుల్ తటిద్ద్యుతి ఘనశ్రీ నాదరింపన్, గర
సీమన్ వామకరంబు సొంపు వలచే రక్షోపథానంబుగా
రామం బైన ఫణీంద్రతల్పమున శ్రీరంగధాముం డాప్రక
క్షేమ స్థేమ మెసఁగన్ సుఖించుహరిఁ బూజింతున్ దయాంభోనిధిన్, ౧

మ. శయనంబై - యుపధానమై - నిలయమై - సచ్ఛత్రమై - పాదుకా
ద్వయమై - మంగళ పీఠమై - మృదుల వస్త్రంబై - సమస్తోచిత
క్రియలం జక్రికి నిత్య సన్నిహిత మూర్తిం బొల్చుశేషాహి న
క్షయమేధానిధిఁ గావ్య లక్షణ కళాచార్యున్ బ్రశంసించెదన్ ౨

ఉ. ఆయతచండతుండనిహతాహినికాయునిఁ, దప్తహాటక
చ్ఛాయుని, సర్వవేదమయసన్నుతకాయుని, దేవదానవా
జేయుని, నప్రమేయుని, నశేష విహంగమరాజ్యాధిపత్య ధౌ
రేయునిఁ బ్రస్తుతింతు సుచరిత్రవిధేయుని వైనతేయునిన్ ౩

క. శ్రీరమణచరణసేవా
చారనిరూఢావధాను - సత్కీర్తిజయ
శ్రీరాజమాను, దానవ
వీరఖగ శ్యేనుఁ దలతు విష్వక్సేనున్ ౪

మ. వినుతింతున్ హరిభక్తి పెంపున జగద్విఖ్యాతులై - పుణ్యకీ
ర్తను లైనట్టి పరాశరుం - గపిలు - వేదవ్యాసు - బ్రహ్లాదు - న
ర్జును, రుక్మాంగదు, నంబరీషుని, వసిష్ఠున్, బుండరీకున్, మరు
త్తనయున్, భీష్ము, విభీషణున్, సురమునిం, దాల్భ్యున్, శుకున్, శౌనకున్ ౫

వ. అని సపరిచ్ఛదంబుగా నభీష్టదేవతాభివందనం బొనర్చి ౬

తే. అఖిల భువనైక పావనం బగుచు శ్రవణ
మంగళం బైన రఘునాథ మహిత చరిత
మసమవాక్ప్రౌఢి విరచించె నట్టియాద్య
సుకవిశేఖరుఁ బ్రాచేతసుని భజించి. ౭

చ. లలితకవిత్వరేఖ సఫలత్వము నొందఁ. నశేషకిల్బిషం
బులఁ దొలఁగించి, నిత్యసుఖమూలములై, హరిభక్తిదంబులై
వెలయు పురాణ సత్కథలు వేడ్క రచించి- జగత్ప్రసిద్ధులై
పొలుచు మహాత్ములన్ - సుకవిపుంగవులం- బ్రణుతించి వేండియున్ ౮

క. రహి నిక్కిన కవితలఁ దహ
తహఁ జొక్కిన నృపులచేతఁ దగ సత్కృతులై
మహిఁదక్కిన కళలందును
వహి నెక్కిన కవుల నేఁటివారలఁ బ్రీతిన్ ౯

క. నుతిసేసి వారికరుణను
శతముఖములఁ బరిఢవించు సాహిత్యకళా
ప్రతిభా సంపద పెంపునఁ
జతురుఁడ నగునేను హృదయజలజములోనన్ ౧౦

క. సుతుఁడును గృతియును దేవా
యతనము నల్లిల్లుఁ జెఱువు నారామము నా
ర్జిత ధన నిక్షేపము నన
సతతము ధరఁ బరఁగు సప్తసంతతు లందున్ ౧౧

క. కలుగు ధన మఖిలదిశలను,
వెలుఁగు యశం, బతిశయించు విద్యలు ప్రీతిం
జెలఁగు సుధీతతి యెడనెడ
దలఁగు శివేతరచయంబు దగుకృతిఁ జెప్పన్. ౧౨

వ. అదియును. ౧౩

సీ. శబ్దార్థరూఢి రసస్థితి బహువిధ
వ్యంగ్యభేదములు భావములు గతులు,
శయ్య లలంకార సరణులు రీతులుఁ
బరిపాకములు దశప్రాణములును,
వృత్తులు వస్తువివేకంబు గుణములుఁ
గవి సమయముఁ జమత్కారములును,
వర్ణనంబులు గణవర్ణ ఫలంబులుఁ
దత్కాలంబులు నధిదైవతములు

తే. గ్రహములును శత్రుమిత్రయోగములు దశలు
నంశవేధయు భూత బీజాక్షరములు
పొత్తువులుఁ దెల్పి శాంతవిస్ఫురణఁ బరగు
సత్కవీంద్రుని కృతి బుధసభల వెలయు, ౧౪

వ. అట్టిమహాకావ్య సముదయంబునందు. ౧౫

క. లోకోత్తర గుణపుణ్య
శ్లోకకథామధురిమ ధురశుభవాఙ్మయపరి
త్యాకల్పం బగుకావ్యం
బాకల్పంబగుఁ, గృతార్థుఁ డగుఁ గవివరుఁడున్ ౧౬

వ. కావున భువనైక కథా సంబంధ బంధురంబుగా నొక్క ప్రబంధంబు రచియింప వలయునని వితర్కించు సమయంబున, నతిప్రసన్న వదనుండును, నాకార విజితమదనుండును, ననుపమగుణ భూషణుండును, నతిమధుర ప్రియభాషణుండును, నవికృతవేషుండును, నపగత దోషుండును, సకలంకమణి కుండల మరీచి మంజరీ రంజిత గండమండలుండునునై, ప్రతాప సమగ్రుండై, రాజశేఖరుండయ్యును - గృతలక్ష్మీ పరిగ్రహుండై, రాజీవాక్షుండయ్యును - దుర్గాధీశుండై, పద్మినీ వల్లభుండయ్యును - గువలయానందకరుండై, కళానిధియయ్యును - నిత్యప్రవర్ధమానుండును, వజ్రధరుండయ్యును - గోత్రవిరోధిగాక, ససమాంబకుండయ్యు ననంగుండుగాక, భోగీంద్రుండయ్యుఁ - గుటిల ప్రచారి గాక, భీమసేనుం

డయ్యు - దుశ్శాసనాభిముఖుండు గాక, విజయుండయ్యు గర్ణకంటకుండు గాక, నారాయణుండుఁబోలె నరప్రియుండును, నదీనాయకుండుఁబోలె ఘనసత్వ సమగ్రుండును, నాకేశ శైలంబునుంబోలె సువర్ణకటకోజ్జ్వలుండునునై యనురాగిలుచుఁ జాగయామాత్యసాగర సంపూర్ణ సుధాకరుం డగురాఘవ మంత్రిశేఖరుం డొక్క దివసంబున, నవసర సఘుస్మృణ మల యజాభిషిక్త ప్రదేశంబును,సద్యస్సమర్పిత బహురూప ధూప ధూమగంధాను బంధిగంధవహవాసి తాశావ కాశంబును. విలంబిత కుసుమమాలికా విసరపరిమళ విలోలరోలంబ ఝుంకార ముఖరితంబును, ప్రభాత ప్రభాకర బింబవిడంబిత జాంబూనదశిఖర రాజి విరాజితంబును, ముక్తాఫల ముకురతల విమలభిత్తి చిత్రిత హరిలీలావతార విహారంబును, నై వెలయు సభాగారంబున—నశేషనయ విద్యావిశేష స్వతంత్రులగు మంత్రులును, సకలకర్మ ప్రయోగ చాతురీ మహితులగు పురోహితులును, అవక్ర బలపరాక్రమవంతు లగుసామంతులును, అసమ సంగ్రామ రంహవిహార వీరావేశ సముద్వృత్తు లగు బిరుదరాహుత్తులును, బహువిధ నాటకాభినయ పాటవసముద్భటు లగు నటులును, శ్రుతి సంధాయక గాన విద్యా సుసంధాయకు లగుగాయకులును, సచమత్కారకారణ గుణాను బంధ బంధుర ప్రబంధ రచనానిస్తంద్రు లగుకవీంద్రులును, నిజశేముషీ విశేషానుకృతశేషు లగు మనీషులును, భారత రామాయణాదిక కథా కథన చతురవచనామృత సరిద్వైణికు లగు పౌరాణికులును, నలనహుష నృగ భగీరథాది రాజన్య ధన్య గుణశ్లాఘాముఖరం బగుపాఠక ప్రకరంబును; సమంచిత లీలాసంచితానూనవిటమాన మాన ధనం బగు విలాసినీ జనంబును, గొలువఁ గొలువుండి సకలశాస్త్ర సారంబగు హరికథామృత పూరంబు వీను లలరం జవిఁగొనుచు నందు గారుడ పురాణ ప్రసిద్ధంబై - సిద్ధముని గణ స్తోత్ర పాత్రంబగు శ్రీరంగ క్షేత్ర ప్రభావంబునకుఁ బ్రమోదం బావహించిన. ౧౭

క. శ్రీరంగ మహత్త్వము ప్రియ
మారంగఁ దెనుంగు బాస నతి మృదులవచః
శ్రీ రుచిరత్వంబుగఁ దన
పేర రచింపింప నాత్మఁ దిరిగొనువేడ్కన్ ౧౮

ఉ. తొల్లిఁటి సత్కవుల్ కృతులు దొంతులు పేర్చిన మాట లూఁతగా
జల్లి పదంబు లాదుకొని, సంధులు దూఁటుచు నొక్కజాడుగా
నల్లిన కబ్బముల్ సభల నార్యులు నవ్వఁ బఠించుదుష్కవుల్
మొల్లము వాకిచేతఁ దుదముట్టిరె భవ్యము లైన కావ్యముల్, ౧౯

ఉ. పుట్టకుఁ బుట్టి, కోమలికిఁ బుట్టిన ప్రాఁగవు లాదరించి, చేఁ
బట్టినగాదె రాఘవ నృపాలక ధర్మజకీర్తి చంద్రికల్
నెట్టన సర్వలోకములు నిండిన విప్పుడు నిందు నందులన్
ముట్ట నఖర్వ సర్వ సుఖమూలము కావ్యము వో తలంచినన్ ౨౦

మ. కృతవిద్యా ఖురళీ పరిశ్రమ కళాకేళీ విలాసుం జన
స్తుత చారిత్రుని, గౌతమాన్వయ పవిత్రుం, గౌరనామాత్య స
త్సుతుఁ, గల్యాణ కవిత్వ లక్షణ సమర్థున్, సూక్తి ముక్తాఫలా
తతకాంతి స్ఫుట చంద్రికోల్లసిత విద్వ ద్భైరవున్ భైరవున్, ౨౧

చ. ననుఁ దన సమ్ముఖంబున మనం బలరం బిలిపించి, యాదరం
బెనయ, విచిత్ర వస్త్ర మణి హేమ విభూషణ దర్పసార చం
దన హిమవాలు కాది వివిధస్తుత నిస్తుల వస్తుసంపదల్
దనియఁగ నిచ్చి, వక్త్ర కమలంబున లేనగ వాముతింపఁగాన్, ౨౨

క. లలిత మరుసమయ సముదిత
మలయానిల చలిత మధుర మాకందనవో
జ్వలకుసుమ విసర సౌరభ
కలిత వచస్ఫురణ మెఱయఁగా నెట్లనియెన్ ౨౩

శా. వ్యాస ప్రోక్త మహాపురాణములు ముఖ్యాతిఁ జెందిటి యందుం జగ
ద్వ్యాసుం డైన రమామనోహరు మహత్త్వ వ్యక్తి మూలంబులై
భాసిల్లుం దగు నాలు గందును బహూపాఖ్యాన విఖ్యాతమై
యా సౌపర్ణ పురాణ మొప్పు బహువేదాంతార్థ గంభీరమై ౨౪

వ. అందుఁ బురాణసారంబై శ్రవణమంగళంబగు శ్రీరంగమహత్త్వంబు మదంకితంబుగా నాంధ్ర భాషా కౌశలంబుఁ బచరించి రచియింపవలయు నని యభ్యర్థించిన నయ్యర్థిపారిజాతంబునకు నభిమతం బొదవ నిట్లంటి ౨౫

క. శ్రీరంగ రాజమహిమో
దారం బది కృతిదలంపఁ, దత్పతి సుగుణో
దారుఁడు - రాఘవుఁడఁటె శుభ
కారణమగు నిట్టిపొందు గలదే యెందున్, ౨౬

క. చెప్పెదఁ గావ్యము రసములు
చిప్పిల వర్ణనల నింపు చిలుకగఁ బాకం
బుప్పతిలఁ, జిత్రి రచనలు
చొప్పడ శబ్దార్థ ఘటన సుకవులు మెచ్చన్, ౨౭

వ. అని-అమ్మహామంత్రి చింతామణిచేత నత్యంత బహుమాన పూర్వకముగాఁ గర్పూర సమేతం బగు తాంబూలంబు గైకొనిసమ్మదంబున నిమ్మహా పురాణకధ రచియింప నుపక్రమించితినిట్టి కృతి నాయకునన్వయక్రమం బెట్టిదనిన. ౨౮

మ. జగముల్ మూఁడు తలంపులోపల జనించం జేయు వాగ్వల్లభున్
మిగులం గూర్మితనూజుఁగాఁ గనిన లక్ష్మీనాథుఁ డెవ్వానికిన్
బొగడొందన్ సుతుఁడయ్యె నట్టి సుమహత్పుణ్యుం బ్రశంసింపఁగాఁ
దగదే కశ్యప సన్మునీంద్రుని విశుద్ధ జ్ఞాన నిస్తంద్రునిన్, ౨౯

క. ఆ మునివంశ సుధాంబుధి
సోముని కరణిం జనించె సురుచిర లక్ష్మీ
ధాముఁడు కేశవదేవ మ
హామంత్రీశ్వరుఁ డుదారయశుఁడై వసుధన్. ౩౦

క. అతని కతి భాగ్యలక్షణ
వతి. మాదాంబికకు నుద్భవంబయ్యె జగ
న్నుతచరితుఁ డబ్జమిత్ర
ప్రతిమానుఁడు మాయిదేవపండితుఁ డెలమిన్ ౩౧

క. అమ్మంత్రిమణికి బొమ్మా
యమ్మకు సుతు లిరువు రుదయమై రఖిల జగ

తస్నమ్మదకారు లుదారులు
సమ్మర్దిత చటులకుటిల శాత్రవవీరుల్. ౩౨

వ. వెలయుచుండ, ౩౩

సీ. ఈప్రధానశ్రేష్ఠు కెనవచ్చు గనకాద్రి
భవునిచేఁ దలవంపు పడకయున్న,
నీసచివాగ్రణితో సమం బగు వార్ధి
యఱచేతిమాత్రలో నడఁగకున్న,
నీయమాత్యుని రహి కెక్కుఁ గల్పకశాఖి
భూలోకమున వీటఁబోకయున్న,
నీమంత్రిమణికి జో కౌ మీనకేతనుఁ
డంగవైకల్యంబు నందకున్న-

తే. ధైర్య గాంభీర్య దాన సౌందర్యములను
ఘనఁగ నాశ్రిత విద్వదర్థార్థిబంధు
మిత్రసంతత భాగ్యలక్ష్మీవిలాస
బంధురుం డొప్పుఁ జాగయప్రభువరుండు. ౩౪

చ అతులధృతిం దనర్చి విబుధాశ్రయమై, క్షమఁ బూని భూమిభృ
త్తతి కతిమాన్యయై, యచలతామహిమన్ మహి కెక్కియున్, జన
స్తుతుఁడగు చాగయప్రభువుతో సరిగామనుమీ సుపర్వప
ర్వత మురుధర్మకార్యముస వక్రత నొందుట దక్కకుండుటన్ ౩౫

వ. తదనుసంభవుండు ౩౬

శా. శ్రీవిభ్రాజితుఁ, డుల్లసద్గుణమణిశ్రేణీసుధాంభోధి వి
ద్యావాణీపతి, యన్యరాజసచివోద్యద్వంశ వంశాటవీ
దావజ్వాలి, ముకుంద పాదకమల ద్వంద్వార్చనోత్సాహి యా
గోవింద ప్రభుఁ డొప్పు బంధుజన చక్షుః పూర్ణిమా చంద్రుఁడై, ౩౭

ఆ.వె. అయ్యమాత్యమణికి నంగనారత్నంబు
మాణికాంబకును, సమగ్రబాహు

శౌర్యశాలి భాగ్యసంపన్నుఁ డుదయించె
బరఁగ విశ్వనాథ పండితుండు, ౩౮

సీ. లక్ష్మీనృసింహ లీలావైభవ ధ్యాన
బద్ధానురాగ ప్రసిద్ధ బుద్ధి,
శుంభద్విరోధి సంరంభ సంస్తంభన
క్షమతా సముద్యుక్తి శౌర్యశక్తి
బంధు విద్వత్కవిప్రకర పోషక నిత్య
ఫలిత కల్పకశాఖ భాగ్యరేఖ,
చక్రవాళో పరి స్థాన రంగస్థలీ
నర్తనోల్లాస విస్ఫూర్తి కీర్తి-

తే. గాఁగ లిమంత్రి మెఱయు నఖండిత ప్ర
తాప సౌభాగ్య గాంభీర్య ధైర్య మహితుఁ
డతఁడు గోవింద పండిత సుతుఁడు ఘనుఁడు
విశ్వనాథుండు శుభగుణ శాశ్వతుండు, ౩౯

మ. హరి — దుగ్ధాంబుధికన్యఁ, జంద్రధరుఁ డయ్యద్రీంద్ర పుత్రిన్, బురం
దరుఁ డింద్రాణిని, బెండ్లియైనగతి నుద్యద్వైభవం బొప్పఁగా
వరియించెం దగఁ జాగయ ప్రభుఁడు శశ్వద్బంధు సన్మానత
త్పరతారూఢ పతివ్రతా గుణకదంబన్ బ్రేమ దేమాంబికన్. ౪౦

ఉ. వారలు మువ్వురం గనిరి వంశవివర్ధనులన్, మనోహరా
కారుల, నిర్వికారుల, జగన్నుతసత్కులధర్మమార్గ సం
చారుల, నప్రతీప భుజసారుల, శూరుల నర్థిలోకమం
దారుల, వైరిదుర్మదవిదారుల, ధీరుల సత్కుమారులన్. ౪౧

వ. అందుఁ బ్రథమంబున ౪౨

తే భవ్యచరితుండు నరసింహపండితుండు,
భాగ్యవంతుండు విఠ్ఠలప్రభువరుండు.

రాజ్యలక్ష్మీవిలాసుండు-రామదేవ
మంత్రి మణియను, నల గొప్ప మహాపురుషుఁడు ౪౩

క. అందగ్రభవుని-సురకరి
చందన మందారకుంద శశధర పురభి
న్మందిరనిర్మలయశుఁ డె
ప్పం దగు నరసింహ దేవ పండితు డెందున్ ౪౪

సీ. అతులితైశ్వర్యరూపాతిశయంబుల
నసమాంబక ఖ్యాతి నందమొంది,
సుమహత్ప్రతాప తేజోవిశేషంబులఁ
జిత్రభానుస్ఫూర్తిఁ జెన్ను మిగిలి,
విశ్వసంరక్షణ విపులధైర్యంబున
నవనీధరస్థితి నతిశయించి,
యంచిత దాన మహాభాగ్యరేఖల
రాజరాజప్రౌఢి నోజ మెఱసి,

ఆ వె. ధరణిఁ బెంపుమీఱె-నరసింహపండిత
ప్రవరుఁ డమృత మధుర భాషణుండు,
సకల సుజనవినుత సద్గుణమణిమయ
భూషణుండు వైరిశోషణుండు ౪౫

క. అతని సుతుఁ, డఖిల జనహితుఁ,
డతులబలాధికుఁడు, హరిపదాంబుజసేవా
నిరతుఁడు. మతిజితవాచ
స్పతి గోవిందార్యుఁ డెన్నఁబడు భువనములన్, ౪౬

శా. వాహారోహణ చాతురీతురగ రేవంతుం, బ్రతివ్యూహవా
ర్వాహాటోప పటు ప్రభంజనుని, శశ్వద్దాన కేళీసము
త్సాహున్, సాహస విక్రమార్కుఁ, గరిదంతక్షీరలారామరు
ద్గోహీరామలకీర్తిఁ జెప్పఁదగు నాగోవిందమంత్రీశ్వరున్, ౪౭

క. అతని పినతండ్రి లక్ష్మీ
పతి నిత్యకృపాకటాక్ష పరిణత భాగ్యో
న్నతుఁ డుభయ వంశదీపకుఁ
డతులితనయశాలి విర్ధలామాత్యుఁ డిలన్, ౪౮

శా. దేవ బ్రాహ్మణ పూజనాభిరతు, ధాత్రీగోహిరణ్యాది దా
నా విర్భూత యశోవిశాలు. జగదీశాభ్యర్చనాలోలస
ద్భావున్, బావనశీలు, నాశ్రిత హితప్రారంభనిత్యోర్జిత
శ్రీ విభ్రాజితు విర్ధలేంద్ర సచివశ్రేష్ఠున్ నుతింపందగున్ ౪౯

మ. పటుధాటీముఖ జృంభమాణకలహ ప్రౌఢార్వసంపూతవి
స్ఫుటరింఖా పుటకోటి ఘట్టన పరిక్షుణ్ణ క్షమోద్య ద్విశం
కట ధూళీపటల ప్రశోషిత మహాకర్ణాట సేనాసము
ద్భటపాథోనిధి విర్ధలేంద్రుఁ బురణింపన్ మంత్రు లేరీధరన్. ౫౦

సీ చండదిగ్వేదండ కాండ ధూర్వహమహీ
మండలోద్ధరణ సమర్థ మగుచు,
దుర్వార పరిపంథి సర్వసంపద్గర్వ
నిర్వాపణ క్రియానిపుణ మగుచు,
వేదాది విద్యావినోద విద్వజ్జనా
మోదాతిశయ సముత్పాది యగుచు,
జంభ జిన్మద కుంభి కుంభీన సాధీశ
శంభు భూ భృద్ద్యుతిస్వచ్ఛ మగుచుఁ

తే. బరఁగు నేమంత్రి భుజ బల ప్రకట శౌర్య
దాన సత్కీర్తు ల ప్రతిమాన మహిమ
నాతఁ డిమ్మడి సైప ఖానాధి రాజ్య
భారధుర్యుఁడు విర్ధల ప్రభువరుండు ౫౧

క. ఆ మంత్రి చంద్రునకు రమ
ణీమణి లీలాంబకును జనించె సుధార

శ్రీమంతుఁ డమిత సుగుణ
స్తోముఁడు బాబాజి పండితుఁడు పుడ మొదవన్ ౫౨

సీ. వినుత సత్త్వప్రభా విభవ సత్కాంతుల
భీము రుగ్ధాము సుత్రాము సోము,
నైశ్వర్య చాప విద్యా నయోదయముల
భవుని రాఘవుని భార్గవుని ధ్రువునిఁ,
సౌందర్య సంగీత చాతుర్య జయముల
మరుని దుంబురుని వాగ్వరుని నరునిఁ.
జటుల విక్రమ దాన శక్తి రక్షణముల
నహివైరి సౌరిఁ గ్రౌంచారి శౌరిఁ

తే. బోలుఁ బరి పంథి ధారుణీపాల సచివ
పాలతల భూరితర భాగ్యమూల వర్ణ
జాల నిరసనకరణ సంశీలచరణ
సరణి బాబాజి భద్రలక్షణ విరాజి ౫౩

ఉ. శ్రీ జయభోగ భాగ్య కులశీల వివేక కృపాగుణంబులం
దీజగతిన్ బ్రధాను లెనయే! సురరాడిభరాజ రాజతా
రాజ తనూజ రాజత ధరాతుల కీర్తికి విర్ఠలేంద్రుబా
బాజికి నాజిరంగ పరిపాటిత శాత్రవ సైన్య రాజికిన్ ౫౪

వ. తత్పితృవ్యుండు ౫౫

సీ. సతత ప్రసన్నతా సదనంబు వదనంబు
వినుత సత్యామృత వేణి వాణి,
శరణాగత త్రాణ సదయంబు హృదయంబు
ఘనదాన వైభవాకరము కరము,
గురుధర్మ కార్యాను కూలంబు శీలంబు
సంపాదిత స్వామి జయము నయము,
హరిపదా రాధనాయత్తంబు చిత్తంబు
భూరి సౌభాగ్య విస్ఫూర్తి మూర్తి,

తే. గాఁగ నేమంత్రి విఖ్యాతి గనియె నతఁడు
విక్రమాపాది తానేక విమత దుర్గ
లబ్ధ సామ్రాజ్య లక్ష్మీ విలాస భాసి
చాగయామాత్య రాఘవ సచివవరుఁడు ౫౬

మ. చలనం బందక, యీని యీని ప్రకటించం బోక, నల్దిక్కులం
గలఁగం బాఱక, నీరసత్వమున కాగారంబు గాకుండెనేన్.
దలఁపన్ గల్పక, కామధేను, ఘన, చింతారత్నముల్ సాటియౌ
నలఘు త్యాగగుణాభిరాముఁడగు రామామాత్యసింహంబుతోన్ ౫౭

సీ. ఘోర ఘోణాదిమ ఘోణిదంష్ట్రిచలా
వాసప్రయాసంబు మోసరించి,
కమఠాధిపవ్యాధ కరినకర్పరపీఠ
సంశ్రయక్లేశంబు జరపిపుచ్చి,
చక్రీశ్వరక్రూరవక్రస్ఫటాభాగ
నిరసమోద్యోగంబు నిస్తరించి,
శుంభ దున్మదహరిత్కుంభికుంభస్థలా
వస్థానభేదంబువలనఁ బాసి,

తే. భోగ భాగినియై మించె భూమిభామ,
వర్తితానూన బహుతరవస్తుదాన
చతురముగఁ జాగ దేవపండితకుమార
రాఘవామాత్యభుజశిఖరంబునందు ౫౮

సీ. శ్రీభోగ ధైర్యప్రభా భూరిధనములఁ
జక్రీంద్రధరమిత్రసమతఁ దనరి
త్యాగ శుద్ధి క్షాంతి ధీగభీరతలను
ఘననదీరాజవిఖ్యాతి నెసఁగి
భూతికళాధుర్య నీతికార్యంబుల
శివభద్రసత్కావిస్థితిఁ దనర్చి

బంధుర్మధైర్యశోభన మహత్త్వంబులఁ
గరికాంనకదేవగరిమఁ బొవలి

తే. వెలయుఁ బటుబాహుల విక్రమ విజిత విమల
నృపసమాసీత మణిరమణీ హయాది
బహు విధోపాయ నాంచిత ప్రాంగణంప
రణ జయోల్లాసి చాగయరాఘవుండు 	౫౯

సీ. చటుల సంధ్యానటత్పశుపతి జటా
ఘటిత గంగా ఫెన పటలిఁ వెగడి,
పూర్ణచంద్రాతపస్ఫురణ సముద్భూత
మగ్ధాబ్ధి వీచి పంక్తుల నదల్చి,
భారతీ వక్షోజభారార్పితో దార
కర్పూర హార లేఖల హసించి,
చందనాచల మరుచ్చలిత నిర్ఝరంరు
ప్రసవ గుచ్ఛావలి భంగపఱచి

తే వెలయు నే మంత్రి శేఖరు విశదయశము
వాఁడు-రణదివ్య బిరుద నిర్వాహకుండు,
ప్రకటసంగ్రామ నిర్భంగ ఫల్గుణుండు
రమ్య విభవుండు-చాగయ రాఘవుండు, 	౬౦

మ. ఒసఁగెన్ జాగయరాఘవుండు విసయం బొప్పన్ ప్రతిద్వారమున్
వసుధామండలిఁ గల్గు విప్రతతికిన్ వాంఛానురూపంబుగా
రసవన్ముఖ్య పదార్థ జాల పరిపూర్ణం బైన యన్నాంబు సు
ల్లసితా నేక విధాంబరంబులు నవల్పస్వర్ణ నిష్కంబులున్ 	౬౧

వ. అయ్యమాత్యవరునకుఁ దగిన పత్ని రత్నంబు. 	౬౨

ఉ. సైరణ భూమి, భాగ్యమున సాగర సంభవ, సర్వమంగళ
ప్రరమణీయతన్ గిరిజ - రూపమునం దినసూను-నిర్వగిం

ధీరత గంగ, సత్పరిపేశల భాషల వాణి నాఁగ నొ
ప్పారె సతీలలామ లకుమాంబ సమస్త గుణావలంబయై	౬౩

క. శ్రీ లక్ష్మియు నబ్జాక్షుఁడు
పోలెడువారలకుఁ గలిగెఁ బుత్రుఁడు గుణర
త్నాలంకారుఁడు భాగ్యవి
శాలుం డగు నాగనాథ సచివుం డెలమిన్.	౬౪

సీ. సతతప్రసన్నుఁ డాచార సంపన్నుఁడు
వినయాన్వితుండు వివేకశాలి,
సుజనసేవితుఁడు భూసుర కామధేనువు
వితరణఖని జగద్ధితయశుండు,
స్మితపూర్వ భాషి లక్ష్మీనృసింహార్చనా
రతుఁడు సమస్త శాస్త్ర ప్రవీణుఁ,
డార్య సమ్మతుఁడు నిత్యైశ్వర్య కలితుండు
సంభృత గాంభీర్య శౌర్యధనుఁడు,
తే. చండకోదండ పాండిత్య సవ్యసాచి
యశ్వరేవంతుఁ డసమ బాహాబలుండు
ఘనుఁడు చాగయమంత్రి రాఘవుని కూర్మి
సుతుఁడు శ్రీనాగనాథ పండితవరుండు.	౬౫

క. ఉపతరవితరణగుణముల
సరియగుదురు నాగనాథసచివునకు, మరు
త్తరు, సురభి, ధనద, సురమణి
తరణిజ, శిబి, శరధి, సలిలధర, బలి, ఖచరుల్	౬౬

వ. ఇట్టి విశుద్ధకుల దుగ్ధార్ణవంబునకుఁ బూర్ణసుధాకరుం డగు రామదేవపండిత మహాప్రధానరత్నంబునకును	౬౭

## షష్ఠ్యంతములు

క. శ్రీ నిత్యవిభవునకు, ఘన
దాశరథి ప్రభవునకును, దామరసాక్ష

ధ్యానానురాగరంజిత
మానస పద్మంనకు విమలమఁజీ సద్మంనకున్ ౧౮

క. చాతుర్య భోజునకు-బహు
నూతన విభ్రమ వధూమనోజునకు, జగ
ద్గీతరణదివ్యబిరుద
ఖ్యాతునకును విఠ్ఠలేంద్రు ననుజాతునకున్ ౧౯

క. సింహతలాటాంకున, కుపు
సంహృతకర్ణాటకటక జననాథచమూ
రంహునకుఁ, జారులక్షణ
సంహననునకు, నమితభాగ్య సంపన్నునకున్ ౨౦

క. బాహుబల భీమునకు, ను
గ్రాహవరామునకుఁ బటు జవాధికతురగా
రోహణ రేవంతున, కతి
సాహసవంతునకు-నమిత సామంతునకున్ ౨౧

క. మాఘవ సతులితునకు, శర
లాఘవపటు తావిశేష లక్ష్మణునకు. ధూ
తాఘవరమతికిఁ జాగయ
రాఘవ సచివాగ్రణికి నిరత సద్గుణికిన్ ౨౨

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా రచియింపం బూనినయిప్పురాణ కథకుఁ
ప్రారంభం బెట్టి దనిన. ౨౩

## కథారంభము

ఆ.వె. త్రిభువనైక పుణ్యదేశాగ్ర గణ్య మూ
ర్జిత పయస్సరోవరేణ్య మసమ
బహుల సుకృత రత్న పణ్యము నైమిశా
రణ్య మొప్పు మునిశరణ్య మగుచు, ౨౪

వ. మఱియు నప్పరమ పవిత్ర క్షేత్రం బతి విచిత్ర కిసలయ కుసుమఫల పలాశ రుచిర చంపక నిచుళ కరక కురువక వకుళ లికుచపురఘంఫలినీ తమాలికృత సహకారపదాళ హింతాల నారికేళ పారిభద్ర భద్ర దారుకారంభారం భామలక బింకల్పక రాజరాజ ధనపున్నాగ నాగ కేసర పాటలా ఝాటలా శోకమ ఘాక కదంబాది తరుకదంబ శిఖర సుఖాసీన కలకంఠ కలాపి కలాలాప కలితంబై లలితమాలతీ లవంగ ఫలితావరీ పలయిత నికుంజ పుంజ పరిభ్రమ ద్భ్రమర మిథున మధుర ఝుంకార ముఖరితంబై, సకలకాల సంఫుల్ల హల్లక కమల కువలయ కుముద సముదయానుమేయ తోయ స్వచ్ఛ జలాశయ శతసతత కేళీ విలోల మదకల కలహంస చక్రవాక బక బలాకాది తానేక జల విహగ జాల కోలాహల వాచాలిత దిక్చక్ర వాళంబై, పుణ్యా లంపూర్ణ్యమాణ మాణవక కర ఠరికాముఖ ప్రభవ ఘుమ ఘుమ ధ్వని మనోహరంబై, సమిత్కుశ కుసుమఫలపలాశ భారవహన పటువటు కాను గమ్యమానాధ్యాపక పదక్రమపవిత్ర తలంబై, విశాల పర్ణశాలాభ్యర్ణకీర్ణ వస్యధాన్య చర్వణ గర్వితశాఖా మృగ చంక్రమణ క్రమాలోక నాలోల మునికన్యకా కటాక్ష కాంతి కల్పితానల్ప కువలయతోర ణాలంకృతంబై, పృథుల పీనభార మంథర రోమంథ బంధుర హోమధేను స్తన్యపాన సము త్సుకవత్స వదన విగళిత పయః ఫేన బిందుకశాద్వల స్థల విడంబిత తారకాంబరతలంబై, ద్యుమణిమణిశిలాతల రక్త చందనోపలిప్త సప్తార్చ్య మండల సమర్పి తారుణ కరవీరకుసుమ విసరాభిరామంబై, యుపజాతి పరి ష ప పత్త్రి పత్త్ర పవన ప్రజ్వలిత జ్వలన హుతాజ్యధారాదశ వితత పుణ్యా గంధాను బంధ ధూమ ధూపితాంత రిక్షంబై, నికటకుంజ కుటీర కుక్కుటకు లోపయుజ్యమాన వైశ్వదేవ బలికబళా పశిష్ట పులకాంకిత ప్రదేశంబై, హరి హర పూజా సమయ రచిత ఘంటాఘణ ఘణారవ శ్రవణ హరిణార్ధ కీలిత గళిత ఘాసకబళంబై, ప్రతి శాఖాగ్ర లంఘన చటుల శాఖా మృగ నికరకర పాతిత పరిపక్వఫలరస పూర్ణాలవాల తరుమూల శీతల స్ఫటిక శిలాతలా స్తీర్ణవిస్తీర్ణమృగాజి నాసీనమునిముఖ్య వ్యాఖ్యాయమాననానాశాస్త్రవిస్తరంబై, నందనారామంబునుంబోలె సురసాలోపశోభితంబై. బృందావనంబునుంబోలెఁ-గృష్ణసారసంచారపూతంబై, నాకలోకంబునుంబోలె-నమృతాహారస్థానంబై, దాశరథసైన్యంబునుంబోలెఁ - పనసనీలనలగజగవయగవాక్షోపలక్షితంబై, గాంధర్వంబునుంబోలె-శ్రుతిస్వరసంపూర్ణంబై, సముద్రంబునుంబోలె-బాడబా

సపనక ర్తలు సంయమీశ్వరులు పచ్చి
రెలమి శిష్య ప్రశిష్య సమేతు లగుచు. ౭౭

చ. వనజ భవాసుభావు లగువారల నందఱఁ జూచుకోర్కి నె
మ్మనమునఁ బిక్కటిల్ల, బుధమాన్యుఁడు. సాత్యవతేయశిష్యనం
దనుఁ డగుంపమహర్షణుఁడు దాఁ జనుదెంచిన, నమ్మహాత్ముల
య్యాసముని గాంచి యిట్టని రాదరమేదురసానుభాషలన్. ౭౮

క. ఏపదనుండి యిపుడు ని
రాక సుధీవర ! విచిత్ర రమణీయకథా
నీకప్రసంగ మేమే
నాకర్ణింపంగఁ గలిగె నినుదిన మింకన్ ౭౯

చ. అనవుడు సూతసూతి వినయంబున వారలతోడ నిట్లనుం
జనక మహీతలేశ్వరుని సత్రమహోన్నతిఁ జూచువేడుకం
జని యటనుండి నిన్నిదివసంబులు తార్క్ష్యపురాణసత్కథా
వినుత సుధా సరిద్విపులవీచిక యుల్లము నిల్ప నాఁగినన్ ౮౦

వ అమ్మహాపురాణంబునందు ౮౧

క. సారంబై మోక్షపదా
ధారంబై పుండరీక దళ నయన నిజా
గారంబై మహిఁ బరఁగిన
శ్రీరంగమహత్త్వ మతివిచిత్రము దలఁపన్ ౮౨

తే అనిన శ్రీహరిచరణదివ్యానుషక్తి
చిత్తజలజాతమును వికసింపఁ జేయఁ
దనుఁ దదీయ కథాంశ విస్తార మడుగఁ
జెలఁగి వారల కిట్లని చెప్పె నతఁడు. ౮౩

చ అమల చరిత్రులార వినుఁ డమ్మిథిలాపురి నధ్వరోత్సవాం
తమున మునీశ్వరానుమతుఁడై తను వేఁడెడ నాగదంతసం

యమికిఁ బరాశరాత్మజుఁ డుదాత్త కథా పరిపాటిఁ బుణ్యతీ
ర్థములను–బుణ్యభూములు మదంయునఁ దెల్పఁగఁ బూని ప్రీతితోన్ ౮౪

చ. త్రిభువన ధర్మరక్షణధురీణ విచిత్రచరిత్రుఁ డిందిరా
విభుఁ డెచటన్ వసించి దగువేళల నెందుఁ జరించు నేయెడన్
శుభమతి నాదరించి నెటఁ జూచుఁ గృపాన్వితదృష్టి నేమిటం
దభిరతి గల్గియుండు నివి యన్నియుఁ బుణ్యతర ప్రదేశముల్ ౮౫

క. హరిచరణకమలరేణువు
పరమాణువు సోఁకినంతఁ బావనతరమై
కరము నుతికెక్కు సలిలము
తిరముగ నధికంబు సకల తీర్థంబులకున్, ౮౬

చ. మురహర పాదపంకజ సముద్ధతమై పెనుపొందెఁ గావె శం
కర విలసజ్జటాకలిత కైరవబంధు కళామరీచులన్
పరనిజవీచులన్ నెఱయ పన్నియ కెక్కి త్రిలోకపావన
కరణ ధురీణతం గనెఁ గంగ తరంగిణులందు మేటియై ౮౭

వ. మఱియును ౮౮

సీ. కలుషపంకజ కళకాతమి గౌతమి
సకల సజ్జన మాన్య జహ్నుకన్య
జంతు సంతత మనశ్శర్మద నర్మద
శమిత తాపత్రయ దమన యమున
శ్రిత సాధుజనలబ్ధజీవిక వేణిక
సత్య సంవిద్యోగ చంద్రభాగ,
సతత జన్యాచల లాళని భవనాశిని
దూరీకృతక్షుద్ర తుంగభద్ర,

తే. బహుల సౌభాగ్యదాన సంపన్న–పెన్న,
భగ్న దుర్మోహపాశ విపాశ యనఁగ,
భువిఁ బ్రసిద్ధికి నెక్కిన పుణ్యనదులు
హరికి లీలావిహార యోగ్యములుగావె ౮౯

మ. విను మీమాటలు వేయునేటికిఁ బపస్వి_శేష్ఠ! గోవిందశో
భనలీలా చరణక్రియాకలిత సంబంధానుసంబంధబం
ధ్యానుబంధి క్రమయోగ యోగ్యపుగుభద్ర ద్రవ్య లేఖాటుతో
నెనగా వస్యపదార్థకోటులు ససంఖ్యేయప్రభావంబునన్. ౯౦

సీ. హరిదివ్యనామధేయామృతం బింపారఁ
జెలఁగి యాస్వాదించు జిహ్వ జిహ్వ-
గోవిందకల్యాణ గుణవిశేషంబులు
పలుమాఱుఁ దలపోయు తలఁపు తలఁపు
కమలాక్షునిత్యమంగళమూర్తి విభవంబు
సొంపార వీక్షించు చూపు చూపు
ఫణిరాజతల్పు శ్రీపాదపద్మంబులు
చేరి యర్చనసేయు సేఁత సేఁత
తే. వాసుదేవప్రియం బైనవ్రతము వ్రతము
దైత్య భేది నుపాసించు తపము తపము
శౌరి నారాధనముసేయు జపము జపము
విష్ణుపదభక్తి సమకొల్పు వినికి వినికి ౯౧

సీ. పటుతరభవరోగ పరితాపములఁ బాప
నబ్జాక్షుసేవ దివ్యౌషధంబు,
అంచితజ్ఞాన మహానిధానముఁ జూప
నచ్యుతభక్తి శుద్ధాంజనంబు
దుర్వార భయములు దొడరకుండఁగఁ జక్ర
పాణి సంస్తుతి వజ్రపంజరంబు,
ఇష్టార్థఫలసిద్ధు లెసఁగింప హరినామ
పఠన మంగళ కల్పపాదపంబు,
తే. విపుల దుర్మోహతిమిరంబు విరియఁజేయ
నురగశయనుని పూజ సూర్యోదయంబు
అనిమిషానందలీలల ననిచి మనుపఁ
గమలనాభుని పదభక్తి యమృతరసము ౯౨

క. కరణత్రయకృతపాపా
పరణముల హరింపఁ జేయువారికి మురభి
చ్చరణసరోరుహ సతత
స్మరణము కా కితరము నొండుసాధనము గలదే ౯౩

ఆ.వె అఖిలలోకములకు నక్షయానందసం
భూతికారణంబు పుండరీక
నయన నామ కీర్తనంబ, యీయర్థంబు
నిఖిల వేద శాస్త్ర నిశ్చితంబు ౯౪

క. కావున ఘన దురితావలి
ఖావుల కెందును ముకుంద పరిచిత తీర్థా
ప్లావము పక్కంగ జక్కన
పావనత ఘటింప నొం డుపాయము గలదే ౯౫

ఆ వె అనిన నారదుండు దగఁ ఘ తీర్థప్రభా
వముఁ దలఁచి చూడ వాని వాని
కవిను మొక్కు వైన మట్లంచు నిం పెద్ది
సకల పుణ్యతీర్థ సారతరము ౯౬

శా. ఏ తీర్థంబు దలంచినన్ వినిన నస్నేహించినన్ జూచినం
బ్రీతిం జేరఁగనినం దురంతదురితాపేతాత్ములై నిర్జర
వ్రాత ప్రార్థిత నిత్య సౌఖ్యయుతులై వర్తింతు రల్పేతరవి
ఖ్యాతిన్ మానవు లట్టి తీర్థ మెఱుఁగంగాఁ జెప్పవే నాపుడున్, ౯౭

వ పరమజ్ఞాన పరిపాక పరిచిత పరాపరవివేక పారాయణుం డగు
బాదరాయణుండు నత్తపోధను నత్తమునకు కిట్లనియె. ౯౮

క శుభగుణనిధి యగు రఘుకుల
విభుకృప ననపాయుఁ డగుచు వెలసిన దితిజ
ప్రభుచే నాసీతుండై
త్రిభువన సంస్తుత్య నిత్యదివ్యస్ఫూర్తిన్ ౯౯

శా. రంగత్కేతు విచిత్రతోరణమణి ప్రాసాద వప్రప్రభల్
నింగిం బర్వ, భుజంగతల్పునకుఁ గేళీసద్మమై యొప్పుశ్రీ
రంగం బేతటినీతటిన్ మెఱయుఁ దా రమ్యోత్సవశ్రీనటీ
రంగంబై యదివో జగంబుల నదీరత్నంబు చర్చింపఁగన్ ౧౨౦

సీ. ఏయేటి నడుఁదిన్నె నేప్రొద్దుఁ జలిగొన్న
సికతాతలంబులఁ జెలఁగి చెలఁగి,
యేతరంగిణి నించుకించుక వికసించు
క్రొత్తమ్మితావులఁ గొసరి కొసరి,
యేనదీక్రీడల నెసఁగు రాయంచల
కలకలంబుల కాత్మ నలరి యలరి.
యేసరిత్తటమున నేచినకల్పక
మేదురచ్ఛాయల మెచ్చి మెచ్చి

తే. నేడు నొకనాఁడుఁ బాయకున్నాడు శౌరి
యతిమనోహరి నిశ్శ్రేయసానుకారి
వివిధతాపనివారి భూవినుతవారి
కలిత కావేరి భవకరికలభవైరి ౧౨౧

వ. మఱియు నన్నదీప్రవాహరత్నంబు, నాయతనప్రవర్ధమానసుధాసమాన పానీయపూర సారంబు లగు నారికేరంబులును,గమలభవ కామినీకపోలపాళికా సవర్ణ పరిపూర్ణరాగకర నాగవల్లీవేల్లితాభోగంబులగు పూగంబులును, మృదుముదితపరిమళ పరిజ్ఞానసంకేతకంబు లగుకేతకంబులును, జగజ్జయ ప్రయాణ ప్రవణ పంచబాణ ప్రబల బల ధూళీదూసరంబు లగు కేసరంబులుఁ గలనాగకేసరంబులును, గువలయాకుల విలీనమదకలకలవింక కలకలముఖర శిఖరశిరోవళనటనారంగంబు లగు నారంగంబులును, ధారాధరసమయ ధారాళ మధురమధురసధారాసారకలికాకదంబంబులగు కందంబంబులును, వనదేవతా చరణమణి మంజుమంజీర ఝళఝళ ధ్వని మర్మసూచకశ్రవణశర్మరీమర్మర స్వన సముత్తాలంబు లగుతాళంబులును, బరిపక్వఫలరసమాధురీరమాధరీ కృత సురసాలంబు లగురసాలంబులును, దరుణతరణి కిరణప్రసరణ భయ పలాయిత బంధురాంధకారసందేహమూల జాలప్రవాళ రుచినిచయరచితకృత

ఉ. ఉన్నత రంగధామ లలితోభయపార్శ్వములం బ్రసన్నయై
యున్నది యుబ్బిపాఱుc, గలితాయత కంకణ మౌక్తికద్యుతి
చ్ఛన్న మృదుప్రవాహములు సాcచి చిరాగతుc బ్రాణనాయకుం
జెన్నుగ నిండుకౌcగిcటికిc జేర్చి చెలంగు మృగాక్షికైవడిన్. ౧౦౩

చ. అనుపమ దివ్యబోధమహితాత్ములు తత్తటినీతటంబులం
దనిశము నిశ్చలస్థితికినై చరరూపము లుజ్జగించి నే
ర్పున వివిధాచరాకృతులు పూనcగc గోరుచు రంగధామముం
గొనకొని పుట్టుచుందురు ముకుందపదార్పితమానసాబ్జులై ౧౦౪

క. ఈవసుమతిc గలతీర్థము
లావాహిని నెల్లప్రొద్దు ననుకూలమునై
సేవింపుచుండుc బ్రవిమల
భావంబున నంబురాశి పర్యంతముగాన్ ౧౦౫

క. సుర నర యక్షాసుర ముని
గరుడోరగ సిద్ధసాధ్య ఖచరాదులు త
ద్వర తీర్థ సార్థసేవా
పరులై కని రభిమతార్థ ఫలసంసిద్ధుల్ ౧౦౬

సీ. అవి విను సంయమిప్రవర, స్వర్గద్వార
మనునది దేవగణైక సేవ్య
మాప్రదేశమునc బిండప్రదానాదులు
పితృకోటి కక్షయప్రీతిదములు,
తిలధేనుదాన మతిప్రశస్తము హరి
సేవ కైవల్యలక్ష్మీకరంబు
తత్సరమునc బ్రసిద్ధము పుండరీక మ
చ్చో నొప్పు ఘనవట క్షోణిజాత

తే. మదిహృషీకేశ నావాస మాసమీప
మందుc బెంపొందుc గుళలాఖ్యమైన శైల
మచటc దపముండి కాదె ము న్నాకపాలి
బ్రహ్మహత్యా మహాఘంబుc బాసి వెలిcగె ౧౦౭

మ. కలదయ్యద్రికిఁ దూర్పుదిక్కున వకుళాఖ్యంబైన తీర్థంబు, ము
న్నల జంభారి సురాధిపత్య హరితుండై తత్ప్రతీరంబునం
బలి విధ్వంసిఁ గుఱించి భక్తిఁ దప మొప్పంజేసి యాకల్పని
శ్చలలోకత్రయ రాజ్యలక్ష్మిఁ బడసెన్ సంప్రీత చేతస్కుఁడై ౧౦౮

ఆ.వె. అనిన నాగదంతుఁ డనఘ! శ్రీరంగంబు
దితికులోద్భవుండు తెచ్చె నంటి
వది కవేరకన్య కాభ్యర్థనంబున
నెచట నునిచె, నానతిమ్ము నాకు ౧౦౯

క. అనవుడుఁ బరాశరాత్మజుఁ
డను నతనికి వకుళ తీర్థ మని యిప్పుడె చె
ప్పిన యచటికి దక్షిణమున
ననఘ! కల దనంత శయన మనుతీర్థ మొగిన్ ౧౧౦

సీ. ఎయ్యెడ లక్ష్మీసమేతుఁడై వసియించు
నాదినారాయణుం డవిరతంబు
నెచటితోయస్పర్శ మింత గల్గినమాత్ర
నరులు పాపశ్రేణిఁ బరిహరింతు
రెచ్చోట నొక దివంబేని నిల్చిన వారి
కపునర్నరత్వమహత్త్వ మొదవు
నెందుఁ దపస్స్థితిఁ జెంది సిద్ధులు
బహులతాగుల్మరూపములం నుందు

తే. రే నెలవునందు దశమాత్రమైనఁ దునుమ
బ్రహ్మహత్యసమం బగుపాప మొదవు
నేస్థలంబునఁ గీటాదిహింస సేసి
పతన మొందుదు రతిపుణ్య భావులైన. ౧౧౧

మ. సహజజ్ఞానయుతంబులై సరసభాషల్ ప్రీతిఁ జేతిస్సుఖా
వహములై గాఁ దగఁ బల్కుచున్ మెలఁగు సత్యస్ఫూర్తి నెందేని న

యౄహిమార్జాలవృష ప్లవంగ నకులవ్యాళిశ్వవిద్విట్కురం
గ హరి వ్యాఘ్ర మదేభశల్యరురుఖడ్గక్రోడభేరుండముల్, ౧౧౨

క. ఎందు వసించును జేతన
బృందం బాధ్యాత్మి కాదిపీడావశులం
జెందక యాపద నలజడిఁ
బొందక యాఁకటఁ గృశించిపోవక యెలమిన్, ౧౧౩

సీ. గతవర్తమానైష్యకాలవేదులు సర్వ
కామవంతులును. సంఘటితభూత
హితులు, సర్వజ్ఞు, లహీనసత్త్వులు, దుఃఖ
రహితులు, జ్ఞానవైరాగ్యయుతులు,
బ్రహ్మజ్ఞు లధిగత బ్రహ్మతేజులు, పర
స్పరమిత్రు లతిపుణ్యపరులు, సములు,
నిత్యశుద్ధాత్ములు, నిర్మలుల్. నిత్యులు
నిర్మముల్, సత్త్వులు, నిత్యతృప్తు.

తే. లనఘు, లవికారు, లద్వంద్వు, లనుపహతులు
సుప్రసన్నులు, సుముఖులు, శుభవచనులు–
నై చరింపుదు రెందు నరామరాసు
రాదు లిచ్ఛావహాకృతు లగుచు నెపుడు, ౧౧౪

మ. వినవేర్చుం జెవిటైన, మూఁడుఁ డయిరన్ విద్వాంసుఁడౌ, వెఱ్ఱియై
నను విజ్ఞాని యగున్, ఖలుండు నతిశాంతస్వాంతుఁడౌ, వక్రుఁడై
నను సౌమ్యాకృతిఁ దాల్చుఁ, బాపరతుఁడైనన్ దోషనిర్ముక్తుఁడౌ,
ఘనపుణ్యం బగు నే ప్రదేశము చొరంగాఁ గల్గు మాత్రంబునన్ ౧౧౫

వ. అట్టి సకల కళ్యాణకారణంబై-తీర్థవరేణ్యం బైన పుణ్యక్షేత్రంబున
దైత్యకులపవిత్రుండైన విభీషణుం డా దివ్యధామ మందు నిలిపె
నాట నుండియు, ౧౧౬

క. శ్రీ మెఱయ నుభయకావే
రీ మధ్యమునం దనర్చు శ్రీరంగము తే

జో మహిమ చంద్ర పుష్కరి
ణీ మహిత తటంబునందు నిగమస్తుతమై, ౧౧౭

శా. ఏ పుణ్యాయతనంబుఁ జొచ్చి నియతిన్ వీక్షించుపుణ్యాల్. మహా
పాపశ్రేణి జయించి నిర్మలమతిం బ్రాపించు సుజ్ఞానులై,
తాపంబుల్ పెడఁబాసి దండధరదూత వ్రాతముం దోలి, య
వ్యాపన్నం బగు సత్పథంబునఁ దుదిన్ వర్తింతు రత్యున్నతిన్ ౧౧౮

క. కృత నిష్ఠీవన పతిత
ప్రతిభా షానృత దురుక్తి పఠనాదుల స
న్మతి శ్రీరంగముఁ జేర్కొను
నతఁ డఘములఁ బాసి పొందు నచ్యుతపదమున్, ౧౧౯

ఆ.వె. అతి విదేశ వాసులైన సప్తద్వీప
నిలయులైన భక్తి నివ్వటిల్లఁ
జేతు లెత్తి మ్రొక్కి శ్రీరంగమున కెదు
రై భజించి కాంతు రభిమతముల ౧౨౦

మ. అరవిందాక్షదినోపవాసము, తులస్యాస్వాదముం, జంద్రపు
ష్కరిణీస్నానము, రంగమందిరలసత్సందర్శ నానందమున్,
వరగీతాపఠనంబు గల్గునొక జన్మం బందు నెవ్వారి క
ప్పురుషుల్ ప్రాప్తసమస్తకాములు జగత్పూజ్యుల్ ముకుందాకృతుల్ ౧౨౧

క. చాతుర్మాస్యస్థితిఁ బ్ర
ఖ్యాత శ్రీరంగసీమఁ గల్గినసుకృతం,
బాతలఁ బెఱతీర్థంబుల
నేతెఱఁగున సంభవింప వెన్నాళ్లున్నన్, ౧౨౨

క. శ్రీరంగ భవనమున ముద
మారఁగ నొకరాత్రి యున్నయట్టి ఘనులు దు
ర్వార మహాపాతక శత
పారంపర్యములవంకఁ బాయుదు రనఘా ! ౧౨౩

క. గురుమతి శ్రీరంగమునకు
నరిగిన సుజనుండు, భక్తి నతనికి నన్నం
బరసి యిడునతఁడు లోకో
త్తరచరితులు దుహినబింబ దళసస్ఫురితుల్, ౧౨౪

క. ప్రతిదినమును దిలపాత్ర
త్రితయము దానంబు సేసి ధృతిఁ బొందుసమం
చితసుకృతఫలము సమకొను
నతులశ్రీరంగమందిరాలోకమునన్, ౧౨౫

వ. అందు హేమదానం బతిప్రశస్తంబు, భూదానం బంతకంటె నధికంబు
గోదానవస్త్రదానంబు లత్యుత్తమంబు లివియన్నియు ౧౨౬

క. తమతమపట్లన నిత్యో
త్సవమునకు మదిఁ గలఁగి దేవతలు రంగక్షే
త్రమునందుఁ బొందుపనుజ
త్వముఁ గోరుదు రందు ముక్తిధామం బగుటన్ ౧౨౭

క. రవి కన్యాగతుఁ డగున
య్యవసరమునఁ గృష్ణపక్షమందులఁ జేతో
భవతిథిఁ బితృకృత్యమునకు
నవుముఖ్యవ్రతము మాఘమందును జెల్లున్,

సీ. తమయన్వయమున నుత్తముఁ డొకఁడైనను
జనియించి, శ్రీరంగమునకు నరిగి
యచటఁ గావేరీ జలావగాహ మొనర్చి,
యగ్ర జన్మలకు నాహారమైన,
నత్యల్పదక్షిణయైనఁ, దిలోదక
మైన, ధేను గ్రాసమైనఁ దనకు
గలిగినరీతిఁ దక్కక హరిసన్నిధి
మమ్ము నుద్దేశించి నెమ్మి నొసఁగు

ఒనఁ గడునద్భుతంబు లగు పూర్వకథల్ విన వేడు కయ్యెడున్
ఘనదయ నట్టివెల్ల నెఱుఁగన్ రచియింపుఁడు నాకు, నావుడున్. ౧౩౫

క. నిగమవ్యాసవిశారదుఁ
డగుముని నీయడిగినట్టి యాశ్చర్యకరం
బగు నితిహాసము గల దది
తగ వినుమని పలికె నాగదంతునితోడన్ ౧౩౬

చ. కలరు సుబోధసత్త్వ లనఁగా మును లిద్ద, ఱుదారకర్మని
ర్మలచరితుల్, చతుర్ముఖసమప్రతిభుల్, బహుధర్మమర్మవే
దులు, ఘన దివ్య బోధసహితుల్, మహితుల్, రజనీముఖజ్వల
జ్జ్వలన విశాలనేత్రు లనివారిత భూరితపోబలాధికుల్, ౧౩౭

క. వారఖిల భువన విస్మయ
కారణ దృఢఘోరనిష్ఠఁ గదలక గంగా
ద్వారమునఁ దప మొనర్ప బ
లారాతి పరాతికంపితాత్మకుఁ డగుచున్, ౧౩౮

వ. నిరంతరంబును దదంతరాయంబునకు నుపాయంబు లాచరింప
నానిలింపపతితోడ రాయిడింప నొల్లక యెడఁబాసి వాసిగల
తీర్థంబు లాడువేడుక నిలావలయంబు గలయం జరింపుచు
వచ్చివచ్చి పురోభాగంబున, ౧౩౯

మ. సతతానేకమునీంద్ర బృందకృత పూజావందనం, జందనా
గతమందానిల కందలీకృత తరంగస్యందనన్, దీరసం
గతమాకందమరంద బిందు సహితార్కస్యందనం గాంచిర
వ్యతు లింపొందఁ గవేరనందనఁ ద్రిలోకానందనానందనన్ ౧౪౦

క. కని తదవేక్షణలోలత
ననిమిషత వహించి యద్భుతానందంబుల్
మనమునఁ బిరిఁగొనఁ బులకిత
తనులై ప్రణమిల్లి భక్తితాత్పర్యములన్, ౧౪౧

సీ. గురుధర్మచరితానుకూలంబు కూలంబు
సంక్షాళితాఘకజ్జలము జలము,
ఘనము క్షిప్త తరంగములు తరంగము,
లవిసీతకుజన భైరవము రవము
విహతతాపత్రయోద్వేగంబు వేగంబు
లలిత భక్తానందలహరి లహరి,
కుశల ప్రశంసానుగుణములు కణములు
విధ్వస్త దుర్భవవీచి వీచి,

తే. నిరుపమ జ్ఞానసంపద నెఱపు నెఱపు
భరితబహుమోహపటలిఁ బోనుఱుపు సుఱుపు
గాన రెండగు మిండతో సనూన
మహిమ మహి కెక్కు తీర్థ సమాజములకు, ౧౪౨

క. అని, మఱియుఁ బలు దెఱంగులఁ
గొనియాడి, తదీయవారిఁ గ్రతుకంఠున ము
న్గొని యాడి, దప్త తేజో
ఘనులై ఘన విరహతాప ఘనులై రెలమిన్ ౧౪౩

వ. క్షితిఁ గల నదులందలి వి
శ్రుత యగుకావేరిసరిదు సోఁకిన మాత్రం
ధృతి సద్గతిఁ గనుఁడిర్యో
క్తతి యయినను జెప్పనేల తక్కినవారిన్ ౧౪౪

తే. ఆవిధంబునఁ గృతకృత్యులై—తదీయ
తీరవన భూములోక కొన్నిదినములుండి
వారలోకనాథు సంధ్యాభివందనార్థ
మై నిశావధిఁ గావేరి కరుగుటయును ౧౪౫

వ అమ్మహావాహినీ ప్రభావం బెడనెడఁ బొడవడునిసుము పిదపిదని పదనెగసి
కూలు దరులును దరులుగూడినఁ బెల్లుకొనఁ దాఁకుతఱ్ఱున మొదళ్ల బలువదలు
వమలు మూలంబులం దెఱపుల సముపులఁ బయఃపూరంబులు దోరంబులుగా నేచి

పూచితోచినం బెకలి తలకెడపై వడిపఱద వెంబడిఁ బొరలిపోవు తరులును, దరు తండంబుల గంపి కడల నడ్డంబు దగిలి దట్టంబులై కట్టవెట్టిన లాగునఁ దాఁగనీక వేగం బాఁగిన విటిగి మలసి యెదురుదన్ని మిన్నుల కప్పుంబులై పచ్చ పై యేఱుల బలిమి కలిమిం దొట్టి సిట్టవాడిచిన నెట్టుకొని తమినం బఱుము లిడి నిబ్బరంపు బిరుసునం దెరం ద్రొబ్బిన కడకం బడఁకుల పెల్లడరి యురులు గిరుల చఱుల ప్రచండ రవంబుగా డొల్లు గండశైలంబు లును, గండశైలంబు లొండొండ గుభులు గుభుల్లనం దొడఁగురభసంబున సభశ్చరులు తల్లడిల్ల నెల్లెడలం బెల్లగయు కల్లెపలుసు, కల్లెడల మొల్లంబేరి మేదినీకుహరంబుల హర నటనటనపాటహ మహాభైరవ క్ష్వేడారవ ప్రతి ఘటకట ధ్వని బంధురంబులై దిగంబడు కబంధంబులం బహులావర్తంబుల క్రందుసం దెగి నీరద మగుచు వెలుగుపడి తిరుగుచుపడు జలగ్రహంబు లును, జలగ్రహంబు లొండొండసంటు నంటుగ నొరసి గెంటి కంటికొనల సఫలస్ఫులింగంబులు చెదర నదరి కలహంబునకుఁ దిమురుచు నమురు గవిసి యప్పటప్పటికి జిఱజిఱం ద్రిప్పి వేయుచటుల వాల ఘాతంబుల సుద్ఘాతంబులై మసరుకొని విసవిస విసరు గాడ్పుల దూలి వెడగువడఁ జల్లు జలకణంబుల చల్లు తఱచున దఱియరాని సమీప దేశంబులును, సమీప దేశవాసిసీ జనంబు భయావేశంబునం బాసిచనఁ దోడన జలంబు వెడవెట్టి నివ్వగిలినఁ జువ్వన నెగయు మందిరంబుల పొందు దప్పక తెప్పలగతిఁ దేలిపోవు పురనగర గ్రామ సమూహంబులును, సమూహంబులై నింగి చెంగటం దలఁగి నివ్వెరపడి చూచు ఖేచరులుఁ గలిగి వ్యవహార సమర్థుం డగు సార్థవాహునర్థ సమితియుంబోలె మితుల కగ్గలంబై, బహు ముఖంబులం గూడుచు, నతిరథపటిష్ఠ నిష్ఠుర బాణశ్రేణియుంబోలె ముంపు దప్పక, యొడ్డ భేదింపుచు, మహావదాన్యుల యసామాన్యకీర్తి స్ఫూర్తియుఁ బోలె బలువంకల నుల్లసిల్లుచు, గరాలకరవాల ధారయుంబోలె నొరసిన మేఁ ద్రెంపుచు, నయసంపన్ను సంపదయుంబోలె ముంపుదప్పక వసంత సమయ తరుసంతతియుంబోలె బలుమోసు లెత్తుచుఁ, ద్రివిక్రమ దివ్యదేహ స్ఫురణయుంబోలె నడుగులకొలఁది గానంబడక, హరిమాయయుంబోలె నాలం బెఱమతం (బు) లం గడవ నశక్యంబై, పెన్నిధిఁ గన్న పేద యుంబోలె – నంతకంత కుబ్బుచు, తగవరియగు చుట్టంబునుంబోలె నెజసులు దోపకుండ వర్తింపుచు, వీరభట వితతియుంబోలె మిగుల వడి

గలిగె, సన్నద్ధహయపంక్తియుంబోలెఁ బల్లటిలు నేపు వహించుచు, సచ్ఛ్రుతో
వార్తయుం బోలె సవిదూరంబుగా బ్రాయుచు, సభేద్యకవచంబునుఁ బోలె
నాటఁ జిక్కక, సుధాత్మ వివ్రయుంబోలె నెల్లవారికి వితరించుచు నక్క
జంపై, మెలసి పెన్నఁ జిన్నచేసి, తుంగభద్రను భంగపఱచి, కృష్ణ దూష్ణీక
రించి, సరస్వతీతరస్వినిత్వంబు దెగడి, నర్మద నిర్మదఁ గావించి, భాస్క
రిం దిరస్కరించి, జాహ్నవి నిహ్నవించి, గౌతమి లోతసి యడంచి, సార
వంబు గౌరవం బుడిపి, యమున సరిన్నివహంబు నపహరించి, సంవర్త
సమయసముజ్జృంభ చండ దంభోధరానర్గళ తాండవప్రకాండ తాండవిత
సంఘసమున్నిద్రంబు లైన సముద్రతోయంబు లుద్రేకించి లోకంబు లేకార్ణ
వంబుగా నందంద ముంరపడించు చందంబున చూచువారలకు వెక్కసంబై
యుప్పతిల్లి యేపు దప్పక పెనఁగొని యంతలోన. ౧౪౬

క. ఇరవుగఁ దొలుదొల వచ్చెడి
దరి నొకచో వార లిడిన దండాదికప
త్కరణ స్నానపటాదులు
పరువడి యయ్యేటిలోనఁ బడి వడిసనిగెన్ ౧౪౭

ఉ. అంత నసంత ఘర్మపహిమాంచిత కృత్యుఁడు నత్యుఁ డాసరి
త్ప్రాంతతజ్జృంభణోదయవిచారవికారత యుద్ధఁ బూని భా
స్వంతము, విష్ణుసంజ్ఞకము, సత్యము, సర్వశుభప్రదంబు, శ్రీ
మంతము నైన దైవము సమానుపకీర్ణ వలంచుచున్వెదన్. ౧౪౮

క. కల్పాంత తీవ్ర బాడబ
కల్పసమానప్రతాపఘని యవితథస
కల్పుఁడు సుబోధుఁ డట్టియ
నల్పక్షోభంబుఁ గని మహాద్భుతమందై, ౧౪౯

శా. కాలాంభోధరగర్జిత ప్రతిభయోగ్రధ్వాన గంభీరమున్
హేలాదర్ప విజృంభణస్ఫురణ నిర్గేలా యవేళన్ సము
ద్వేలంబై నది యానదీమణి కడున్ వేగంబె యూర్మిస్ఫు
ర్జ్వోలద్వీచిపరంపరల్ పొదువఁదే లోకంబు లేకంబుగాన్ ౧౫౦

తే. కాన దీనికిఁ బ్రత్యుపకార మింక
నెద్ది గల దట్టి దిప్పు డూహించి చేయ
కొకనిమేష ముపేక్షించి యున్ననైన
బ్రతుక బోలునె విశ్వప్రపంచమునకు, ౧౩౧

సీ. చటులదిక్కరి కర్ణపుట పాటనప్రౌఢి
నాదవునిర్భర ఘోషమదము మొరుఁగ,
పాథోధిమండల పాణింధమము లైన
కల్లోలవితతుల క్రుళ్లడంగ,
మకరనక్రగ్రాహ మత్స్యకచ్ఛపకోటు
లొరలుచు నొండొంటి మఱువు కొదుఁగ
జక్రటిట్టిభ సారస క్రౌంచముఖ జల
విహగజాలము గమి విచ్చి పఱవ,

తే. నారసాతలనిమ్నంబులైన మడువుఁ
బట్లు పంకావిలంబులై బయలుపడఁగ,
శిలలు గుల్లలు నిసుము చిప్పలును దక్క,
నెసఁగి యాతోయ మీతోయ మే గ్రహింతు. ౧౩౨

క, అని సంరంభ విజృంభణ
మునఁ దత్సలిలంబు సకలమును బాణితలం
బున నిలిపి లీల నాపో
శనముగఁ గొనఁ బూని దశదిశల్ గనుఁగొనినన్, ౧౩౩

మ. జలధుల్ పిండలివండుగాఁ గలఁగె, భూచక్రంబు క్రుంగెం, దిశా
వలయం బల్లలనాడె, గోత్రశిఖరివ్రాతంబు గంపించె, ను
ల్కలు దుల్లెం, గగనంబు బిట్టదరె, నర్కస్ఫూర్తి మాసెన్, మదిం
దలఁకెన్ వజ్రి, విరించి వంచెఁ గృతచింతన్ వక్త్రపంకేజముల్, ౧౩౪

వ. అయ్యవసరంబున ౧౩౫

తే. పలప దుడుగుము యూసురి పలపపర్చు
యుట్టి యనుచితకృత్య మూహింప నీకుఁ

దగునె యనుచు ధారాధరధ్వానధీర
మైన వాక్యంబు వీతెంచె నంబరమున ౧౫౬

క. ఆపలుకు తేటపడ విని
యేపున మునుఁ గ్రోలఁ గేల నిడి పూనిన త
ద్ద్వీపవతిజలము చలమునఁ
దాపసవర్యుండు వదలెఁ దత్క్షణమాత్రన్ ౧౫౭

వ. అప్పుడు మఱియు నంతరిక్షంబున నంతర్హితుం డైన దివ్యపురుషుం డతనితో నీక కాదు కవేరకన్యక సకలభువనమాన్య దీని సామాన్యంగా దలంప వలవ దమృతప్రాయంబు లగు నీతోయంబులు ప్రజాజీవనోపాయంబులై ప్రవర్తిల్లెడు, నదియునుంగాక - పుండరీక మండల మధ్యమండనాయమానంబై దురంతదుర్భరాతప సంతప్త జంతుసంతానంబునకు నిరంతరచ్ఛాయానోకహంబై సనకసనందన ప్రముఖప్రసిద్ధ సిద్ధముని శుద్ధాంతఃకరణ సిద్ధాంతీకృత సుకృతవస్తుసారంబై రామాభిరామహేమ దామాకలిత హరి నీలమణి కరండంబై శేషశయనంబు శ్రీరంగంబు శ్రీరంగధర్మం బను నామంబుల భవ్యంబై నదిగా నవ్యయంబైన దివ్యధామంబై తదుభయ ప్రవాహ పరిపాలితంబై మెఱయునది గావున నీపుణ్యతరంగిణి సరస భాజనం బైనది గాని విరసభాజనంబుగా దనిచెప్పి యూరకుండె వెండియు ౧౫౮

క. ఆదివ్యపురుషవర్యుం
డాదరమున నితనితో మహామునివర యీ
ఖేదమును మాని మది నీ
కేది ప్రియం బదియె వేఁడు మిచ్చెద ననినన్ ౧౫౯

ఉ. అచ్చెరువంది సంయమి కులైకవిభూషణుఁ డేక్రియం బ్రియం
బిచ్చెఁ దలిర్పఁ బల్కె నతఁ డెవ్వఁడు తద్వచనంబ కానిరూ
పెచ్చటఁ గానఁబోల దిది యెంతయునుం గలవో యథార్థమో
చెచ్చెర నాదుపూన్కి వృథసేయఁగ నున్నన విష్ణుమాయయో, ౧౬౦

వ. అని యివ్విధంబున, ౧౬౧

క చింతింప మఱియు నంతట ౧౬౨
నంతర్హితుఁ డైనదేవుఁ డాతనితో నీ
కింత దగుదాయ మేటి క
నంతగుణా వేఁడు మిష్టమని పల్కుటయున్, ౧౬౩

ఆ వె. ఆసుబోధుఁ డలరి యఖిలేశ! నీకు నా
దెసఁ బ్రసాద బుద్ధి యెసఁగెనేని
నిన్ను నెఱుఁగ జెప్పి నీదివ్యరూపంబు
సొంపుమీఱ నాకు జూపవలయు ౧౬౪

వ. అనిన నప్పరమేశ్వరుం డతని కిట్లనియె, ౧౬౫

క దేవాది చతుర్విధ భూ
తావళిఁ బొడమింపఁ బెంప నడఁపం బతినై
యీ విశ్వము నాధారం
బై వెలయుదు నిత్యసుఖపరాయణ లీలన్, ౧౬౬

చ. నినుఁ జరితార్థుఁ జేయుమతి నేఁడు ప్రసన్నుఁడనై మదీయమై
యొనరిన దివ్యరూపమహి మోన్నతిఁ జూపితిఁ గాని సారసా
సన పురశాసనాదులును జాలరు గానఁ బ్రసన్నులైన స
జ్జనులకుఁ దక్క నన్యులకు శక్యమె నిక్కము నన్నెఱుంగఁగాన్, ౧౬౭

వ. అని యాక్షణంబ. ౧౬౮

మహాస్రగ్ధర.

బహుభాస్వద్భానుసమానప్రభలు నభమునం బర్వ, వార్వాహగర్వా
సహనీలాంగద్యుతుల్ భూషణమణితతి మించన్, లసద్వైజయంతీ
సహితోరః కౌస్తుభాంశుల్ జడిగొనఁ గనకాచ్ఛాదనం బొప్ప, శౌర్యా
వహచంచద్దోస్సహస్రావలి మెఱయ బలిధ్వంసి ప్రత్యక్షమయ్యెన్, ౧౬౯

ఉ. లప్పుడు తన్మనోహరభయాపు ఏన్ప్రఘపుర్విశేషముం
పప్పక చూచి నోటి ప్రసుపటు భయంబును విస్మయంబు లో

ముప్పిరియై పెనంగొన సుబోధుఁడు దీపిత సుప్రబోధుఁడై
యప్పరమేశు నిట్లని సమంచిత భక్తి నుతించె నమ్రుఁడై, 120

సీ. సర్వేశ! సర్వజ్ఞ! సర్వభూతప్రియ!
శరణాగతార్తి సంహరణ! నిరత
మధుదైత్యదుర్మద మథన! సమస్త క
ళ్యాణ స్వరూప! పరాపరాత్మ!
భవదీయముఖమునఁ బావకుఁడును దృష్టిఁ
జంద్రసూర్యులును భుజముల దిశలు
కళలు శ్రోత్రంబుల గగనంబు నాభిఁ జ
రాచరాత్మక మైనయవని పదము.

తే. లందుఁ బెంపొందుచుండు ధరాదిపంచ
భూతములు, బుద్ధ్యహంకారములు మహత్తు
ప్రకృతిపురుషులు దగముక్తి పరమ మగుచు
నెగడు నాపరంజ్యోతియు నీవ దేవ 121

చ నెఱనగుభక్తి నొండొకటి నేరక సర్వశరణ్య నిన్నుఁ బ
ల్మఱు వినుపించుచున్ మదిఁ దలంచుచు మ్రొక్కుచు నుండు నెవ్వరె
త్తెఱగునైన నట్టి సుకృతిప్రకరంబునకెల్ల మెట్టలుం
గిఱుతలబంటిగాదె పరికింప భవాంబుధి సత్కృపానిధీ! 122

క. దివసాగమవికసితసిత
నవసారసదళవిశాల నయనంబులు వా
సవసామజపంచాసన!
భవసాగర మగ్ను నన్ను దాలింపు హరీ! 123

వ అని ప్రస్తుతించి యప్పుండరీకాక్షుతో నతండు దేవా! నీవు నాయెడఁ బ్రస
న్నత వహించితేనియు నిఖిలవిరోధంబైన మదపరాధంబు సహింపు సహింపు
మాచక్రవాళాచలా చక్రవాళంబులై, సుకృతాలవాలంబులై, దురంత
దుష్కృత సంహరణ సమర్థంబులైన తీర్థంబు లెల్లకాలంబు నీసరిత్కూలం

బుల గలసి మెలసి -చరింప ననుగ్రహింపు మీధునీవారి జేరిన యనాధునీ వారిగఁ గలపి యనుగ్రహింపు మీప్రదేశంబున నొనర్చుజపతపోహోమ దానంబు లక్షయసుఖ నిదానంబులుగాఁ బ్రసాదింపు మని వినయ వినమితోత్తమాంగుడై యూరకున్న నన్నలినోదరుండు సాదరుండై యతనిమనోరథంబు లవితథంబులుగా నొసంగి మఱియును, ౧౭౪

క. ధరణీసుర నన్నెఱుఁగుము
పరాత్పరుఁ బ్రధానపురుషుఁ బరు నాద్యుఁ జరా
చరభూత జాత భయసం
హరు నారాయణు నమేయు నవ్యయుఁ గాఁగన్. ౧౭౫

తే. నిఖిలకర్తయు భోక్తయు నేన కాక
లేదు నాకంటెఁ బర మొక లేశమైన
నెంతవారును నాతెఱఁ గెఱుఁగలేరు
సకలలోకనియంత్రి మత్సహజశక్తి. ౧౭౬

వ. అని యఖిల భక్తమనోరథానుసంధాయకుఁ డగు శ్రీరంగనాయకుఁడు తానగుట తేటపడుటకై యతని కాత్మావతారకథావృత్తాంత మాద్యంతం బును దెలియ నానతియిచ్చె నత్తెఱం గెఱింగించెద నాకర్ణింపుము, ౧౭౭

క. ఏలావన హరిచందన
జాలాభినవప్రసూన సౌరభ విలస
ద్వాలానిల మృదులీలాం
దోళిత కల్లోలమైన దుగ్ధాబ్ధిపయిన్ ౧౭౮

మ. అఖిలప్రాణిహితైకబుద్ధి నురగేంద్రానల్పతల్పంబునన్
సుఖలీలన్ శయనించియున్న హరిఁ దేజోమూర్తి, నాతాపసో
న్ముఖుఁ గల్యాణకరుం గుఱించి దివసంబుల్ పెక్కు భక్తిం జతు
ర్ముఖుఁ డత్యుగ్రతపం బొనర్చినఁ గృపాపూర్ణ ప్రసన్నాత్ముఁడై

క ఆలోక పితామహునకు
నాలోకన సముధికోజ్జ్వలాకృతి పటుభూ
పాలోక మెసఁగ నవ్విభుఁ
డాలోఁ బొడచూపి వేఁడు మభిమత మనినన్. ౧౮౦

తే. లీలఁ జాఁగిలి మ్రొక్కి, కెంగేలుఁగవలు
ఫాలభాగంబునందున గీలుకొలిపి,
బహువిధంబుల వినుతించి, పద్మభవుఁడు
వేడ్కఁ దనకోర్కి యిట్లని విన్నవించె, ౧౮౧

ఉ. నేరెడుపండుచాయ రవణించెడు మేనఁ బదాఱువన్నెబం
గా రొఱఁబట్టు పట్టుఁ, బసగందని తామరరేకు మైసిరుల్,
దోరణఁగట్టి యేలు కనుదోయును, బొంమకు సుద్దియై మెఱుం
గారు సురంబు కెంపు, దయనానిన యుల్లము చల్లచూపులున్ ౧౮౨

క. అలరిన లలితాకృతి నా
తలఁపున నెలకొల్పినట్లు దైత్యాంతక ! యి
మ్మల నెల్లప్పుడు కనుఁగవ
ఁలరఁ గనుంగొనెడిభాగ్య మంటింపఁగదే. ౧౮౩

వ. అని ప్రార్థించిన నాశ్రితవత్సలుం డగుశ్రీవత్సలక్షణుం డతనిదెస నెసఁగు దయావిశేషంబున నట్లకాక యని యానతిచ్చి యంతర్హితుం డయ్యె ననంతరంబ. ౧౮౪

సీ. ధ్వజగరుత్మద్దేహ ధగధగద్యుతులు లో
కాలోక చరమాంధకార మణఁప,
స్వచ్ఛముక్తాతపత్రచ్ఛాయ లసమయ
చంద్రికావిలసనోత్సవముఁ జూపఁ
బటుశాతకుంభ శుంభత్స్ఫూర్తు లంభోద
పథసూనఁ గుంకుమప్రభలు నెఱప
మహనీయతోరణ మణిమయస్ఫూర్తియు
గోచరప్రతతి చూడ్కులు మరల్ప

తే. సుదధి నావిర్భవించె సముద్యదధిక
దివ్యతేజోవిశేష దేదీప్యమాన
పద్మ గర్భాండ భాండ ప్రచండ మగుచు
మంగళం బైన శ్రీరంగమందిరంబు, ౧౮౫

శా. ఆదివ్యాయత నోపజీవు లయి దుగ్ధాంభోధి మధ్యంబునం
ప్రాదుర్భావము నొంది రచ్యుతదయాపాత్రత్వమిత్రుల్ భవ
చ్ఛేదావాప్తసదా సుఖోదయులు రాజీవప్రభూతేంద్రము
ఖ్యాదిత్యప్రకరార్చనీయు లగు నందాదుల్ మనోజ్ఞాకృతుల్, ౧౮౬

తే. వారితోడనె వైకుంఠవాసులై ప్ర
సిద్ధు లైన సనందాది సిద్ధమునులు
నమరగంధర్వ కింపురు షాహియక్ష
గరుడ విద్యాధరాదులు గానఁ బడిరి ౧౮౭

వ. అయ్యవసరంబున, ౧౮౮

సీ. రావించె నిరవద్య రావ నారదవాద్య
కలిత తుంబురు హృద్యగానవిద్య,
మెఱసెఁ గింకిణీరావమిళితమై దివి దేవ
సతులనర్తన భావగతులరేవ,
బలసె దివ్యానేక భవ్య స్తవశ్లోక
ముఖరమై యెడలేక మునులమూఁక,
తొరఁగెఁ బైపైఁ బెల్లు తొలువాసనలఁ జల్లు
పరువమై వికసిల్లు విరులజల్లు
తే. పొరసె నమృతాంబునిధిఁ దేలి పుప్పొళాలి
దైవతోద్యానవనకేళిఁ దనరు గాలి
యఖిలకల్యాణమూల మోక్షాలవాల
రంగజననాతి వేల సంరంభవేళ, ౧౮౯

వ. అప్పుడు ౧౯౦

సీ. ధరియించెఁ దద్దివ్యధవసంబు ఖగరాజు
కరిన బంధురతర స్కంధపీఠిఁ
బట్టె దర్వీకర ప్రభుఁడు శ్వేతచ్ఛత్ర
మురుఫణామండల స్ఫురణ మెఱయ,
నిడిరి వింజామర లిరుగెలంకుల జోక
యై సుధాకరుఁడు సహస్రకరుఁడు,
బకలంబు సేసె హాటక వేత్రపాణియై
తఱిమి విష్వక్సేన దండనాథుఁ

తే. డలిక ఘటితహస్తాబ్జులై యంతనంత
బలసి కొలిచిరి సకలదిక్పాలవరులు
వచ్చె శ్రీరంగధామంబు వచ్చెననుచుఁ
జదలఁ గొదలేక కాహళస్వనము లెసఁగె ౧౯౧

వ. ఇవ్విధంబున స్వయంవ్యక్తంబును దేశోమయంబును, ప్రణవస్వరూపంబును, ప్రభూతవైభవాభిరామంబును, నగు శ్రీరంగధామంబు దృగ్గోచరం బగు టయు దిగ్గున గ్రమ్ము సమ్మదామృతరసంబునఁ బులకాంకురంబులు దలఁ కొనఁ గనకనికషసుషమావిశేషంబున కుపమేయం బగుఛాయం బొలుచు కాయంబు భూభాగంబునఁ జాగిల్లఁ బ్రణమిల్లి శారదాపల్లభుండు యుగప దుల్లసితచతుశ్శ్రుతి ప్రయుక్తంబులగు సూక్తంబుల నభినుతించె, నంత నఖిలగుణగణ ప్రశస్తుండును వేత్రహస్తుండును నగుచు నందుం డాశతా నందునకు నమ్మహనీయ మందిరంబుఁ జూపి యిట్లనియె ౧౯౨

మ. అరవిందాసన నీతపంబు ఫలితంబై తోఁచె, లక్ష్మీమనో
హరు గేహం బిదె చూడు, లోచనము లింపారంగ నీరంగమం
దిర మయ్యిందిరతోడఁ గూడి యచురక్తిన్ యోగనిద్రాళుఁడై
హరి యున్నాఁడు జగత్కుటుంబ పరిరక్షాయత్త చిత్తంబునన్ ౧౯౩

వ. అని నిర్దేశించినఁ గనకగర్భుండు నిర్భరానందంబునఁ దత్ప్రదేశంబు డాయం జనునప్పు డూర్ధ్వాధస్స్థలంబులఁ గనకమహిమండలంబులును, మధ్యభాగం బున శ్రీదేవియు, నభ్యంతరంబున ననంతభోగియుఁ, బ్రతిహారాంతికంబున

జయవిజయులుఁ, బార్శ్వంబుల దుర్గాహేరంబులును, శిఖరంబునఁ బ్రణవ స్వరూపిణి యగు భారతియును, గనకకలశంబుల నామ్నాయసముదాయం బును, నాసాముఖంబున రహస్యజాతంబును,బాదతలంబులఁ గ్రతుప్రతతియు, సంగపశీసంచయంబుల యజనంబును, నుదరంబున నావిర్జలంబును, మఱియు నెడనెడఁ బాకశాసన పరేతరాజ పలలాశన పాశపాణి పవమాన పౌలస్త్య పాశుపతులును నాదిత్యరుద్రమరుదశ్విని విశ్వదేవ సిద్ధసాధ్యులును, సప్త ర్షులు నక్షత్ర గ్రహతారకంబులు- నాదిగాఁ గల చరాచర భూతజాలంబు లెల్లను దోచినఁ బరమాద్భుత సంభ్రమంబులు డెందంబున సందడింప నద్దివ్య మందిరంబునకుఁ బ్రదక్షిణాభివందనంబు లొనర్చి యభ్యంతరంబుఁ బ్రవేశించి యందు, ౧౯౪

సీ. తలగడగా నిడి తలమూఁది వలచెంపఁ
గుడిహస్త మెత్తుగా విడిన వాని,
మేలిచేఁ దొడవుల మెఱుఁగు దాపలు మించు
పెలకేలు కటిఁజూచి మెఱయువాని -
సిరిమేనిపొందునఁ జిత్తంబు సొగయింప
నరమోడ్పుఁగన్నుల నమరువాని,
నాకుంచితోన్నతం బగు వామపదమున
బిరుదు నూపురము శోభిల్లువాని,

తే. మొలక నగవులఁ దెలివొందు మోమువాని
మెఱపు గల మేఘరుచిఁ బొల్చు మేనివాని
నురగశయ్యపై నొదికిలి యున్నవాని
సకలశుభదాయి శ్రీరంగశాయిఁ గనియె, ౧౯౫

వ. కని యప్పరమేశ్వరు నిత్యనిరతిశయ నిరుపమ నిరవధిక లావణ్య సౌందర్య సౌకుమార్య చాతుర్య స్థైర్యగాంభీర్య సౌశీల్య వాత్సల్య తేజః ప్రభావ సౌభాగ్యసౌహార్ద దయాద్యనంత కల్యాణ గుణామృత సాగరాంతర్నిమజ్జ దఖిలావయవ సుఖానుభవ సముత్కటానంద పరిపూర్ణ మానసుండై, పునః పునఃప్రణామంబు లాచరించి-నితాంతభక్తి వినయ వినమ్ర దేహుండై యిట్లని స్తుతించె, ౧౯౬

దండకము :-

జయజయ జగదేకకల్యాణ భావానిశత్రాణపారీణ నిష్కారణాపారకారుణ్య రత్నాకరా! శ్రీకరామ్నాయసారాభిధానామృతాసార శాంతాఘసంతాపయన్ తాపసౌఘా స్తపోభిర్భజంతే యజంతేచ నిశ్శ్రేయసోద్యోగినోఽష్టాంగ యోగాంచిత జ్ఞానయజ్ఞైః ప్రశంసంతివేదాగమాస్త్వాంవకాభూయ భూయః ప్రసాదాభిలాషీ సదా సేవతే దేవతానాంగణ స్త్వం సమస్తప్రతీతం గుణాతీత మాధారభూతం ప్రకృత్యాః సమానాధికోపేత మాద్యంతమేకం భవన్తం భజేఽహం, ప్రసన్నః సువర్ణధ్వజః ప్రత్యుషశ్చిత్రభానుప్రభాజాల జాజ్వల్య వచ్చక్రధారాలి భిన్నారివక్షః శిరఃకుల్యకైవల్య సామ్రాజ్య లక్ష్మీ సమర్థైక మూర్ధాభిషిక్త ప్రణామ త్వదాజ్ఞావహం విశ్వమావర్తతే! శాశ్వతం జ్యోతి రాకారలోకోత్కరం తత్త్వసంకల్పమాత్ర ప్రభూతాలి సంభూత భూతావకాశ్యం దిశానాథ తేజోముఖం మిత్రరాత్రీశ్వరౌ నేత్రయుగ్మం దిశశ్శ్రోత్ర మేషా ధరిత్రీపదౌ మాతరిశ్వాస నిశ్వాసభూతో నభోనాభి రావాసభూర్మస్తకం శ్రీఃకళత్రం మనోర్భూర్మనోఽహశ్చ రాత్రిశ్చ పార్శ్వేనిలింపాః ప్రతీకా స్త్వమేవాంతరాత్మాషడంగాని వేదాశ్చ ధర్మాణి శాస్త్రాణి సర్వాగమాః పాంచరాత్రం తథా సాంఖ్యయోగం తవాజ్ఞాహి వేదాన్తవేద్య స్త్వమేక ప్రసాదోఽహ ముగ్రస్త్వదీయాతిరోష స్త్వదన్య త్పరం నాస్తి నీహారభానూబృహద్భానురంభోజినీ బాంధవో గంధవాహః ప్రమత్తాభవన్తే ప్రభీతాః ప్రయాన్తి ప్రజాస్వన్వహం మృత్యురభ్యేతి మర్త్యేషు కాలేజనిష్వత్వమేవాఖిలం వాభవంతం భవచ్ఛాస్య బాహూరుపాద ప్రభూతం మహీదైవతక్షత్ర విట్ఛూద్రజాతం సవర్ణాశ్రమాచార ధర్మస్త్వ మేవ త్వమేవక్రతు ర్విశ్వమూర్తే సుధీనాథమీనాకరాధీప హీహా సురాధీన మానాధికానూన నానాగమాదానసూరాయ మత్స్యావతారాయ ధీరామృతాహార వీరార్ణవక్షీర పూరార్పితోదార భారాచలా ధారరూపాయ కూర్మ స్వరూపాయ సర్వం సహోఖర్వదుర్వార దోర్గర్వ నిర్వాహవత్పూర్వ గీర్వాణ భూతోర్వ రోద్ధార లోలాయ లీలాధికోలాయ కాలానలాలోల కీలాసముత్తాల ఫాలాక్షశోః స్థూల శూలాధికాభీల భాస్వన్నఖాళీఢతారాతి దేహాయ లక్ష్మీనృసింహాయ ధీమన్మునిస్తో మసామస్తుతవ్యోమభూ మర్త్య భుగ్ధామసీమక్రమస్థేమరాజత్పదా

జ్జాయ మాయావికుబ్జాయ పుత్రా ప్తసన్మిత్ర గోత్రా నిత్యక్షత్రగాత్రావలిచ్ఛేత్రృ పత్రావలీ చిత్రబాహాకురారాతి భీమాయ రామాయ చండాభ్రవేదండ శుండాభదో ర్దండకాండాసనాఖం కాండాహృతోద్దండ పౌల స్త్యకంఠప్రకాండాయ, కాకుత్స్థ వంశ ప్రకాండాయ కోపావమానాపతే పామర క్షేపతాపారి కృత్యాపరూపావలీ తాపకేళీ సతృష్ణాయ కృష్ణాయ వైహాయసవ్యూహ గోహారిసన్నాహబాహాబలో త్సాహనీహారరుగ్వాహదుర్లక్ష్య రక్షః పుర క్షోభకర్మప్రబుద్ధాయ, బుద్ధాయ, ంషాగ మద్వేషభాషాతి దుర్వేషయోషావధాతోష మేషాది దుర్దోష శీలస్ఖలద్ధర్మ సంస్థాపహేల్కాయ కల్క్యేహయా యాప్రమేయాయ-కించామితానంత లీలా వతారాయ తుభ్యంనమో దేవతుభ్యం నమః, కలశజలధి మధ్యచంచత్సిత ద్వీప రత్నాగ్ర వైకుంఠపూరుజ్వల ద్దివ్యసౌధాతికాంతే సభాన్తే భవనం, నిశారంభ సంఫుల్ల నీలోత్పలశ్రీ విశాలాంగ లావణ్య విభ్రాజమానం నతామర్త్య దైతేయ నాగావతంస ప్రతాన స్ఫురత్పీన భాగోచితాభ్యాం సరోజధ్వజచ్ఛత్ర చక్రాదిచిహ్నైః పదైరంకితాభ్యాం ప్రభాసంపదాభ్యాం పదాభ్యాం మనోజ్ఞం స్వరామ్నాయ మంజీర పాళిక సత్పద్మరాగ ప్రకాశాప్తృతాంసం తటిన్మూ్నతన ద్యోతి ధౌతాంబరాంచత్కటి మండలాబద్ధ కాంచీకలాపం సుధావర్త గంభీర సుస్నిగ్ధ నాభిప్రభూతాయత శ్వేతపద్మాభిరామం, లసత్కౌస్తుభ శ్యామల శ్రీతులస్యామిళద్వైజయన్తీసమేతోరువక్షఃస్థలీకం, వరానర్ఘ కేయూరవజ్రోర్మి కాద్యైః పరిభ్రాజితాజానుబాహుప్రకాండం రమాలింగ నోత్కీర్ణరత్నాం గదాంక క్రమైరుల్లసత్కంబుకంఠప్రదేశం, శరచ్చంద్రబింబప్రసన్నస్మితాస్యో లసత్కుండల లాలోకచంచత్కపోలం, పరంపక్వ బింబప్రభా పాటలోష్ఠం దరద్యోతిత స్వచ్ఛదంతాంశుజాలం, నవామోదినిశ్వాసనాసావిలాసం, దివాజృంభితాంభోజదీర్ఘావలోకం, సలీలానతభ్రూవిలాసం, సుఫాలం చలత్కుంచితానీల సత్కుంతలాంతం, సముద్భాసికోటీరచారూత్తమాంగం, సమస్తైకసౌందర్య సంపన్నిధానం, మహాభోగినో భోగమధ్యేనివణ్ణం సహైవశ్రియా సర్వసౌభాగ్యవత్యా సువర్ణాదిభిర్నిత్యశుద్ధైరనంతై రుపాస్యం,

సనందాదియోగీంద్ర బృందైశ్శరణ్యం, సదా సత్య సంకల్ప మీశం పురాణం విభుం, విశ్వభూతాంతరస్థం ఏనాన్యాశ్రయం వేద విద్భావయిత్వా మనస్యర్చయేద్భక్తి మాన్యం ప్రశంసంతి సంత స్తమేనో హరం, తేన తస్మై శుభం జాయతే కింబహూక్త్యైశ్శతస్తేన భావానువర్తీ

భవాన్, పరమపురుషస్త్వాం సజానాతి కశ్చిత్కథం విస్తరేణస్తుతిం కర్తు మీశో భవిష్యత్యుదంచన్మనీషః సహస్రాస్యమ్మఖేభ్యోపి పుంఖానుపుంఖా గతాశేష భాషావిశేష స్సశేషశ్చ శేషత్వమాపద్యతే శేషిణస్తే వచోగమ్య భావం విచార్యాసనచ్ఛత్రశయ్యా రూపేణవాచాలతా పంచవక్త్రాంచితోఽ నాతతైస్తర్కహారైః ప్రభిన్నప్రమాణైః ప్రకారైః పరిభ్రాన్తిమూలై ర్వికల్పాలవాలైః పరాభూత సంపాదితాతీతభేదై ర్మహాశాస్త్రసిద్ధాన్తవాదై రలంకింతు తాపత్రయోర్మిప్రచ్ఛిహసంధురే శోకమోహాదిదుష్టగ్రహాధిష్ఠితే। మోహకామాది లోభాదికావర్తజాతే మహాదుర్భవాంభోనిధౌ మజ్జతాం సారిలైకాగరిస్త్వత్పదాంభోరుహైకాంత భక్తిర్నకర్మప్రసక్తిం పరస్యా విరక్తిం భజాత్పాదయత్యేకనిష్ఠా గరిష్ఠామహామాయాంతి రంతిద్వితీయ్యా మలంప్యో సదాస్యాభిరేషా హృషీకేశ విఖ్యాతిశాయిన్ క్షణంపశ్యమా ముల్లసత్కుంభజారోయారంభ సంభూత వైమల్య గంభీరనీర స్ఫుర త్పుండరీకచ్ఛదాకార సౌభాగ్యశోభావహా గర్వసర్వస్వచోరై రుదార ర్నతా రూఢ రాగానుబంధై రివోపాంతరక్తై ర్దయాసంప్రయుక్తైర్మరున్మానినీమంగళా కల్పరక్షాధికారైకపుణ్యాతిదూరై రపాంగై ర్మమత్వం పితాత్వం త్వంగురు స్త్వంసఖా త్వంసమస్తం జితంతే ముకుంద ప్రసన్నార్తిహంత్రే జితంతే జగన్నాథ! గోవింద! విష్ణో! జితంతే - శ్రియః కాంతరంగాధిశాయిన్ జితంతే హరే వాసుదేవాదిదేవప్రసిద్ధ ప్రభో పాహిమాం పాహిమాం పాహిమాం ౧౫౭

శ్లో. శ్రీరంగేరుచిరాయస్య, శ్రీరంగేరుచిరాయతా
సదైవతః శరణ్యోనః సదైవత ముపాస్మహే ॥ ౧౫౮

చ. అని వినుతించినన్ సదయుఁడై మురవైరి దయామృతంబు నిం
డిన కడకంటిచూపు నిగిడించి విరించి భవద్వచః సమ
ర్చనమునఁ జాల నీడెనః బ్రసన్నుఁడనైతి వరంబు లెవ్వియై
నను నమ వేఁడు మిత్తు ననినం బ్రమదంబున నాతఁ డిట్లనున్. ౧౫౯

తే. అనిభరింపుము, నీనెప్ప డవిపరించి
నట్టి యీ విగ్రహంబు నే నహరహంబు

నెలమిఁ బూజింపఁ గోరెద, నిట్లు యొసఁగి
మఱుఁగులే కానతిమ్మనె తెలుఁగు నాకు ౨౦౦

క. నావుఁడు హరి యిట్లను నీ
భావమ్ము నెఱింగికాదె పద్మాసన యి
ట్లావిర్భవించితిని-ది
వ్యావసథముతోన కొలువు మభిమతభంగిన్, ౨౦౧

క. ఏనరుఁడు పంచకాల-ని
ధానంబున నన్ను శాశ్వతముఁ బూజించున్
వానికి నొసఁగుదు నమృత
స్థాన మనిన నెన్ననేల తక్కినపదముల్, ౨౦౨

క. ఈ నాళీకభవాండము
పై నావరణములమీఁదఁ బరమవ్యోమ
స్థానంబున నుండుదు నెపు
డే సప్రాకృతశరీర హితవిస్ఫురణన్, ౨౦౩

సీ. దేవతిర్యగ్జన స్థావరాత్మకభువ
నావలి లీలార్థమై రచింతు
నవి చేత నించుటకై సమస్తమునందు
జీవరూపమున వసించియుందుఁ
గర్మంబులకు లోనుగాక భూలావలిఁ
బ్రసరింపఁ జేయుదు బహువిధములఁ
దదను గ్రహార్థ మాత్మగతుండనై యుండి
జ్ఞానరూపమున విజ్ఞాన మడఁతుఁ
దల్లిగతి హితకారినై తనరి తిలలఁ
దైలమునుబోలె వ్యాపించి తమ్ముఁ గూడి
యున్ననైనను సురలు నాయోజ యిట్టి
దని యెఱుంగరు విపులమోహాంధు లగుచు, ౨౦౪

క. దివి నౌపేంద్రస్థానము
రవి మండలమును సుధాంబురాశియు ననఁ నే
నివసించు కందువలు మూఁ
డవుటఁ ద్రిధామాఖ్యఁ ముఖ్య మయ్యెను నాకుఞ్ ౨౦౯

వ. తత్త్రప్రదేశంబులందును రాజసతామసాత్ములకు దుర్విభావ్యుండనై యుండుదు వెండియు లోకానుగ్రహార్థం బొక్కొకయెడల నావిర్భవించియు నొక్కొక్క విభావంబునం దావేశించియు నొక్కొక్క రావుల జన్మప్రసంగంబు లంగీకరించి యుఁ బ్రతికల్పంబున నవతారసహస్రంబులు గైకొందు సత్త్వ యత్తులై మదేకచిత్తులయిన యుత్తములయెడఁ దద్గుణకర్మాభివృద్ధ్యర్థం బత్యంతరాగాసక్తుండనపోలె సకలంబు ననుసంధింతు, పితృపుత్రవాత్స ల్యంబుల నైనను మిత్రామిత్రంబుల నౌదవు రాగాపరాగంబులనైనఁ బ్రాణి స్తోమంబు నామీఁదఁ దలంపు గలిగి యేవిధంబున వర్తించు నావిధంబున కనురూపంబులు ధరియింతు, నవియునుంగాక ద్వీపవర్ష తీర్థాయతనంబులందు బ్రతిగ్రామ గృహంబుల ప్రతిపర్షంబుల దారులోహ శిలామయంబు లగు నర్చాభేదంబుల నుల్లసిల్లుదు నట్టియర్చావతారంబులు స్వయంవ్యక్త దివ్య సైద్ధమానుషంబులనఁ జతుర్విధంబుల మెఱయు నందు శ్రీరంగ శ్రీముష్ణ శ్రీవేంకటాచల సాలగ్రామ నైమిశ తోతాద్రి పుష్కర నారాయణాశ్రమంబులను నీయెనిమిదిస్థలంబులం గల మదీయమూర్తులు స్వయంవ్యక్తంబులు హస్తిగిరి వృషపర్వత చక్రతీర్థాది ప్రశస్తదేశంబులు భవధర్మ శతముఖ ప్రముఖ దేవప్రతిష్ఠితంబులైనయవి దివ్యంబులు, భృగుతీర్థ మందరక్షేత్ర చిత్రకూట ప్రభృతి పుణ్యస్థలంబులు, భృగుమరీచి మతంగజముని సిద్ధసంస్థాపి తంబులైనయవి సైద్ధవంబులు, విశిష్టాగమోక్త ప్రకృష్ట శుభలక్షణలక్షితంబు లయి శుచిద్రవ్యరచితంబు లయినయవి మనుష్యస్థాపితంబులై యున్నయవి మానుషంబులు, వీనిలో స్వయంవ్యక్తంబులై యున్నయవి వికృతిమయంబు లైనను బూజాతిశయంబునను బింబాభిరూప్యంబునను బ్రసన్నుండనై సాన్నిధ్యంబు వహింతు-మత్ప్రభావంబున నీస్వయంవ్యక్తాదులకుఁ గ్రమం బున ద్వితేర్థ (?) పాదయోజన మాత్రక్షేత్రంబు పరమపవిత్రంబునై యతిశయిల్లు. ౨౧౦

క శ్రీమెఱయ నెపట సాల
గ్రామ శిలార్చనము గల్గుఁ గల్యాణకరం

బై మహి నచ్చోటికి యూఁ
డామడ పుణ్యప్రదేశమై విలసిల్లున్, ౨౦౭

తే. తక్కు గలుగు గృహాళికిఁ దద్గృహంబు
పావనపం విను పురి వల్లె పదియు రెండు
నొక్కటన మధ్యమానము లుండెనేని
సాటి యచటు సాలగ్రామ శైలమునకు ౨౦౮

క. ఇల నెచ్చోటు మదర్చన
విలసిత పూజోత్సవాది విరహిత మగునా
నెలవు వెలివాడఁబోలెం
దలఁపఁ గనుఁగొనఁగ ననుచితము సుజనులకున్, ౨౦౯

మ. ఇవు దేఁజెప్పిన యీ స్వయంభువులయం దెల్లం గడు న్మేటియై
క్షపితాశేష దురంత దోషచయమై కల్పాంతర స్థాయియై
యపవర్గప్రద యోజనద్వయయుతంబై భవ్యమై, దివ్యమై
విపులశ్రీకర రంగధామ మమరున్ వేదాంతవిఖ్యాతమై ౨౧౦

మ. నరులైనన్ సురలైన దైత్యవరులైనన్ సన్నుతద్వాదశా
క్షరమంత్రైక పరాయణత్వమున నన్ సద్భక్తి సేవించినం
బరమైశ్వర్య సమగ్రభోగ వితతిం బ్రాపించి సర్వోత్తర
స్థిర వైకుంఠ పదంబుఁ జెందుదురు ప్రీతిం గర్మనిర్ముక్తులై ౨౧౧

క. పరమ మిది యొకరహస్యం
బరవిందజ వినుము మత్పరాయణు లెందుం
దురితములు పెక్కొనర్చియు
నరుగరు పటుఘోర నారకాధోగతులన్, ౨౧౨

క. గోపథ మాదిగఁ గల నా
నావిధ పాతకము లనుదినము మద్భక్తుల్
గావింపుచుండు రేనియు
సేవలఁ దద్దోషచయము నే హరియింతున్, ౨౧౩

ఆ.వె. తుది మదీయభక్తి మహనీయు లగు వా
చారులైన హీనజన్ములైన
వారి నితరబుద్ధి వారక నిందించు
వార లతి నికృష్ట వర్తనములు ౨౧౪

మ. ధరఁ బెంపొందిన మత్ప్రపన్నులను మద్భక్తంబైన శాస్త్రంబును-మ
త్పరమార్థంబగు మంత్రరత్నమును, మత్ప్రాణప్రతీకాశమై
నిరపాయం బగురంగధామమును దుర్నీతిన్ విచారించి-యె
వ్వరు దూషించుచు నుందు రాఖలులు జహ్నోర్చేష్టు ద్యద్గతిన్, ౨౧౫

క. మఱచియు శ్రీరంగంబున
నెఱుఁగని యజ్ఞాన మూఢు లెవ్వరు గల రా
మొఱకుల కిడు నశనాదులఁ
దఱికొని వనకమున కొసఁగదగు ననిశంబున్, ౨౧౬

క. వారక సకలజనంబులు
శ్రీరంగంబనుచు సంస్మరింపుదురేనిన్
నారక నాకము లనియెడు
నా రెండును ఖిలముగావె యరవిందభవా! ౨౧౭

తే. మర్త్యలోకంబునందు నంబరమునందు
నెప్పు డెచ్చట శ్రీరంగ మొప్పియుండు
నప్పు డా దిక్కు నను భక్తి నభిముఖుండు
గాఁగ నిలిచి నమస్క్రియాకారి యగును ౨౧౮

వ. అని యానతిచ్చి యాశ్రితనిస్తారకుం డూరకుండెఁ దచ్ఛాసనంబున వారిజాస నుండును నిశ్శ్రేయస నిదానం బగు నద్దివ్యవిమానంబు గొని సత్యలోక సీమాంతంబున విరజానదీప్రాంతంబున విశ్వకర్మ నిర్దేశంబున బ్రతిష్ఠాపించి, నిరంతరానురక్త దివ్యోపచారవిరాజిత పూజావిధానంబున నద్దేవుని నారాధించుచు నారాయణనక్షత్రంబునం బరమహర్షంబున బ్రహ్మర్షి సహాయుండై మహోత్సవం బొనర్చి, యవభృథానంతరంబున నింద్రాది బృందారకబృంద పరివృతుండై మందార మందారం బగు నానందకవాటి సందర్శనంబు గావించి, యావేళ నుదారస్వాంతుం డగు వివస్వంతునకుఁ

బాంచరాత్రంబు సమంత్రంబుగా నుపదేశించె నతం డౌరసుం డను వైవస్వత మనువున కొసంగె, నామనుండు తనతనయుం డగునిక్ష్వాకున కెఱింగించె, నాభూభుజుండు చతుర్భుజునిఁ దపోవిశేషంబున మెచ్చించి కమలభవ భువన సీమామందిరం బైన రంగమందిరంబు గొనివచ్చె, నివ్విధంబున నిజాన్వయ పరంపరాప్రాప్తంబైన యాదివ్యధామంబు రామభద్రుండు గుణసముద్రుం డగు విభీషణున కిచ్చె, నతనిచేత నది కావేరీతీరంబున నునుపం బడియె నని పారాశర్యుండు నాగదంతమునివరున కెఱింగించిన తెఱంగు, ౨౧౯

ఆశ్వాసాంతము

శా. బంధుప్రాంగణ కల్పపాదప! ధనుఃపాండిత్య కౌంతేయ! ద
ర్పాంధారాతి వసుంధరారమణ దుష్టామాత్య నీతిక్రియా
సంధాన ప్రబ లాంధకారపటలీ సప్తాశ్వ! శశ్వన్నభ
స్సింధుక్షీర పటీర నిర్మలయశః శ్రీవాసి తాశాంతరా! ౨౨౦

క. పన్నగశయనవర ప్రతి
పన్న గజప్రకర తురగ బహుధన మణిసం
పన్న గతకలుష సుజన వి
పన్నగ సుత్రామ! సుజనపావననామా! ౨౨౧

మాలిని. నమ దవనవిలోలా!నవ్య శృంగారజాలా!
ప్రమద కరవిలాసా!భాగ్యలక్ష్మీ నివాసా!
శమ దమ యుతభవ్యా! చారు విద్వన్నిషేవ్యా!
సమద రిపువిరామా! చాగయామాత్యరామా! ౨౨౨

గద్యము,

ఇది

శ్రీ మ ద్భ్ర మ రా ం బా
వరప్రసాద లబ్ధ సిద్ధసారస్వత
విలాసగౌరవ, గౌరనామాత్యపుత్ర
సు ధీ వి ధే య భై ర వ నా మ ధే య
ప్రణీతంబైన శ్రీరంగమహాత్మ్యం
బను పురాణకథయందుఁ
బ్ర థ మా శ్వా స ము.

# శ్రీరంగ మహాత్మ్యం

## ద్వితీయాశ్వాసము

క. శ్రీపతి కల్యాణ గుణా
లాప! సమున్నిద్ర భద్రలక్షణ విలస
ద్రూప! శశివిశద కీర్తి
వ్యాపిత దిక్సీమ! చాగయప్రభురామా! ౧

వ. అవధరింపు మఖిలకథాకథన చాతురీజనిత జనరోమహర్షణుం డగు వ్యాస శిష్యనందనుండు దివ్యబోధను లగు శౌనకాది తపోధనులకుఁ జెప్పె నట్లు—శ్రీరంగావతారప్రసంగంబు తెల్లంబుగా విని యుల్లం బనురాగిల్ల నాగదంత మునివర్యుండు-పారాశర్యుతో- మహాత్మా! సత్యలోకంబున లోకపితామహు నకు నిలువేల్పగు భుజంగతల్పుం డేకారణంబున నిక్ష్వాకుచేత నానీతుం డయ్యెఁ దద్వృత్తాంతం బంతయు సవిస్తరంబుగా నెఱింగింపు మనిన—నాసంయమీంద్రుం డతని కిట్లనియె ౨

శా. వైకుంఠాంఘ్రి సమర్చనాకలన హేవాకుండు లోకోత్తర
శ్లోకుం డార్తజనావనోదిత దయాలోకుండు ప్రత్యర్థిలుం
ఠాకుం డర్థిహితార్థదానగుణగణ్యశ్రీకుఁ డేపార-ని
క్ష్వాకుం డర్కకులామృతాంబునిధి రాకాచంద్రి కాలోకుఁడై, ౩

వ. ఆరాజశేఖరుం డాత్మగతంబున-

శా. దైవవ్యాకులి తాత్ములై-విషయచింతా మగ్నులై—రోషమో
హావేశావిల చిత్తులై-భవదవిద్యా మత్తులై-దుర్భవ
వ్యావృత్తిం బ్రసరించు మానవులభావం బింద్రియార్థంబులం
దావైరాగ్యము పొంది మోక్షపదవీ ధర్మం బపేక్షించునే. ౪

వ. మున్ను మత్పితృపితామహులైన వైవస్వతవివస్వంతు లమితానుభావు లగుటం—గమలభవలోకంబున కరిగి-యురగ గణార్చితుండై యురగరాజ

పర్యంకంబున వెలుంగు రంగమందిర సందర్శనంబు గావించి-నిరర్గళ భోగాపవర్గంబులం జెంది రందు మార్గంబు నాకు దుర్గమంబై యున్న దనిన నస్మత్పుత్రపౌత్త్రాదుల నెన్న నేల యిది గావున నాతెఱంగు పొంపపడు నంతకు నసురాంతకు భజియింతు నని చింతించి యనంత తపోనిష్ఠుం డగు వశిష్ఠున కంతఁదద్వృత్తాంతం బంతయు నెఱింగించిన నమ్మౌని సత్తముం డాన్నృపో త్తమున కిట్లనియె, ౭

క. ఈతలఁపు మేలు జనవర
నీతపమున సంభవించు నిజ మెంతయుఁ బ్ర
ఖ్యాత పురాతన మునితతి
చేతన్ మును వింటి - వినుము చెప్పెద నీకున్, ౮

చ. జగదుపకారబుద్ధి నరిశాసన! నీవు తపం బొనర్పఁ బ
న్నగపతిశాయి దివ్యభవనం బజుఁ డప్పుడు తాను దెచ్చి-నీ
కగణితభక్తి నిచ్చు-నది యాదిగ నీపురినుండు ధర్మపా
రగు లగు యుష్మదన్వయ ధరాపరు లెల్ల భజింపఁ బెంపునన్ ౯

క అటు కొంతకాల మరుగఁగఁ
బటువిక్రమశాలి రామభద్రుఁడు గుణలం
పటుఁ డగు విభీషణున కా
దఁట నొసఁగిన నిజపురమున కదిగొని చనుచున్, ౧౦

తే. నడుమఁ గావేరికడ దృగానందమైన
యిందు పుష్కరిణీతటి నిడి-కదల్ప
నలవికాకేఁగఁ గల్పాంత మందునుండి
బ్రహ్మలోకంబునకుఁ బోవు పార్థివేంద్ర! ౧౧

క. ప్రతికల్పము నీగతి నా
గతుఁ డగు దివినుండి భువికిఁ గమలోదరుఁ డా
శతధృతి దినములు చతిగెన
నతులిత నిజదివ్యపదమునందు వసింతున్. ౧౨

క. కావేరీ తీర్థ స్థితు
లై వెలసిన దాక్షిణాత్యులం దనిశము-ల
క్ష్మీప్రియుడు రంగశయనుఁడు
దా వదలఁడు కరుణ వారితప మెట్టిదయా ! ౧౨

క. ధారుణి గల నానావిధ
దారుణ దురితముః లొనర్చు తామసు లైనన్
శ్రీరంగ దివ్యదేశము
జేరఁగఁ గలిగినను ముక్తిఁ జెందుదు రధిపా ! ౧౩

క. క్రిమికీట విహగ మృగ తిమి
కమరాది ఖగోరగములు గను తమ తిర్య
క్త్వము దొలఁగి శాశ్వతస్థితి
యమిత శ్రీరంగమందు నావాసమునన్, ౧౪

క హరి కృప గల ఘనులకుఁ గడు
నిరవగు నానెలవు నిలుప నితరుల కెల్లం
బురహర జలజభవాదిక
సురకృత విఘ్నముల నచటఁ జొరరా దెపుడున్, ౧౫

మ వనజాత ప్రియవంశ భూపుల లసద్వర్ణాశ్రమాచార-వ
ర్తనులై-ధీధనులై - ముకుందపద సక్తస్వాంతులై - శాంతులై
ఘనులై సజ్జనులైన సాత్వికులు రంగక్షేత్రమం దెన్నఁ డెం
దును గ్రందై చరియింతు రప్పు దడఁగుం దుర్వారవిఘ్నావళుల్ ౧౬

వ అది గావున— ౧౭

ఉ. దక్షుఁడవై జగజ్జనహితంబుగ నిప్పుడుఁ బూని శ్రీమద
ష్టాక్షర మంత్రచింతనపరాయణ చిత్తుఁడవై - భజింపు మ
బ్జాక్షుఁ బయఃపయోధితనయాభినయాలస చారు చంచల
ద్వీక్షణ చంద్రికారుచుల వేడుకఁ జొక్కు చకోరవల్లభున్ ౧౮

వ. అని నిజకులగురుం డగు నయ్యతివరుం డుపదేశించిన హార్షించి-యతని
కభివందనం బొనర్చి - వీడ్కొని యమ్మహీకాంతుండు - సకాంతుండై -
కాంతారంబున కరిగి యచట నిర్ద్వంద్వుండును వశిష్ఠాశ్రమసమీపంబునఁ
దనదేవి పరిచర్య లొనర్ప నిష్పరిగ్రహుండును - నిశ్చలుండునునై తపం
బొనర్చు నంత. ౧౯

ఉ. తాఘనమయ్యె నల్లడ నిదాఘము, దూరనిర స్తచైత్రిక
శ్లాఘము, మార్గగాభిమత చండమయూఖ నిరోధ విస్ఫుర
న్మేఘము, తోయదానపరిమృష్ట మహోఘము, శుష్య దంబుమా
ర్గౌఘము, సర్వజంతువపు రుద్గత భూరినిదాఘ ముర్వరన్. ౨౦

సీ. అతిమరు ద్ధూత శాఖాన్యోన్యసంఘట్ట
నోద్ధాగ్ని దగ్ధదా వోత్కరంబు
చండభాను ప్రభాసహ సముజ్జృంభణా
టోప ప్రభిన్న గండోపలంబు -
మృగతృష్ణికా సమున్మిష దంబుధిస్ఫుర
దవిరతోదన్య నానాధ్వగంబు
తప్త తోయాశ యాంతర్లుర త్ప్రారీన
కమర నక్ర గ్రాహ సముదయంబు
తే. విటపకోటర సంలీల విహగకులము
నగలతాకుంజ విభ్రాంత మృగచయంబు
శాదనిర్మగ్న భూదార సైరిభంబు
నగుచు మించె నిదాఘసమాగమంబు ౨౧

క. ప్రాణికిఁ దను వొసఁగు జగ
త్ప్రాణ పయఃపాదపములు ప్రఘుప్తపరి
క్షీణములై కోరె జగ
త్ప్రాణపయఃపాదపాంతరంబులఁ దమకున్. ౨౨

క. మునికన్యార్పిత జలములఁ
దనుపగు తమపాదులందుఁ దరువులనీడల్.
గనుపట్టి నిలిచె దినకర
ఘనతర ఘరితాపభీతిఁ గదలనికరణిన్, ౨౩

ఉ. అట్టి యనేహముం గడపె నానృపకేసరి నాల్గుదిక్కులం
బిట్టు మిడుంగురుల్ జెదఱ భీకరవహ్నులు మండుచుండఁగా
నెట్టన మధ్యభాగమున నిల్చి పదాగ్రము నేలమోపి-మా
ర్వెట్టని చూపు లుగ్రకరబింబముపై నిడి యూర్ధ్వబాహుఁడై, ౨౪

వ. తదనంతరంబ-

మ. జలదాటోపవిశాల మింద్రధనురంచద్వారుణీకూల-ము
త్కలికాలంబ కదంబసాల వనమధ్యస్ఫారసవ్యావళీ
కలనావాల ముదారకేతకపరాగవ్యాళ ముర్వీధర
స్థలనృత్యన్మదకేకిజాల మగువర్షాకాలమొప్పెం గడున్. ౨౬

వ. వెండియు- ౨౭

సీ. శుంభదంభోధర స్తోమ భీమారంభ
గంభీర గర్జా విజృంభణంబు
దృగసహ్య చటుల దీధితిమత్సముద్దామ
సంకుల జీమూత సంకరంబు
ఝంఝామరుద్ధత స్ఫారధారాసార
నీరంధ్రతమ ధరణీనభంబు
రోధోనిరోధకాగాధపాథఃపూర
వాహినీ వర్ధిత వార్ధిజలము
తే. కర్దమస్థల చంక్రమక్రమ సగర్వ
దర్దురోత్తరవికట పృథగ్విధప్ర
భూత నిర్ఘోష బధిరితాశాతటంబు-
నగుచు మించె నభోనభస్యాంతరంబు- ౨౮

శా. ధారాళాంబుదబృంద నిర్భర నిరోధవ్యాప్తి నాశాంతముల్
భూరిధ్వాంతమయంబులైన జను లేప్రొద్దున్ రవిం గానమిం
డా రూహించుచునుందు రాఁకొనుట మధ్యాహ్నంబు-నుద్దామని
ద్రారంభఁబుఁ రేయిటం బగట బోధావాప్తిఁ బ్రత్యూపమున్ ౨౯

ఉ. ఆసమయంబునన్ విరహితాపరణం బగుచోటఁ బ్రౌఢష
ద్మాసనబద్ధ విస్ఫురితుఁడై బహులాశనిజాత పాతసం
త్రాసము లేక ఘోరిజలధారల నెప్పుడు దొప్పఁదోఁగుచుం
జేసెఁ దపంబు రాజకులశేఖరుఁ డక్షయధైర్యశాలియై, ౩౦

ఉ. అంత నిరంతరంబును దురంతసమున్నతిమంతమయ్యె—హే
మంత ముదారవిస్ఫురితమంజులమౌక్తికజాల రుల్లరీ
కాంతిలసత్తుషార కణికాపరిగుంభిత భిల్లభీరుసీ
మంతము దుర్దమక్రమవిమర్దిత పద్మవనాంత మెంతయున్ ౩౧

వ. మఱియును- ౩౨

సీ. ప్రత్యూషజృంభిత ప్రాలేయ దుర్లక్ష్య
మాణ పద్మభవాండ మండలంబు,
సంకులద్వాసర సమయ మందిరభవ
ద్యోత ఖద్యోత భానూత్కరంబు -
వితత నిశీధినీ వేళాసహస్రిత
శీతరుగ్బింబ విజృంభణంబు
శీతాంశు దుర్దినవ్రాత సంచితకరీ
షాగ్నిధూమావృ తాశాంతరంబు

తే, నగుచు నంతంత కెగసె నీహారధరణి
ధర సముద్ధూత నిబిడశీతల సమీర
ణాభిసంపాత జాత మాయాతభీత
జంతుసంతాన మగుచు హేమంత మంత, ౩౩

తే, హిమముచే నంబరం బెల్ల నిముఱుగొనఁగ
నష్టకరుఁడును గరము లొయ్యొయ్య సాఁచి,
తాను ననలాంశ ధరియింపఁ బూనె ననఁగ
నెంత యనవచ్చు నింక హేమంత మహిమ, ౩౪

శా. ఆహేమంత దినంబులం ధరణిపాలాగ్రేసరుం డద్భుతో
త్సాహాటోపముసం గళద్వ్యయసపాథఃపూర మధ్యస్థుఁడై

యాహారంబు జలంబుగా నచలదేహస్వాంతుఁడై నిర్జర
వ్యూహంబుల్ వెఱఁగందఁగా మెఱసె నత్యుగ్రప్రకారంబునన్. ౩౫

వ. అంత — ౩౬

ఉ. సంతత పుష్ప సౌరభ సుజాలదిగంతము - పాంథపఙ్క్తిభి
త్యంత, ముదాత్త మత్తపిక ఘోషిత మన్మథరాజ్య వైభవో
దంతము, జంతుజాతసుఖద స్థితిమంతము, దూరధూత హే
మంతము, సంతతార్తిగ సమగ్రతఁ జూపె వసంతమంతటన్. ౩౭

వ వెండియు - ౩౮

సీ. కలకంఠ మధురవాగ్వైఖరీకారణ
మహిత సారస్వత మంత్రవిద్య -
నానావనీజాత నవయౌవనప్రదాం
చిత రసాయనయోగ సిద్ధఘుటిక
కుసుమసాయక నిరంకుశ రాజ్యసప్తాంగ
సన్నాహ వైభవాస్థానసీమ
మందమందాగత మలయానిలాంకుర
వ్యాపార సులభ ఫలాపఫలంబు

తే. చేతనద్వంద్వ సౌఖ్యసంజీవకరణి
విరహి దశమదనావేశ విషమవేశ
శిశిరమదకుంభి సంరంభ సింహమూర్తి
లీల నేతెంచె మధుమాస కాలమంత - ౩౯

ఆ వె పసిమిఁ దాసి, ముదిరి, పసరింకి, పరుసనై,
పటుపు మిగిలి, తుదలు పగిలి, తలఁకి,
పండి, తొడిమ లెడల నెండుచుఁ గారాకు
డుల్లెఁ దరుల రవము పెల్లుగాఁగ, ౪౦

క. కారాకు రాల లేఁజిగు
రీరిక లెడనడఁగి శాఖ లేక విధంబై

వే రెఱుకపడక యుండెను
భూరుహములు కొన్ని దివసములు వనవీథిన్, ౪౧

వ. తదనంతరంబ- ౪౨

సీ. గుమురులై నయముదూకొని మోసు లెడరి లేఁ
జిగురాకు వెట్టి కెంజిగిగి దలిర్చి,
జొంపముల్ గొని జగజంపుగాఁ బొదిలి, క్రొ
న్ననలొత్తి మొగ్గలఁ దనరి, నిగ్గు
దులకించి, మొగడలు ద్రోచి శోరేకులు
బిగిసి తుదల్విచ్చి నిగిడివచ్చు
పూవుగుత్తుల మించి పూఁపల నిండారి
పిందెలై యొగరెక్కి, పెరిగి పులుసు
తే. మిగిలి కరిగట్టి కలఁగి, దోరగిలఁ బాఱి,
యూరఁ బండిన ఫలముల నమరు గెలల
ప్రేఁకదనమున గొమ్మలు విఱ్ఱవీఁగి
పరగెఁ దరువులు కిన్నల పండు వగుచు ౪౩

చ. గునియుచు గుజ్జమావి నెలఁగొమ్మల నిమ్మలవ్రాలి సోఁగలేఁ
గొనలు దెమల్చి కెంజిగురు గుంపులు లంపులుమేసి క్రొవ్విరి-పిఁ
కను నొగరెక్కి డగ్గపడుకుత్తుకలం గొదలేని నూతన
స్వనములు పంచమశ్రుతుల జట్టికొనం జెరలించెఁ గోవెలల్ ౪౪

ఉ. మెకమునం గ్రొత్తనెత్తురుల మించు నుచుంబులి గోరుబాగు-సొం
పుకుఁ బసఁజూపు వాఁడి కొనముక్కునఁ బక్వఫలంబు లొత్తి యుం
జక వెసఁ గ్రమ్మి తియ్యనిరసంబులు కుత్తుకబంటిఁ గ్రోలి-రా
ట్చిలుకములు పొతరించి రొదచొప్పడ నెల్లెడఁ బల్కఁ జెల్లుగన్, ౪౫

చ. లరవిరి కమ్మఁదమ్మి విరులందుల నెందును సోడుముట్ట న
బ్బురముగ నుబ్బి మేలివలపుల్ పసిఁగొంచుఁ ప్రూఁగి లో
గుఱువులు వాటి కర్ణికలఁ గొందులవాచవు లూరు తేనె ము
మ్మరముగఁ గ్రోలి యన్నుకొని మూసక రుమ్మని మ్రోసెఁ దుమ్మెదల్ ౪౬

చ మిలమిలమంచు మించు చలి మించుల ముద్దులచందమామ–కాం
తులఁ దులఁదూఁగుక్రొమ్మొలకతూఁడుగొనం గబళించి త్రుంచి వి
చ్చలవిడి మేసి గబ్బుఁగొని సమ్మదనాదము లొప్పఁజేసి లీ
లల మలసెం గొలంకులకెలంకుల రాజమరాళదంపతుల్. ౪౭

సీ, తళుకుసుపాణి ముత్యాలమించుల మించి
మెలయుచుక్కల మేనిమెఱుఁగుఁ దఱిమి,
కలికిరాయంచఱెక్కల రేవగిలుమాడ్కి
విరిమల్లెగుత్తుల మురువుఁ దెగడి
చదువుతొయ్యలిమేని చాయ నుల్లసమాడి
వెలిదమ్మి మొగడల తెలివి గెలిచి
జిగిమీఱు తొగరెక్క సిరులకు నసమిచ్చి
పాపరాయనివన్నె కేపుచూపి

తే, పాలమున్నీటి తరఁగల పసలు పండి,
కొండయల్లుని మైతెల్పు కొంచపఱచి.
కుప్పతిలు చుట్టుగొండపైఁ గొనలుసాఁగి
వెలఁది వెన్నెల తెల్లన వెల్లివిరిసె, ౪౮

ఉ, సారఁపుఁదేటవెన్నెల రసంబులు మేలిమి సల్లగల్పపూఁ
గోరల నించి చందనపుఁగుబ్బలిపైఁ జమదెంపుగాడ్పులన్
సారెకుఁ జల్లజేసి మృదుచంచుపుటంబులచేఁ జకోరములన్
కోరిక నిచ్చె మచ్చిఁగఁ జకోరిక లింపులఁ గోరగించఁగన్, ౪౯

ఉ, గండపుఁగొండ నెత్తముల కందువ నేలకితీవయుండ్లలో
గెందలిరాకుపాన్పున సుఖించి నితాంతరతిశ్రమంబులం
జెందిన చెంచుగుబ్బెతల చెక్కులఁజిమ్ము జవాదివాసనల్
విందులుసేయుచున్ మెలఁగె వేమఱుఁ గోమలగంధవాహముల్ ౫౦

వ. అట్టి వసంతసమయంబున నవ్వనంబున దపోనివసితాశయంబున
వర్తించు నమ్మార్తాండకులమండను తేజఃనుభావంబు భావం
బులు గలంప నిలింపు లాత్మపదభ్రంశనాశంక నందఱు పురందరు

పాలికిం జని యత్తెఱం గెఱింగించినఁ గించిశానతముఖుండై శత
మఖుం డంతరంబున దత్త్వతభంగంబుసేయ నుపాయంబు విచా
రించి పంచశర సంచలిత జగద్ధీరతావైభవుం డగుమనోభవుం
దలంచిన తత్క్షణంబ— ౫౧

సీ, కప్పారు నెఱివెండ్రుకలకొప్పు కొప్పుగాఁ
పారిజాతంపుఁబూబంతి మెఱయ
రతి పదాలక్తకాంకితమైన నొసలిపై
నిలువుఁగస్తురిబొట్టు చెలువు మిగుల
గేయూరముద్రలు గీల్కొన్న గళమున
మౌక్తికంబుల కంఠమాల యమరఁ
దెపరు గంధపుఁబూఁత జెన్నొందు యురమునఁ
బద్మరాగంబుల పదక మొలయ—

తే సరస సంభోగశృంగార సహజమహిమ
లలితయౌవన లావణ్యలక్ష్మిఁ బెనుప
ననుపమాన జగన్మోహనైకమూర్తి
దర్పకుఁడు వచ్చె నింద్రునాస్థానమునకు ౫౨

క. వలరాజు రూపరేఖా
విలసనములు దనవిసనక వీక్షించెవిచో
నిలుచెల్లఁ గన్ను లగుటకు
ఫలమెల్లను గలిగె నమరపతిపాలునకున్, ౫౩

ఉ. అప్పుడు పుష్పబాణునుచిరాకృతి దప్పక చూచి చిత్తముల్
ద్రిప్పఁగ లేక కొర్కిలతఁజిలిపులఁ బ్రేమచెలర్ప మానసంబుల్
దప్పి చలించి ఘర్మ సలిలం బెసఁగం బులకించి నివ్వెఱల్
గప్పి విచిత్రరూపములకైవడి నిల్చె రమర్త్యభామినుల్ ౫౪

వ. ఇట్లు వచ్చిన భావసంభవు బహువిధంబుల సంభావించి జంభారి నిజకార్యారంభ
మెఱింగించి మఱియు నారమాకుమారునకిట్లనియె ౫౫

చ. అమరుం దివ్యబాణ నిచయంబుల పెల్లు దృఢీకరించి—ద
ర్పమునఁ జరించు పోటరులు, భామల కోమలహాస దృగ్విలా
సముల ధృతుల్ గలంగి వివశత్వము నొందుట విశ్వలోక—దు
ర్దమ భవదీయ కోరిక శరంబుల బల్మిగదా! మనోభవా! ౬౭

ఉ. ఏకమనస్కులై తగుల మెందును లేక విరక్త ధర్మశీ
లాకరులైనవారి నొకసందున డెందముఁ జూచి చించి—బ
ల్కాఁకలు సేయు నీకు మహిళాసహచార దృఢావివేకుని
త్సాకుఁ బరాభవించు టనఁగా సరకా నరకాంతకాత్మజా! ౬౮

వ. అని యగ్గించి తత్కాల సముచితసత్కారంబుల నతనిఁ బ్రీతుఁ గావించి
వీడ్కొలిపి తత్కార్య సహాయంబుగా—సురగణికా నికాయంబును—బంపిన
నయ్యచ్చరలు వియచ్చరేంద్రుపంపునఁ గందర్పునకు ముందఱ నిలచి
యమ్మహీపాలుండు తపంబొనర్చు వనంబుఁ బ్రవేశించి యందు— ౬౯

సీ. కొమరారు చెంగల్వకొలఁకుల కెలఁకులఁ
బూఁదేనెఁ దనినొందు పొదల మొదలఁ
బొరలెత్తు కర్పూర తరువుల మఱువుల
మది కింపుగల యేటిమడలకడల
విలసిల్లు శశికాంతవేదుల వీదులఁ
గేలి కిమ్మగు మేటిగిరుల తరుల
నింపుగాఁ బండిన యూడల నీడలఁ
చెలువైన సురపొన్న చెట్లపట్ల-

తే. నాకుఁదీవెల క్రేవల నతిశయించు
పోఁకమ్రాఁకులజోకల పీఁక నెగయు
ఘనపరాగంబు రాగంబు బెనుప నెసఁగు
మొగిలివనముల మనముల ముద మెలర్ప,

క. మెలఁగుచు, మధురసముల జడి
కలఁగుచు లీలాభినయ సమంచిత గతులన్
వెలఁగుచు, నవసరసోక్తుఁ
జెలఁగుచు, నృపుఁ జేరి వేల్పుచేడియ లచటన్. ౭౦

సీ. పాణిపల్లవ మృదుస్పర్శఁ జూతంబుల
సుకరాంఘ్రి హతుల నశోకములను,
గలభాషణంబులఁ గర్ణికారంబుల
వదనాసవంబుల వకుళములను
బరిరంభణంబులఁ గురువకప్రతతుల
దృగ్విలాసంబులఁ దిలకములను
దరహాసకాంతి సంతతి సురపొన్నల
సమదరాగంబులఁ జంపకముల

తే. నసమ సమగీత లహరిఁ బ్రియాళములను
జారుముఖ గంధముల సింధువారములను
ప్రౌఢ నఖరాంకురక్రీడఁ బాటలముల
నాదరంబార నందందఁ బ్రోదిచేసి ౭౧

సీ. అతివ!చందన పంకాంచితం బీవనం
బిదియేల నీమోము నిట్లకాదె,
పల్లవోల్లాసిని! పడఁతి యీ తరుశాఖ
నీజాడ లదియును నేలఁబోలు
లలితాంగి!మాధవీలతిక పుష్పిణియైన
నంటఁగా రాదు నీ వందుఁ జనకు
వనజాక్షి! కాంచనావలి కాససేసెదు
జగ మంతయును దద్వశంబకాదె,

తే. మెఱసి లోకోత్తరంబైన సమీరణంబు
దక్షిణంబౌట యెఱుఁగవా తరుణి యిపుడు
బాల నీసొమ్ము రాజీవజాల మెల్లఁ
దలఁప మాకేల కైవర్తతతికిఁగాక-

క. ధవళేక్షణ! లీలార్థం
బవతంసముగాఁగఁ గువలయముఁ దాల్చెఁ జెలీ
చెవి నమరసత్యవతిగా
భువి నిక దలఁమోపు మాసెఁబో ఫణిపతికిన్, ౭౩

వ. అని యిప్పిధంబున నిచ్ఛారూపచతురసల్లాపంబులఁ బ్రమోదంబునొంది
వినోదించుచు-

క. ఓసరసిజాక్షి! యిది గడు
నోసరమని యేల దవుల నోసరిలెదు. నీ
కేసరములు వలసిన నీ
కేసరములు గూర్పు లలితకేసరములుగాన్, ౬౫

చ. తలఁపులు నిక్క, నిక్కపుముదమ్ములఁ దమ్ముల సంచలించు ని
య్యొలులకు లోఁగి లోఁగిసుకనందెద నందెదవేల,చంపకా
వలి వలిసున్నమొగ్గల నివారణ వారణయాన-కోయు-మిం
పలరఁగ దానఁ దేటి రసమానదు మానదు లేఁతపూవులన్, ౬౬

క. ఎలమావుల వలరాయని
యలమావుల శుకపికంబు లాఁగినవేల్పుం
బొలమావుల విరహార్తుల
దలమా వులుకక* చరింపఁ దరుణీ యిచటన్, ౬౭

సీ. ఏపారువనలక్ష్మి యిమ్మలు దమ్మలు
తుహినాంశు నెనరు కందువలు దొవలు,
భ్రమరనాయకు లేలుపల్లెలు మల్లెలు
కందర్పుసిరులు చెంగల్వవిరులు,
నెసఁగుపూమొగ్గల యెల్లలు మొల్లలు
వలఁపు సంపదలు చేవంతిపొదలు
తొలినెయ్యములకుఁ బోదులు విరవాదులు
నవవిహారదములు నారదములు
తే. వేడుకల కామెతలు కురువిందలతలు
రసికజనముల మెచ్చుల రచ్చపచ్చ

---

౬౭ నెం. పద్యానికి ఈ గుర్తు పెట్టి కవిగారు
*తలమా + ఉలుకక, ఈ సంధిలాక్షణికమతవిరుద్ధము అనివ్రాసినారు.
ఆ ప్రతిలో ఇది 279 నెం పద్యం.

యొసఁగుచుఁ గుసుమాపచయకేళి గంతకంత
కంతరంగములన గుతూహల మెలర్ప, ౭౮

సీ. పదముల కెంజాయఁ బఱచి నిల్చినచోటఁ
జిగురాకు పఱచిన చెలువు నెఱపఁ
దీగకై వడి గౌను సాగనిక్కిన నీవి
వెడజాఱ నతనాభి బెడఁగు దెలుపఁ
బరువంపువిరులపైఁ బచరించుచూడ్కులు
మెలమెల్ల నన్నులై తెలుపు చూపఁ
గేలుసాఁచిన నివ్వగిలు కక్షకాంతులు
జిగిచన్నుఁగ్రేవల జీరువాఱ-
తే. మలఁగి జఘనంబు వెనుకకు మాగ నిగిడి
వ్రేళ్లపై ముద్రికల మించు వెల్లిగొనఁగ
వాఁడివాలారుకొనగోళ్ళ వలను మెఱసి
కోర్కులె చరింపఁ జూపులు గోసెనోర్తు- ౭౯

సీ. చెమటచిత్తడి చాలఁ జెలువొందు నొసలిపైఁ
గుఱుచక్రొన్నెఱులు గైకోలునెఱపఁ
బెడఁదకన్నులకెల్లు బెదయుచూపులు వాలు
ఝళిపించుగతి దళతళనఁ బొలయఁ
గదలు బింకపుఁజన్నుగవ నిండుపఱపున
నిఱుపేద కౌఁదీఁగ తరలఁబాఱ
ధట్టించి తుదవ్రేళ్ళఁ దట్టుచో వెస నుంగు
రపుల కాంతులు బిత్తరములఁ దాఁటఁ
తే. నక్షరోచులు నెఱయ గంకణము లొరయఁ
జెరలి మొలనూలుమెలఁగ నందియలు సెలఁగ
సంతసము బెంప నూర్పులు సందడింపఁ
బ్రౌఢ యొక్కతె కందుకక్రీడ సలిపె. ౮౦
క. కరతలరుచి నరుణంబై
ధరఁ దననఖకాంతిచే సితంబై దృష్టి

స్ఫురణ నిడ నసితతరమై
కరమొప్పెను బంతి మూఱిగతి నొక్కచెయున్ ౨౧

సీ. సరిలేని బంగారుజలపోసనము పేడె
మెఱుఁగుడాచనుగుబ్బమీద నిల్పి
తులలేని వజ్రకాంతులపెల్లు వెదచల్లఁ
గొనగోళ్ళ తంత్రులుగూడమీఁటి
నిగ్గులు దులకించు సిడువాలుఁగన్నుల
తళుకుసారెలమీఁద దడఁబడంగ
గంకణంబులు ఘలుఘల్లున బహుతాళ
గతులు వాయించుసంగతులు నెఱపఁ
తే. గ్రమముతో మంద్ర మధ్య తారకల శుద్ధ
మిశ్రసాళగముల రాణమీఱ రాగ
వితతిఁ దగుమిశ్రములు మేళవించి పాడెఁ
దెఱవ యొక్కతె సంగీతదేవి యనఁగ. ౨౨

క. నిరుపమ వీణావాద్య
త్వర- నితరకుచంబు గదలెఁ దరుణీమంచాం
తరితోన్నతవామపయో
ధర సందర్శనము లేమిఁ దా వడఁకుగతిన్. ౨౩

వ. మఱియును. ౨౪

సీ. క్రీడామయూరంబు నాడించెఁ గంకణ
క్వణచారు కరతాళగతుల నొకతె,
కామతంత్రరహస్య గర్భోక్తు లొఱపుగాఁ
గలికి రాచిలుకకుఁ గఱపె నొకతె
మఱియుచు నటియించు ముద్దురాయంచకు
నెఱి మందయానంబు నేర్పె నొకతె-
మహనీయయౌవనోన్మాదంబు పెంపున
దీగయుయ్యెల వేడ్కఁ దూఁగె నొకతె,

తే. ధవళ శశికాంత వేదికాంతరమునందుఁ
చెలులతోఁ గూడి వలరాజుఁ గొలిచె నొకతె
లలిత సహకార మాధవీలతల కెలమిఁ
బరిణయోత్సవలీలలు నెఱపె నొకతె. ౭౫

వ. ఇట్లు బృందారక సుందరీబృందంబు బహుప్రకారంబుల మదన వికార కారణంబు లగు లీలావిలోల సంధిభావంబులు పచరించియుఁ గేళీ విహారంబుల సంచరించియు-ననమశృంగార భంగివిశేషంబుల మెఱయు నా రాజతపోధను చిత్తంబుఁ జిత్తజాయత్తంబు చేయంజాలక - ౭౬

ఉ. మేనక విన్ననై నిలిచె, మెల్లన మోమ మరవాంచె రంభ-శో
నూనిన వింత నివ్వెఱఁగు నొందెఁ దిలోత్తమ-గర్వహీనయై
దీనత నొందె నూర్వశి, మదిఁ జలియించె ఘృతాచి యన్యకాం
తానిచయంబు లెల్ల దవుదవ్వుల నుండె భయంబుపెంపునన్ ౭౭

వ. అట్టి యెడ ముక్కంటి మగతనంబు సగంబుగాఁ బెనంగిన నెఱజోదు ప్రమోదంబున బ్రయాణసమయ సముచిత సన్నాహ సంరంభ విజృంభితుండై-బొండుమల్లెల బొమిడికంబును-గొజ్జంగి వజ్రాంగియుఁ జొన్నగుబ్బెల రాగెవల్లులును మెఱయ,హరినీలజాలంబుల డాలు నేలు నలువునం బొలుపు మిగులు కొదమతుమ్మెద గొనయం బెక్కించి మించుగాఁ దొడిగిన యించువిల్లునం బెల్లు నిగిడి-పల్లవుల యుల్లంబులఁ గాడిపాఱు కోరచూపులు గల కళావతుల కలికి కనుఁజిలు కడల ధగధగలం బొలయు మెఱుఁగులు గుఱిగొన బసని కుసుమరసముం గులికి పులుగడిగి గఱులు దీర్చి వంకలొత్తిన గ్రొత్తలై యున్న మదనమోహన వశీకరణ సంతాపనాభిధానంబుల నొప్పారు సహకారసారసాశోక శిరీష కోరక ప్రదరంబులు నిలచి సవరించిన కవదొనలు ధరియించి కట్టాయితంబై విరిదమ్మి బండికండ్లును బిసకాండపుటిరుసులును, బొగడ మొగడల చీలలును దొగల నొగలును మొగలి రేకుల పలుకయుఁ గలువకాఁడియుఁ గురువేరువాగంబులును సంతరించి వసంత సారథి తిన్ననై యున్న క్రొన్నన మునికోలఁ గదల్చి యదల్చినం గెరలి చెరలి కొట్టుచు మిన్నులపైఁ బాఱు చిలుకవారువంబుల రయంబున దళతళంబొలయు దిక్కులఁ బిక్కటిల్లి వెన్నెల నెదచల్లు వెల్లియుఁ గలిగి తనరు తనరథంబు

రతి సమేతంబుగా నెక్కి, మధుమధురసపాన సంభ్రమ ప్రభ్రమద్భ్రమర ఝంకార కాహళారావంబులు జెలంగ-నుభయపార్శ్వంబులం గదలివచ్చు-కల కంఠ వీరభట పటలంబుల నంతకంతకు సంతసం బొలయు సేనా ముఖంబునం గలయం బొలయు. మలయానిలంబుచేత నాఘాతంబులగు తరు వ్రాతంబుల నెసంగు కుసుమ పరాగంబు నభోభాగంబునం బర్వి సర్వంబు పదిలంబగు నిజప్రతాపానల స్ఫులింగజాలంబు ననుకరింప సమంథతీపతి యాశ్రమంబు సొత్తెంచి యచ్చట రిచ్చవడియున్న యచ్చరలం దెలిపి కలిపి కొని యామహీపాలు సమీపంబునకుం జనునప్పు డమ్మహాత్ముండు. ౨౮

చ. ఎసంగిన బాహ్యసంచరణ మెల్లను మాన్చి మరల్చి-యెద్దెసం
దుసికిలనీక నెమ్మనముతోం బిరిగొల్పిన చూపు దేవతా
విసర శిరోవతంస మగు విష్ణునిపై నిడి నిస్సమీరణ
ప్రసరణ దేశదీపరుచిరస్థితి నిశ్చల యోగయుక్తుండై. ౨౯

ఉ. ఉన్న తెఱంగుం జూచి రభసోన్నతి మిన్నదలంగ నార్చుచుం
బన్ని శుకాస్య పుష్ట మధుపప్రకరామరకామినీ తతిన్
మున్నిడి చందనాచల సముద్ధత మందమరుత్సహాయ సం
పన్నతం బేర్చి పుష్పశరుండు కాపుగ నిల్చి యదల్చి బల్విడిన్. ౩౦

మ. సరి గెందామర మొగ్గనారస, మలిజ్యావల్లి సంధించి-భా
సుర మాణిక్యమయోర్మికారుచులు చక్షుష్కోణశోణద్యుతుల్
బెరయం జక్రవిభాకృతిం దనువు శోభిల్లన్ వడిందీసి ని
ర్భరముష్టిన్ వెస డాసి యేసె మరుం డారాజన్య చూడామణిన్ ౩౧

తే. అట్లు పుంఖాను పుంఖంబు లగుచు నిగుడు
నతను బాణపరంపర లాన్నృపాలు
నిచ్చం దెరలింపం జాలక విచ్చిపోయె
జగతిం బూవుల కది సహజంబ కాదె. ౩౨

క. తా ననమాస్త్రుం డనియును
మానవపతి మానినీ సమన్వితుం డనియుం

బూని మది దురభిమానము
మానక నటుపెనఁగి మరుఁడు భ్రమన్పడియుండెన్, ౭౩

వ. అయ్యవసరంబున— ౭౪

తే. అడఁగె మలయానిలుండు సొంపఱె వసంతు
డలులు విభ్రాన్తినొందెఁ, గోయిలలు బెదరె,
జెదరి మోములు వాంచె రాచిలుక పిండుఁ,
జిన్నఁబోయిరి దివిజ రాజీవముఖులు. ౭౫

వ. అంతనిక్ష్వాకు భూకాంతుం డంతర్నివృత్త హృషీక వ్యాపారుండై యుదయ దరుణ కిరణ నికర వికసిత సరసీరుహదళ శోభావిడంబకంబు లగు నంబ కంబు లల్లన విచ్చి పురోభాగంబున- ౭౬

మ. కనియెన్ మారు, జగద్విమోహన శుభాకారున్, సమారూఢయౌ
వన శృంగారు, శుకాలి కోకిల పరీవారున్, లలాభావలో
కన భూరివ్రత భంజన స్ఫురదహంకారున్, సముద్భూతచే
తన సంకల్ప ఫలావతారు, విరహార్త ప్రాణి సంహారునిన్, ౭౭

క. కని నిర్వికారగతి న
మ్మనుజవరాగ్రేసరుండు మరునకు (ను) మరు
ద్వనితల కతిథి సపర్యా
ఘన సత్కారము లొనర్చి కడువినయమునన్, ౭౮

క. సంతసమె కుసుమశర! వ
సంత! సముల్లాసమే? కుశలమే దివిష
త్కాంతాజనంబ! త్రిభువన
సంతాపహరప్రచార సౌఖ్యమె పవనా! ౭౯

చ. అని మధురోక్తు లొప్పఁ దమ కందఱకుం బ్రియమాచరించు-న
మ్మనుజవరేణ్యు ధైర్యగరిమంబునకున్ వెఱఁగంది యొండొరుం

గనుఁగొని సమ్మదంబు మతికంపము విన్నదనంబు లజ్జయుం
బెనఁగొన సంతరంగమునఁ బిమ్మటిగొంచు రహస్యభాషలన్, ౯౦

క. ఈతగు, లీతెగు, వీతెలి,
వీతాలిమి, యీ విరక్తి యెటుగంటిమె యీ
భూతలపతి గలఁగడు మన
చేఁతల, వ్రతసిద్ధి యల్లసిలుగా కింకన్, ౯౧

వ అని యగ్గించి రంతఁ గంతుం డమ్మహీకాంతున కిట్లనియె,

ఉ నీవు తపస్వి వౌదు ధరణీవర, యింద్రియముల్ వశంబు ని
కే విధి నేనియుం గెలువ నెవ్వరు నోపరు, మున్ను జంగమ
స్థావరముల్ మదేక విజితంబులు-నా కగపాటులేని భూ
రావలి గల్గెనేని యిదియంతయుఁ గ్రోధముచే హతంబగున్ ౯౩

క. వెఱపింప వచ్చి-వెఱచిన
తెఱఁగున ననుగెలుతు నని మదిం బూని హరుం
డఱిముఱిఁ గ్రోధము చేతం
బఱిపఱియై తపము విడిచి పాఱఁడె మొదలన్. ౯౪

క. మిక్కుటమగు వలఁపుతమిం
గుక్కుటమై చనిన దేవకులనాయకునిన్
మక్కువ తగవు దలంపమి
నక్కమలాసనుని నెఱుఁగవా లోకమునన్. ౯౫

శా కామక్రోధవశంబు విశ్వమును దత్కామంబు క్రోధంబు నా
జ్ఞాముద్రాధరు లబ్జనాభునకు నాసర్వేశు సేవించుటన్—
భూమీశోత్తమ నీవు మత్సముఁడవే మున్నీకు లోనైతి-మే
లా మాఁ లీ గయికొందుగాక భువనాలంఘ్యార్థలోకోన్నతుల్, ౯౬

వ. అని ప్రశంసించి తచ్ఛాప(తత్+శాప) భయంబున నచ్చటనిమిష మాత్రంబు
నిలువ శంకించి మగిడి తనపోటువిధంబు-నిక్ష్వాకు సన్నిధానంబున నైన

నిజపరాజయంబును సురరాజున కెఱింగించి-యథాస్థానంబున కరిగి రంత-
దురంతకార్యచింతాసంతాపితస్వాంతుండై మరుద్వంతుండు- ౯౭

వ. పటుబాహాబల దర్పితామరచమూపశ్రేణి గొల్వన్ సము
త్కటదీప్తానల విస్ఫులింగవిసరోగ్ర క్రూరధారాశత
త్రుటితగ్రావ గరుద్విశాన మగు సస్తోకాస్త్రముం బూని-యు
ద్భట దానాకుల గండమండల మహాదంతావళారూఢుఁడై, ౯౮

క. అతిరయమున నాధరణీ
పతికడ కరుగుటయుఁ దనకుఁ బ్రభుసముచిత స
త్కృతు లాచరింపఁ బూనిన
యతనితపస్సిద్ధిఁ గని మహారోషమునన్, ౯౯

క. గిరిభేది వైచె నన్నర
వరుపైఁ బటు కుటిల కరినవైరిప్రజ ని
ర్భరగర్భ తిమిర సముదయ
హరణదినారంభ హేళి నాదంభోళిన్,

వ. ఇట్లు ప్రయోగించినఁ బ్రపంచితదీర్ఘనిర్ఘోషభీషణంబై-తనమీఁద నడరు
వజ్రాయుధంబు బెడిదంపుటురవడి కించుకయుఁ జంచలింపక యమ్మను
తనయుండు సకలభక్త భయత్రాణపరాయణం బగునారాయణదేవుని
చక్రంబుఁ దలంచి తత్క్షణంబ ౧౦౧

సీ. ప్రళయమార్తాండమండల చండతరసము
ద్భూత భూరిప్రభాపుంజ మగుచు,
ఘనసహస్రార నిర్గతమహోగ్రానల
జ్వాలాపలీఢ దిగ్వలయ మగుచు.
సహజ తేజోవిశేష క్షణాంతర్భూత
సర్వదివ్యాస్త్ర విస్తార మగుచుఁ
గఠిన నిర్ఘాత సంఘాత భీషణఘోష
నిర్భిన్న రాక్షసీగర్భ మగుచు.

తే. సకల శుకముఖ్య మునియోగిజన సమగ్ర
మహితనిగమార్థ సంస్తూయమాన మగుచు
వచ్చె మానసవేగమై వనజగర్భు
దాసభయకర్శనంబు-సుదర్శనంబు- ౧౦౨

వ. ఇట్లు వచ్చినయమ్మహాస్త్రరాజంబు తేజంబున దౌదౌలన దళితసంరంభంబై దంభోళి పౌడ వడంగిపోయినం గని జంభారి సిగ్గుపడి బెగ్గడిల దిగ్గన కనక గర్భుపాలికిం జని తద్విధం బంతయుఁ జెప్పిన నప్పరమేష్ఠి యాశ్చర్యంబు నొంది వైవస్వతనందను మనోరథమహత్త్వంబు దెలియం గోరి నిమీలితాక్ష నయనారవిందుండై యానందంబున డెందంబునఁ గనువిచ్చి చూచి యా భూవరోత్తము చిత్తము శ్రీరంగశయనప్రవృత్తం బగుటయెఱింగి-మైయెఱుం గక యొల్లంబోయి మెల్లన తెలిసి నిజస్వామి యగుశ్రీరంగధాముని సన్నిధానం బున కరిగి సురగణ సమేతంబుగా సాష్టాంగప్రణామం బాచరించి, కృతాంజ లియై ముఖకంజంబులు పుంజంబులుగా నూరకున్న యన్నలువపైఁ గృపాకటా క్షంబు నిగిడించి పుండరీకాక్షుం డిట్లనియె, ౧౦౩

చ. జలరుహగర్భ నీదెసఁ బ్రసన్నుఁడ నేను విషాద మేల నా
తలఁ పెఱిఁగింతు నీకు నది తప్పదు విన్ము మదేతదంచితో
జ్జ్వల శుభమూర్తితోఁ దరణివంశమహీధవ రాజధానియై
వెలయు నయోధ్య కేఁగెదను విశ్రుత రంగగృహాన్వితంబుగన్ ౧౦౪

సీ. అచట నిక్ష్వాకుధరాధీశ్వరుఁడు మొద
లయిన తత్కులజనతాధిపతులు-
గొలువ మహాయుగంబులు నాల్గు పరిపూర్ణ
మగుదాఁక నుండి యనంతరంబ
చోళమండలమునఁ జూడనొప్పారు కా
వేరీమహానది తీరమునను
జంద్రపుష్కరిణీల సత్ప్రదేశమున మన్వం
తరంబులు రెండునైదు నిలచి

తే. యంత భవదీయమగు దివసాంతమైన
నేఁగుదెంచెద నీయున్న యెడకు మగిడి

ముపుడు పూజించె దీసుగతాగతంబు
లిట్లు ప్రతివాసరంబును నే నొనర్తు ౧౦౫

వ. ఈక్రమంబున భవదీయ ద్వితీయపరార్ధంబు సమాప్తంబైన నీకు ముక్తి
గొనంగెద, నొక్కవిశేషంబు వినుము, ప్రతిమా సమారాధనంబు జేసి యొక
వాసరంబు లేకయున్న మహాదోషంబు సంభవించుఁ బ్రాయశ్చిత్తంబును
వలయు, నాలుమెల రెడపడినఁ బునఃప్రతిష్ఠాపనంబు కర్తవ్యంబు, గాత్వ
సాదకైంకర్యాదు లొదవినం బ్రతివిధానం బవశ్యకర్తవ్యం బని తత్పరవేదు
లెన్ను దుర్నియమంబు లన్నియు-దివ్యసైద్ధమానుషార్చనలయందగాని భుక్తి
ముక్తినిధానంబై స్వయంవ్యక్తప్రధానంబైన శ్రీరంగంబందున లేవు-నీ వను
దినంబు నన్నుఁ బూజించెదవు గాన నీకార్యం బంగీకార్యం-బిక్ష్వాకునకు
శ్రీరంగం బిమ్ము పొమ్మనినం దెలివొంది శతానందు డాక్షణంబ ౧౦౬

మ సురయక్షాసుర సిద్ధసాధ్యభుజగ స్తోమంబు గొల్వ న్మునీ
శ్వర వేదస్తుతినాదముల్ సెలఁగ దార్క్ష్యస్కంధపీఠంబునం
బరగన్ రంగనికేతనం బిడి మహీపాలుండు నిత్యవ్రత
స్థిరుఁడై యున్నతవోవనంబునకు డెచ్చెం దివ్యమార్గంబునన్, ౧౦౭

క కొనివచ్చి యమ్మహీశ్వరుఁ
డనురక్తి నొనర్చు బహువిధార్చనములు గై
కొని యిచ్చె రంగధామము
ఘనరుచిధగధగిత దిఙ్ముఖస్తోమంబున్. ౧౦౮

మ. అటు శ్రీరంగమహావిమానము నిజైకాయత్త మైనన్- సము
త్కట హర్షంబునఁ దానె మోచుకొని యిక్ష్వాకుండు సామంతులుం
భటులున్ మంత్రులు ద న్నెదుర్కొన శుభప్రౌఢిం బ్రవేశించె-ది
క్తట వంచద్ధ్వజతోరణంబగు నయోధ్యాపట్టణోత్తంసమున్ ౧౦౯

క. ఆపురమున కుత్తర మగు
గోపురమున కెట్టయెదుటఁ గ్రోశార్ధమునం
దీపిత సరయూతమసా
ద్వీపవతీ ద్వితయమధ్యదేశమునఁ దగన్, ౧౧౦

మ. సమభూమిం బరమోత్సవంబునఁ బ్రతిష్ఠాపించె శ్రీరంగముం
గమనీయావృత నారికేళ కదళీ ఖర్జూర నారంగమున్
విమలార్థప్రతివాక్యవిశ్రుత వనీవిక్రాంతసారంగమున్
సమభావార్యవిలోకితాభినవమోక్షశ్రీ నదీరంగమున్, ౧౧౦

సీ పదపడి యద్దివ్యభవనంబు చుట్టును
గోటలు నట్టళ్ల గోపురములుఁ
బటుకవాటంబులుఁ బందిళ్ల నరుగులు
గాంచనమయములుగా నొనర్చి
పూజనాపరు లగుభూసురో త్తములకు
బహుపరిచారికా ప్రకరమునకు
విష్ణుధర్మరహస్య విదులైన ఘనులకు
జాబాలిమునికిఁ గశ్యపవశిష్ఠ

తే. వాసుదేవాదు లగువారివారి కుచిత
మైన నెలవులు రచియించి యందు నిలిపి
తదనుమతి శాస్త్రచోదితోత్సవము లెల్ల
వివిధ విభవాన్వితముగఁ గావించె హరికి ౧౧౨

వ. విశేషించి ఫాల్గుణమాసంబునఁ బూర్వఫల్గుని నక్షత్రంబున-బుత్రపౌత్ర
సహితుండై -యవభృధసహితం బగుమహోత్సవం బొనర్చె-నివ్విధంబునఁ
బ్రతివర్షంబును జరుగుచుండు నంత నయ్యిక్ష్వాకువంశ పారం
పర్యంబున- ౧౧౩

క శశి మరువశన దిశాకరి
దశన శరచ్ఛరద హారదాశరథకరా
ట్పశుపతి విశదయశోనిధి
దశరథుఁ డుదయించె నమితదమనోరథుడై, ౧౧౪

శా ఆరాజేంద్రుఁడు పుత్రలాభనిరతుండై యశ్వమేధంబు పెం
పారం జేయఁగ దన్మహోత్సవదిదృక్షాయత్తులై వచ్చి రా

పారావారవసుంధరాతలమునం బ్రఖ్యాతులై సంతతో
దారైశ్వర్యసమగ్రులైన నృపు లుద్యత్తైన్యసంయుకులై, ౧౧౫

ఆ. వె వసుధలోన ధర్మవర్మ సురుచిర వి
ఖ్యాతి నెసఁగు చోళభూతలేశుఁ
డజతనూజ విరచి తానందవిభవాభి
రాముఁడైన రంగధాముఁ జూచి- ౧౧౬

క. ఆదేవు దివ్యమూర్తి
శ్రీ దనచిత్తమునఁ గదియఁ జేర్చి నితాంతా
మోదామృతమునఁ బులకలు
జాదుకొనం జూడ్కి దివియఁ జాలక మదిలోన్. ౧౧౭

మ అతులంబైన తపోవిశేషమున నీయబ్జాక్షు నిక్ష్వాకుఁ డీ
గతి మెచ్చించి విరించిమందిరసురంగం బైనరంగంబు నూ
ర్జితశక్తిం గొనివచ్చె నిచ్చటికి, నారీతిన్మహావైష్ణవ
వ్రతనిష్ఠారతిఁ బూని మత్పురికి రాఁ బ్రార్థింతు నిద్దేవునిన్. ౧౧౮

చ. అని తలపోయుచున్ దశరథాధిపు యాగము సుప్రయోగమై
యొనరినదాక నయ్యెడన యుండి యతండు దుదిం బ్రియంబునన్
ఘనముగఁ జేయు సత్కృతులు గైకొని క్రమ్మఱ నాత్మపట్టణం
బున కరుదెంచి నిర్భర తపోనియమోద్యమ చిత్తవృత్తుఁడై, ౧౧౯

తే. ఇందు పుష్కరిణీతటి కేఁగి యచటఁ
దపము గైకొన నానృపోత్తముని జూచి
తత్సమీపంబునందు నితాంతనియతిఁ
బాయకున్న మునీశ్వరప్రకర మెలమి

క. ఓ నరనాథోత్తమ ! నీ
మానసమున నేమికోర్కి మసలినఁ దపముం
బూనెద వది చెప్పఁగఁ దగు
నేనియు నెఱిఁగింపు మనిన నృపుఁ డిట్లనియెన్

చ హరి నతిభక్తి గొల్చి యజుఁ డాదియుగంబునఁ గన్న రంగమం
దిరము పయోజమిత్రకులదీపకుఁ డమ్మనుపుత్రుఁ డెట్లు చె
చ్చెరఁ గొనివచ్చె నాత్మపురిసీమకు నట్ల తదాలయంబు మ
త్పురి కిటమీఁద నేను గొనిపోవుటకై తప మాచరించెదన్ ౧౨౨

వ ఏను లోకహితార్థంబుగా నీయర్థంబు సమర్థింపం బూనితి మీచేత ననుజ్ఞాతుం
డనగదా ! యనిన నమ్మహాత్ము లతని కిట్లనిరి— ౧౨౩

క. ఏలాప్రయాస మవనీ
పాలక! నీతలఁపు మున్న ఫలియించిన దా
కీలెఱిఁగి శీఘ్ర మింకం
జాలింపు తపస్వివేష సంచారంబుల్, ౧౨౪
వ. అది యెట్లనిన— ౧౨౫

ఉ. ఉన్నది యీ ప్రదేశమున కుత్తరదిక్కునఁ గ్రోశమాత్రధా
త్రిన్నృప మీపురాతనపురీస్థల మప్పురనాథుఁ గాదె రౌ
ద్రోన్నతి మున్ను పుష్పశరు నుక్కడగించినలీల వీక్షణో
త్పన్న కృశానుకీలముల భస్మముజేసె హరుం డుదగ్రుఁడై, ౧౨౬

తే. ఆపురప్రాంతమునఁ గల దగ్నికల్పుఁ
డైన దాల్భ్యమునీశ్వరు నాశ్రమంబు,
నచటి కొకనాఁడు మేము కార్యాభిలాష
నరిగి సుఖగోష్ఠిమై నున్న యవసరమున. ౧౨౭

చ. హరి చనుదెంచి దాల్భ్యముని యస్మదుపేతముగాఁగ భక్తిను
స్థిరమతిఁ జేయుపూజనలు చేకొని, సారదయాసుధారస
స్ఫురిత కటాక్షవీక్షణరుచుల్ వొలయన్ మముఁ జూచి మేదురా
వర మధుర స్వరంబు జలదస్వనభంగిఁ జెలంగ నిట్లనున్. ౧౨౮

ఉ. తాపసులార ! మీయభిమతం బొడగూర్చుటకై కవేరక
న్యాపులినస్థలంబున నిశాధిపపుష్కరిణీతటిన్ జగ
ద్రూపితరంగమందిరముతోఁ జనుదెంచి వసింతు వేగ మీ
లోపల నెందుఁ జోక మదిలోఁ జలియింపక యుండుఁ డీయెడన్

వ. ఎట్లనిన — ౧౩౦

ఉ. లోకభయంకరుం దశగళుం బరిమార్చుట కేను రామభ
 ద్రాకృతి నర్యమాన్వయమునందు జనించి యయోధ్యలోనఁ బు
 ణ్యాకరమైన రంగనిలయంబు విభీషణు కిత్తు నాబుధ
 శ్లోకుఁడు దేర మీరు సముఁ జూచెద రీడ ననంతపీఠికన్ ౧౩౧

వ. అని యానతిచ్చి యప్పరమేశ్వరుం డరుఁగఁ దోడనకూడి నేను మును మార్తాండ
మండలపర్యంతంబును గొలిచి చని మరలి వచ్చునెడ భవద్వంశకర్తయగు
వికర్తనుండు మమ్ముఁ గనుఁగొని యిట్లనియె. ౧౩౨

సీ. మున్ను పద్మజలోకమున రంగశాయి నే
 నర్చించి మద్వంశ్యులైన నృపులు
 దేవ! నీచరణాబ్జసేవ సేయఁగ నుండ
 వలయు నీవని మ్రొక్కి వరముగాఁగ
 గోరిన గరుణ గన్గొని యయోధ్యాపురిఁ
 గావేరిదరిఁ జిరకాల మేను
 వసియించి ప్రీతి భవత్కులీనులచేతఁ
 బూజఁ గైకొనియెద భూరిదారు

తే. ణాఘ కలివేళ గతిశూన్యమైన ప్రాణి
 తతికి సులభుఁడ నయ్యెద-ధర్మరహితు
 లైన నాస్తికు లెపుడు క్రందై చరింతు
 రపుడు దుర్లభమగు నస్మదాశ్రయంబు. ౧౩౩

వ. అని యానతిచ్చెఁ గావున శ్రేయోభిలాషంబు లగువారికిఁ గావేరీ తీరంబున
చోళవంశసంభవుండైన ధర్మవర్మాపదేశంబున నవశ్యంబును శ్రీరంగ
నాయకుండు వేంచేయునది తప్ప దని చెప్పిన లోకబాంధవు భాషణంబులఁ
బరితోషణంబు నిగుడ మగిడి వచ్చి యచ్చట నున్న వార మచ్యుతుండును
దాశరథియై యవతరించినాఁ డచిరకాలంబునన యస్మన్మనోరథంబు సిద్ధించు,
రఘునాథ దయాభూషణుం డగు విభీషణుం డెప్పుడిచ్చటికి రంగధామంబుఁ

దెచ్చునప్పుడ నీకెఱింగించెద-నంతదాఁక భద్రాజధానియగు నీచోళపురం
బుననె యుండి మహీపాలనంబు సేయుము పొమ్మని సమ్మదం బిద్దియని
యమ్మానవేశ్వరుం డరిగె — ననంతరంబ — ౧౩౪

సీ. అహిమాంశుకుల రోహణాచల స్థలమున
నలరిన దివ్య రత్నాంకురంబు,
జానకీమృదుల భుజాపంజరంబున
రంజిల్లి విహరించు రాజశుకము,
యోగిమానస భూసురోద్యానవనమునఁ
గలయ వర్తించు శిఖావళంబు
నగజామృత స్తవ నవమధు ద్రవమునఁ
జవుల నింపునఁ జొక్కు షట్పదంబు -

తే. కలిత కరుణాసుధారస కలశజలధి
దశరథాధిప సుకృతసంతానఫలము
భక్తహృద్వర్తి తారకబ్రహ్మమూర్తి
రాజపరమేశ్వరుండు శ్రీరాఘవుండు. ౧౩౫

క. రాముఁడు హరిమణినివహ
శ్యాముఁడు శుచిధాముఁ డమరసన్నుత సుగుణో
ద్దాముఁడు రక్షితసుజన
స్తోముఁడు జనదృక్చకోరసోముఁడు మఱియున్. ౧౩౬

సీ. ఎవ్వని సుగుణంబు లీశానుముఖ్యులు
చెలఁగి కైవారంబు చేయుచుందు
రెవ్వనికరుణచే నెసఁగు ధన్యులకు నా
కల్పాంతమగు నిర్వికారపదము
ఎవ్వని గొలుచువా రిచ్చసేయరు కల్ప
తరు కామధేను చింతామణులను
ఎవ్వనికదకంటి కెఱుపు వచ్చినమాత్ర
బ్రహ్మాది దివిజులు వసలుచుందు

తే. రెండు సెప్పని చరణారవిందరజము
పెంపు గౌతమసంయమి పెండ్లిపెద్ద
యతఁడు జగదేకచాపదీక్షాగ్రగురువు
రామభద్రుండు లోకాభిరామమూర్తి. ౧౩౭

వ. అమ్మహాధనుర్ధరపరేణ్యుండు — ౧౩౮

సీ. కన్నెకయ్యమునంద ఘటిలనాకపురీక
వాటికఁ దాటక గీటణంచె,
దూలుకూఁకటినాడ లీలఁ గౌశికయాగ
భంజనోత్సాహు సుబాహు జంపెఁ
దల యెగగట్టున త్రుటి దేవదైత్యాసు
త్రరము ధూర్జటిధనుర్వరము విఱిచె
నలవోక దొరసి హేలాజితాఖిలనృప
స్తోము భార్గవరాము దూలఁదోలె
తే. దండకావనమార్గ సంతత నిరోధు
రచితసుజనాపరాధు విరాధు నఱికె,
దళిత సకలామరుని జతుర్దశసహస్ర
దితిజముఖరుని ఖరుని వధించెఁ గడిమి, ౧౩౯

క. అచలితకరణ కనకమృ
గోచితలీలావిమోహితోర్వీతనయా
లోచన హృదయుని సదయుని
నీచున్ మారీచుఁ గడపె నేలం గూలన్. ౧౪౦

క. బంధురశరహతు నేసెఁ గ
బంధుని, బహుదుర్జనైకబంధుని గృతని
ర్బంధునిఁ బృధుతరకరిన
స్కంధునిఁ బ్రావీణ్యవిస్రగంధునిఁ గలనన్. ౧౪౧

వ. పరిచరుగాగ నేతె నిరపాయచరిత్రుని, శత్రుకానన
స్ఫురదురువీతిహోత్రుని సముజ్జ్వల మేరుసమానగాత్రునిం

పరమపవిత్రు, సన్ముని సుపర్వతతి స్తుతపాత్రునిన్, మనో
హర ఫలశేముషీ కబళితాంబుజమిత్రుని వాయుపుత్రునిన్ ౧౪౨

శా. లీలం దార్కొని యేసె నుగ్రరణకేళిన్ వాలి వాలిం బ్రభా
హేళిన్ హేమసరోజమాలి, పరివాహిన్యాటవీకీలి, ను
త్తాలవ్యాళ కరాళవాల పరిబద్ధస్ఫూర్త పౌలస్త్యకం
రాళిం బూజితశూలి సప్రతిమబాహాసత్ప్రశాలిం బదన్ ౧౪౩

క. కిష్కింధాపురి నిలిపెను
పుష్కరహితతనయు సునయు భూనుతవినయున్
నిష్కాశిత రిపుజీవుని
నిష్కలిభావుం బ్రతాపనిధి సుగ్రీవున్, ౧౪౪

మ. స్రగ్ధర బలిమిం గట్టించె నత్యద్భుత ఖదురధురాపాత భీతావనీభృ
త్కుల సంరక్షావినిద్రుం గుపితజలచరక్రూరసంఘట్టనోద్య
జ్జ్వల నిర్ఘోషాధిరౌద్రుం జనితమణిసుధాచంద్రలక్ష్మీసురద్రుం
బ్రళయాంత స్సుప్తవిశ్వంభర భరితకృపా ప్రాప్తభద్రు న్సముద్రున్. ౧౪౫

మ హతు గావించె సపుత్రమిత్రముగ దీప్తాస్త్రంబులం గాంచన
క్షితిభృద్ధన్వి ధరాధరోద్ధరణశక్తిప్రౌఢ దోర్దండసం
గత భాస్వద్ఘనచంద్రహాస నిశితోగ్రక్రూరధారా సమా
హత భీతప్రపలాయితాదితిసుతేంద్రైరావణున్ రావణున్. ౧౪౬

వ. ఇట్లనన్యసాధ్యంబు లగు మహానుభావప్రతాపతేజోవిశేషాదిగుణంబుల
నఖిల జగన్నుతుండై దశరథసుతుండు సమస్తసామ్రాజ్యభోగంబుల ననురా
గిల్లుచు శశ్వదైశ్వర్యం బవార్యంబుగా-నశ్వమేధయాగం బుపక్రమించి,భూ
చక్రంబున విక్రమైకశాధన్యులగురాజన్యులఁదన్మహోత్సవంబునకు రప్పిం
చుచు-ధర్మవర్త్మావనీవరుఁ బిలిపించిన నతండును-నిఖిలదేశాగతానేకభూపాలావ
లోకనజాత కౌతూహలాయిత శాతోదరీచరణ మణినూపుర ఝుళంఝుళధ్వనిత
గోపురంబగునయోధ్యాపురంబుఁ బ్రవేశించి-యారఘునందన చరణారవింద
సందర్శనంబునఁ గృతార్థీకృతజన్ముండై-తన్మఖంబు పరిపూర్ణంబగునంతకు
నందుండి మరలి నిజపురంబునకుం జని-యంత నిక్కడ- ౧౪౭

క. వితత వసంతగుణావలిఁ
బొత పగునెల నినుఁడు మీనమున నున్నతఱిన్
సితసప్తమి శనిరోహిణి
నతిశుభలగ్నమున వాసరాగమవేళన్ ౧౪౮

చ. హితుఁ డగు నవ్విభీషణున కిచ్చె దశాననవైరి లీల స
న్నుతి సఖిలార్చనోపకరణంబులతో బహుచిత్రశిల్పక
ప్రతతులతో మహీసురతపస్విసమాజముతో మహోత్సవ
స్తుతమణి హేమవస్తుతతితో శుభసీమము రంగధామమున్ ౧౪౯

ఉ. ఇచ్చినభక్తి సంభ్రమము లిచ్చఁదలిర్పఁ బదక్షిణంబు మ
న్నచ్చి నమస్కరించి జతనంబున మస్తమున న్వహించి పెం
పచ్చుపడంగ రాక్షసబలావలితో నిజపట్టణంబుకై
చెచ్చెర నేఁగి యేఁగి యభిజిత్సుముహూర్తము చేరున త్తఱిన్. ౧౫౦

సీ. అనువైన తామరపాకుఁ జప్పరముల
నలరి క్రీడించు రాయంచకవలు,
రాజిల్లు కల్వపూగాజుటోవరులలోఁ
దవిలి పాయని యళిద్వంద్వములును
వాపిరి లేనాఁచు దీవపందిరులలోఁ
దనుపొందు జలచరదంపతులును
ఱెఁగల్వదడెల తరంగడోలికలలో
మేలమాడెడు చక్రమిధునములును

తే. దరులఁ బండినసహకారతరులఁ బ్రేమ
గోపి విహరించు మదకేకిశారికలును
గలిగి పథికుల కింపులు గడలుకొలుపు
విమలతరపుణ్యవారిఁ గావేరిఁ జేరి ౧౫౧

క. విలసిత వనలక్ష్మీకర
కలిత నవస్ఫటికముకురగతి నతిరుచిర

స్థలమున మలయానిల మృదు
చలిత తరంగానుమేయ సలిలం బగుచున్, ౧౩౨

క. ఏపారు చంద్రపుష్కరి
ణీపరిసరభూమి రంగనిలయ మిడియె-నా
లోపల సచ్చోళనృపతి
తాపసులును వచ్చి రతిముదంబున నటకున్. ౧౩౩

ఆ.వె. వచ్చి దైత్యవంశవరునకు నుచిత స
త్కృతు లొనర్చిభక్తి యతిశయింప
రంగశాయి చరణరాజీవపూజనం
బాచరించి ప్రముదితాత్ము లయిరి, ౧౩౪

వ. అంత ననంతగుణగరిష్ఠుండగు నావనుజశ్రేష్ఠుం డాసరోవరంబునం గరంబు నియమంబునఁ దత్కాలకరణీయంబు లాచరించి సముచితోపచారపూర్వకం బుగా సావధానంబున శ్రీరంగరాజ పూజావిధానంబు దీర్చి సప్రదక్షిణ ప్రణామం బాచరించి వేదశాస్త్ర పురాణోక్తంబు లగు శ్రీవైష్ణవసూక్తంబుల నభినుతించి గమనోన్ముఖుండైన యతనికిఁ గృతాంజలియై యన్నరేంద్రుం డిట్లనియె,- ౧౩౫

క, అకుటిలమానస సుజన
ప్రకటితసౌజన్య జన్యపాటిత విమత
ప్రకర మముఁ గూర్చి యిచ్చట
నొకకొన్నిదినంబు లెలమి నుండఁగవలయున్, ౧౩౬

ఉ. నావుఁడు నాతఁడెల్లి మనువంశస ముఫణిరాజశాయికిన్
శ్రీవెలయంగ నుత్సవముచేసిన యట్టిదినంబు గావునన్
భూవర మత్పురంబునకుఁ బోవలయున్ వెస నన్న నాదశ
గ్రీవుసగర్భుతోడ నృపకేసరి యిట్లను నెమ్మిఁ గ్రమ్మఁగన్ ౧౩౭

సు విమలంబై తనుపొందుసీయుభయకాసెకీ సరిస్పృప్ర-మి
రమణీయోన్నత సైకతస్థలము లీ రాజీవషండంబు లె

భ్రమరాంచత్తరుసాంద్రచంద్ర సరసీ ప్రాంతంబు లత్యంత హృ
ద్యము లిచ్చోటన జేయు ముత్సవము దైత్యేంద్ర చూడామణీ ౧౩౮

ఆ. అనిన నట్లకాకయని నిల్చె నచ్చోట
దానవేశ్వరుండు, తత్క్షణంబ
తన పదార్థములు ముదంబున నమకట్టె
ధర్మవర్మ ధరణిధవ వరుండు. ౧౩౯

శా. నిర్మింపించె ననల్పశిల్ప రచనల్ - నేత్రాభిరామంబుగా
ధర్మద్వార కవాటవేది చయ కుంభ స్తంభశుంభ ద్ద్యుతుల్
ఘర్మాంశుప్రభ గప్పి దిక్కుల వెలుంగం బాప సూపాన్నస
ర్పిర్మధ్వంబు పయః పయస్యఫలగుప్తి స్ఫీతశాకావళుల్. ౧౪౦

శా. భూనాథాగ్రణి యొక్కనాట నలఘుస్ఫూర్తిన్ రచింపించెఁ దా
నానాదేశ సమాగతద్విజ మహీనాథార్య శూద్రాది సం
స్థానార్హంబులుగా మరావళులఁ బ్రాసాదంబులుం దంతివా
హాళీకాయతనంబులున్ విపణిరథ్యా మంటపశ్రేణులున్. ౧౪౧

క, ఈభంగి ననమ సంప
ద్వైభవ సామగ్రి నభినవంబుగ నిచ్చా
లాభ సముత్సుకుఁ డగునా
భూభుజుఁ డొనరింప దైత్యపుంగవుఁ డెలమిన్, ౧౪౨

తే, సహ్యకన్యాతటావాస సంయమీంద్ర
సమితితో విధిశిష్యపంచకముతోడ
నమ్మహారాజ వరునితో సావధాన
బుద్ధియై యాగమోక్త ప్రసిద్ధవిధిని. ౧౪౩

చ, చెలువగు చంద్రపుష్కరిణి చేరువఁ జారువనాంతవీథి నిం
పులు మదినింపు మేలిసురపొన్నల క్రింద సువర్ణమంటప
స్థలమున నింద్రకాంతఘటితం బగు వేదికమీఁద నున్నతో
జ్జ్వల మణిపీఠికన్ మృదు భుజంగమరాజ విశాల శయ్యపైన్. ౧౪౪

క. ఉత్సవ మొసఁగెఁ నాశ్రిత
వత్సలునకు నఖిల భువనవందితునకు శ్రీ
వత్స ప్రశస్త కౌస్తుభ
వక్షఃస్థలునకుఁ గరేణువర వరదునకున్, ౧౬౫

సీ. అగరు ధూపముల మిన్నగలు వాసన కెక్క-
జడిపట్టి కుసుమ వర్షములు గురియ
భేరీ మృదంగ ఝంఝారావములు మించ
చారణ స్తోత్ర నిస్వనము లెసఁగ
ముక్తాత పత్రదీప్తులు మీఱి ఖేచరీ
కరచలచ్చామరకాంతు లొలయ-
ధ్వజరణత్కింకిణీతాళ సంగతి నింపు
దనరు నచ్చరల నృత్యములు మెఱయ
తే. ననిశకర్పూర తైలధారాతి దీప్త
దీపమాలిక లానత దివిజమకుట
పద్మరాగాంతరంబులఁ బ్రతిఫలింప
మాసరము లయ్యె నుత్సవ వాసరములు. ౧౬౬

ఉ. సమ్మద లీల నిట్లు దివసంబులు తొమ్మిది చెల్లినం బ్రభా
తమ్మునఁ బూర్ణచంద్రతిథి తత్పద సంశ్రయులై విరక్తులై
నెమ్మిఁ జరించు వైష్ణవ ముని ప్రకరంబులతో-దశాస్యు లేఁ
దమ్ముఁడు వేడ్కమై నవభృథం బొనరించె సముచిత క్రియన్ ౧౬౭

వ. ఇట్లు తం డొనర్చు సముచిత సత్కారంబులఁ బరితోషితుండై విభీషణుం డర్ధమాస వ్రతంబునఁ దత్పుణ్య క్షేత్రంబున వసియించి, మఱునాఁ డరుణోదయ సమయంబున గమనోన్ముఖుండై యద్దివ్య విమానరత్నంబు నావహింపం బూని తరలింప నోపక యఖండ మదభరాఖండల ప్రచండ వేదండ శుండాకాండ మండితంబు లగు బాహుదండంబులు బెండుపడఁ బెనంగి యొండొండ నిట్టూర్పు లెగయఁ బగఁబొట్టి వెట్టుకొనిన వగలఁ బొగులుచు నిలాతలంబునఁ బడిపొరలఁ బతనిపైఁ గరుణా తరంగితం బగు నపాంగంబు నిగుడ శ్రీరంగనాయకుం డిట్లని యానతిచ్చె,- ౧౬౮

మ పరమాహ్లాదన మీకవేరతసయాపర్యంత మీ చంద్రపు
ష్కరిణీవారి సుధానుకారి జనలోక స్తుత్యుఁ డీ ధారుణీ -
శ్వరుఁ డస్మత్పదభక్తు లీమును లుదంచత్పుణ్యు లిట్లొట నా
కిర వీరావు వసింతు నీయెడన పౌ మ్మీవంక నీలంకకున్, ౧౬౯

క. విను మితిహాసం బొక్కటి
దనుజాధిప వింధ్యధరనికటమునన్
మును పేరుకల మహానదు
లొనరఁగ నొక్కెడన గూడి యున్నట్టితటిన్. ౧౭౦

క. విశ్వావసుఁ డనుగంధ
ర్వేశ్వరుఁ డచ్చోటి కెలమి నేతెంచి మదిన్
విశ్వాస మొదవ మ్రొక్కుచు
శశ్వద్గతి దక్షిణంబు చనినం బిదపన్ ౧౭౧

ఆ. వె. మ్రొక్కె నితఁడు దనకు మ్రొక్కె నీతఁడు దన
కనుచు నీసు వాసికై కడంగి
తమక మొదవ నదులు తమలోన వాదించె
ఘనరవంబు మింటఁ గడలుకొనఁగ ౧౭౨

చ. అతఁడును దక్షిణాబ్ధికి రయంబున నేఁగి భుజంగతల్పసం
గతు నను నవ్యదివ్యమృదుగానవిశేషములన్ భజించియున్
వ్రతముగఁ బౌష్యమాసమున వాసము తత్తటిఁ జేసి భానుఁ డూ
ర్జితగతి నుత్తరాయణము చెందిన గ్రమ్మఱి యేఁగుదెంచుచున్. ౧౭౩

క. ఆనతుఁ డగుటయు నానదు
లీనతి నీ వాచరించు టెవ్వరి కనినన్
భూనుత మహిమాధిక మీ
లో నెవ్వరు దాఁ కని పలుకుచుం జనియెన్. ౧౩౪

ఉ. అతటి నమ్మహాపదుల రయ్యెఁ బరస్పరగౌరవాల్పతా
హేతుక మైనవాద మదియెల్లఁ గ్రమంబున శాంతిఁ బొందె నే

రీతిని జిక్కఁగాక యుదిరెం జగడంబు గడం గవేరసం
జాతకు నంబుజోదరు లసత్పదపంకరుహప్రసూతకున్. ౧౬౫

ఉ. ఈసున నచ్చలం బొదవ నీగతి నిద్దఱు వాదొనర్చి ప
ద్మాసనుపాలికిం జని మహాత్మ! సమస్తసరిద్వరేణ్యపు
ణ్యాసమలీల మాయిరువురం దరయన్ ఘన మెవ్వరన్న నా
వాసి వియత్తరంగిణి కవశ్యము జొప్పడునంచుఁ జెప్పినన్. ౧౬౬

క. తొల్లిటివడి జెడి సంభ్రమ
మెల్లను వెస నడఁగి కంఠ మెడవడి రంతుల్
జెల్లక యుబ్బరి వంతలు
పెల్లై కావేరి దైన్యపీడిత యగుచున్ ౧౬౭

ఉ. బాహ్యాచరంబు గాని శుచిభావమునన్ మదవన్మరాళసం
వాహ్యాధర ప్రచారుఁ డగువాని గుఱించి సమస్తనిమ్నగా-
సహ్య తపఃక్రియల్ నెఱపి జహ్నుసుతాధికతాభిలాష-నా
సహ్యవసుంధరాధరవిశాలతటంబున బెక్కువర్షముల్, ౧౬౮

క. సరివారిలోన భంగము
పొరసిన సుడియై గలంక పొడమిసఁ గెలనం
బరు లుండిన దనజీవన
మొరులకు లోఁతీక మెలఁగు టుచితముగాదే, ౧౬౯

క. ఈ పగిదిఁ జరింపఁగ- వా
ణీపతి చనుదెంచి సురధునీసామ్యం బీ
నోపుదు గొను మధికత్వము
నాపని గా దొసఁగ వికచనాళీకముఖీ, ౧౭౦

చ. అని చనినం గవేరునిప్రియాత్మజ మత్ప్రతిబింబ మొక్కచో
ననువుగ నిల్పి భక్తి నెఱపార భజించిన మెచ్చి యిచ్చెదం
గొనుము వరంబు నీ కనినఁ గోమలి గోరెఁ ద్వదీయపాద సం
జనన ఘనప్రతాప యగుజాహ్నవి మీఱుమహామహత్త్వమున్. ౧౭౧

క. కోరిన గంగానది కా
గౌరవ మస్మత్ప్రసక్తిఁ గలిగె దదాధి
క్యారూఢియు మద్భక్తి య
వారితముం గలుగకున్న వశమే పొందన్, ౧౮౨

వ. కావున నీకు గంగాధిక్యంబు గల్గునట్లుగా భవదుభయ ప్రవాహమధ్యంబున-
మధ్యందిన దినకరప్రభాసుందరం బగురంగమందిరంబునఁ దిరంబుగా వసిం
చెద నని ప్రతిజ్ఞ చేసితి నట్లగుట నీప్రదేశనివాసం బవశ్యకర్తవ్యం బని యానతి
చ్చిన దచ్చరణారవిందంబులకు నభివందన మాచరించి ముకుళీకృతకరాంబు
జుండై యారావణానుజుండు ౧౮౩

తే. ఇందిరాధీశ! నీతలం పిట్టిదేని
నిత్యసేవకవృత్తిమై నిన్నుఁ గొలిచి
యేను నిచ్చోట నుండెదఁ గాని విడువఁ
జాల భవదీయ పాదాబుజములపొందు, ౧౮౪

ఉ. నావుడు నిట్లనుం దనుజనాయకుతో హరి కర్మభూమి మ
ర్త్యావలి నుద్ధరించుటకునై యిటు నీయవతార మొందితిం
గావున నిక్కడ న్నిలువఁ గార్యము గల్దటుగాన నెంతయున్
నీవు వసింపనేల రజనీచర! పొమ్ము భవత్పురంబుకున్ ౧౮౫

తే. అచట రాఘవకరుణాకటాక్షలబ్ధ
మహిత నిరపాయ దనుజసామ్రాజ్యసుఖము
లారవిందుతారకముగా ననుభవించి
మించెదవు మోక్షపదవి నామీఁద ననిన ౧౮౬

చ. మది యురియాడ నాతఁడు రమావరు కిట్లను నే నశేషసం
పదలను గాంచి ముక్తి దనుఁ బ్రార్థనఁజేయఁ దదర్థమై శుభా
స్పద మగురంగమందిరము భాసుకులాఖెపుఁ డిచ్చె నిచ్చనే
నది దిగనాడి యేగతి నహీనకరాంబుజ నెత్తరించెదన్, ౧౮౭

సీ. అని నన్నుకమేనఁ దకనితో నమ్మ న
భీషణ మోక్షాభిలాషుడైన

వారును ఘనభోగవాంఛాపరాయణు
లగువారు గల రెవ్వ రట్టిపురుష
లందఱు నస్మదాజ్ఞానుపాలనము సే
యుదురు యాగవ్రతానూనదాన
ముఖ బహుశుభకర్మములు నాకుఁ బ్రియముగాఁ
గావింపుదురు నీకు నావిధమున

తే. ధర్మ మెడలక మత్పరతంత్రవృత్తిఁ
దగిలి రాజ్య మొనర్పుము తలఁపు నన్ను
నేను నిన్ను నుపేక్షింప నేఁగుదేర
వలవ దెన్నఁడు నీవు నీవారు నిటకు, ౧౮౮

వ మఱియు నొక్కవిశేషంబు విను మెల్లకాలంబును బట్టణాభిముఖుండనై వీక్షింపుచుండుదు. పంచజనులు పాపకర్ము లగుటఁజేసి నీవల ననుగ్రహంబు సేయుచు నన్నభిలషించి దూరదేశాగతు లయినవారలకుఁ బరమపద ప్రాప్తియు-మనోరథంబులు నిత్తు, నీద్వీపంబు పుణ్యభూమి యగుటంజేసి యచ్చోట నెయుండి సంస్మరింపు,మత్యంతసుకృతంబు సంభవించు-నొక్కొక యేటఁ బుణ్యదివసంబులందు మత్సందర్శనంబున కలిరహస్యంబుగాఁ గామ రూపంబు గైకొని రమ్ము-పొమ్మని మఱియు నిట్లనియె, ౧౮౯

ఆ. వె. ధర్మములును సకలకర్మఫలంబులు
పరిహసించి శరణుఁ జొరుము నన్ను
నిదియె నీకు మోక్షపదపరప్రాప్తికి
నలిరహస్య మైన యట్టిమతము ౧౯౦

చ అని హరి పల్కినన్ వినతుఁడై మఱియొండన నోడి-లంకపుం
జనియె విభీషణుండు, మునిసంఘములో నిట ధర్మవర్మయున్
వినుతవిశిష్టపూజనలు వేడుకఁ జేయుచునుండె భక్త,హృ
ద్వనజవిహారకున్ భవనివారణకర్తకు రంగభర్తకున్, ౧౯౧

క. అది యాదిగఁ గావేరీ
నదిఁ జెలువగు పులినతలమునను హరికి నిజా

స్పదమగు శ్రీరంగం బు
న్నది భజదపవర్గసాధనంబై నేఁడున్, ౧౯౨

వ. అని చెప్పి యప్పరాశరతనయుండు సవినయుండగు నాగదంతమునీశ్వరునితో నిట్లను నీప్రకారంబున భువనరక్షణపరాయణుండగు నారాయణుండు నిజావతార ప్రసంగంబు, సాంగంబుగా నుపన్యసించి- వెండియు సుబోధుఁ గనుంగొని, ౧౯౩

మ. త్రిజగత్పావనతీర్థసారములు శక్తిశ్రీనిజాకారముల్
భజదిచ్ఛాఫలదప్రచారములు శుంభన్మంగళాకారముల్
కుజనవ్రాతవిదూరముల్ మధురనిర్ఘోషాదిగంభీరముల్
విజితాఘౌఘవికారముల్ దలఁపఁ గావేరీపయఃపూరముల్, ౧౯౪

క. నీ వింపుమిగుల నీనది
గావింపుము నియతి సమవగాహాదివిధుల్
సేవింపు మెపుడు నను మది
భావింపుము రంగశయనుఁ బంకజనయనున్, ౧౯౫

తరల:- అనుచు నీగతి భక్తవత్సలుఁ డైనయాహరి కర్ణమో
హన సుధామధురోక్తులం దగ నానతిచ్చినఁ బ్రీతుఁడై
మునిజనోత్తముఁ డాసుబోధుఁడు పూనితద్వచనక్రమం
బునఁ జరించుచునుండె దోషవిముక్త సాత్వికవర్తనన్ ౧౯౬

ఉ. ఈకథవిన్న వ్రాసినఁ బఠించిన నాయురనామయత్వముల్
చేకుఱు వేదవిత్త్వ,రిపుజిత్వ,ధనిత్వ,సుఖిత్వముల్దిరం
బై కలుగున్ మహీసురనృపార్యజఘన్యజకోటి కున్నతుల్
బైకొను వంధ్య పుత్రుఁ గనుఁ బాయు ననేకభవార్జితాఘముల్. ౧౯౭

వ. అని యివ్విధంబునఁ బ్రసంగవశమునఁ గావేరీమహత్వం బుపదేశించె, వేదవ్యాసమునీంద్రుండు చంద్రపుష్కరిణీప్రభావంబు దెలుపు తలంపున నాగదంతసంయమి కిట్లనియె, ౧౯౮

చ. అనుపమ దివ్యబోధమహిమాధికుఁ డైన సనత్కుమారస
న్మునివి మఘ చంద్రపుష్కరిణి పొంత దపం బొనరించెఁ బైపయిం

ఘన మగుసంతతాయములు గై కొన కెంతయు శాంతచిత్తుఁడై
యనిశము క్రోలుచుం బటుశిఖానలపంచకమధ్యమంబునన్. ౧౯౯

క. ఆతని తీవ్రతపస్స్థితి
చేతస్తాపం బొనర్పఁ జింతాకులుఁడై
ధాతకడ కమరనికరస
మేతుండై చని సురేంద్రుఁ డిట్లని పలికెన్, ౨౦౦

మ. ఘనతేజుండు సనత్కుమారుఁడు మహోగ్రస్ఫూర్తి నుర్విం దపం
బొనరన్ సల్పెడు నిప్పు డేనతని యుద్యోగంబు వారింతుఁ బొ
మ్మనుచుం బన్నిన విఘ్నముల్ చనియె వమ్మై నీ వుపేక్షించి-ని
ల్చిన నేకక్షణమాత్ర లోకములు భస్మీభూతముల్ సేయఁడే! ౨౦౧

క. కావున నింద్రపదం బొ
నావల నొం డెద్దియైన నగుఁ దదభీష్టం,
బీవేళఁ దడయ కొసఁగి ని
రావిలముగఁ జేయు జగము లరవిందభవా. ౨౦౨

వ, మేము నిన్ను శరణు జొచ్చి నార మెయ్యది కర్తవ్యం బది యానతిమ్మని యాఖండలుం డూరకుండె - ననంతరంబ తత్సభాంతరంబునకు నుమాకాంతుం డేతెంచి శతమఖ ప్రముఖ నిఖిల బర్హిర్ముఖులఁ గనుంగొని తదాగమన ప్రయోజనం బడిగి వారలు సనత్కుమార ఘోరతపోభీతు లగుట దెలిసి జలజాసనుం గనుంగొని ౨౦౩

క, ఇది యేటిరాక తలఁపె
య్యది సేయఁగఁ దగినకార్య మెద్ది జగం బా
పద యెట్లు వాయు ననవుఁడు
త్రిదశజ్యేష్ఠుండు వామదేవున కనియెన్ ౨౦౪

చ, అరయ సనత్కుమారుఁడు యుగాంత్యమహాచల తీవ్రతేజుఁ డె
వ్వరికినిఁ దత్తపం బుడుపపచ్చునె మోక్షపదాభిలాషమై

పరఁగెడునాతఁ డిట్టిపని పంకజనాభుని చేతిదౌట నా
హరి కిది విన్నవింపు మన మందలయుం జుటొప్పు నిత్తఱిన్. ౨౦౫

వ, అని యాక్షణంబ కదలి చని ౨౦౬

మ. అరవింద ప్రభవుండు గన్గొనియె మధ్యస్థానసుప్తాంబుజో
దర పర్యంక భుజంగపుంగవ సముద్యద్భూరిభోగాగ్ర వి
స్ఫురితానేక నిరర్ఘ దివ్యమణి సంభూత ప్రభాపుంజ పం
జర జాతాభ్రపదభ్రమాకులిత భాస్వత్సారథిన్ నీరధిన్. ౨౦౭

వ. మఱియు నమ్మహార్ణవంబు సముదీర్ణమద దుర్నివారంబులై విస్రంభ విహారంబులఁ బరిభ్రమించు కుంభీకుంభీర తిమి తిమింగిల కమఠ కర్కటాది జలగ్రహంబుల సమగ్రకోలాహలంబుల నినుమడించి బ్రహ్మాండ భాండోదర నిరంతర జంతుసంతాన నిర్ఘోష ప్రతిఘోషంబులకై వడి నెడపడక విశ్వ విశ్వంభరాభారధురీణకరేణు కర్ణకుహరంబులు చెవుడుపడ నడరు ఔడిదంపు మ్రోతలును దుర్వారవేగావహాది మహామహత ప్రేరితంబులై చూడ్కులకు వెక్కసంబుగా నెక్కడఁ జూచినఁ బంకపంకంబు లగుచు నొండొంటి నొత్తుకొని వచ్చు నుత్తుంగతరంగ సంఘట్టన సముద్గత ఫేనమి యెకములం గూడి దరులకుఁ దొట్టి తెట్టువలు గట్టి యసంఖ్యాకంబులై కౌస్తుభా కల్పునకుఁ దల్పంబగు భుజంగపుంగవుఁ డప్పటి కెకలించిన కుప్పసంపుతిప్పల యొప్పున రసాతలాఖిల క్రీడామహాగకలిత నాగకన్యకాబృందంబు పందెంబునకై యెగవైచిన ముక్తాఫల కందుకంబులుం బోలె - వియచ్చరు లచ్చెరువునొంద నుచ్చలితం బగు బిందు సందోహంబులును, నితరనిమ్నగా సంగంబుల భంగంబు నెఱపు తనవలనఁ బండితాభావంబు భజియించి యంబరంబు వదలక నిద్రాత్యాగంబునుం బోలె ననిమిషాలోకనయై యున్న మిన్నేఱుఁ దేర్చుటకై నేర్పునఁ బరిభవించిన దీర్ఘబాహార్గళంబుల లీల నభ్రంకషంబులై గ్రాలు కల్లోలంబులును భూతకాలంబున నమృతోత్పాదన సమయంబున దేవ దానవ వ్యూహ బాహాపసవ్య సవ్యాకృష్యమాణఫణిరాజ రజ్జువలయ వలయితా మంథర మందర పరిభ్రమణ విలులితంబు లగు పయఃపూరంబుల విభ్రమ విశేషంబుల నెందును బాయకున్నవో యనుశంక నంకురింపం జేయు విపులావర్తంబులును, బక్ష విచ్ఛేదనారంభ విజృంభితుం డగు జంభారి వలని

భయంబునం బెకలి వచ్చి పడియం జొచ్చియుం దదనుధావన సందేహ రసంబు లయి నిక్కిచూచు ధరాధరనికరంబుల చందంబులం బోలెఁ నత్యున్నత విస్తారాయామ రమణీయంబులై, రజితమహారజిత రత్నౌషధీ ప్రముఖ ప్రశస్త వస్తు విశేషంబుల ప్రోవుల దీవులును, బయోధి గర్భ నిర్భర బాడబానల శిఖాకలాపంబు లక్కడక్కడఁ బిక్కటిల్లి వెలికి నిగిడిన బాగునం గొనలుసాఁగి సోనరై సొబగు మిగిలి పొదలి పొదిగొని యంబరభాగంబునఁ బరఁగి రాగిల్లు తరుణారుణ కిరణజాలంబుల గేలిగొనఁ జాలి యుపాంత ప్రదేశంబుల నక్షుద్రంబులగు విద్రుమలతా చయంబులును, స్వాధీనలై యభిసారికా లీల లంగీకరించిన తరంగిణుల యెడ నాత్మీయ దక్షిణ నాయకత్వం బెఱుకపడఁ దత్తదుచిత సంకేత స్థలంబుల విలసించుచందంబున మందానిల స్పందమాన మందార మంజరీ మకరంద నిష్యంద బిందు సందోహ శీతల సికతాతలంబులం గల వేలావనాంతరంబులఁ బ్రత్యేకంబాడిన నదీ సంగమ స్థానంబులును, మధ్యభాగంబున యోగనిద్రాపరాయణుం డగు నారాయణు దివ్య దేహకాంతి ప్రవాహ యోగంబునఁ గృష్ణత్వంబు గైకొన్న రూపున దీపించు నంతర్గత క్షీరగ్రాహి నీలమణీ ధామంబుల నతిశ్యామంబు లగు నాగంబులును, భువనద్రోహులు పాతాళబిలంబులం దాఁగియున్న దైతేయ వ్రాతంబులఁ బరిమార్ప ననువుపడుటకై క్షీరకాండంబు లొండొండ క్రోల నాఖండలుండు పుత్తేర నరుగుదెంచిన బలాహక సందోహంబులుం బోలె పత్రక్రీడా లోలంబులైన వన్యశుండాలంబులుం గలిగి, యపవర్గంబునుంబోలె ముక్తాస్పదంబై, యచలగహ్వరంబునుంబోలె హరినిద్రాసుశోభితంబై, యచ్యుత కరంబునుంబోలె నారూఢచక్రంబై, యంబుదాగమసంబునుంబోలె నహిమకర భాసురంబై, యమరాద్రియుంబోలె నత్యాప్తచంద్రపాదంబై, యశ్వరత్నంబునుంబోలె ననమ సుధారాజితంబై, యాహవరంగంబునుంబోలె నతి ప్రభాపలక్షితదివ్యకాండంబై, సురభిసమయంబునుంబోలె సుజాతసుమనోబహుళంబై, రమణీనితంబంబునుంబోలె రత్నగర్భాభిరామమేఖలంబై, మెఱసి గాంభీర్యంబునకు విస్రంభస్థానంబును, మాధుర్యంబునకు ధుర్యంబును మర్యాదకు నాదికారణంబును, నౌదార్యంబునకు నాకరంబును, నద్భుతభయానకంబులకుఁ దానకంబును నాధిక్యంబునకు నావాసంబును, నాది తిమికమఠ భూదారవిహారంబున, కాధారంబున నతివమహత్త్వంబున కాస్పదంబును,

ననుపమానంబునునై పెంపొంద డెందంబునం దనుభావంబున గొని యాడుచుఁ దీరంబు సేరి, శరణాగతశరణ్యుం డగు నప్పుండరీకాక్షు నిట్లని స్తుతించె, ౨౦౮

సీ. హరికి మ్రొక్కెద షడ్గుణైశ్వర్యసంపన్ను
నకు శాంతునకుఁ బరునకుఁ బరాత్మ
నకు నగణితతేజునకుఁ బరమేష్ఠ్యాత్మ
నకు బరమేశ్వరునకు ననంత
నిరుపమభూత్యేకనిధికిఁ బరాపరే
శునకు నచింత్యరూపునకు నాది
కర్తకు విశ్వభోక్తకు నక్షయానందమూ
ర్తికి నిత్యతృప్తునకు నిత్య

తే. శుద్ధునకు నీవ దేవ యీసురపతియును
హరుఁడు నేనుఁ జరాచరోత్కరము నీవ
జగము లన్నియు నీయందు సంభవించి
నీవ రక్షింపఁగా మను నీరజాక్ష! ౨౦౯

ఆ. వె. సకలవేదములును సంకల్పసంస్మృతి
కారణములు నీకుఁగాక యంత
కర్తృభోక్తలును జగన్నాథ నీవు నీ
విక్రమాధిగతము విశ్వచయము. ౨౧౦

క సదసత్పరుఁడవు సర్వ
త్రిదశ శరణ్యుఁడవు వాక్తతికి వాంఛుఁడ వె
య్యది విబుధదృశ్య మగుపద
మది యుష్మత్పరమధామ మంబుజనాభా! ౨౧౧

వ భవచ్చరణ శరణాగతుల మమ్ము రక్షింపు మఖిలంబు నీవ యెఱుంగు దని ప్రస్తుతించి కాంచనదర్భుండును నిర్భరానంగంబున నమ్ముకుందున కభివందనంబు గావించి యూరకుండె, నప్పు డాఖండపరశుండును నాఖండ

లుండఁగను, బహువిధంబులఁ బ్రస్తుతించిరి, యిత్తెఱంగున నందఱుఁ బ్రార్థింప
వారలయెడఁ బ్రసన్నుండై పారావారమధ్యంబున, ౨౧౨

సీ. దివ్యవిగ్రహకాంతి దిగ్విలాసినులకుఁ
గర్ణోత్పలశ్రీలు గడలుకొలుప
మహిత నానాకల్ప మణిదీప్తు లంబర
స్థలిఁ జిత్రరచనలు సంఘటింప
నభినవాంశుకరుచు లాపగాకుచహారి
ద్రాయోగశంక సిరధికి నింప
శంఖచంద్రాంశుపుంజము జరత్కౌముదీ
బాలాతపంబుల పసలు చూప

తే. సితవిశాలాయతేక్షణశ్రీలు కుముద
వారిరుహవికాసమునకు వన్నెనెఱప
గరుణ మూర్తిభవించె నిక్కరణి సనఁగ
నెలమిఁ బ్రత్యక్షమయ్యె లక్ష్మీశ్వరుండు. ౨౧౩

క. అప్పరమేశ్వరుఁ గనుగొని
యప్పుడు, ప్రమదంబు భయము నద్భుతమును లో
ముప్పిరిగొన శ్రుతిమతములు
చొప్పడ నుతియించి రదితిసుతు లానతులై. ౨౧౪

ఉ. అవ్విబుధవ్రజంబు నుతు లంబురుహోదరుఁ డాదరించి లే
నవ్వు దొలంకుచూపుల మనంబుల దుస్థితు లెల్లఁ బాపి మీ-
రెవ్వరు మీకు నిచ్చటికి నిప్పుడురాఁ గతమేమి యీగతిం
బర్వెన నవ్వ యెయ్యది సమస్తముఁ జెప్పుడు నాకు నావుడున్, ౨౧౫

క. శ్రవణామృతముసు మేఘా
రవగంభీరంబు సగుధరాధరుపలుకుల్
దివిజజ్యేష్ఠుఁడు విని ఫ
క్ష్యవసతుఁడై విన్నవించెఁ బ్రాంజలి యగుచున్ ౨౧౬

ఆ.వె. పసు గమంబు ప్రపసితంపు దేమౌళి
హరిహయుం డితంపు సురలు పేర
లింతవట్టువార మెపుడు నీపదములు
గోరి తలంచి బ్రదుకువార మీర ! ౨౧౬

ఉ. దేవ ! సనత్కుమారుఁ డతితీవ్ర తపోరతి నున్నవాఁడు రో
కావలి తత్ప్రతాప మహితార్చికి మండెడు, వానికోర్కెనే
మై వెదకింపఁ దీర్ప సమర్థుం డొకడును ధాతకోట్లపస్
నీవు శరణ్యుఁ డౌటను మునిస్తుత ! నీ కిది విన్నవింపఁగన్ ౨౧౭

క. మావచ్చుట యిట మీఁదట
దేవర చిత్తంబుకొలఁది తెల్లం బని భా
పావిభుఁడు నూరకుండిన
శ్రీవల్లభుఁ డంత దరహసితవదనుండై, ౨౧౮

చ. వనజభవున్ హరుం ద్రిదశవల్లభుఁ జూచి సనత్కుమారస
న్మునిఁ దపమాచరింపుమని మున్న యెఱుంగుదుఁ దన్మనోరథం
బనితరసాధ్య మట్టగుట నంతయు నేనొకజాడ దీర్చెదా
మ్మనియెదఁగాని మీరు చనుఁడా తమవీడులకున్ ముదంబునన్. ౨౨౦

తే. పద్మసంభవ ! నాదృష్టిపథమునందుఁ
బడినవాఁ డెప్పుడైన నాపదఁ దొఱంగి
చిరతరైశ్వర్యసుఖములఁ జెంది వెలుఁగు
ననిను మఱి చెప్పనేల నీయట్టివారి, ౨౨౧

చ. అనిన గృతార్థులై ప్రమదమారఁ దదీయపదారవిందవం
దన మొనరించి తద్వరశతంబులు గాంచి, విశేషకాంతియౌ
వని కరుణావలోక సృమివాగ్విభవంబు లనేకభంగులన్
వినుతులు సేయుచుం జనిరి వేల్పు పితామహముఖ్యదేవతల్ ౨౨౨

వ. అని యిట్లు కృష్ణద్వైపాయనుండు నాగదంతున కెఱింగించినతెఱంగు, ౨౨౩

-ఆశ్వాసాంతము-

మ. ప్రతిభాషోదిత సర్వశాస్త్రకలనాపాండిత్య!సద్వాదశీ
వ్రత సంకల్పిత గోహిరణ్యమణిభూవస్త్రాన్నదానాధిత
ప్రత ధాత్రీసురబృంద ! మందరమహీభృద్ధైర్య! వీణాదిసం
గతసంగీతకళావిలోల బుధలోకస్తుత్య నిత్యోదయా! ౨౨౪

క. జరఠఫణికమఠపరివృఢ
కరికిరి కులకుధర విధృత ఘనతర ధరణీ
భరభరణక్షమ దక్షిణ
కరఖరకరవాల! విమతగర్వవిభాళా! ౨౨౫

మాలిని - రుచిరమణికలాపా!రూపపుంద్రేక్షుచాపా!
ప్రచుర విబుధపుణ్యా!బ్రహ్మవంశాగ్రగణ్యా!
విచలిత రిపుచేతా!విఠ్ఠలేంద్రానుజాతా!
సచివకుల లలామా!చాగయామాత్యరామా! ౨౨౬

గద్యము

ఇది

శ్రీ మద్భ్రమరాంబా వర ప్రసాద లబ్ధ సారస్వత
విలాస గౌరనామాత్య పుత్ర సుకవిజనమిత్ర
సుధీవిధేయ భైరవ నామధేయ ప్రణీతంబైన
శ్రీరంగమహాత్త్వంబను పురాణకథయందు
ద్వితీయాశ్వాసము.

-౦-

# శ్రీరంగమహత్త్వం

## తృతీయాశ్వాసము

క. శ్రీమాధవపద కోమల
తామరసార్చన విధానతత్పర! సుజన
క్షేమంకర కరుణోదయ!
చామీకరరుచిరధామ! చాగయరామా!

వ. అవధరింపు మఖిలకథాకథనచాతురీజనితరోమహర్షణుం డగురోమహర్షణ కుమారుండు,దివ్యబోధకు లగు శౌనకాదితపోధనులకుఁ జెప్పిన చందంబున నిందిరాసుందరుం డరవిందభవాది బృందారకబృందంబు న ని పి - యసంరంభ— ౨

సీ. పరిణాహ పరిలసత్ఫాలభాగంబున
రమ్యమై యూర్ధ్వపుండ్రంబు వెలుఁగ,
నలినాక్షమాలికాకలిత వక్షంబున
ధవళ యజ్ఞోపవీతములు మెఱయ,
ముఖ్య రత్నాంకితముద్రాభిరామ హ
స్తముల నూతనపవిత్రములు దనర
సింహాసంహననతా శ్రీకిని బైకొంపు
గాఁగ నుద్గమసీయకం బెలర్పఁ

తే. గోమలోత్పలదళకాంతి కొమరుమిగులు
మేను, గృపతోడఁ జిఱునవ్వు మెఱయఁ జూపు,
మనయశ్శైలోపరిస్థలి నుల్లసిల్లు
జలజబాంధవు మిగులు తేజముసు గలిగి

మ. హరిరీం బ్రణవాత్మకుం డసటఁ దా నధ్యాపకుండై ఫగే
శ్వరచక్రాబ్జసరోజనందకగదాశార్ఙ్గాయుగంబుల్ మనో

హరభాస్వ ద్వటుకాకృతుల్ మెఱయ శిష్యస్తోమమై—విస్ఫుట
స్వరవర్ణక్రమ వేదపాఠనిరతిన్ సద్భక్తి నేతేరఁగన్, ౪

క. వారలఁ జదివించుచు నిజ
చారుతరద్యుతులు నఖిలజగములకు ముదం
బారోహించుచు ద్రుహిణకు
మారుఁడు తపమున్న యాశ్రమమునకు నరిగెన్, ౫

వ. అప్పు డనన్యసాధారణంబు లగునారాయణప్రభువు గుణగణంబులచేత వశీకృతంబులై న సకలవేదశాస్త్రంబులు తారాకారంబులు భజియించి యను సరించె. సనకసనందనాది ప్రసిద్ధ సిద్ధముని సాధ్య విద్యాధర కిన్నర కింపురు షాదులు నంతరిక్షంబున నంతర్హితులై కొలిచి చనిరి, తదీయ సామగానపరి మోహితంబులై మృగంబులు ఖగంబులు తోడన తగిలిపోయె నివ్విధంబున నప్రమేయ ప్రభావ భాసురుండై తనయున్నయెడకు వచ్చు నాకపట భూసురు దవ్వుదవ్వులం గని ప్రత్యుత్థానంబుఁ జేసి కృతాంజలియై కంజ భవనందనుం డంతర్గతంబున— ౬

క. ఈ వేష మీశుభాకృతి,
యీవిశ్వవ్యాప్తి తేజ మీసత్కరుణా
భావము నదృష్టపూర్వము
లీవిప్రుఁడు మనుజమాత్రుఁడే తలపోయన్, ౭

ఉ. ఈవటువుల్ సరోరుహనిభేక్షణు లండఁ గృష్ణసారచ
ర్మావృతనిర్మలాపఘను లంచితకుంచిత నీలమూర్ధముల్,
పావనభావు లుజ్జ్వలితపావకతేజు లను నలక్షణ
శ్రీవిలసత్రయీపరనశీలు రనాహతశేముషీనిధుల్, ౮

వ. ఇమ్మహామహుం డేమినిమిత్తంబున నిచ్చటికి వచ్చుచున్నవాఁడొకో యని వితర్కించుచు విస్మయస్తిమితలోచనుండై చూచుచున్న యమ్మునికుంజరుఁ జేరం జని నిజ సహాగంబునఁ దన్నుఁ గృతార్థునిగాఁ దలంచు నతనితోడ నాకమఠాకళ త్రుండు ౯

క. ఓయతివర ! నీ వెవ్వఁడ ?
వీయెడ నిట్లుండ నీకు నే లనిన మహా
త్మా ! యే సనత్కుమారుఁడ
పాయక యిన్నెలవునం దపం బొనరింతున్, ౧౦

ఉ. భూవిబుధాగ్రగణ్య కృతపుణ్యవిచిత్రము నీ చరిత్ర మే
రావుననుండి వచ్చి తెచటన్ వసియింపుదు రెట్లు గూడె ని
న్నీవటుసంచయంబు జనయిత్రియుఁ దండ్రియు నెవ్వ రిష్ట—ఏ
భావగతార్థ మెయ్యది, కృపాయతి ! నా కెఱుఁగంగఁ జెప్పవే ! ౧౧

క. నీపుణ్యదర్శనంబునఁ
దాపము లడఁగెం, ఫలించెఁ దదభిమతంబుల్.
ప్రాపించె నెవ్వ రీ వీ
రూపున విహరించె దా హరుఁడవో ! హరివో ! ౧౨

క. అనవుఁడు నమ్మునిపుంగవుఁ
గనుఁగొని యంతఃస్మిత ప్రకాశితముఖుఁడై
ఘనచతుర వచనరచనలఁ
దనతెఱఁగు మొఱంగి ధరణిధరుఁ డిట్లనియెన్. ౧౩

సీ. ఇందుండి వచ్చితి నిప్పుడే ననరాదు—
సకల లోకైకసంచారిఁ గాన
నిది యది నెల వని యేర్పరింపఁగఁ బోల
దెందుఁ జూచిన వసియింతుఁగాన
రూపించి తల్లి దండ్రులఁ జూపి చెప్పఁగా
లేదు వా రెవ్వరు లేరుగాన
వీరు బంధువు లని వివరింపఁ గూడదు
సర్వభూతములకు సముఁడగాన —

తే. వటువు లిట్టట్టు గతిఁ జేరవచ్చి వసఁగఁ
బొందు గాదు, నిమిత్త సంభూతు లగుచుఁ

చిత్తగత మైనకార్యంబు చేతలందు
నెఱుఁగఁ దగఁగాక మాటల నేమిచెప్ప ౧౪

తే. హరుఁడ గానే నముచిసంహరుఁడగాను,
యతివరేణ్య యథేచ్ఛావిహారపరత
పలుల నొకపురుషుఁడని నన్ పటుపు వెల్ల
శిష్యులై భక్తి శుశ్రూష సేయఁ గండు. ౧౫

సీ. నిగమజాతంబు నే నిల్పఁబట్టిన నిల్చు
నగములు నా చెప్పినట్లు చేయుఁ
బుడమి నాముందటఁ బోరాడు చర్చింప
శ్రీపహింతు నపూర్వసింహ మనఁగఁ
బ..పదక్రమముల బ్రహ్మకీటుడు వాడు
లెదిరిన ఖండింతు ముదము లడఁగ
శైశవంబునన యజ్ఞవ్యాహుతుల్ దీర్తుఁ
బ్రజ్ఞమై శేషరూపము భజింతు

తే. మును మహర్షులు సర్వజ్ఞమూర్తి యనుచు
వినతులుగ నిష్పరిగ్రహవృత్తి నుండు,
వివిధ దుష్కర్మరతులు గర్వించిరేని
నిగ్రహింపుదు సుకృతంబు నిలుపుకొనకు. ౧౬

ఆ. ఇవి మదీయగుణము లిప్పుడు నీచేత
నెఱుఁగఁ బడినపిదప నేమి గలదు
నీకు నది యటుండె నిన్నొక్కమాట నే
నడుగ వచ్చితి విను మట్టిప్రశ్న. ౧౭

చ ఎడపక సర్వవర్ణముల కెయ్యది కార్యము వాచ్చ మెయ్య చె
ప్పుడుసు మనుష్యసం(త)హతికి భూతచయంబున కెద్ది చక్షు వె
య్యెడ నొకటయ్యుఁ బెక్కయిన దేమి ఘనాశ్రయమున్ ఘనంబునై
యడరెడు నెద్ది యల్పతర మయ్యును వ్యాపక మెద్ది యారయన్ ౧౮

క. ఎయ్యది సదసత్తులు పర
మెయ్యది దానికిఁ దలంప నెద్ది యజాతం
బయ్యెను - బహుప్రజాతం
బయ్యెనఁగుచునుండు భూసురాగ్రణి చెపుమా! ౧౯

వ. అనిన నయ్యుత్తమద్విజునకు - నజునికొడుకు కిట్లనియె. ౨౦

మ. మతి నే ని న్నొకవిప్రమాత్రుఁ డని నమ్మంజాల, యుష్మత్సమ
ప్రతిభుల్ శిష్యులు నిట్టిచందము దలంపన్, మాదృశానుగ్రహో
చిత బుద్ధిన్-వసుధావతీర్ణుఁ డగులక్ష్మీభర్త-వీమూర్తిసు
స్థితియుం దేజము నున్నవారలకు నేదీ యట్లు గాకుండినన్. ౨౧

క. నీ వడిగినప్రశ్నములకు
భావం బిది యని యెఱింగి ప్రత్యుత్తర మీ
నావశమె-ఘనతరప్ర
జ్ఞావంతుల కైన నది యశక్యం బనినన్ ౨౨

వ. సకల వేదాంతరహస్యవేది వగు నీవు దక్కఁ దక్కినవార లిట్టిప్రశ్నలు గావింప వానికిఁ దగిన యుత్తరంబులు చెప్ప నసమర్థులు, గావున నాదెసం గలుగు కరుణాగుణం బేర్పడ నెంతయు నీవు దెలుపు మని ప్రార్థించిన - నమ్మహానుభావుం డిట్లనియె. ౨౩

సీ. ఎల్లవర్ణములకు నెప్పుడు గార్యంబు
ధర్మంబు మఱిసుకృతంబు బాయ
రనిశంబు దివ్యశక్త్యావిష్టుఁ డగుపద్మ
బంధుండు చక్షువు ప్రాణితతికిఁ
దగ నేకమయ్యుఁ బ్రధానంబు కార్యరూ
పమునఁ జూడఁగ బహుత్వమ భజించు
నాధారహీనమై యధికమైనది పర
బ్రహ్మ మల్పం బనల్పంబు వ్యాపి

తే. పరఁగ సదసత్తు లనఁగ నక్షరము క్షరము
నన్నౌ మీరెంటికిని బరమాత్మఁ దలఁప

భవము బొరయక యుండియు బహువిధముల
జనన మొందుచునుండు నీశ్వరుఁడు వత్స! ౨౪

క. చెప్పితి సంక్షేపంబున
నిప్పటి ప్రశ్నోత్తరంబు లెయ్యవి యింకన్
జెప్పవలయు నీ కనుటయు
నప్పురుషవరేణ్యుతోడ నఱఁ డిట్లనియెన్. ౨౫

సీ. ధర్మ మెట్లది-సూనృతం బెద్ది-దివ్యశ
క్త్యావేశ మద్దేకమైన వస్తు
వరయ నేరీతిఁ బెక్కగు, నిరాధారత
బ్రహ్మంబు కెద్ది యల్పత్వఘనత
లొక్కటి యెట్లు. నెందొగిఁ బ్రసన్నబ్రహ్మ
మక్షరక్షరముల కన్యమగుచు-
నెట్లు చెప్పితి పుట్టు వెన్నఁ డెఱుంగని
యీశ్వరుం డె ట్లుదయించుచుండు

తే. మాటిమాటికి నింతయు మన్మనంబు
సంశయము నొందఁ జేసె నీశంక నెల్ల
దీర్ప నర్హుండ వీవ సుధీవరేణ్య!
యనినఁ, దెలిపెద విను మని యతఁడు వలికె, ౨౬

క. నిగమములు భూతసమితికిఁ
దగుగతి యగుటం దదితరక్రియ - పరమం
బగుధర్మ మనిరి-హింసలఁ
దగులని సత్యంబు సూనృతం బనఁ బఱఁగున్. ౨౭

తే. విష్ణుశక్త్యభివిష్టమై విశ్వజగము
లొగిఁ బ్రవర్తించుఁ గాకున్న నుడిఁగి మడుఁగు
నాత్మ దనుఁ బాసి బోయిన యట్టి కుణక
మడరి చేష్టింపఁ జాలని యవ్విధమున ౨౮

మ. పరమవ్యోమపదంబునం దవిరతోత్పన్నామితానంద-భా
స్వరలీలం బరమాత్ముఁ డుండుఁ, దదాయాజ్ఞఁ బ్రహ్మగర్భాండముల్
పరివర్తింపఁగ నప్పరేశ్వరుని శుంభచ్ఛక్త్యుపష్టంభవి
స్ఫురణం బెంపు వహింప వాయు హుతభుగ్భూషాఙ్ఞసంచారముల్. ౨౯

క. ఏవస్తువు లత్యూర్జిత
మై వీక్షణగోచరంబు లగు మునివర నీ
వావస్తువుల నెఱుంగుము
శ్రీవిష్ణుని దివ్యశక్తి జృంభితములుగాన్. ౩౦

వ. మొదట నొక్కటయైన ఘటత్వపటత్వాదిజాతికి సజాతీయంబు లద్ధాకృతి వైషమ్యంబున బహుత్వంబు బహుత్వంబుయుక్తంబై నకరణి-నేకంబైన వస్తువునకుఁ గార్యకారణ భావంబున ననేకంబు సిద్ధించుట-విరుద్ధంబు గాదు. సర్వంబునకుఁ బరబ్రహ్మ తానె యాధారంబుగానఁ దదాధారంబ సంభవం బగుట నదినిరాధారం బని చెప్పితి, నట్టి బ్రహ్మంబునకు సంకోచ వికాసంబునం జేసి యల్పత్వ బహుత్వంబులు ప్రసన్నం బగు-మఱిసర్వ సామాన్య యుక్తంబునను-విశ్వజాతీయదర్శనంబునను అనిర్దేశ్యవిశే షంబునను — గల్యాణానంత సంశ్రయంబునను జేసి పరమాత్మ ససత్తుకంబెఁ బరం బని యెఱుంగునది బ్రహ్మాది పరిణామంబులం దాత్మయై తదన్యత్వంబున సపశ్యజాయమానుం డయ్యును బరమ పురుషుండు స్వేచ్ఛావిర్భూతుం డగుట నతనికి జన్మవశ్యత్వంబులేమి, నజాయమానుండై ప్రకాశించు - 'నజాయమానో బహుధా విజాయతే' యని వేదంబులు ఘోషించుచుండు - నిప్పటి ప్రశ్నల కివి యుత్తరంబు లనిన నాసర్వలోకోత్తరునకు నత్తపస్వివరుం డిట్లనియె ౩౧

ఆ.వె. విబుధకులవరేణ! వేదాంత నిష్ఠితం
బగుచు-వేద్య మైనయట్టియర్థ
మాదరంబు మిగుల నానతి యిచ్చితి
సరసఫణితి విగతసంశయముగ,

క. భూరివిషయ గ్రహంబున,
పారాశాంభఃప్రపూరభరితము నగుసం

సారాబ్ధి నిమగ్నుఁడనై
తీరముఁ జేరంగ లేక తిరుగుడు వడుచున్, ౩౩

సీ. ప్రతిభవంబునను, గర్భస్థితివేళఁ బు
ట్టెడువేళ, వార్ధకం బడరునపుడు,
మరణావసరమున మఱి పుత్రమిత్ర-క
ళత్రార్థభూగృహలాభమునను
నిష్టనాశమున, ననిష్టపరిప్రాప్తి,
నవమానమున, సాధ్వసాగమమున
నాధిభౌతికముల-నవిరతంబు- ౩౪

తే. పొందు దుఃఖపరంపరఁ బొంది కుంది
తల్లడిల్లుచు నజ్ఞానతమముచేతఁ
దెరలి సన్మార్గ మిది యని తెలివి లేక
విసుగు నాకేది గతి చెప్పవే మహాత్మ!

వ. అనిన నయ్యతిశ్రేష్ఠునకుఁ బరమేష్ఠిగురుం డిట్లనియె, ౩౫

క. మానసవమును నేత్రగతం
బౌనో నజ్ఞానతిమిర మంతయుఁ బాయున్
మానవకోటి కనూన
జ్ఞానాంజనకరణిచేత సంయమిముఖ్యా! ౩౬

క. జ్ఞానము సుఖసిద్ధులకు ని
దానము మఱి దానఁ దక్కఁ దక్కినవానిన్
భూసుత యవి సిద్ధింపవు.
గానఁ బరిజ్ఞానశాలి గను సకలంబున్, ౩౭

క. నీవెంతయు నియతాత్ముఁడ
వై, విమల జ్ఞానపదము నధిరోహణమున్
గావింపు విస్తరించెద
నావెరవున దుఃఖకలిత మగుభవజలధిన్, ౩౮

వ. ఆత్మేతరంబునందలి యాత్మజ్ఞానంబు సంసారసాలంబునకు మూలంబు, పర మాత్మ పరిజ్ఞానం బనుకురారంబున నది మొదలిటఁ దునిమినయోగి నిర్వా ణంబు నొందు, పరిజ్ఞానం బక్షయం బగుసత్యంబు-తద్రధం బఖిలంబును మృషాత్మకం బని యెఱుంగవలయు-ననిన నాధీరునకు సనత్కుమారుం డిట్లనియె, ౩౯

తే. బ్రహ్మసుజ్ఞాననిరతిఁ దపంబుఁ బూని
మున్న శించిన వృత్తిమై నున్న నాదు
జీవితంబు సనాధమై చెలువు మిగిలెఁ
జిరదయామూర్తి వైన నీచేత నేఁడు ౪౦

వ. అని కొనియాడిన నవ్విప్రుండు సంతోషాంతరంగుండై చనియె. ౪౧

సీ. తాతలతాత, నెత్తమ్మి నెయ్యఁపుఁబట్టి
వేలుపు పెద్ద వావెలఁది మగఁడు,
తపసుల మొనగాఁడు, తపముల జెట్టికాఁ
డెల్లవిద్యల నెఱ నెఱుఁగుజాణ
ముక్కంటిసారధి ముల్లోకములఁ జేత
నంటక చేయు విన్ననువుకాఁడు
పంచాశిరాయంచఁ బఱపి యాడెడురౌతు,
కైలాటకపు మునిఁ గన్నతండ్రి,
తే.గీ. జగతి నేరికిఁ దనవ్రాలు మిగులరాని
బిరుదులేకరి నేర్పులఁ బరఁగుప్రోడ,
నాల్గుమొగముల దేవుఁ డున్నతి దలిర్ప-
నచటి కేతెంచుటయు వినయమున మ్రొక్కి ౪౨

ఉత్సాహ. ఆ సనత్కుమారుఁ డనియె నఖిల లోకనాధ భూ
మీసురేంద్రుఁ డొకఁడు తెంపు మిగుల శిష్య సహితుఁడై
నాసమీపమునకు వచ్చి నాకు బ్రహ్మవిద్య సం
తోస మెసఁగఁ జెప్పి చనియెఁ దోన నేను మఱచితిన్, ౪౩

క. ఆనిర్మలాత్ముఁ డెవ్వం
డానతి ఋూవలయు ననిన నల్లన నగి సు

జ్ఞాను లగుమునులు వినఁ దన
సూనులకుం గరుణఁ దమ్మిచూ లిట్లనియెన్, ౪౪

సీ ఏదేవుఁ డాదరం బెసఁగ నిన్నధ్యాత్మ
విద్యావిశేషసంవేదిఁ జేసె,
నేదయానిధి కటాక్షేక్షణామృతమునఁ
గంటి నీవిపు డధికప్రియంబు
లెవ్వాని విభవాంశ మించుకేనియుఁ గనఁ
జాల రత్యంతవిజ్ఞానులైన
నేశుభాకారుఁ డహీంద్రపర్యంకంబు
నందొప్పు శ్రీరంగమందిరమున-

తే. నట్టి నారాయణప్రభు నమ్మహాత్ముఁ,
డతని దివ్యాయుధములు శిష్యప్రజంబు
భూత దుర్లక్ష్యుఁడైన యప్పుణ్యమూర్తి,
గాననయ్యె భవ ద్భాగ్యగరిమఁ జేసి, ౪౫

ఉ క్రమ్మఱ నాజగద్గురునిఁ గన్గొనఁ గల్గెడు నీకు రంగగే
హమ్మున నంత దాఁక నియతాత్ముఁడవై పరమాత్మ చింతఁ గా
ర్యమ్మున నుండు మెల్లపుడు నాశశిపుష్కరిణీ తటంబునం
దిమ్మహి దీనిపెంపు వచియింపఁగ శక్యమె! యెట్టి వానికిన్, ౪౬

క. పరమంబై - సకల జగ
త్పరిపావనమై సమస్త భద్రాకరమై
దురిత నిరాసక మగు పు
ష్కరిణీతీర్థంబు తీర్థసారం బెందున్, ౪౭

తే అమలమతులై జితేంద్రియు లైనవార
లీజలస్నానపానాదు లెలమిఁ జేసి,
యందు విహరించుచుండుదు రెల్లనాడు
మహిత పరమాత్మభక్తి సమగ్రు లగుచు. ౪౮

క. సుమహిత పుష్కరిణీ తీ
ర్థమున గృతస్నానుడై 'జితంతే' యను మం
త్రమున హరిఁ దలఁచు నతఁ డఘ
సమితిఁ దొఱఁగి పోయి పొందు సాయుజ్యంబున్. ౯౯

వ. మఱియు నిచ్చట నొనర్చు దానవ్రతాదు లత్యల్పంబులైన నధికంబులగు బితృసముద్దేశంబునఁ జేయునవి యక్షయంబులై యొసంగు వేదమునఁ బాద మాత్రంబైనఁ బఠించిన సర్వాధ్యయనఫలంబు నొందు శుక్లపక్షంబునఁ బూర్వ దివసంబునభార్యాసహితుండై యుపవసించి పంచమియందుఁ గృతస్నానుండై ఘృతప్లుతంబులైన తిలలును గుణపప్రస్థ పరిమాణంబులఁ బరిపూర్ణంబులైన ఘృతపాత్రత్రయంబును దిలపాత్రత్రయంబును నొకసువర్ణంబును నుత్తమ వర్ణుల కొసంగిన నతండు పుత్రవంతుండును బరమాయుష్మంతుండు నగు-నొండేని కేవల తిలదానం బైనను-ఘృతదానం బైనను-సుతార్థు లగువారికిఁ గర్తవ్యంబు- నిష్కమాత్రంబు సువర్ణప్రదానంబు రోగనిర్ముక్తి నిదానంబు ౧౦౦

ఉ. వారని రాజయక్ష్మ కలవాఁడు తనంతియ హేమపుత్రికం
గోరి రచించి పుష్కరిణిఁ గ్రుంకి నభోదయతారకాత్మ-వి
ద్యారతుఁ డైనవిప్రునకు దానము చేసి పునర్నిమజ్జనం
బారఁగఁ దీర్చి లబ్ధనతరామయదుఃఖముఁ బాయు పుణ్యుఁడై ౧౦౧

తే. అచట గోదాన మొనరించునతఁడు గోవు
తనువునను నెన్నిరోమము లొనరు నన్ని
యబ్దశతములు త్రిదశసౌఖ్యముల నొందు
నిందు నసమానలక్ష్మిఁ బెంపొందు మఱియు ౧౦౨

క కడునిష్ఠ నబ్దమాత్రం
బుడుగక నక్షత్రమాత్రయోగంబుల నె
వ్వఁడు తీర్థమాడు నిం దతఁ
డడరఁగ బహుళాశ్వమేధ మగుఫల మందున్. ౧౦౩

తే. పర్వతిథి సమయలోన నాప్లవ మొనర్చు
నాతఁ డతిపాతకంబుల నపనయించు
జన్మనక్షత్రమునకుఁ గృతస్నానుఁ డైన
మనుజపతి యేలు నఖిలభూమండలంబు ౨౪

సీ. సితపక్షపంచమిఁ గృతశుచిస్నానుఁడై
యొగి మూఁడు దివసంబు లుపవసించి
యుదకపారణఁ జేసి పదపడి మఱి దివ
సత్రితయంబు త్రిసంధ్యలందు
నంభోవగాహనం బాచరించుచు హవి
ష్యాశియు భూశయనాభిరతుఁడు
నై యుండు నేనరుఁ డట్టి పుణ్యాత్మకుఁ
డతిశీఘ్రమున నపస్మృతిఁ దొఱంగు

తే. నెలమిమై మాసమాత్ర మీకొలఁది తీర్థ
మాడువారల మును చెందినట్టి గుల్మ
కుష్ఠశూలరుజాది దుష్కోటి యడఁగు
సలిలములలోన లవణరాసులనుబోలె. ౨౫

క. గురుతల్పగ శిశుఘాతక
హరినిందాపర - కృతఘ్న - నాస్తిక - మదిరా
నిరత పతి తాదులకు నీ
సరసీస్నానమునఁ బాపచయశాంతి యగున్. ౨౬

క. నిరవధిక దురిత కరులకు
హరికీర్తన మొకటితక్క నఘనిష్కృతికిన్
మఱి లే దుపాయ మీపు
ష్కరిణియుం దత్సమంబుగా నెన్నఁ దగున్. ౨౭

వ. ఇమ్మహాతీర్థరక్షకులై విధాతృపరికల్పితు లగు పుష్కర, పుష్కరాక్ష, సుముద, కాల, సుప్రతీపు లనువారలుఁ గ్రమంబునఁ బూర్వాది చతుర్దిశలను

మధ్యప్రదేశంబునను వసింతురు, మొదలఁ దదీయప్రార్థనం బొనర్చి పిదప నవగాహాదికృత్యంబు లాచరించునది, సర్వపర్వంబుల శర్వరీవిభుం డిందుఁ గ్రుంకువెట్టుట నిందుపుష్కరిణీనామం బీ సరోవరంబునకు భువనప్రసిద్ధంబుగా నయ్యె-నీవు సరసిఁ గృతస్నానుండవై- శ్రీరంగధామంబున కరిగి యచట సుఖంబున నుండు, మిట్టి యుగ్రతపంబున లోకంబులు సముద్విగ్నంబులు సేయవలవ దీతీర్థవాసంబున నీతీరునం జేసి కృతార్థుండ వయ్యెద వని చెప్ప యప్పద్మసంభవుం డరిగె- సనత్కుమారుండును దదుక్తప్రకారంబునఁ బ్రవర్తించుచుండె. ౩౮

ఉ. ఏనరుఁ డీకథాపరన మెప్పుడు సేయు నతండు పాపసం
తానము బాసి శాశ్వతపదంబు చనుం బితృదత్త మక్షయ
శ్రీనొనరించు నత్తఱి వసింప నృపాదులు సార్వభౌమతా
నూన ధనాఢ్యతాసుఖసమున్నతులన్ విలసింతు రెంతయున్. ౩౯

క. అని చెప్పి యప్పరాశర
తనయుఁడు వెండియును నాగదంతునితోడన్,
మునిముఖ్య, ముక్తికర మగు
వినుత పురావృత్త మొకటి విను మని పలికెన్. ౪౦

చ. ఒదవఁగ లోభయుక్తమతి నొక్కజఘన్యజుఁ డధ్వనీనులం
జదియఁగ మోది. వారిధనజాలముఁ జాలుపుగా హరించుచున్
బెదరక యివ్విధంబు నిజజీవికగా మనుచుండు నట్టి బ
ల్లిదుఁ డగువానిచే సమసె లెక్కకు మిక్కిలిగా ద్విజావళుల్. ౪౧

క. ఇటు బహుముఖముల మఱియా
కుటిలాత్ముఁడు తెరువుగొట్టికొని యొకనా డు
ద్భటభంగి నున్నతఱి న
చ్చటగా భూదేవుఁ డొకఁడు చనుచున్ వానిన్ ౪౨

మ. కనియెం, గర్కశమేచకాంగు నతిరక్తక్రూరవిస్ఫారలో
చను, నుత్తీర్ణ కరాళ బర్బర కచశ్మశ్రున్, వినీలాంబరుం,

ఘనకుంజాంతరితుం గతాగతజనాకారప్రతీక్షాపరున్
హననోత్సాహుఁ గరాగ్రలోహవలయోన్యద్వ్యస్కరున్ దస్కరున్. ౬౩

క. పొదగని యదరెడు భయమున
నడుగులు దడఁబడఁగ హృదయ మదరఁగ బెదవుల్
దడుపుచు నడుకుచు వడవడ
వడఁకెడు నవ్విప్రుఁ జూచి వాఁ డుద్వృత్తిన్. ౬౪

చ. సుడివడ బిట్టపల్చి యెటుపొచ్చెద వెక్కడబోవవచ్చు రోఁ
బడితివిగా కటంచు సిగఁ బట్టి వెసం బడనీడ్చి క్రోవసం
బడమునకైన నప్పు డొకపైకము నాతనిచేత లేమి యే
ర్పడఁ బరికించి చూచి మదిఁ బైకొని పల్కెడు నాగ్రహంబునన్. ౬౫

క. తల ద్రెవ్వ నడరుటయుఁ గడుఁ
గలఁగి మహీసురుఁడు వాని గనుఁగొని నన్నుం
బొలియింప నీకు నయ్యెడు
ఫల మెయ్యది రిక్తహస్తుఁ బాఱుని ననదున్, ౬౬

తే. ప్రాణములు గాఁచి రక్షింపు మనిన నతనిఁ
జూచి యోరి ! నిరర్థక స్థూలకాయ
భూసురాధమ ! యెటనుండి పోవుచున్న
వాఁడ వదిచెప్పుమా వినవలయు ననిన ౬౭

క. అనవుఁడు దీనాననుఁడై
తనువు సెమర్పంగ గద్గదస్వరమున ని
ట్లను వసుధావరముఖ్యుఁడు
తను నెటఁ జననీక యేఁచు తస్కరులోడన్, ౬౮

మ. వసుధామండలికిం బ్రసిద్ధిగముగా వర్తించుచోటెల్లఁ బ్రశ
స్త సరిత్తీర్థ వనాచల ప్రకరముల్ దర్శించుచున్ వచ్చి-చం

ప్రరసస్నానము రంగరాట్పద సపర్యాకృత్యముల్ భక్తి పెం
పెసగం జేసి మదీయదేశమునకై యే నేఁగెదెం దస్కరా ౧౯

వ. అని చెప్పునప్పు డప్పాతక ప్రచారుఁ డగణ్యప్రభావుండగు భూదేవునితోడి సంభాషణ విశేషంబునంజేసి యాక్షణంబ విశుద్ధమానసుండై పరహింసాత్మకం బగు నిజవ్యాపారంబుఁ జాలించి సవినయంబుగాఁ గరంబులు మొగిచి యమ్మ హీసురున కిట్లనియె, ౨౦

మ. సుమనః శ్రేష్ఠ! శశాంక పుష్కరిణి యెుచ్చో టుర్వి నాతీర్థరా
జము నేచక్కి భుజంగశాయికి నివాసంబైన శ్రీరంగమున్
విమలక్షేత్ర మతీతపాప నిరతిన్ వేఁగించు మాబోంట్లకుం
గమనీయ స్థితి గోచరించెడినె నిక్కం బింతయుం జెప్పవే. ౨౧

క. నీ వధికపుణ్య పరుఁడవు
గావున నిత్తెఱఁగు దెల్పి కడుబ్రియమున నీ
వోపలయు నెడకు నరుగుము
భూవినుతచరిత్ర యేనుఁ బోయెద నెలమిన్ ౨౨

తే. ఆనిన నమ్మాటలకు ముద మలరి-మరణ
చింతఁ దప్పి యకంపిత చిత్తుఁ డగుచు
విప్రుఁ డత్యుగ్ర కర్మ ప్రవృత్తు శూద్రు
ననునయించుచు నల్లన నతని కనియె ౨౩

సీ. మానవోత్తమ! నీ వనూన సౌమ్యాకృతి
స్ఫురణఁ జూపట్టె దిప్పుడు మహాత్మ!
సేయం దతి ప్రియాన్విత మయ్యె నీవును
నాయెడఁ గడుఁ బ్రసన్నత వహింపు -
మఱిఁగెలి పేవు యథార్థంబు నేనును
జెప్పెద నది విను చిత్తగించి

జగదభివర్ణితం బగుశేషశయనంబు
శ్రీరంగశబ్ద ప్రసిద్ధిఁ దనరు

తే. నందు శయనించు నెలమి శ్రీహరి తదీయ
పరిసరంబునఁ జంద్ర పుష్కరిణి మెఱయు
నట్టితీర్థావగాహనం బాచరించి
శుద్ధు లగుదురు ఘనపాపబద్ధులైన ౨౪

క. ఇది మార్గ మిందుఁ జను ను
న్నది ముందట నర్ధయోజనంబునఁ జాలన్
మెదిగిన తెరవున నరుగుము
ముద మొదవ నిరంతరాయముగ శీఘ్రముగన్ ౨౫

క. అని చెప్పి యతని వీడ్కొని
పునరుజ్జీవితుఁ డనై తిఁ బొమ్మని పలుమా
ఱును మరలి మరలి చూచుచుఁ
జనియె న్నది విప్రుఁ డాత్మజనపదమునకున్. ౨౬

వ. తదనంతరంబ యాచోరుం డంతరంగమున నంతంత కొదవు సంతాపంబున నొక్కింతసేపు నివ్వెఱ నొంది-తన్నుఁ జెందిన దోషంబులు మత్సంభాషణ విశేషంబున నిరవశేషంబు లగుటయు, బుణ్యాచరణ పరిణతుండై దురిత చరితంబునఁ దొలంగి - యానదీకూలంబునఁ గొంతకాలంబు సుజనాను కూలంబుగాఁ బ్రవర్తించి సంచితాఘంబుల నిర్వర్తించి - యుదంచితప్ర బోధితుండై - విప్రవరుండు చెప్పినచొప్పునఁ బుష్కరిణీతీర్థ యాత్రా పరాయణుండై - యల్లనల్లనఁ దదంతికంబుఁ జేరునంత కాయుః పరిక్షీ ణంబైన నతఁడు కృతాంత గోచరుం డయ్యె నప్పు డాలోకనభయంకరు లగుకాలకింకరులు తర్జనగర్జనభైరవం బైనరవంబున గదిరి యాభీలంబు లగు దండప్రహారంబులఁ గొట్టి పట్టలువ నిగిడ్చి ముసలిఁ దాఁకినాఁడు మిశపు పొసప్పు సుదూర్భతయాతనాపరిభూతుండై - యాక్రోశించె - నయ్యవసరంబున ౨౭

శా. ఆతీర్థంబునకుం జతుర్దిశల రక్షార్థంబుగా ద్విత్రిగ
వ్యూతిక్షేత్రమునం జరించు కృతపుణ్యుల్ - దుష్టశిక్షావిని
ష్ణాతుల్ దండధరుల్ ఘనాకృతులు - విష్వక్సేనవాక్చోదితుల్
భూతేశుల్ పటుదివ్యశక్తియుతు లంభోజాక్షతేజోధికుల్ ౬౮

క. గజవదనాదులు గాంచిరి
నిజరక్షితసీమఁ గాలనియమితభృత్యుఁ
వ్రజకృత బహువిధబాధల
గిజిగిజియగు శూద్రభక్తుఁ గిలితదేహున్. ౬౯

వ. ఇట్లు గనుంగొని గుబ్బనం బ్రబ్బు నిబ్బరంపు రోషంబునఁ జటుల సటా
సముత్పాటన పటుతరాగ్రహోదగ్రరంహంబు లగుసింహంబుల తెఱంగునఁ
బ్రతోదచోదనోద్దీపిత కోపాటోపబంధురంబు లగు సింధురంబుల చందం
బున, నకాండదండాఘాత జాతప్రతిమాభీలంబు లగు శార్దూలంబుల పోలిక
వాలాకర్షప్రభూతామర్షకరాళంబు లగు కాలవ్యాళంబుల విధంబునఁ,
బ్రళయపవన ప్రేరణ ప్రవర్ధమానంబు లగు పావకజ్వాలావితానంబుల
యచ్చు వెరిగి- యుదయమార్తాండమండల మరీచోష్ణంబు లగు దృక్కోణం
బుల నదరులు చెదర వికటభ్రుకుటీకుటిలంబు లగు నిటలంబుల ఘర్మం
బులుఁ గ్రమ్మ నతికఠోరక్రకచ నిశితదశన సంఘర్షణ చ్ఛటచ్ఛటాత్కార
ఘోరంబుగా- దురహంకార సముద్భటు లగుశమనభటులం బొదివి మద
మడంపం దొడంగి రప్పు డమోఘనిర్ఘాత నిష్ఠురంబు లగు ముష్టిఘట్టనం
బుల విశంకటంబు లగు కటంబులు పగిలి జల్లునం బెల్లు దొరగు నెత్తుటం
జొత్తిల్లి- పిమ్మిటిగొని బమ్మరించువారును-జనవర్ష పాషాణ పాత ప్రకా
రంబులఁ గరోటి కర్పరంబులు చిద్రుపలై- వికీర్ణంబు లగు కర్ణరంధ్రంబుల
మెదడు గ్రమ్మిన దిమ్మగొని సొమ్మసిలువారును అక్షీణ కఫోణిప్రయోగం
బుల క్రోడభాగంబులు తండసిలి గుండె లవిసి-బజ్జెముకలు నెట్టు మోపఁబడి
బిట్టు మూల్గువారును బిటుకరినజాను కుట్టనంబుల నుత్తానంబు లగు కంకా
లంబులు విఱిగి నొఱఁగి పొరలుచు మొరలిడువారును, ప్రకటపార్ష్ణిఘాతం
బులఁ బ్రచండంబు లగు పిచండంబులు పగిలి డిగులువొచ్చి- కళ్ళుపడి
త్రెళ్ళ వారును మహాయస ముసల పరిఘ పట్టిసానుశాసనంబులం బరశు

ఘాతంబులఁ గలకలంబులై యసువులు పెకల వికలచిత్తులై యుద్దెస వద్దరిలు వారును, నుదారగదాప్రహరణంబులఁ జరణంబులు కంఠంబులు కరంబులు శిరంబు లవలగ్నంబులు భగ్నంబులైన నుద్విగ్ను లగువారునై - ఓరంబులు దక్కి- బీఱువోయి మాఱుమొగంబు లిడి- మానంబు లెడలి- పంద్రిలి- పికాపికలై, బెదరి చీకాకువడి దవ్వుఁ దొలంగి నవ్వులకు భాజనంబై పఱచి రయ్యవసరంబున- ౮౦

మ. తమవెంటంబడి తోలు, విష్ణుభటబృందంబున్ విలోకించి- డెం
దములం గొందల మందుచున్ శమనదూత వ్రాతముర్- దీనవా
క్యములం బల్మఱు మీర లెవ్వ రనిపల్కం గింక సాలించి- య
వ్విమలాత్మూర్ మఱి వారితోడ నని రావిర్భూతకారుణ్యులై ౮౧

క. వలదు వల దింకఁ బరువిడ
నిలునిలుఁ డోదూతలార! నెఱిఁ జిత్తములం
గలఁగక మా కభివందన
మెలమి నొనర్పుఁడు శుభంబు లెసఁగెడు మీకున్. ౮౨

ఆ. అనిన నెట్టకేల కాభయం బొకకొంత
యుడిఁగి నెమ్మనంబు లుమ్మలింప
నంత నంత నిల్చి రంతకకింకరు
లంత - వారితోడ ననిరి వారు. ౮౩

శా. ఈతీర్థంబున కేము రక్షకులమై-యేప్రొద్దు వర్తింతు మా
భూతేశం డిది గారణంబుగ-మముం బట్టించినాఁ డస్మదా
జ్ఞాతుల్ గాక సురాసురాహి నరరక్ష పక్షి యక్షాది సం
ఘాతంబుల్ దమయంత నిచ్చటఁ జొరంగానేర వత్యుద్ధతిన్ ౮౪

చ. చల్లనితావు లెంచు వెదజల్లఁగ మవ్వపుఁ బూవుమొగ్గచా
లల్లన విప్పుచుం గిసలయావళి శ్రీవెలయంగఁ దెల్పుమన్
మెల్లని జంతుజాల మెలమిం బొదలం బరిపాటిమైఁ బ్ర
ర్తిల్లనుగాని-గాలి తనతీవ్రత సూపఁగ నోడు నీయెడన్. ౮౫

క. ఆలోకబాంధవుండును
నాలోకము నెఱపుఁ గాని యవనీజ లతా
జాలాదులఁ దనవేఁడిమిఁ
దూలింపఁగ వెఱచు బ్రేళ్లతోడుత నయినన్, ౧౬

క. తపనశశు లుష్ణశైత్య
వ్యపగత కిరణప్రసారులై వెలుఁగుట నీ
విపులక్షేత్రమున దిన
క్షప లివి యనుభేదబుద్ధి సమకొన దెపుడున్ ౧౭

వ. ఇచ్చటిజనులు-నిరామయులు నిర్ద్వంద్వులునై చరింతురు. శకుంతసంతతులు నట్ల ప్రవర్తిల్లు నెల్లవృక్షంబులు నిరాబంధంబులై సకల కాల సంపూర్ణ ప్రసవఫలభరితంబులై యెప్పుఁ దిర్యగ్జంతువులును బుద్ధిమంతంబులై యుల్ల సిల్లుఁ గ్రూరసర్పంబులైన నీప్రదేశప్రవేశమాత్రంబున నతిశాంతంబులగు నివి దేవదేవుం డగుపుండరీకాక్షుని దివ్యతేజోనుభావ పరిపాలితంబులై మెఱయు చుండు-నట్టిభుజంగశాయికి నపరాంతంబులగు(?)శ్రీరంగంబు మీకుఁ గన్ను గోచరంబు గాదొకో?యని వెండియు, ౧౮

ఉ. హీనమనస్కులార!యిది యెంతయు మీ రెఱుఁగంగ లేక—యి
చ్చో నఘజీవుఁ డైనపురుషుం బరుషక్రియఁ జేరి నొంపఁగా
బూనిన వార లిందుఁ జొరఁజాలునె మీకు, నుదారవైష్ణవ
జ్ఞానసమగ్రులై పరఁగు సంయమికోటికిఁ గాక యెమ్మెయిన్, ౧౯

క. ఈతనిపై మీచేసిన
చేతలు దలఁపంగ మమ్ముఁజేయుట యస్మ
చ్చేతఃపరితాపకుఁడై
యేతెఱఁగున బ్రదుకనేర్చు నింద్రుండైనన్, ౨౦

ఉ. ఎవ్వరు మీరు, మీకు నట నేలిక యెవ్వఁడు, మూఢబుద్ధులై
క్రొవ్వున నీప్రదేశమునకుం బఱతెంచిన కార్య మేమి ? మా
కివ్విధ మెల్లఁ జెప్పుఁ డని యీక్షణకోణము లెఱ్ఱఁజేయుచున్,
నెవ్వగఁ బల్కె నవ్వనజనేత్రుని దాసుల కోసరించుచున్, ౨౧

వ. ఆసమవర్తిభృత్యు లిట్లనిరి- ౯౨

మ. సకలప్రాణిచయాంతకారియు మహాశాభర్తయుం బుణ్యపా
తక నిర్ణేతయు-నైన దండధరుఁడొద్దం దత్సమాదేశభా
రక వృత్తిం జరియించుచుండుదుము చర్యారక్రియాప్రౌఢిమై
నొకచో నైనను మమ్ముఁ గీడ్వఱప నన్యుల్ చాల రెవ్వారలున్ ౯౩

తే. సర్వభూతాత్ముఁడైన విశ్వప్రభుండు
దృఢముగాఁ దన్మనోవృత్తిఁ దెలిసికాదె
ధర్మరాజని యాకృతాంతకుని నిలిపెఁ
గడఁగి ప్రాణ్యంతకరణాధికారిగాఁగ, ౯౪

క. స్వకృత శుభాశుభకర్మ
ప్రకరామితబంధనములఁ బరిబద్ధములై
సకల చరాచర చయములు
నొకయప్పుడునతని వశమునొందుచునుండున్. ౯౫

క. కాలము గ్రసించు సర్వము
కాలము ప్రాణుల నశింపఁగాఁ జేయుఁ దుదిన్
గాలవశం బగునింతయుఁ
గాలము దా నన్యవశముగాదు దలంపన్, ౯౬

వ. కాలాత్మకుండును గాలచక్రప్రవర్తకుండునునగువిష్ణుదేవుం డట్టికాలక్షయంబుఁ
జెందిన - యపస్ఫురుషాధమునిఁ గాలుని సమీపంబున నొందించుటకై నే
మిందఱ మిందువచ్చితిమి-మాచందంబు వినుండు, ౯౭

మ కలుపాకారుల కెల్ల నేము భయదాకారంబునం దోచి,వి
హ్వలులై బిట్టొరలంగ మార్గమున నత్యంతంబు బాధింతు-మే
వలనం బాపము లేనివారలకు శశ్వత్సౌమ్యరూపక్రియం
జెలువొందం బొడచూపి త్రోవ నెలమిన్ సేవింతు మిష్టస్థితిన్ ౯౮

చ అనిశము కీ డొనర్చిన మహంతమహాఘము నెన్నఁడేనియున్
వినినవి గావు-గోవులును-విప్రులు నీకరినాత్మచేతఁ జ

చ్చినవి యసంఖ్య లీఖలుఁడు సేసిన దుష్కృత మింత యం తనం
జన దటుగాన వీని జముసన్నిధికిం గొనిపోవఁగాఁ దగు౯ ౯౯

క. అనిహతమహిమ నెసంగిన
దినకరసంభవుని యాజ్ఞ ధృతి నెవ్వఁడు గై
కొనక వితథంబు సేయఁగ
మొనయు దుడుకు జడుల కనయమును జే టొదవున్ ౧౦౦

తే. అప్పరేతాధిపుని యాజ్ఞ నతిదురాత్ముఁ
డైన యీతనిఁ గొనిపోవు నట్టి యేము
భగ్నకార్యులమై పరిభవము నొంది
యున్నవారము మీచేత నుక్కు దక్కి ౧౦౧

క. అలఘు సుకృతాత్ము లుండెడి
నెల విది,దుర్జనుఁడు వీఁడు నిలుపంజన దీ
లలితస్థలమునఁ గావున
దలకొని మీ కడ్డగింపఁ దగ దితనికినై, ౧౦౨

క. దేవాదిచతుర్విధభూ
తావలికిని మీఁదగతి కృతాంతుఁడ కాఁడే
యావైవస్వతు నెదిరికి
రావలయును గాదె సుకృతరతులకు నైనన్, ౧౦౩

వ. అనిన దరహాసంబు సేసి వాసుదేవపారిషదు లాధర్మరాజానుజీవుల కిట్లనిరి— ౧౦౪

క. కాలహతమైన చేతన
జాలము నియమింపఁ గర్త జముఁ డనుపలుకుల్
పోలునవి కర్మఫలములు
వాలాయం బనుభవించు వారలత్రోవల్, ౧౦౫

క. అనలము నిజసంగతి నల
కనకాదులకందుఁ జెఱచుగతి నీనెలవుం

దనుఁజేర నఘము లడఁచును
దనుజారి సమీపసీమఁ దరలక యునికిన్, ౧౦౬

శా. శ్రీవిష్ణుం బురుషోత్తమున్ వికచరాజీవాక్షు లక్ష్మీవిలా
సావిర్భూతరసాత్ము నేమనులు సమ్యగ్భక్తిసంయుక్తులై
సేవింపం గనుచుందు రట్టిపురుషశ్రేష్ఠుల్ వినిర్ముక్తక
ర్మావష్టంభులు వారిసత్పథ మగమ్యం బెందు నెవ్వారికిన్. ౧౦౭

క. ఇచ్చోట నుండు భూతస
ముచ్చయము ప్రవేశమాత్రమున గను సుకృతం
బెచ్చోట నెన్నిజన్మము
లచ్చుగ వసియించియైన నలవియె పొందన్, ౧౦౮

సీ. అట్టి పుణ్యాత్ముల కత్యంతసులభుఁడై
మానిత శ్రీరంగమందిరమున,
ఫణిరాజ మృదుభోగ పర్యంకతలమునఁ
బద్మాసమేతుడై ప్రమదలీల
శయనించి యున్నాఁడు సర్వేశ్వరుఁడు సర్వ
భూతహృద్దేశ విస్ఫురితమూర్తి
భక్తానువర్తి యప్పరమేశుఁ డొక్కఁడు
పరకాల చక్రప్రవర్తకుండు,

తే. యముని నుర్వికి నియమించి నట్టిదేవు
నకును బ్రాణపదంబు యీనదితటంబు
కాలసంస్పర్శలేశంబు గలుగ దిచట
నెట్లు వచ్చితి రట్లు పొం డింక మీరు ౧౦౯

క, కాలుని దండధరత్వము
కాలోపహతాత్ములందుఁ గావున మీకుం
బోలినగతి వారలఁ బలు
గాలింపుఁడు జముఁడు శాస్త్రగాఁ డీయెడకున్, ౧౧౦

క. విలయసమయమునఁ గలజడి
 నలజడిఁ బడి భువననివహ మడఁగెడు నపుడున్
 జలశాయి నిలయ మగునీ
 లలిత క్షేత్రము నిరాకులతఁ బొలుపారున్, ౧౧౧

ఆ.వె. సర్వశక్తిమయము జగతి శ్రీరంగంబు
 సర్వతీర్థమయము చంద్రసరసి
 సర్వపుణ్యమయము చర్చింప నీరావు
 సర్వవేదమయుఁడు శార్ఙ్గపాణి, ౧౧౨

వ. ఈశూద్రుం డతిపాపకర్ముం డయ్యు నీపుణ్యప్రదేశంబున నుండి సమాధి యోగంబునం జేసి శుద్ధాత్ముం డయ్యె, నిది గాదని బలిమిం బట్టికొనిపోవ మీవశంబు గాదు,పనిలేని దురభిమానంబునఁ బొరలక మఱలిపొం డనిన నొండన వెఱచి యాశమన దూత లాపని విడిచి పఱచి రనంతరంబ- ౧౧౩

సీ, నిర్మలుండును, సత్వనిధియును శుద్ధాంత
 రంగుండు, నగుశూద్రపుంగవుండు,
 వెస సముద్ధితుఁడైన, వెఱవకు మికనంచు
 భూతేశ్వరులు గరంబులఁ గరంబు
 నతుల తదీయకాయస్పర్శ గావించి
 రతఁడును భక్తిమైఁ బ్రణుతి సేసి-
 పుష్కరిణీతీర్థమున కేఁగి తనివోవ
 నం దవగాహన మాచరించి-

తే. తత్తటంబున నురుతపోవృత్తి నున్న
 సన్మునీంద్రుల దర్శించి సమ్మదమున
 వందనము చేసి తానును వారిఁ గూడి
 యర్థి శ్రీరంగభవనంబు కరిగియందు, ౧౧౪

సీ శరదిందుమండల స్వచ్ఛాహిపర్యంక
 భాసురు నపసవ్యపార్శ్వశాయి,

దక్షిణబాహూపధాన పీతాంబరో
జ్జ్వల కటివిన్యస్త సవ్యహస్తు
వైజయంతీలసద్వక్షు నాకుంచితో
త్థానిత పాదపద్మాసమేతు
యోగనిద్రాముద్రితోద్భాసిలోచన
జలజాతుఁ బశ్చిమాశాశిరస్కు

తే. నసమ మణిమయ మకుట కర్ణావతంసు
హారకేయూర కంకణోదారపార
సన తులాకోటి ముఖ్యభూషణవిశేష
కలితు శ్రీరంగవిభు జూడఁ గాంచి మ్రొక్కె, ౧౧౩

క. అతని నురుభక్తి వినయా
నతు నానందాశ్రుపూర్ణనయనున్ ముకుళీ
కృతకరు విష్వక్సేనుం
డతికృప నాభూతవరుల కనుచరుఁ జేసెన్ ౧౧౪

మ. ఇట వైవస్వతకింకరావలియు భూతేశప్రహారస్ఫుట
స్ఫుటితాంగంబుల నెత్తు రొల్కఁ జరణంబుల్ దొట్రిలం గంప ము
త్కటమై పర్వఁగ నూరుపుల్ పయిపయిం గ్రమ్మన్, భయభ్రాంతి మి
క్కుటమై చూపులఁ దోప నొక్కమొగి నాక్రోశించుచుం దీనులై ౧౧౫

చ. ఇనతనుజాతు ముందటికి నేఁగి సగద్గదవాక్యవృత్తి ని
ట్లనిరి–కృతాంత! ము న్నెపుడు నస్ఖలితస్థితి నిజ్జగంబులం
జను భవదాజ్ఞ విష్ణుభటసంఘముచే నిదె నేఁడు సర్వమున్
బెనుపఱె చూచ నేము పరిభూతుల మైతిమి వారిచే మదిన్. ౧౧౬

వ. అవ్విధం బవధరింపుము ౧౧౭

ఉ. నేము భవన్నియోగసరణిం జరియించుచు నొక్కశూద్రుచు
ద్ధామనికామ పాతక విధానపరాయణుఁ గాలగోచరుం
బామరు నిందుఁ దెచ్చుటకుఁ బట్టి కడంగెడునంతలోన ద
ర్పీమకుఁ గావలై మెలఁగు ధీరులు భూరిభయంకరాకృతుల్ ౧౧౮

శా. భూతేశాహ్వయు లుగ్రదండధరు లంభోజాప్తతేజుల్ సము
ద్ధూత స్వేదలలాటభాగ వికటభ్రూభీషణుల్, మమ్ము-ని
ర్ఘాతక్రూర కరాంఘ్రిజానుహతులం గావించినం దోలి-నే
మాతుచ్ఛుం దిగనాడి వచ్చితిమి నీ కాద్యంతముం జెప్పఁగాన్. ౧౨౧

క. అనుపలుకులు దనచెవులకు
ననయంబు నసహ్య మగుచు, ననలములో గొ
బ్బున నే పోసిన విధమున
కనలి పరేతప్రభుండు కటకటపడుచున్, ౧౨౨

శా. ఏమేమీ మది నింతయున్ భయములే కెవ్వారొకో మూఢులై
యామీదం దమపా టెఱుంగక మదీయాజ్ఞానిరోధక్రియా
సామర్థ్యంబు భజించినారు త్రిజగత్సంజాతభూతావలిన్
నేమింపం దఱితో హరింపఁ బ్రభులే న్నేఁదక్క నెవ్వారలున్. ౧౨౩

వ. అని యొక్కింతవడి చింతించి యంతకుం డంతకుమున్న సన్నుతాచార భూషణుం డగువిభీషణుచేత నానీతంబైన శ్రీరంగంబునుఁ దదీయ నికటంబునఁ గావేరీ తటంబున-నఖిలదురితహరణ సమర్థం బగువుష్కరిణీతీర్థంబును నతివిచిత్రం బగు నాపుణ్యక్షేత్రంబు మహత్త్వంబును-దద్దివ్యవిమానశయనుం డగుపుండరీకాక్షు మూర్తివిశేషంబును - దనమనోగోచరంబులైన నాచరితాభివందనుండై యాభూతేశ్వరులు తీర్థరక్షకు లగుటయు-శూద్రుండు తదనుచరుం డగుటయునికియుం దెలిసి నిజకింకరులం గని వారితో నిట్లనియె. ౧౨౪

క. నిక్కముగ నామనంబున
నక్కడి వృత్తాంత మెల్ల నధిగత మయ్యెం
దక్కక వినిపించెద మీ
రక్కఱ దత్తావధానులై వినుఁ డనుచున్, ౧౨౫

సీ. శ్రీరఘురాముఁ డాశ్రిత వజ్రపంజరుం
డఖిలకంటకుని దశాస్యుఁ దునిమి

యురువైభవమున నయోధ్యాపురికి వచ్చి
యచట సుగ్రీవాదు లైనహితుల-
కుచిత సంభావన లొనరించుతటి నతి
ప్రియకారియైన విభీషణునకు
నాత్మకులీన కృపారాధితంబును-దన
కంటె నుత్కృష్టతరము నైన-

తే. రంగధామంబు సదయాంతరంగుఁ డగుచు
నొసఁగుటయు నాతఁ డదిగొంచు నసమహర్ష
మెసఁగ నిజపట్టణమునకై యేఁగుచుండ
మార్గవశమునఁ గావేరి దగ్గఱుటయు, ౧౨౬

వ. అపుడు మధ్యాహ్నసమయం బగుట-నతండు తత్ప్రదేశంబున తద్దివ్యమందిరంబు నిలిపి - దేవతార్చనార్థంబు పుష్పోపహరణంబునకై వనంబున కరిగి-యచటఁ బరమతపోనిష్ఠులఁ గని సంభాషించి వారిచేత సంభావితుండై-తత్సమేతంబుగా నేతెంచి శ్రీరంగరాజపూజావిధానంబుఁ దీర్చుటయు-ననంతరంబ గమనోన్ముఖుండై యద్దశముఖానుజుం డుద్దామతేజోభిరామం బగు రంగధామంబు వహింపం బూని తరలింపలేక శోకాకులుం డగుటయు నాదనుజపుంగవుం గరుణాతరంగితంబు లగునపాంగంబుల నిరీక్షించి లక్ష్మీశ్వరుం డతనిపై లక్ష్యం బుడిపి, యాశశాంక పంకజాప్తంబుగా నిరాతంకం బగులంకాధిపత్యంబున కనిపి-యసమాన సంతతానందుండై-యుండుటయు-నది కారణంబుగాఁ దత్సమీపం బఖిలపాపంబుల లోపంబు సేయనోపుటయుఁ జెప్పి దండధరుండు వెండియు వారల కిట్లనియె. ౧౨౭

క. మీవశమె విష్ణుభూతే
శావజ్ఞయుఁ దత్పరిగ్రహ నిపీడనముం
గావింప వారితోడం
బోవం బనిలేదు కలిగెఁ బోయినఫలమున్. ౧౨౮

క. అన్నెలవున గల భూతము
లన్నియు నజ్ఞానపాత మన్నియు సుఖసం

పన్నములు శక్తిమంతము
లన్నియు నాత్మాభిమతవిహారోన్నతముల్, ౧౨౯

తే. సకల జగదేక విభుఁ డైన చక్రపాణి
కానతిత్రూఁజి మతిహృద్య మగునివాస
మచటు రక్షింప ధాతసంరచితులైన
వారు-భూతేశు లమితు లవార్యబలులు, ౧౩౦

మ. క్రమయోగంబున నెన్నఁగాఁబడు కళాకాష్ఠాదులం బేర్చుకా
లముచే భూతచయంబు లెల్ల నవలీలన్ సంక్షయం బందు, నా
కమలాక్షప్రియధామమై మెఱయు రంగక్షేత్రమం దెప్పుడుం
బ్రమదం బార వసించు ప్రాణుల హరింపంజాల దాకాలమున్ ౧౩౧

వ. దేహసంగ్రహంబునకుఁ దత్త్యాగంబునకుఁ గర్మంబు కారణం బట్టి కర్మ
వశులంబట్టి శిక్షించుకారణంబు నాయదిగాని మహానుభావులం గేవలంబు నియ
మింపు సామర్థ్యంబు నాకులేదు, వారలకెల్ల సర్వభూతేశ్వరుండగు నప్పర
మేశ్వరుండు నియామకుండు గావున-జీవేచ్ఛగలదేని మీ రందుఁబోవలవ
దనిన, నిజస్వామియగు వైవస్వతుపలుకు లాకర్ణించి-కింకరు లహంకారం
బుడిగి తదాదేశంబున నాదేశంబునకు దవ్వులఁ దొలఁగిపోదు రని చెప్పి
యప్పారాశర్యుండు నాగదంత మునీశ్వరునకిట్లనియె, ౧౩౨

క. ఈకథఁ జదివిన వారును
జేకొని వినువారు-విజితజీవత్వరులై
నాకాది పదసుఖస్థితిఁ
గైకొందురు చనరు జమునికడ కొకనాడున్, ౧౩౩

ఉ. నావుడు నాగదంతముని నాథుఁడు సాత్యవతేయుతో-మునీం
ద్రా వనజాతవైరి-యనురాగమునం బ్రతిపర్వమున్ జగ
త్పావనియైన పుష్కరిణిఁ దా నవగాహము సేయు నంటి వీ
వావిధుఁ డేమికార్యమునకై యటు సేయుచునుండు చెప్పుమా! ౧౩౪

చ. అనినఁ బరాశరాత్మభవుఁ డాతనితో నను మున్ను దక్షసం
దనలఁ దుషారరోచి ప్రమదం బెసఁగంగ వివాహమై (నసె)

మ్మనమున వారి నందఱ సమంబుగఁ జూడక రోహిణీసతిం
ఘనబహుమాన పూర్వకముగాఁ బనిసేయుచు నుండు నెప్పుడున్, ౧౩౫

క. దానికి నశ్విన్యాదు ల
నూనవ్యథఁ జెంది తండ్రియొద్దకుఁ జని దీ
నాననలై పతిచేఁ దమ
కైన పరాభవముఁ జెప్ప నాతఁడు గినుకన్, ౧౩౬

శా. ఆరాజుం బిలిపించి యి ట్లనియె-నీ వన్యాయసంచారివై
తారానీకము లెల్ల నీవలని నాథప్రాప్తి తుల్యంబుగాఁ
బ్రారంభింపక దుర్వివేక సరణిన్ బాటింపుచున్నాఁడ వీ
దౌరాత్మ్యంబుఁ దలంప మేలగునె చంద్రా! రోహిణీవల్లభా! ౧౩౭

క. ఇది మొద లందఱకునుఁ బ్రియ
మొదవఁగ సమభావవృత్తి నుండుట గడుమే
లది గాక తప్పి తిరిగినఁ
దుదిఁ గనియెదుగాక పొమ్ము దురిత ఫలంబున్, ౧౩౮

క. అని దక్షుఁడు తన తనయల
ననునయములఁ దనిపి, కినుక ననుప సుధాంశుం
డును జని ముందటి తెఱఁగున
దనప్రియయును దాను సమ్మదంబున నుండెన్, ౧౩౯

మత్తకోకిల :- ఆతెఱంగున కాత్మలన్ వగ పగ్గలింపఁగ వెండియున్
తాత పాలికి నేఁగి వారలు తద్విధం బెఱిఁగింప న
జ్ఞాతసంభవపుత్త్రుఁ డప్పుడు చంద్రునిం బిలిపించి- ధ
ర్మేతరంబు భవచ్చరిత్ర మిదేలమానవు బేలవై. ౧౪౦

వ. ఇంక నిటమీఁద నీవర్తమానం బిట్టి దయ్యేనేనియు గొఱఁగాదు-తప్ప దేఁ
జాఁటిచెప్పితి, నెప్పగిది నైనను బుద్ధిమంతుండవై యుండు పొమ్మని యుల్ల
సంబు లాడి పీడ్కొలిపిన-గ్రమ్మఱ వచ్చి మామ మాటలు గీటులఁ బుచ్చి
యచ్చంద్రుండు-సాంద్రానురాగంబున రోహిణీసంభోగలంపటుండై యుండె

మఱియును బెక్కుమాటలు దక్షుండు ఋక్షాధిపతి నివ్విధంబున బోధించి తత్కుటిల ప్రచారంబు వారింపం జాలక చాల రోషించి యతనిం గనుంగొని. ౧౪౧

క, దోషాకర! పలుమఱు-మ
ద్భాషలు గైకొనక చపలభావంబున. ను
ద్వేషించితి గావునఁ ద
ద్దోషంబునఁ జెందు యక్ష్మదుర్దశ నిష్నన్. ౧౪౨

చ. అని శపియించె. నంత హరిణాంకుఁడు తత్పటురోగ ముగ్రమై
తనతనువందుఁ బొందఁ బ్రభఁ దప్పి కృశించి వినష్టబుద్ధియై
ఘనభయవిహ్వలుం డగుచు గ్రక్కున నక్కడఁ బాసి భూతలం
బునఁ గడువాసి నుల్లసిలు పుష్కరిణీతటిఁ జేర సన్మతిన్. ౧౪౩

మ. నిజశాపావధిఁ గోరి తద్విమల పానీయంబులం గ్రుంకి స
ర్వజగద్భాసితపంబు పంచదశవర్షంబుల్ ధృతిన్ సల్పి నీ
రజనాభుం జదివత్సరంబు లట నారాధించె భాస్వత్కర
వ్రజ కించిద్వికసద్దళాంచితతర స్వచ్ఛాంబుజాతంబులన్ ౧౪౪

వ. అంత- ౧౪౫

క. తద్విరచిత పూజనముల
హృద్వనజం బలర లోకహితమతి సార్థా
పద్విఘటనకరుఁ డగు దను
జద్విషుఁ డతికరుణ నతని సన్నిధి నిల్చెన్, ౧౪౬

ఉ అప్పుడు కైరవప్రియుఁ డుదంచిత సమ్మదవార్ధివీచులం
దెప్పలఁ దేలు నెమ్మనము దిప్పఁగఁ జాలక నేత్రపర్వమై
యొప్పెడు నప్పురాణపురుషోత్తము దివ్యతనూవిలాసముం
దప్పక చూచుచున్ బహువిధంబులఁ బ్రస్తుతిచేసె నమ్రుఁడై ౧౪౭

క.ఆసంస్తవంబు-హృదయో
ల్లాసం బొనరింప మెచ్చి లక్ష్మీశ్వరుఁ డా

కాసారము దగ్గఱి యమృ
తాసారము దొరఁగువణితి నాతనితోడన్, ౧౪౮

క. కువలయహిత ! భవదుదిత
స్తవ ముదితుఁడ నైతి నీవుఁ దలఁచెడి కార్యం
బవలంబిత ఫలసిద్ధులఁ
దవశించెడు నస్మదీయ దర్శనలబ్ధిన్ ౧౪౯

చ. అనుటయుఁ జంద్రు డిట్లను గుణాంబుధి విష్ణుఁ బురాణపూరుషున్
నిను నఖిలేశు యజ్ఞమయునిం బొడగంటి మదీయమైన జీ
వనము కృతార్థ మయ్యె నఖిలవాంఛితముల్ సమకూరెఁ బైపయిన్
మునుపుగఁ బొందు నాపదలు మున్నె దొలంగె విహంగవాహనా! ౧౫౦

చ. అమృతమయంబులైన కిరణావళులం బచరించి యోషధీ
సమితులఁ బ్రోవు మంచుఁ బటుశక్తిఁ గృపామతి నిచ్చి నన్ను నా
క్రమమున నీవు నిల్పితివి కైటభమర్దన! నిల్చెద న్మహ
త్వము దిగె దక్షశాపజనితక్షయపీడయు నిప్డు నాదెసన్ ౧౫౧

క. దక్షాగ్రహజాతమహో
గ్రక్షయమునకు క్షయంబు గావింపంగా
దక్షు లెవరు లేరి యిట నలి
నేక్షణ! నీ వొకఁడు దక్క నీ విశ్వమునన్, ౧౫౨

సీ. అనుటయుఁ బుండరీకాక్షుఁ డాతనితోడ
నిట్లను గైరవహిత ! మదీయ
దర్శనామృతవారి ధారాభిషిక్తులై
రేనియుఁ బాపాత్ము లైనవార
లతిశుద్ధతను లౌదు రనిన ని స్సెన్నఁగా
నేల నా కెంతయు హితుఁడ వీవు,
గావున యక్షరోగవ్యథఁ బెడఁబాసి
పోషింపు మోషధీ పుంజములను

తే. యుష్మదుదయంబు లోకనేత్రోత్సవంబుఁ
జేయుచుండెడిఁ గల్యాణదాయి యగుచుఁ
దపము నీపొందుఁ జేసినదానఁ జంద్ర
పుష్కరిణి నాఁగ వెలయు నీపుణ్యసరసి, ౧౫౩

ఆ.వె పురుషులందుఁ బుణ్యపురుషుండు-సతులలో
నబ్ధితనయ - నదులయందుఁ గంగ-
యెవ్విధమున వెలయు నవ్విధమునఁ దీర్థ
రాజి నీసరోవరంబు మెఱయు. ౧౫౪

వ. అనిన నప్పద్మలోచనునకు సుధారోచి యిట్లనియె- ౧౫౫

చ. జిగిఁ దళుకొత్తు క్రొత్త వికసించిన తెల్లని తమ్మిరేకులం
దెగడెడి కన్నులు న్నగవు దేరెడి చూపులు గుండలద్యుతి
స్థగితములై మెఱుం గెసఁగు చక్కని చెక్కులుఁ బల్లవారుణం
బగునధరంబుఁ గల్గు భవదాస్యవిలాసము నిల్పు నామదిన్ ౧౫౬

క. ఆ చొప్పునను మదీయ వి
లోచనములు చూచుఁ గాక లోలత నెపుడున్
నీచారుమూర్తి ననవుఁడు
నాచంద్రునితోడ దనుజహరుఁ డిట్లనియెన్. ౧౫౭

ఆ.వె. అఖిలదోషరహితులై నిర్మలజ్ఞాన
వంతులైన యట్టివారి కైనఁ
గాని గోచరంబు గాదు నానిజమూర్తి
కూడ దట్టిపలుకు కుముదమిత్ర ! ౧౫౮

మ. అనినం జంద్రుఁడు పల్కు, నట్లయిన నత్యల్పాల్ప సత్కర్మబో
ధనులై ద్రిమ్మరు లోకు లెప్పగిది నార్తత్రాణ ధుర్యన్-రమా
సనపద్మార్యము ని న్నవార్యగతి సందర్శించి ధన్యాత్ములై
ఘనతం బొందుదు రట్టిపొందు వెలయంగా నిల్పు మిచ్చేటికిన్ ౧౫౯

క. నావుఁడు నా యుడుపతి కను
నావిభుఁ డిది పొసఁగు నిచటి ఘనఘులుఁ గానం
గా వలతురు నను నితరప
దావాసుల కలవిగా దుదారుల కైనన్, ౧౬౦

వ. ఇట మీఁద లంకాధిపతి యగు విభీషణుకతంబున నీసరి త్తీరంబున నెల్లవారికిఁ
బ్రత్యక్షంబై యుండెద నది కారణంబుగా ధారుణీవలయంబు నిరుపద్రవంబై
మెఱయు, నపుడెపు డిప్పరిసరంబున మదీయదివ్యధామంబు నిలిపి నిజపురం
బున కరుగునది—కారణంబుగా ధారుణీవలయంబురంగమందిరం బైనభుజంగ
భోగతల్పంబున ననల్పభోగంబునఁ గల్పాంత పర్యంతంబు లోకాను
గ్రహార్థంబుగా వసియించెద—నావేళన నీవు నన్ను దర్శించెద వింకఁ బ్రతి
పర్వంబును-బుష్కరిణీ తీర్థసేవార్థం బిచటి కేతెమ్ము-పొమ్ము-నీ నిండు
వెన్నెల యఖిలజగత్పావనం బయ్యెడుమని యాదేవదేవుం డంతర్ధానంబు
నొందెఁ జంద్రుండును దద్వచఃప్రకారం బాసరోవరభజనాపరాయణుండై
యున్నవాఁ డని చెప్పి యఘ్పారాశర్యుండు మఱియు నాగదంతున
కిట్లనియె, ౧౬౧

క. పదియోజనములు నైదుం
దదర్థమును నందు సగము తగు పఱపై-యిం
పొదవుఁ గృతాదియుగమ్మున
సదమల సలిలములఁ జంద్రసరసియు బెడఁగై, ౧౬౨

క. అంతట కలియుగమున నం
తంతకుఁ బ్రతిదినము నల్పమగు నస్తనగ
ప్రాంతముఁ జేర్చిన యర్చి
ష్మంతుని కిరణోత్కరప్రసారముకరణిన్ ౧౬౩

ఆ.వె. కలఁక యింత లేక కడుచల్లనై నల్పు
లొలయు చంద్రసరసి సలిలపూర
మనఘ! కలియుగాంత మగువేళ దుర్గంధ
యుక్తమై కలంగి యుండు నపుడు ౧౬౪

సీ. మండలాధిపులకు మరణ మెప్పుడు గల్గు
నపుడు రక్తచ్ఛాయ నగ్గలించు
మాన కెన్నఁడు రాజ్యహాని పాటిలునాఁడు
నెఱియంగఁ బసరువన్నియ వహించు
నఖిల ప్రజాసంక్షయం బగు నేవేళ
నాతఱి క్రిమిమయం బగుచునుండుఁ
జొప్పెడు వేళ విక్షోభ మేసమయమం
దయ్యెడ ఫేనంబులై కలంగుఁ

తే. బేర్చు నాకాలమున ననావృష్టిదోష
మట్టి పట్టునఁ జువ్వన పట్టిపోవు
నింకఁ బెక్కన్న నేల యీ యిందుసరసి
దోచు విపరీతములు-విపత్సూచకములు. ౧౬౫

మ. నృపులుం బోరక భావికాలమున శాంతిం జెందుచో- దుగ్ధస
చ్ఛవియున్ విప్రులు సౌఖ్యమందునెడలం జంద్రోపలచ్ఛాయయుఁ,
భువి నెంచుం ఘనవృష్టి గల్గుతఱి నుద్భూతోర్మిజాలంబునై
సువిశేషస్థితిఁ దత్సరోవరము పొల్చున్ మంగళావాసియై, ౧౬౬

తే. ఎన్న ముప్పదిరెండు యోజనము లంత
మేరయై యొప్పు దేశవిస్తారమెల్లఁ
గాలవశమునఁ బొడవఱి కలియుగాంత
వేళ నత్యల్ప మయ్యెడి విప్రవర్య! ౧౬౭

వ సకల భూతక్షయకరంబుగా నాయుగంబున నఖిల వర్ణంబులకు నుపప్లవం బగ్గలం బయ్యెడు- నప్పు డాప్రదేశంబు నిర్మనుష్యం బగుట దేవతాసంచారంబ కాని యొండు లేకుండుట -ననాచారులు నన్యాయకారులు-నామ్నాయ దూషకులు-నార్యజన భయంకరులు-నల్పాయువులునై యెల్లవారును బరమ కల్యాణకారకు లగువారినామోచ్చారణంబు విన్నంతన విద్వేషించుచుఁ దమః ప్రవర్తకుం డగురుద్రుండు తమకు దైవంబుగా నుపాసించెద-రమ్మహా దేవుఁడు జగద్విమోహార్థంబుగాఁ దాను దైవం బని కల్పించిన తామస

శాస్త్రంబు లెల్లెడలం జెల్లుబడియై ప్రవర్తిల్లెడు- నాసమయంబులందు నాసు
దేవపరాయణు లగుసమ్మహాత్మ లైనవైష్ణవులు తమోనిరాసం బాచరించి
యచ్యుతపదంబు నొందుదురు. ౧౬౮

సీ. సాత్వికంబులు రాజసములు దామసములు
నన మూఁడువిధముల నవనిఁ బరగు
శాస్త్రంబులందు విశ్వప్రభు సర్వాత్మ
హరిఁ జెప్పునవి సాత్వికాహ్వయములు,
జలజగర్భుని సరస్వతి హవ్యవాహనుఁ
బ్రణుతించునట్టివి రాజసములు
ప్రకట తమఃప్రవర్తకు నుమానాథుఁ గీ
ర్తనసేయు నవియెల్లఁ దామసములు,
తే. వానిఁ గొనియాడి యతఁడె దైవంబుగాఁగ
గొలిచి సంపన్ను లగుచుఁ గోర్కులు ఫలించి
బలియులై సాత్వికుల బాధపఱచి నగుచు
నెడల విడుతురు హరిసేవ నెల్లవారు. ౧౬౯

క. హరిహరుల సమముజేసిన
హరుఁడే పరతత్వ మనిన యాశాస్త్రములుం
ధర సత్య మనిన దుర్గతి
దొరకునె హరిసమముపలుక దోషము గాదే ! ౧౭౦

క. ఈపగిదిఁ గలియుగంబున
నేపారు నుపద్రవంబు లెల్లను భద్రం
బై పరగు చంద్రపుష్కరి
ణీపరిసర మందలేవు నెఱి నొకనాడున్. ౧౭౧

క. జగదుద్భవ పరిపాలన
నిగమంబులు లీలగాఁగ నెలిసిన హరికిన్
ఒగి నుపసంహృతి నపు డిం
పగు నప్పుడు గల్గుఁ గలిసమాగమ మున్ప్రేన్. ౧౭౨

ఉ. మేదినిపై విభీషణునిమిత్తమునం గరుణామయాత్ముఁడై
యాదట రంగమందిరమునందు భుజంగమరాజశాయి—ప
ద్మాదయితుం డజస్రమును దా వసియించుటఁజేసి కాఁదో
పాదుల నేయుప్రదవము నందవు నా సరసీసరిద్ధ్రసలుల్. ౧౨౩

క. అని మఱియు నప్పరాశర
తనయుఁడు సునయుఁడగు నాగదంతునితో ని
ట్లను మునిజనములచేమును
వినఁబడు కథయొకటి నీకు వినిపింతుఁ దగన్, ౧౨౪

తే. ఏల నీచోళమండల మెల్ల నేలు
రాజదోషంబు కతన ధరాజనంబు
వనరి వసియింపఁ బంద్రెండు వత్సరములు-
పెచ్చుపెఱిగె ననావృష్టిపీడనంబు- ౧౨౫

సీ. కడుఁ బేర్చి మిటమిటఁ గాయు కట్టెండచే
భువనముల్ పొరపొరఁ బొక్కిపడియె,
వేఁడియై బిసబిస విసరుగాడ్పులఁ బ్రాణి
తతు లెల్లఁ దటతటఁ దాఁక దొణఁగె,
నొండెడ భగభగ మండు కార్చిచ్చులఁ
బెనుగిరుల్ పెటపెటఁ బ్రేలఁజొచ్చెఁ
బంకమై జవజవ నింకు శాదంబుల
మలమల మకరాళి మాడిపోయె

తే. నెండ చొఱకుండఁ గడు నేఁచి యిరులు గొనుచు
వఱలు కాంతారపంక్తులు వట్టిపోయె,
నట్టనడువేసవులను గాల్నడలు గాక
జరగు నేఱులు నిర్జన స్థలము లయ్యె, ౧౨౬

శా. క్షుత్తృష్ణాదిక వేగతా పరిగతాసుప్రాణ శల్యావళీ
భిత్తాకీర్ణమహార్ణవాంతిక మహీభృత్కందరారణ్య శు
ష్యత్స్రోయాశయ తీర చైత్య మరుదేవాగార రథ్యాదులన్
స్పృష్టం బాడుచు మృత్యుదేవత సమున్మేషించె హేలాగతిన్. ౧౨౭

క. ఆవేళ మునులు సిద్ధులు
కావేరీ తీర్థమంద కాపుండెడి భూ
తావలికి నచటు శరణం
బై వెలసెను రంగవిభు సమాశ్రయ మహిమన్, ౧౭౮

ఉ. ఆగతిఁ గొంతగాలము సమంచితభక్తిఁ జసంగ నానదీ
వేగము నాఁడునాటి కతివేగముః దొంకిలివం దటస్థు లు
ద్వేగము నొంది యందఱకు దిక్కుగు దేఁదిన మాకునుం దను
త్యాగము గార్య మంచు విగతాన్యదిశావిజిగీష నుమ్మెదన్, ౧౭౯

ఉ. అత్తెఱఁ గెల్లఁ గన్గొని మహాబలవంతులు తీర్థరక్షకుల్
చిత్తములం గృపారసము చిప్పిల వారలఁ గావఁ భూని యు
ప్వృత్తిమెయిం బయోధర తతిన్ రభసంబున నాక్రమించి యు
వ్వెత్తునఁ దద్ఘనోదపము లెల్లను జిల్లులువోవఁ బుచ్చినన్. ౧౮౦

ఉ. పన్నవు మేఘముల్, గగనపాలిక వాలిక క్రొమ్మెఱుంగు—లు
త్పన్నము గావు, లేవు మహతస్తనితధ్వను లిట్టి చిత్రమే
మెన్నఁడుఁ జూడమంచు జను లెల్లఁ బ్రమోదకుతూహలంబులం
జెన్ను వహింపఁ బెల్లుగురిసెం జలధారలు ధారుణీస్థలిన్, ౧౮౧

క. తోరములై కరటికరా
కారములై సకలదిశలఁ గడుఁ చొఱఁగు తదా
సారమున నుబ్బి పఱచెను
వారక కావేరి నీరు వారిధిఁ బొదువన్, ౧౮౨

వ. అమ్మహానదీజలపానంబునఁ బ్రాణిసంతానంబు సంతాపరహితంబై సుఖం బుండెనంత నారాజకృతం బైన బ్రహ్మహత్యే పిశాచీస్వరూపంబుఁ గైకొని తత్తోయం బెల్ల నొక్కతోయంబునఁ గ్రోలిన తత్క్షణంబ కావేరి వారిహీనయై మొందటిచందంబున నున్న దన్నిమిత్తం బన్వేషించుచు వచ్చి పురోభాగంబున, ౧౮౩

మహాస్రగ్ధర. కనిరా భూతేశు లత్యుత్కటవికట పటాకప్రతీకాశ కేశః
జనితోదన్వోపతాప శ్లథమలినవపుర్ఘాత మాంసాస్రగంధిన్

ఘనకావేరీ జలౌఘగ్రసన వివృతవక్త్రి స్ఫురద్భూరిదంష్ట్రి
శనిసంఘర్షప్రభూతజ్వల దనలశిఖాజాల శాచిం బిశాచిన్ ౧౨౪

క. కని కనలు నిగుడ నురువడిఁ
జనుకుటిలభ్రుకుటితల విశంకట భయదా
నను లగువారల దవ్వులఁ
గనుఁగొని మది బెగడి మేను గజగజ వడఁకన్, ౧౨౫

ఉ. ఆసలిల ప్రవాహమున కడ్డము నిల్చియు వక్త్రిగహ్వరం
బోసరిలంగఁ జేసికొని యొయ్యఁ దొలంగెఁ బిశాచి-యప్పుడో
సోసి దురాత్మురాల 'యిపు డోడకు మేడకుఁ బోయెదంమఁ జి
త్రాసులు విష్ణుదాసులు కరంబు రయంబునఁ బట్ట డాసినన్ ౧౨౬

క. ఆగతి యెఱింగి యది గడు
వేగంబున బరువుఁబాఱి వెనుకొని చన నీ
కాఁగి యదలించి యెవ్వతె
వేగతి వచ్చితివి వెఱవ కిచటికి ననినన్, ౧౨౭

సీ. ఆపుణ్యపరులతో నప్పిశాచిక యనె
నేను బాపంబుల కెల్ల నెక్కుడఁ
దగుదాన నన్నుఁ జంపఁ దగదు—మదుత్పత్తి
విధ మెఱింగించెద వినుఁడు మీర
లీజనపద మేలురాజు సోముకనాముఁ
డపరాధివేతొకఁ డవలనుండ
నేపాపమును లేక యితరమహీసురుఁ
దేరి చంపించె శ్రోత్రియుని వినతు-

తే. నప్పు డాతని సచివులం దాప్తులందుఁ
బౌరులందును, జనపదాస్పదులయందుఁ,
దదృహిర్దేశ జనులందుఁ,దలఁప నొక్కఁ
డైన నిది గూడ దని విడనాడరైరి. ౧౨౮

క. ఎదురెదుర నొకఁడు దురితము
వదలక కావింపఁ జూచి వారింపనిఁ
రొదవిన దత్పాపఫలా
స్పదు లగుదురు సమధికారబలములకొలంఁదిన్, ౧౮౯

వ. కావున నీదేశం బంతయుఁ బాపదూషితం బగుట ననావృష్టిదోషంబు ఘంటి
ంచె,నారాజకృతంబైన బ్రహ్మహత్యాస్వరూపిణియైన నాచేతఁ జరాచరాత్మ
కంబైన జగం బిట్టియుపద్రవఁబు నొందె,నేను-తటాకసరోవరాతులం గల
వారిపూరఁబు నిరవశేషఁబుగాఁగ్రోలితి - నత్యుగ్రాకారదర్శను లగుమీ రెవ్వ
రెంతవారును మదంతంబు గావింప నసమర్థు లీనిరర్థకప్రయాసం బేల
యని పల్కి యప్పిశాచి పరువువెట్టినం గట్టలుక దట్టించి యాపాదిట్ట
లిట్లనిరి. ౧౯౦

ఉ. సార మెఱుంగనేరక, పిశాచమ'నీచమనీష!లోకసా
ధారణదృష్టిఁ జూచెద వుదారతరం బగునీప్రదేశ మీ
చేరువ సంచరింపను వసింపను శక్యమె నీకు- నీవునున్
వారక వచ్చితేనియు నవశ్యము నాశముఁబొందె దీయెడన్ ౧౯౧

మ. క్షితి నీచక్కటి దివ్యదేశ మమితశ్రీవిష్ణుభూ తేశర
క్షిత, మీపుణ్యనదీప్రవాహము జగత్సేవ్యంబు భవ్యంబు సం
స్మృతిమాత్రాఘనివారణంబు మహితశ్రీరంగధామాంతికా
గత, మారూఢసమస్తతీర్థమయ మగ్ర్యం బాపగాకోటికిన్ ౧౯౨

ఆ.వె. ఎట్టి పాపులైన నీజలంబులు మేను
సోకినంతమాత్ర శుద్ధు లగుదు,
రేతదంబుపానపూతమై జగము నీ
వలన ముక్తి బొంది వెలయుచుండు ౧౯౩

క. కావున నెవ్వరితెరవునఁ
బోవక వేగంబ వెడలిపొమ్మటుగాకీ
తావున నున్న వధింపక
పోవిడువము నిన్ను బాపపుంజము పగుటన్, ౧౯౪

వ అని పలికి రఘు డా బ్రహ్మహత్య తద్దేశంబున సద్యోనాశంబు నొందె, నవ్విష్ణుమహేశ్వరులు తమతమనిలయంబులకుం జనిరి, తదనంతరంబ జగత్ సృష్టికారణంబైన మహావృష్టి గురిసి కఱవు దీఱి యెల్లవారు తమతమ నెలవుల సుఖంబుండిరి, యీయుపాఖ్యానంబున నిఖిలపాపహరణంబగు నిహపర సుఖదం బని చెప్పి యప్పారాశర్యుండు నాగదంతమునివరున కిట్లనియె ౧౯౫

క. ఈ కథ వినియెడి మనుజు ల
నేకమహాపాతకంబు లెడలియు, ముక్తి
శ్రీకాంతు లగుదు, రట్టిది
సీకాకకథ యోగివర్య ! నే నెఱిఁగింతున్. ౧౯౬

మ. ఒక గంధర్వుఁడు చిత్రసేనుఁ డనువాఁ డుద్దామదర్పోదయా
ధికుఁ, డస్వప్నవరేణ్యమిత్రుఁ డుడువీధిం దోడిగంధర్వగా
యకులుం దానును బాడుకొంచు నట రంగాభ్యర్ణముం జేరి, కొం
ఱక యామీఁదటగా వెసం జనియెఁ దచ్ఛాయాసముల్లంఘియై. ౧౯౭

ఆ.వె. వానితోడ నేఁగువారు తచ్ఛాయ న
తిక్రమింపరామి దెలిసి, నిలిచి,
రంతతీర్థరక్షు లాదుర్మదాంధుని
సాగి పోవనీక సంభ్రమమున. ౧౯౮

క. కడకాలఁ బట్టి, కడు నురు
వడి బిఱబిఱ ద్రిప్పివైవ వననిధి కవలం
బడియె రఘునాథు శరహతి
సుడిఁబడి మారీచరాక్షసుఁడు పడినగతిన్ ౧౯౯

వ. అప్పు డతనితోడఁ గూడివచ్చిన గంధర్వు లావిధంబెల్లఁ దెల్లంబుగాఁ గనుగొని బెదరి మగిడి నిజాధిపతింపగు చిత్రసేనుండు తేజోహీనుండునై పడినయెడకుం జని, యచట నచేతనుండై యున్న యతనిఁ బ్రబోధించిన— ౨౦౦

తే. తెలిసి నలుదిక్కులను జూచి, ధృతిఁ గలంగి
యిక్కడెక్కడ నన్నెవ్వ రివ్విధమ్ము
జేసి రని పల్కునాచిత్రసేనుతోడ,
వారుఁజెప్పిరి-తద్విపత్కారణంబు - ౨౦౧

క. చెప్పిన విని, బెగడుచు మదిఁ
గప్పిన మోహమున మీఁదుగానక పోదం
డప్పగిది నుండ నేలని
యప్పాటుం దరుగఁజూచె ననుచరయుతుఁడై ౨౦౨

వ. ఇట్లు చన మొక్కలించి తెక్కలు విఱిఁగిన పులుగులంబోలె-నాకపంబున కెగయులేక, చీకాకుపడి యార్తుం డగుచు, మర్త్యుకైవడి పుడమిం బడి పొరలి యాక్రోశించుచు. ౨౦౩

మ. అకటా' యే నతిమూఢభావమున నీయత్యంతసంతాపహే
తుకకర్మం బొనరించినాఁడ, నిఁక నీశోషం బశేషంబు, నూ
రక యెబ్భంగిఁ దొలంగు, దీనికి విచారం బెద్ది యన్యాయకా
రికి నేలోకముసందు నాపదలు వర్తిల్లున్ దురంతంబులై. ౨౦౪

వ. అని మొక్కింత చింతించి మఱియును ౨౦౫

మ. దివి మీముందట వచ్చు నన్నిటు బహిర్ద్వీపంబునం దేపదా
నవ మర్త్యాదులలోన నెవ్వరొకో! ప్రాణత్రాణ నిష్ఫాళులై
యవిచారంబున వైచి రాజడుల నింద్రాఖర్వరోషాగ్నిను
ద్దవిడిన్ వేలిచి తత్ఫలంబున హవిర్భాగంబు భాగించెదన్ ౨౦౬

క. అదిగాక వారిఁ జెప్పను
కాదవెడు భద్రంబు మీకు నుద్దీపితమై,
యిది యటుపోనిం డిపుడు
న్నడ యఁడ నొకసంశయంబు నామదిలోనన్ ౨౦౭

ఉ. అప్పుడు మీకు నాకును వియద్గమనంబు సమంబ-యిట్టిచో
నిప్పుడు నాకు నొక్కనికి నిత్తెఱఁగై మఱి మీగలి త్రిపుం

జెప్పటి చుట్టి యున్కి యిట నెట్లదిగావున పక్షపాత మీ
చొప్పునఁ గానవచ్చెఁ గడుఁ జోద్యముకాదె తలంచి చూచినన్ ౨౦౮

క. అని తనపడుటకు మనమునఁ
గన లొదవఁగ నదరి పల్కు గంధర్వవిభుం
గనుఁగొని గగనస్థితు లగు
ననుచరు లిట్లనిరి మఱియు నాతనితోడన్. ౨౦౯

ఆ.వె. మానుమాను మిట్టిమాట లెవ్వరిదెసఁ
దీదు గలుగ దొకని కిల్బిషంబు
లొకని నేల పొందు, నూరక నిజకర్మ
ఫలము తనకుఁ బొరయవలయుఁగాక. ౨౧౦

క. అమృతాశన మనుజ పశు
ప్రముఖం బగుసకలజంతుపటలంబునకుం
దమలోని తారతమ్యము
క్రమమున నిజకర్మఫలముగాదే తలఁపన్. ౨౧౧

వ. నీవు తామసంబున దివ్యధామచ్ఛాయా సముల్లంఘనం బాచరించిన పాపంబున నీయాపదఁ దెచ్చుకొంటివి నెమ్మది మహాపాతకం బనియతిక్రమింప కునికిం జేసి మాకు గగనగతిక్రమం బవక్రంబై యున్న దిత్తఱి నీచిత్తంబు క్రోధాయత్తంబు గానీక దోషనివృత్తి యగునుపాయంబుఁ జేయు మట్టైన నతిపవిత్రుం డయ్యెదు, గానినాఁడు దుర్జనునకు సుగతియుంబోలె నీ కాకాశగమనంబు సిద్ధింపదు, భవత్పతనకారు లగువారల నేమెఱుంగనేర-మీమేరకు నంతరిక్షాదిభూతంబులు సాక్షి వానినడిగి చూడు, మింక నీవృత్తాంతం బంతయు బలాంతకునకుం జెప్పబోయెద, మిపుడు నీవడిగిన చక్కటికి నద్రిద్వీప సముద్రంబు లెడసి - యంతరంబులై యున్న వింతదూరంబు పాదప్రచారంబునఁ జన ననేకవర్షశతంబులనైన నశక్యం, బదియుఁ గాక నుదగ్రగ్రాహంబు లగునంబుధులు దురవగాహంబు లిట్లౌట దురితనిష్కృతి గల్గునంత నీ విందయుండు - మఖిలంబు భద్రం బయ్యెడుమని వార లరిగి రనంతరంబ- ౨౧౨

క. తలకొనిన శోకభయమున.
నలమరుగుచుఁ జిత్రసేనుఁ డతికరుణముగా,
బలుమఱు విలపించె నెగుల్
దలఁగునుపాయములు గొన్ని తలపోసి ధృతిన్. ౨౧౩

క. శంభుని-నాశ్రితరక్షా
రంభుని-ఫణిరాజకటకరాజితఘనదో
స్స్తంభుని-నపహృతదానవ
దంభుని నిట్లని నుతించెఁ దత్పరమతియై. ౨౧౪

గద్యము :- జయ 'జయ' జలజభవముఖ నిఖిలసురనికర మకుటతటఘటిత మణిరుచిరుచిరచరణయుగళ, గళవిచరదవిరళ గరళకబళ బలవదసురనివహ బాణపటలవిఘటన చటుల దివసకరకమలదమృతకిరణ మధురమధు రసభరిత శశికుసుమ, సుమహితశుచివిభవవిలయరహిత, హితవివిధ విహ రణకుతుక చరణఖచరమిథున శతసతతపరిచితవితతశిఖర మణికిరణకలిత సకలకకుబంతతిమిర భరశుభరజదరణధరనిలయ, లయసమ్మయ వివృత వికటనిటలతటనయనపుట నటదనలకణ కణకబళితసకలభువన, వనధివలయ వలయితధరణీభరవహనసహన ఫణిభర వరివృథదృథవలయ ఖిలసదురుభుజపరిఘపరిచితకనకకుధర పృథులధనురచితమదనధనవిశిఖముఖ శిఖిహుత దితిజనిగదిత నిగమశతనుత నిజనిరుపమనిరవధికగుణవిసర,సరసిజవిపులతర వనవనపవనసపనకృతవని దహన గగనమయ తనుమ హిత, హితజనభవనఫలిత సురనగనగదుహితృ వదనకమల సమదమధుకర, కరటిరదశరదరవిసలబిస రజతభుజగవదసురసరిదమృతకరదరహాసిత, సిత కమలరుహతుహిన నగనిభశుభరుచిమదపఘన, ఘనభుజబలపరుషరిపు పరిష దతనుజయ వితతధనురతినిబిడ నిహతిముదిత, దితిజనృభుజగజవ సనస సనకశుకముఖమునిజన హృదయకమలసదన వరదసమవననిరత, నిరతిశయ శయకలిత లలితహరిపృథు పృథుకరినకుదపహసిత గిరిజశిఖరవరవృషభ గమన, మనసిజమదధవళ దహనజలదసమయ ముఖరఖరవచన దురధిగమ మహితహిమ, హిమకరహుతవహరవినయన వినయనతకరిలపనవిపులకటక విగళితమదసలిల విచలదళికులనినద ముదితమృదునటదురుపద కటకఫణిఫణ

మణిరుగరుణితహరిదుదర దరవికచనఖకమల పరిమళపరిమిళిత మరుసరి దతులసలిలకణగణకలిత బలికచభరరుచినిచయ ఖచితగగనగతిరహిత మహితనిపతిత మఘమలి చలితమతిదయ వివశమశరణభువభవ పాహిమాం! పాహిమాం! ౨౧౩

వ. అని సన్నుతించిన( బ్రసన్నుండై విపన్నగాశని యగుపన్నగాభరణుం డతనిపై( గృపాతరంగితం బగునపాంగంబు నిగిడించి నీ తలంపెయ్యది చెప్పుమనిన నప్పుడు పతికి నందండ వందనం బాచరించి కృతాంజ లియై యాచిత్రసేనుండు తనవృత్తాంతం బంతయు విన్నవించిన( దత్పతన కారుల నిరూపించి విరూపాక్షుం డాక్షణంబున నిజకింకరగణంబుల రణం బున కాజ్ఞాపించిన- ౨౧౪

శా. బాహాకంపితహేతిదీప్తులు వియద్భాగంబు గప్పన్ సము
త్సాహోదంచితసింహనాదముల దిక్చక్రంబు భేదిల్ల( గా
సాహంకారభయంకరాకృతులతో సాయోధనోదగ్ర-స
న్నాహం బద్భుత మావహింప వెడలెన్ మాహేశభూతావళుల్ ౨౧౫

శా. చంచద్వాహనకేకిపింఛరుచు లాశామండలం బెల్ల( జి
త్రించెన్,రోహణశృంగరాజములభాతిన్ రత్నకోటీరముల్
మించెం బాశశరాదిసాధనము లోలిం బూని దర్పంబునం
గ్రౌంచారాతియు బల్విడిన్ వెడలె సంగ్రామక్రియాలోలతన్ ౨౧౬

వ. ఇ ట్లరిగి సకలదురితలతాలవిత్రం బగుశ్రీరంగక్షేత్రంబు( బ్రవేశించి యందు నిరర్గళాపవర్గకరవారి యగుకావేరిం జేరి యాభూతజాతంబు నానా ముఖంబుల( దజ్జలంబు చలంబున( గ్రోలం- దొడంగిన- ౨౧౭

సీ. అంత నిర్మగ్నంబు లైనమహీధర
ప్రతతి శృంగంబులు బయలువడియె,
నీర(-దేలెడి-తీరభూరుహప్రసవంబు
లంతరిక్షమున దూ(గాడ( దొడ(గె
నవ్యంబులైన నిమ్నప్రదేశంబులు
నయ్యమేది న్నమతరంబు లయ్యె,

బొడవులై పొలుపారు పులినస్థలంబులు
క్రందుగా సందందఁ గానవచ్చె

తే. నదరుచూడ్కికి వెక్కసఁ బైనవఱపు
తెల్లముగఁ దోన జువ్వనఁ దీసిపోయె
నల్పజలజంతు నికరంబు లచట నచట
నదరె శైవాలపంక్తుల నాక్షణంబ ౨౨౦

తే. అంతఁ దత్తీర్థసంరక్షణార్థ మచట
మెలఁగు శ్రీవిష్ణుభూతేశు లలఘుమతులు
మున్ను దఱులకు మిగిలి యుప్పొంగి పాఱు
నమ్మహానది యల్పంబు వగుటఁ జూచి- ౨౨౧

క. సరభసగతిఁ దత్కారణ
మరయుచు నటపోయి బాడబానలశిఖలం
బొరి నడుకు జలధిరవమునఁ
బరగెడు నొకస్రోఁత వినిరి పదమతివంకన్ ౨౨౨

చ. విని యిది యేమియో'యనుచు విస్మితులై చని -యమ్మహోతరం
గిణి యుభయప్రతీరములఁ గ్రిక్కిఱి యంబడి యానతాస్యులై
ఘనరసపూరముల్ బహుముఖంబులఁ గ్రోలెడివారి నుగ్రని
స్వన బధిరీకృతాశల బిశాచగణంబుల ఘోరమూర్తులన్ ౨౨౩

చ. కని-కడునల్గి బిట్టదటి కన్నుల దిట్టఁపుకెంపు బర్వఁ ద
ర్జనములు-గర్జనంబులు విశంకటభంగిఁ జెలంగఁ దాఁకి క
న్కనిఁ బరిఘాసి చక్రశరఖడ్గగదాముసలాది ఘోరసా
ధనముల బిట్టు నొంపఁ గడు దల్లడ మందుచుఁ బాఱి రందఱున్ ౨౨౪

క, వారలతోడన తెరలి- కు
మారుండును బఱచె నీక్రమంబున భయముం
గూరిన వచ్చెడి తనపరి
వారము నీక్షించి వృషభవాహనుఁ డాత్మన్, ౨౨౫

తే. సంభ్రమించుచు, వీరి సీజాడఁ బరపి
నట్టి బలియుఁడు నెప్పుడో! యనఁ దదంతి
కమున కేతెంచి వినయుఁడై క్రౌంచభేది
చెప్పెఁ దా రేఁగి విఱిఁగి వచ్చినతెఱంగు, ౨౨౬

వ. అంత నంతయు విని—యుమాకాంతుం డఖిలభూతజాతం బాకర్ణింప బలవం తులతోడివిరోధంబు గాదనిపల్కి యాగంధర్వునిం జూచి-నీ వెందైనను బొందైన కందువ కరుగుమనియంతరార్థంబున నుండెఁ,దదనంతరంబ నిజ మిత్రుం డగుభేచరత్వంబు చెడి పుడమిఁ బడి యడలుచునీకి తదనుచరుల వలనఁ దెలిసి యాశతమన్యుండు ధృతమన్యుండు నయ్యె,నయ్యెడ- ౨౨౭

క. లోచనసహస్రలోహిత
రోచులు మెయినిండ -నామరుత్పాలుఁడు లో
నేచిన రోషానలకీ
లాచయములు వెలిఁ దలిర్చులాగున నుండెన్, ౨౨౮

వ. అంత ౨౨౯

ఆ.వె. దంతి,మేష,మహిష,దానవ,మకర, సా
రంగ,తురగ,శాక్వరముల నెక్కి
కులిశ శక్తి దండ ఘోరాసి పాశ-తో
మర గదాత్రిశూలధరులు నగుచు, ౨౩౦

ఉ. ఆహవశూరులై వెడలి రప్పుడు తక్కును గల్గు దేవసం
దోహము లాత్మ చిహ్నములతో వివిధాయుధపంక్తితో,నట
వ్యూహసకోటితో, సుభటవర్గముతో వెస నిర్గమించి-ర
వ్యాహత సింహనాదముల నంబరభాగము పూరటిల్లఁగాన్, ౨౩౧

క. ఆ దివిజగణము తమతమ
కైదువుల మెఱుంగు లెల్లకడలం బర్వం
గా దనరెఁ దఱచు మెఱుపుల
తో దివిఁ బన్నిన యుగాంతతోయదమ్ము లనన్. ౨౩౨

ఉ. అయెడ వాయువుల్ పరుసనై వెస వీచె, నినుండు వేఁడిమై
కాయ దొడంగె భీకరముగాఁ బెనుమంటలు నెల్లదిక్కులన్
వాయుసఖుండుఁగప్పెఁ బటువారిదపంక్తులు మిన్ను ఘూర్ణిలన్
మ్రోయుచు ఘోరనం గురిసె ముంపఁగ శోణితధార లెల్లెడన్. ౨౩౩

క. చదలం గనలుచు ముదమునఁ
బొదలెడి సురవరులు విష్ణుభూతేశులు-దా
రిదియేటి దనుచు నచ్చెరు
వొదవఁగ వీక్షించుసంత నుద్ధతవృత్తిన్. ౨౩౪

క. సురగణవిభుపనుపునఁ, గడు
నురువడిఁ జండానిలంబు లొక్కట విసరన్
బురిగొని వైష్ణవవాయువు
లరుదారఁగఁ బేర్చి వాని నన్నిటిఁ దోలెన్. ౨౩౫

క. ఆలో నాలోలఘన
జ్వాలాజాలములఁ గప్పి చను నాయజ్ఞిన్-
గాలుపుచు వైష్ణవానల
మాలోకనభయద నిష్ఠురాకృతి మెలఁగెన్. ౨౩౬

వ. అట్టియెడ-సమరసముత్సాహ దోహలంబులై-సురసందోహంబు లుదగ్ర మండలాగ్రపరిఘ పట్టిసప్రాసపాశముఖప్రహరణ బాణపాణులై—మఱిముందఱం దఱిమి నిజప్రతాపాతపాహతారికుముదుం డగు, దత్క్షేత్రరక్షకుండు కింక రెట్టింప హరికింకరులం బంపిన, నానిలింప సైన్యంబులపైఁ గవిసి నిశితపవి నిష్ఠురంబు లగుశరంబుల నురంబులు గాఁడనేసియుఁ బ్రళయానలకరాళంబు లగు కరవాలంబులఁ గంఠనాళంబులు-దెగవ్రేసియుఁ గాలోరగాభీలంబు లగుశూలంబుల ఫాలంబుల నొంచియు, నుదంచితప్రభాపిహితవియత్తలంబు లగునత్తళంబులఁగత్తళంబులఁ జించియుఁ గరంబు భయకరంబు లగు ముద్గరంబుల శిరంబులు నొంచియు, బ్రచండంబు లగుగదాదండంబులఁ బిచండంబులఁ బగిల్చియుఁ, గనకపుంఖ మండితశిఖండజాలంబు లగుభిండివాలమ్ముల నాడించియుఁ దఱము

గాటమ్మునకు — నోహటించి — విముక్తరణపాండిత్యు లగునాదిత్యులు, — విస్మృతహరిత్తు లగుమరుత్తులును, విగళితగంధర్వు లగుగంధర్వులు, విఘూర్ణితాత్ము లగుయక్షులు: వితతక్షతవేదనాసాధ్యు లగుసాధ్యులును, వికంపితాసువు లగువసువులునునై, రివ్విధంబున నిజబలంబులు దక్కి నలుదిక్కులకుం బఱచిన సురపతి తా నొక్కరుండ చిక్కి మిక్కుటం బగుకోపాటోపంబున ౨౩౭

శా. శుంభద్రోషమునం దిశల్ పగుల నత్యుద్రజ్వాలజ్వాలితా
సంభూతస్ఫుటవిస్ఫురద్విస్ఫురత్స్ఫాయత్స్ఫులింగవ్రజం
బంభోవాహపదంబు గప్పికొన జంభారాతి వైచెన్ రణా
రంభోజ్జృంభితమైన వైష్ణవభటవ్రాతంబుపై వజ్రమున్ ౨౩౮

క. ఆరీతి భూతభయదం
బై రయమున వచ్చు వజ్ర మతులితబల దు
ర్వారుఁ డగుకుముదుఁ డచ్చెరు
వారఁగ డాకేలఁ బట్టె ననుచరు లార్వన్. ౨౩౯

ఉ. ఆతతి సర్వపర్వతచయాతతపక్షవిభేదనక్రియా
హేతుకమై దనర్చు నిజహేతి-వికుంఠితమై యరాతికిం
జేతికి నగ్గ మౌటఁ గని సిగ్గఱి శక్రుఁడు వాఱె-దైత్యజి
ద్దూతలు వెంటవెంటఁ బడి తోలుచుఁ గేలిఁ గొనంగ మౌనియై. ౨౪౦

చ. హరిఘాయుఁ డాదిగా గల సురావలి నాగతి గెల్చి-విష్ణుకిం
కరులు జయోత్సవం బెసఁగ, గ్రమ్మఱి వచ్చినఁ దన్మహోగ్రసం
గర ఘనఘోష మచ్చట సుఖస్థితి నున్నమహాత్ము లాలకిం
పరు పరమాత్మచింతనముఁ బాయక యన్య మెఱుంగ కుండుటన్. ౨౪౧

వ. అంత నక్కడఁ బరాభవజాతమన్యుండై వచ్చుశతమన్యుదైన్యం బాలోకించి లోకపితామహుం డతని డాయంజని. ౨౪౨

క. ఎవ్వరిచే నేనెపమున
నివ్విధి వాటిల్లెఁ జెప్పు మేర్పడ ననినన్

నెవ్వగఁ జిత్తం బెరియఁగ
నవ్వనరుహగర్భుతోడ నతఁ డిట్లనియెన్. ౨౪౩

క ఏమని చెప్పుదు లోకపి
తామహ ! మత్సరము మానధనమును బాసెం
దామర సాతుని దూతల
చే ముల్లోకములు గేలి సేయుచు నవ్వన్. ౨౪౪

వ. అనినఁ జతుర్ముఖుండు శతమన్యున కిట్లనియె. ౨౪౫

చ. మెఱసిన మృత్యుదేవతకు మృత్యువులైన ముకుందదాసులం
దరలక మారుకొం టరయఁ దాఁ గొఱవిం దల గ్రోఁకుకొంట యి
ట్లెఱిఁగియు వజ్రమంది యిది యేటికి వైచితి వారిమీఁద నె
త్తెఱఁగుననైన నాపదలుఁ దెచ్చుఁగదా బలవద్విరోధముల్. ౨౪౬

క. అనిమిష ! విను నీకులిశం
బనఁగా నిది యెంత ? మామకాస్త్రవరంబై
నను హరునిపాశుపతమై
నను వమ్మగు విష్ణుభూతనాథులచేతన్. ౨౪౭

ఆ.వె. కాలచక్రమైన గరుడధ్వజునిచేతి
చక్రమైన వారిఁ జేర కంత
దలఁగునట్టి మహిమ గలమహాత్ములతోడ
వైర మగుట నేమికారణంబు- ౨౪౮

క. అనిన పితామహుపలుకులు
విని యనిమిషనాయకుండు వినమితముఖుఁడై
మునుకనసిగ్గున దమ్ముం
గనుఁగొనుటయు, నతని తలఁపు గని గంధర్వుల్ ౨౪౯

వ. ఆచతుర్ముఖ శతమఖులిద్దఱు కరపుటంబులు నిటలతటంబునం గదియించి
యిట్లనిరి- ౨౫౦

సీ. అవధరింపుము పంకజాసన, సురరాజు
చెలిమికాఁ డగుచిత్రసేనుఁ డనెడి
గంధర్వనాథుఁడు, కాదంబరీపాన
మత్తుఁడై సోలుచు, మధురఫణితిఁ
బాడుచు, నాకాశపథమున నరుగుచో,
రుచిరమచ్ఛాయాస్వరూపమైన
శ్రీరంగధామంబు జెచ్చెర లంఘించె,
బలసి యాతనివెంటఁ గొలిచి వచ్చు

ఆ.వె. నేము దాని దాఁటరామి ము న్నెఱుఁగుట
గడచిపోక నిలువఁబడితి మంత
కింక మీఱ విష్ణుకింకరు లాతని
నొడిచి పాఱవైచి రుర్విఁ గూల. ౨౫౧

క. అటు ద్రేసిన జలధులకడ
పఁట, ముక్కును మోముఁ జదియఁబడి గగనమునం
బటుగతిఁ జనుసామర్థ్యము
మటుమాయము నొంది దీనమానసుఁ డగుచున్. ౨౫౨

లయగ్రాహి:- సింధురనిశాట మదసింధుఘటజన్ము, సుర
సింధు కనకాంబురుహగంధ విచలత్పు
ష్పంధయవితీర్ణ సితబంధుర జటాపటల
బంధవిలసత్కుముదబంధుఁ బ్రమదాస
బంధ లలితాంగు ననుసంధిత జగత్కుశలుఁ
గంధర వినీలతర కంధరు నుదార
స్కంధవృషవాహనుఁ గబంధ మథనప్రియు, జ
లంధరహుఁ గొల్చె నతఁ డంధకవిరోధిన్. ౨౫౩

క. ఆతనిదెసఁ బ్రీతుండై
శీతాంశుధరుండు పనుపఁ జెచ్చెరఁ జని త
ద్భూతములు విష్ణుదాసుల
చేతం బరిభూతి నొంది చేష్వడి రంతన్. ౨౫౪

చ. హితుఁ దగుచిత్రసేనునకు నిట్టివిధంబున వచ్చునట్టి దు
స్స్థితి విని యల్కమై నమరసేనల నెల్లను గూర్చి యాశత
క్రతుఁడు ముకుందకింకరనికాయముపైఁ జని—పోరి—వారిచే
హతబలులైన నిలింపులు భయంబున కన్కనిఁ దాఁకిపోయినన్. ౨౫౫

క. ధట్టించి నిలిచి వజ్రము
కట్టలుకం బూని వైవఁ గైకొని కది చే
పట్టుకొని కుముదుఁడును నతఁ
డిట్టాలం బనుచుఁ జెప్పనెద నచ్చటికిన్. ౨౫౬

వ. మున్ను చిత్రసేనునిచేతను బరిభూతం బగురాజశేఖరుం దరుదెంచిన విరించి
యర్ఘ్యాదరంబున నమ్మహాదేవుతో నీవేమి కార్యంబున కిచ్చటికి వచ్చితనిన
నచ్చతురాననుం గనుంగొని. ౨౫౭

క. క్షితి చిత్రసేనపతనము
నతనికినై తనబలంబు నని కనుపటయుం
ధృతి చెడి వారలు-హరిభట
తతిచే నొచ్చినవిధంబు తడయక చెప్పెన్. ౨౫౮

క చెప్పిన విని గంధర్వుం
డొప్పని పని సేసెఁ దెలిపి నూనక నీవుం
దప్పితివి బుద్ధి సురపతి
చెప్పెడి దేమున్న దిట్టిసెగ్గము నొందెన్. ౨౫౯

చ. అని జలజాసనుండు దివిజాధిపుఁ గన్గొని దైవకృత్యమె
వ్వనికి నతిక్రమించి చన వచ్చునె పుణ్యపరుల్ శుభంబులం,
ఘనదురితాత్ము లాపదలు, గైకొనుచుండుదు రట్టికర్మముల్
దనవశమే యొనర్పఁగ విధాతృనియోగమె కాక సర్వమున్, ౨౬౦

క జీవుల శుభాశుభస్థితు
లేవిశ్వాత్మకుఁ దెలియంగ నెవ్వప్పంతు నా

దేవునిశక్తికి హీనం
బై వెసఁ జలియించునే తృణాగ్రంబైనన్. ౨౬౧

ఉ. ఆపరమేశ్వరుం డరయ నాగమవేద్యుఁడు వేదచోదితం
బై పెను పొందు ధర్మ మఖిలాశ్రయ మానరణిం జరించువా
రాపదఁ జెంద కెందుసుఖమందుదు రుత్పథవర్తులై తదా
క్షేప మొనర్చు నీచులు నశింతురు దుస్తరనారకాగ్నులన్. ౨౬౨

తే. ఆది పరమాత్మసంకల్ప మైనయట్టి
ధర్మమార్గంబు దప్పి గంధర్వవిభుఁడు
చక్రి దివ్యాలయచ్ఛాయ నాక్రమించి
కనియెఁ దత్పాపమున నిట్టి కష్టదశలు. ౨౬౩

వ. అనినఁ బాకశాసనుఁడు జలజాసనుఁ గనుంగొని ౨౬౪

దే. తోయజభవ! హరిభవన
చ్ఛాయాలంఘనము సేయ సమకొనుపాపం
బేయది తుది నది పాయు ను
పాయం బేతెఱఁగు తేఁటపఱుపుము నాకున్

సీ. నావుఁడు నజుఁడును దేవేంద్ర! వినుము చె ౨౬౫
ప్పెదఁ బరప్రత్యక్షభేదముటను
ద్వివిధమై దాను వర్తించుభూతావలి
యందు స్వచ్ఛాయ ప్రత్యక్ష మనఁగ
నమరు నాయుఃక్షయం బైనవారల కది
దునుకబోయిన రీతిఁదోఁచు నొండెఁ
బొడగానఁగా రాక పోవు నీజాడ న
ది విను స్వచ్ఛాయయ దృష్ట మనఁగ

తే. భువిఁ బరచ్ఛాయఁ దాఙ్త్రోష్ఠమును గనీయ
సంబు నన రెండువిధములు జరుగుచుండుఁ

బిన్నవాఁ డెట్టియెడలను బెద్దవాని
నీడ దాటించుచుం జనఁగూడ దెపుడు. ౨౬౬

క. గురుసముచిత శయనాసన
వరవాద్యప్రముఖగేహవర్గము జడుఁడై
చరణమున నాక్రమించిన
నరుఁ డరుగు ననేక ఘోర నారకములకున్. ౨౬౭

వ. సకల ధర్మంబు లందును సాత్త్వికంబు పరమధర్మం, బిది యవలంబించి చరి
యించు నిర్మలాత్ములు-మనోవాక్కాయకర్మంబులఁ బరాత్ము లగునెల్లవారికి
గురువు, లట్టిపుణ్యపురుషులయందు సదా సన్నిహితుండై యుండుఁగావునఁ
దచ్ఛాయఁ ద్రొక్కఁచను దుష్కృతచిత్తులకు నిష్కృతి గలుగనేర దని చెప్పి
యప్పితామహుండు వెండియు నిట్లనియె. ౨౬౮

తే. కుష్ఠరోగాత్ము లగువారుఁ గుంటివారు
నంఘ్రిహీనులు గల రెవ్వ రట్టివారు
గతభవంబున శ్రీహరిప్రతిమనీడ
లంఘనము చేసి చనినపాలసులు పుత్ర. ౨౬౯

చ. నిగిడిన విష్ణుమందిరమునీడయు విష్ణునినీడయట్ల దా
టఁగఁ దగ దట్టిపాపము జడత్వము మైనొనరించు దుష్టమతి
తెగి యమబాధలం బడి తుదం ధరపై జనియించి పంగులై
వగలఁ గృశించుచుండుదు రవారిత ఘోర రుజాదిపీడలన్. ౨౭౦

తే. తత్ప్రదక్షిణ మొనరించుతఱి నరుండు
కడఁగి తచ్ఛాయ మూఁడుభాగములు చేసి
యందుఁ బూర్వాంశమునఁ జను టర్హ మిట్లు
గాక, తక్కినయది దోషకారియండ్రు. ౨౭౧

క. వనజోదరుశుభగుణములు
గొనకొని కీర్తింప గేలిఁ గొనుచు నవజ్ఞం

జను జనులు బధిరులై, మహి
జనియింతు రనేకజన్మజన్మములందుఁన్. ౨౭౨

క. హరిబింబమైనఁ దత్పరి
కరమైన, ధ్వజంబునైనఁ గని మ్రొక్కక నా
దరబుద్ధిగడచిచనునా
పురుషులు జాత్యంధు లగుచుఁ బుట్టుదు రద్దిన్. ౨౭౩

క. హరినగరి కప్రదక్షిణ
సరణిం జనుదుర్వివేకి సంచితపుణ్యా
స్ఫురణఁ బెడఁబాసి సంప
ద్విరహితుఁడై పిదప నరకవితతులఁ గూలున్ ౨౭౪

క. ద్వారమున జనక విష్ణున
గారము-మఱియొకడు వెంటఁగాఁ జొచ్చు దురా
చారమున జేసి నరుల కు
దారం బగుపుణ్యవితతి దలగు సురేంద్రా ! ౨౭౫

క. ఈగతి మెలఁగక, దుర్మదుఁ
డై గంధర్వుఁడు విపద్గశాకులుఁ డయ్యెన్.
వేగపడి విష్ణుదాసుల
తోఁ గరకరినొంది యశము దొలఁగితి వీవున్. ౨౭౬

వ. అని పలికి వాగ్జాసనుం డూరకయున్న నాశతమన్యుండు లజ్జావనత
ముఖుడై యిట్లనియె. ౨౭౭

క. చతురానన ! నా కెంతయు
హితుఁడీ గంధర్వుఁ డెగ్గు లెన్నక కరుణా
మతిఁ జెప్పుము నాకొఱకై
యతనికిఁ గల్మషనివృత్తి యగుతెఱఁ గింకన్. ౨౭౮

చ. అనినఁ బితామహుండు దివిజాధిపుఁ గన్గొని, యిట్టిపాప మే
యసువునఁ దీఱ నేర్చును సమర్చన్న వందన సంస్తవాదులం

దను భజియింప నావికచతామరసేక్షణుఁ డాసమాశ్రితా
వన నిరతుండు శ్రీహరి ధ్రువంబున మాన్పెడిఁ దాన యాతనిన్. ౨౭౯

క. అని చెప్పి యజ్ఞగర్భుఁడు
చనియె న్నిజధామమునకు శంభుఁడుఁ బోయెన్
వినుతమణిశృంగ సంగత
ఘనపటలవిలాసమునకు గైలాసముకున్. ౨౮౦

చ. హరిహయుఁ డంత నిష్టసఖుఁడై పెనుపొందెను, జిత్రసేనుఁడం
బరగతి పాటవం బెడలి పక్షప్రదేశము కేఁగి పాపికిన్
సరసిజసూతి వాక్యములచందము పొందుపడంగఁ జెప్పి-తా
నరిగె నిజాగమోత్సుకసుధాశనకోటికి వేల్పుపిపికిన్, ౨౮౧

వ. ఆగంధర్వరాజును నిజవ్యతిక్రమంబునకు నిర్వేదించి యచ్చోటు వాసి, కాశ్యప నామధేయుండు నగుమునీశ్వరుఁ బొడగని యభివందనం బాచరించి వినయవినమితమస్తకుండై హస్తకమలంబులు మొగిచి-యిట్లనియె. ౨౮౨

క. దురితానలకీలావలి
నెఱిఁ జెడి నా కేదికృత్య మెయ్యది వాచ్యం
బిరవుగ నేమిట సౌఖ్యముఁ
బొరయుదు నెఱిఁగింపవే తపోధనముఖ్యా ! ౨౮౩

వ. అనిన నయ్యతివరుండు గంధర్వవరున కిట్లనియె. ౨౮౪

మ. పరమేశుం బురుషోత్తం బరుఁ, గృపాపాథోధి, నారాయణున్
హరిఁ జిత్తంబున నిల్పి-నిత్యము ప్రణామాభ్యర్చనాదిక్రియా
పరతం గార్యము దీర్పు, మట్లయినఁ బాపశ్రేణిఁ బోఁదోలి-త
త్పరమస్థానముఁ బొందె దెంతయును గోప్యం బే నెఱింగించితిన్. ౨౮౫

క. నావుఁడు నప్పరమేశ్వరు
నేవెరవున నెఱుఁగబోలు - నేచందము, వాఁ

దేవంక సుండు ననుటయు
నావాచంయమి పరేణ్యుఁ డతనికి ననియెన్, ౨౮౬

క. అతివిమలం బగుమానస
గతులను సుకృతప్రసక్తి గలకర్మములన్
వితత ప్రసన్నభాషలఁ
జతురుఁడవై యెఱిఁగె దీవు సర్వాత్ము హరిన్. ౨౮౭

క. కలఁ డఖిలనాయకుం డగు
జలశాయి, సమస్తభూతచయములలోనన్
వెలుపటి సకలావస్థలఁ.
గలకాలము పూర్ణుఁడై జగన్నివహములన్. ౨౮౮

క. అనుటయు నాగంధర్వుఁడు
మునివర్యుని విష్ణు డఖిలభూతావలియం
దును బాయకుండునేనియుఁ
గనరామి యదేమి యనినఁ గాశ్యపుఁ డనియెన్. ౨౮౯

సీ. గంధర్వనాథ! జగత్ప్రపంచంబునఁ
గలవస్తుతతి తన్నుఁ గదిసియున్న
నైన, పురోగతం బైన, భాగమకారఁ
గనవచ్చునేలోన వెనుకదెసయు-
నదిగాన/నీమాడ్కి నఖిలభూతాత్ముఁడై
తనను నవ్వీక్షుగానఁ దరముగాదు
బాహ్యాంతరంబుల ప్రతిహతంబై ప్రవ
ర్తించు పరిజ్ఞానదృష్టి గాని

తే. యట్టి సుజ్ఞానమునకు మాటగుచు దేహి
కర్మబంధంబు నిగుడుఁ దద్భవ నిరోధ
మురిదిఁ బోఁ జేసి నిజహృత్సరోజమధ్య
గతునిఁ బరమాత్ముఁ గనువాఁడ కనెదివాఁడు. ౨౯౦

చ. అరుగుము నీవు, దుస్తరమహాఘనివారిణియైన చంద్రపు
ష్కరిణికి, నందు భక్తి నవగాహ మొనర్పుము - దాన నీకగున్
బరమశుచిత్వ, మంత భవబంధవిమోచనుఁ బద్మలోచనున్
హరిఁ బరమాత్ము గాంచెద వుదంచితధాముని రంగధామునిన్. ౨౯౧

క. ఆదేవుని, నాశ్రితర
క్షాదక్షునిఁ గొలిచి, తత్ప్రసాదంబున నీ
ఖేదంబుఁ బాసి చనియెదు
మోదంబున నిజనివాసమున కుడువీథిన్. ౨౯౨

క. అని యెఱిఁగించిన, వినయం
బెనయఁగ గంధర్వుఁ డమ్మునీంద్రున కభివం
దన మాచరించి వీడ్కొని
చని గంధర్వుఁడు విరక్తిసంపన్నుండై. ౨౯౩

మ. పరమోత్కంఠ నకుంఠితస్థితి పురోభాగంబునం గాంచెఁ బు
ష్కరిణీతీర్థము - నాత్మతత్పరభజ ద్గంధర్వగీర్వాణ కి
న్నర సంపాదిత కామితార్థము, ననూనస్ఫార నీరేజకే
సర నిర్యన్మకరంద తుందిల పయోజాతోర్మికాసారమున్, ౨౯౪

వ. కని విస్మయంబు నొంది - నిజస్మరణమాత్ర గళిత కలుషకజ్జలంబు లగు తజ్జలంబుల మజ్జనం బాచరించి, విశుద్ధశరీరుండై, కవేరకన్యకాతీర సహకార కోరక మోదమేదుర మలయమారుతావతార రజతగరుడకేతనాభిరామం బగుశ్రీరంగధామంబుఁ జేరి, యచ్చట నభంగ సంగతప్రసంగంబున నారమామనోహరు చిత్తంబు ప్రసన్నతాయత్తంబు సేయం బూని, మొదల నాదసముద్భవంబులై - మంద్రమధ్యమతారభేదంబులఁ దమవలన - నేక వింశద్విధంబులైన శ్రుతులకు నాధారంబులై - మయూరాదిరుతంబులచేత సంకేతం బగుషడ్జాది సప్తస్వరంబుల పరస్పరమేళనంబున నధిరామం బగుగ్రామత్రయంబు నవలంబించి - మతంగ తుంబురు నారదకోలాహ లోదితంబు లగుమతంబుల ననేకప్రకారంబు లైనమూర్ఛనల నింపు గడలొత్తు చతురుత్తరాశీతితానంబుల ననూనంబులై, సంపూర్ణషాడబ

సషేతంబు లగుపంచదశజాత్యవయవంబులఁ బరిశీలించి — స్థాయి సంచారి ప్రముఖ లగుచతుర్వర్ణంబులు నాశ్రయంబుగా నెన్నఁబడిన ప్రసన్నాది ప్రభృతికాలంకారంబులు పదుమూడును బరిస్ఫురింపఁ గంపిత స్ఫురితాహతాందోళితంబులు లోనుగాఁ గల సప్తగమకంబులు మెఱయ నష్టాదశజాతి ప్రభూతంబులై శుద్ధభిన్న గౌళదేసరి సాదారి తోపరాగసంజ్ఞలఁ బ్రసిద్ధం బులైన శుద్ధరాగంబులు ముప్పదియాఱును, రాగాంగంబు లిరువదియును, భాషాంగంబులు నలువదియేడును, నుపాంగంబులు ముప్పదియొక్కటి, క్రియాంగంబులు మూఁడునుగాఁ బదిదెఱంగుల నూటముప్పదియే డగురాగంబులు వేళావిభాగంబులతో నాలాపంబు సేసి సమతాళపదక్రమబంధురంబు లగు నాసింధురవరదు బిరుదాంకితంబు లైనప్రబంధంబులు పాడఁ దొడంగె - నపుడు కర్ణామృతాయమానం బగుగంధర్వరాగంబు నాకర్ణించి— ౨౯౫

సీ. సెలవు లంబులు రాలఁజెవు లొగ్గి మృగములు
తరలక మేపులు దలఁగి నిలిచె,
గగనవీధులఁ బాఱు ఖగము లుపాంతభూ
జములపై వ్రాలి నిశ్చలత నొందె,
మంజులప్రాసాద మణికుట్టిమంబులు
గరఁగి నీరై జాలుగట్టి పాఱెఁ
దరులతాపంక్తులు మరలఁ బ్రాయము వచ్చి
చిగురు గెమ్మోములఁ జెలువు మిరిసె,
తే. నచటి జనులెల్ల నితరకార్యములు దక్కి
సంతతానందపరవశస్వాంతు లగుచుఁ
జిత్రరూపులకైవడిఁ జేష్ట లుడిఁగి
యున్నవా రున్నచోటనె యుండి రపుడు, ౨౯౬

మ. కరుణాంభోనిధి రంగనాయకులు దద్గంధర్వగాంధర్వ వై
ఖరి చిత్తంబున కౌతుకంబు నెఱయంగా సుప్రసన్నాత్ముఁడై,
సకసోదార కటాక్షవీక్షణ సుధాసారప్రసారంబునం
బరితాపం బడఁగించి వారి కొసఁగెన్ భవ్యార్థితైశ్వర్యముల్. ౨౯౭

మ. అతిమోదంబున నప్పు డుజ్జ్వలవిమానారూఢుఁడై — యుజ్జ్వల
ద్యుతుల నించి, తనుప్రభల్ దెసల నెందుం బర్వ, గంధర్వు ల
ప్రతిమప్రౌఢి ననేకభంగుల నుతింపం, జిత్రసేనుండు ధీ
రతమై నేఁగె నిజాలయంబున కపూర్వశ్రీసముల్లాసియై. ౨౯౮

వ. తదనంతరంబ ౨౯౯

క. వితతశ్రీమహిమలఁ దన
ప్రతి యగుసఖుఁ జూచి దేవపతి యతివి
స్మితుఁ డయ్యె నతనిసంగతి
నతఁడును సుఖముండెఁ ద్రిదివమం దనురక్తిన్, ౩౦౦

క. ఈకథ వినునరుఁ డఘముల
సోఁకక యధికారనిరతి స్రుక్కక శుభముల్
గైకొనుచు నుండు నిచ్చట
శ్రీకరగంధర్వపదముఁ జెందుదు రచటన్. ౩౦౧

వ. అని పారాశర్యుండు నాగదంతమునివర్యునకు నెఱింగించిన తెఱంగు. ౩౦౨

-. ఆశ్వాసాంతము :-

శా. ఘాటీసంభ్రమజృంభమాణ నిజయోధవ్యూహ ! బాహాధను
ర్జ్యాటంకారవిశంకటధ్వని విశేషధ్వస్త ! నిస్తంద్ర క
ర్ణాటోద్దీర్ణ బలార్ణ వార్భటితురంగారోహణోదార ! లీ
లాటోపార్కితనూజ ! చాగవిభురామామాత్యచూడామణీ ! ౩౦౩

క. నిరుపమ శుభగుణనిభనుత
వరభుజ బలమహిత హితవివర్ధననిరతా
చరణరణ 'దివ్య రాహుత'
నిరుదపదోన్నతనతారిబృందాభయదా ! ౩౦౪

మాలిని. సుకవినుతకరసాలా ! సూనృతాలోలశీలా !
వికచ కమలనేత్రా ! విద్విదంభోజమిత్రా !
ప్రకటితనిజశౌర్యా ! ధర్మశైలేంద్రధైర్యా !
సకలసుగుణధామా ! చాగయామాత్యరామా ! ౩౦౫

గద్యము

ఇది
శ్రీమద్భ్రమరాంబా
వరప్రసాదలబ్ధసారస్వత
విలాసగౌరనామాత్యపుత్రసు
ధీవిధేయభైరవనామధేయప్ర
ణీతంబైన శ్రీరంగమహాత్త్వంబను
పురాణకథయందుఁ దృతీయాశ్వాసము.



# శ్రీ రంగ మహత్త్వము

## -:చతుర్థాశ్వాసము:-

క. శ్రీ రంగరాజసేవా
పారంగత! కర్ణఖచరపతి, శిబిఘన, మం
దార, సురధేను-వితరణ
చారు గుణాకరసుధామచాగయరామా!

వ. అవధరింపు మఖిలకథా కథన చాతురీజనిత రోమహర్షణుం డగురోమహ ర్షణకుమారుండు దివ్యబోధను లగుశౌనకాది తపోధనులకుఁ జెప్పినతెఱంగునఁ బుష్కరిణీతీర్థసామర్థ్యం బాకర్ణించి–సుధీవిధేయుం డగుసాత్యవతేయునకు నధికతపోధనవంతుం డగునాగదంతుం డిట్లనియె. ౧

సీ. అతిచిత్ర మగునీయుపాఖ్యాన మనఘాత్మ!
వింటి నీవలన, భూవిదితమైన
చంద్రపుష్కరిణీప్రశస్తియు నంచిత
క్షేత్రానుభావంబు చిత్తగతము
లయ్యెను వేదవేదాంగ పురాణేతి
హాసాది సకలవిద్యాప్రపంచ
కల్పనంబున, నీవ కర్త వీరూపున
నవతారమైన నారాయణుఁడవు

తే. గాన, నిగమార్థనిర్ణయగతుల నీవ
యెఱుఁగు దెఱిఁగెడివారికి నెల్లమేటి
వానతిమ్ము కృపామతి నచట మఱియు
సుమహితము లైన పుణ్యతీర్థముల తెఱఁగు. ౩

క. అనుటయు, కృష్ణద్వైపా
యనుఁ డాసంయమివరేణ్యు నాదరమునఁ గ

న్గాని చెప్పె, మఱియు నయ్యెడ
జనవినుతార్థంబులైన షట్తీర్థంబుల్. ౪

చ. అన విని శౌనకాదిమును లందఱు డెందములందు సమ్మతం
బెనయఁగ సూతపుత్రునకు నిట్లని రట్టి విచిత్రసత్కథల్
విన మిట మున్ను మాకు విన వేడుక యయ్యెను శక్తిపౌత్రుఁ డా
తని కెఱిఁగించినట్టి సముదంచితతీర్థము లాఱుఁ జెప్పుమా. ౫

వ. అనిన - మునీంద్ర బృందంబునకు సూతనందనుం డిట్లనియె. ౬

క. ఇప్పుడు నను మీ రడిగిన
చొప్పున, ము న్నఖిలతాపసులు గూడి ప్రియం-
బొప్పారఁ దన్ను నడిగిన
నాపుణ్యాత్ములకు బాదరాయణుఁ డెలమిన్. ౭

క. వినిపించె నట్ల తగ న
మ్మునిపరునకుఁ జెప్పఁ బొడఁగె మున్నసమతపో
ధనుఁ డైన భరద్వాజుఁడు
తనశిష్యులు గొలువఁ దీర్థతత్పరమతియై. ౮

సీ. తపసియుఁ జని కంచి దర్శించెఁ, గేదార
మాడె, గంగాద్వార మధిగమించె.
సింహాచలంబు నీక్షించెఁ గురుక్షేత్ర
మరిగెఁ బుష్కరముల ననుసరించెఁ,
కాశికాపురి నవగాహంబు సేసెఁ బ్ర -
యాగంబునందు గయావటంబు
గదిసె, గోదావరిఁ గాంచెఁ, గృష్ణానది
భజియించె, శ్రీరంగభర్తఁ గొలిచె.

తే. సన్నుతించె నహోబలస్వామిఁ బ్రణుతి
సేసె శ్రీవేంకటాచలవాసి నెలమి

నర్చ గావించె హస్తిశైలాధిపతిని,
దీర్చెఁ బూజ జగన్నాథ దేవునకును. ౯

క. ఈవిధిఁ గని, మఱియును ధర
ణీవలయమునందు మహిమ నెగడిన బహుతీ
ర్థావలి ననుక్రమంబున
సేవించుచు వచ్చి వచ్చి చిత్తం బలరన్. ౧౦

క. అతఁడు గనుఁగొనియెఁ, గ్రీడా
గతవితతోదన్యవన్యకరి మదధారా
ప్లుతమైన సరసి చెంతను
నతిముద మందంగఁ జేయు నారామంబున్. ౧౧

వ. కని—డాయంజని. ౧౨

సీ. కర్ణామృతంబుగా కమలాక్షు నవతార
కథలు వర్ణించు శుకవ్రజంబు,
సామంబు లంచితస్వరముగా మునికుమా
రులఁ జదివించు కోకిలకులంబు,
హరిఁ బాడు కిన్నరవరులకు నాలాప
విధము లాసించెడి మధుకరములు,
నమరవిలాసినీ సముదయంబుకు లాస్య
గతు లోజఁ గఱపు శిఖావళములు,

తే. శ్రీమనోహరు శుభదివ్య నామవితతి
విశదముగఁ బల్కఱును బల్కు విహగచయము,
చూత, పున్నాగ, వకుళ, ఖర్జూరముఖ్య
తరుకదంబంబు గల్గు తత్తటములందు, ౧౩

క. ఘనుల, ససహిూసతేజో
ధనుల, సమీక్షించెఁ దత్తతమహామిసుఖా

శనుల, నిరంతరహరి చిం
తనుల, సనాతనుల మునులఁ దద్దయుఁ బ్రీతిన్, ౧౪

క. సందర్శించుచుఁ జని, కని
యెం దదనంతరమ సుజనహృద్వనహరిణిన్,
నిందాచరణ మహీరుహ
చందనమందాంధకరణి శశిపుష్కరిణిన్, ౧౫

ఉ. అం దవగాహనాదివిధు లర్థి నొనర్చి భజించె, దేవతా
బృంద లసత్కిరీటు వలభీ బలభిన్మణిమాలికాంకితా
మంద నఖేందుబింబరుచిమత్పదపీఠుఁ, గృపానిరూఢు, నా
నంద సమగ్ర సజ్జన మనఃప్రియదాయకు రంగనాయకున్, ౧౬

క. ఆదేవు నసమవైభవ,
మాదివ్యతనూవిలాస, మాసౌభాగ్యం,
బాదరహాస విలోకన
మాదరమునఁ జూచి విస్మయాన్వితుఁ డగుచున్, ౧౭

తే. కొంతతడ వుండి వెడలి, తదంతికమునఁ
దనగురుండైన వాల్మీకిమునివరేణ్యుఁ
డున్నవాఁ డనిచని, ముద మొదవ నచటి
తాపసులచేఁ దదాశ్రమస్థలము దెలిసి, ౧౮

వ. అభరద్వాజమునివరుం డచ్చోటి కరిగి, హరిధ్యానానందలీలా సమ్మిలితనేత్రుఁ
డగు వాల్మీకి నవలోకించి కృతాభివందనుండై తదాదరంబు వడసి యమ్మ
హాత్మున కిట్లనియె, ౧౯

చ. వెలసిన పుణ్యతీర్థములు వేడ్కఁ జరించుచు వచ్చి, యీశుభ
స్థలి ననమప్రభావవిదితం బగుపుష్కరిణిం, గృపాసుధా
జలనిధియైన రంగవిభుఁ జారుమతిం భజియించు చిందు—మీ
రలవడ నున్కి నిక్కముగ నారసి కంటి భవత్పదాబ్జముల్, ౨౦

క. వినఁబడియెఁ బెక్కుచిత్రము
లనఘా! కనుగొంటిఁ గొన్ని యాశ్చర్యము లీ
ఘనదివ్యదేశవరమున
కెనయగు తీర్థములఁ జూడ నే నెయ్యెడలన్, ౨౧

వ. అనిన విలసత్తపోవిభవుం డగు వల్మీకభవుం డుదార తేజుం డగు భరద్వా
జున కిట్లనియె, ౨౨

ఉ. భూనుతసత్యధర్మగుణభూషణుఁ డైనవిభీషణుండు దా
నీనది క్రేవ నెన్నఁడిడె నీహరిధామము నాటనుండియున్
యే నిటనున్నవాఁడ మఱి యేమియు నొల్లక నిత్యకృత్యమై-
పూని ముకుందవందనము పుష్కరిణీభజనంబు సేయుచున్ ౨౩

ఉ. ఆయతరంగమందిరశయాను, భుజంగమతల్పు, యోగని
ద్రాయుతు, నిందిరారమణు, దైత్యవిభేదిఁ బురాణపూరుషుం
బాయక నిల్పుటన్ విమలభావము నొందిన నామనంబులో
నీయెడ గల్గు చిత్రము లనేకము లచ్చుగఁ దోఁచు నిచ్చలున్ ౨౪

క. అనిన భరద్వాజుఁడు గురుఁ
గనుఁగొని, మున్నిచట నున్నకాలంబున నీ
కనిన విశేషము లన్నియు,
వినిపింపుము నాకు-భువన వినుత చరిత్రా! ౨౫

సీ. నావుఁడు, నమ్ముని నాథుఁడు నిజశిష్యుఁ
గనుఁగొని పలికె లోకప్రసిద్ధి-
నెగడు నీ పుష్కరిణీ సమీపంబున,
సురసిద్ధముని యోగివరుల భక్తి
ననిశంబు సేవింపఁ దనరుతీర్థము లాఱు,
కడిమి తత్సలిలావగాహ మెలమిఁ
గావించిరేనియు గోవిప్రహంతలు
గురుదార గమనోత్సుకులు సువర్ణ-

తే. చోరకులు, కల్లుఁ ద్రావెడివారు- మఱియు
బహువిధము లైనదు స్తరపాతకములు
చేసినట్టి కుశీలురు, చిరవిశుద్ధిఁ
జెంది శుద్ధాత్ములై ప్రకాశింతు రెలమి, ౨౬

వ. ఇట్టి మహత్త్వంబు గలిగిన రంగధామంబునకుఁ జెంగట ద్విత్రి గవ్యూతి మాత్ర ప్రదేశ స్థితంబగు నశ్వత్థ వకుళాశ్రమజంబూక. బిల్వతీర్థంబులం దతివి చిత్రంబు లగు పురావృత్తంబులు గల వవి నీకెఱింగించెద-దత్తావధానుండవై యాకర్ణింపుము- ౨౭

మ. సతతానేక మునీంద్ర సేవితము, నశ్వత్థాఖ్య తీర్థంబునం,
దతిపుణ్యాధిక సద్వివేకఖని-సత్యజ్ఞాన సంపన్న ని
ర్గతకామాదివికామ మాధవియనంగా నొక్కతన్వంగి స
న్మతి సేసెం దప మంబుమధ్యమున సమ్యగ్వర్ణితాహారియై ౨౮

కి. ఈనెఱి బహుకాలము చనఁ
గా నొకనాఁ డంబరమునఁ గావుఁడు కావుం
డేనాచ్చితిఁ జచ్చితి నను
దీవాలాపంబు లుప్పతిలెఁ గడు దఱచై ౨౯

తే: అమ్మహాక్రందనము విని యాత్మఁ గరుణ
దనుక 'వెఱవకు వెఱవకు' మనుచు వదన
వనరుహం బెత్తి య త్తన్విఁ గనియె మింట
కాలభటపీడితాంగ నంగన నొకర్తు. ౩౦

క ఆలలనయుఁ దద్వచనము
లాలించె దయాళువైన యప్పుణ్యవతిం
బోలఁగఁ గనుఁగొని వెండియు
నాలోనన క్రిందుఁగాగ నాక్రోశించెన్ ౩౧

క. ఈ విధమున భయపరవశ
యై వడఁకుచుఁ గరుణపుట్టి యాక్రందనముం
గావించుదానితో స
ద్భావం బొనరంగ నాతపస్విని పలికెన్, ౨౧

క. ఓకామిని! నీవెవ్వతె,
వేకతమున వీరిచేత నీచందమునన్,
భీకరబాధలఁ బాల్పడి
పైకొని వేదనల బెండుపడఁగా పలసెన్, ౨౨

మ అకటా! చిత్తములం దొకింతయును సౌమ్యత్వంబుఁ బాటింప కే
విక నీయింతిని బట్టి నిర్దయతఁ బీడింపంగ మున్నెట్టివా
రికినైనం బ్రభవించునే మగువ లార్తింజెంది కూయంగ-వా
రక కాటించువిచార మిజ్జగము నిర్దాక్షిణ్య మయ్యెంగదే! ౨౪

క. ఈవనితఁ గృపామతివై
ప్రోవుము జగదీశ! సకలభూతాఘ హరా!
గోవింద! సుఖావహ స
ర్వావసమ ముకుంద నమ్ర మయ్యెద నీకున్, ౨౫

వ అని పలికి, ధర్మపత్నుల యగునమ్మాధవి నెమ్మనంబున నుమ్మలించుచు నూర కున్న, నాసమవర్తి కింకరులు ధర్మార్ధహితంబును గంభీరభావబంధురంబును నగు తద్వాక్యంబు లాకర్ణించి, యత్తపస్విని నిఖిలధర్మవిదుషిగా నెఱింగి ముదితహృదయులై- సాదరంబున నాబ్రహ్మవాదిని కిట్లనిరి, ౨౬

తే. ఓతపస్విని! సుకృత సంయుత చరిత్ర!
వినుము కడు నార్త యగుదీనిఁ గనికరింపు-
దొలఁగి, యే మివ్విధమున నత్యుగ్రభంగిఁ
గారిసంబులఁ బెట్టెడి కారణంబు- ౨౭

సీ, స్థావర జంగమాత్మక మైనభువనంబు
లన్నియుఁ బరమాత్ముఁ డాత్మవశము

గావించి, మఱి సర్వకార్యమ్ములందుఁ ద
ద్భావస్థుఁడై, వానిఁ బ్రత్యహంబు
చేష్టింపఁజేయు నశేషశుభాచర
ణంబులకును దాన సాక్షి యగుచుఁ,
గర్మాను రూపముల్ గా సుఖదుఃఖముల్
పరువడి ననుభవింపంగఁ బంపు

తే. నట్టి సర్వేశ్వరుని యాజ్ఞ నఖిలభూత
తతుల శాసింపఁ బ్రభుఁడైన దండధరుని
శాసనంబున, లోకసంచయమునందుఁ
దిరుగుచుందుము నేము తత్కింకరులము— ౩౮

క. పలుమఱు నిది యొనరింపని
కలుషంబులు లేవు,-పాపకరులకు బైఁబైఁ
దలమగు బాధలు పుణ్యా
త్ములకతిసౌఖ్యము నొనర్పుదుము మే మెపుడున్, ౩౯

వ అని శమనదూతలు చెప్పిన నప్పుణ్యవతి వారల కిట్లనియె, ౪౦

ఉ. తప్పదు మీరు పల్కిన విధం బఖిలంబును భూతకోటి, కి
చ్చొప్పు సనాతనంబు, విధిచోదితమై క్రియ యెట్టివారికిం
ద్రిప్ప వశంబె, యైనను మదీయసమీపముఁ జేరెఁగాన నే
నిప్పుడు దీనికైన నెగు లేగతినైనను మాన్పఁగాఁ దగున్. ౪౧

క. కావున నీసతి- సుగతికి
నేవిధమునఁ బోపు నెద్ది యే నొనరింతున్,
నావుడు మితభాషిణియగు
నావిమలచరిత్రతోడ నని రాదూతల్, ౪౨

ఆ.వె.సకలకర్తయయిన శార్ఙ్గిజశాసన మెవ్వఁ
డతకరింపఁ జూమనట్టి జడుఁడు

తన్మహోగ్రచక్రధారానలజ్వాల
లందు, మిడుతఁబోలె గ్రమందిపోవు, ౪౩

చ. అనవుడు, వారితోడ ననఘాత్మక మాధవి యిట్లనుం, బ్రియం
బనువచనంబ నిక్కమగునట్టిద, నిర్మలపుణ్య మించుకై
నను నొనరింపదే నిపుడు నాసుకృతం బొకయింత యిచ్చెదం
జెనకక దీనిఁ జోవిడిచి చిత్తములోఁ గలయార్తిఁ బాపుడీ ౪౪

చ. పొడమిన యార్తిమై, శరణుఁ బొందినవారి కృపాగుణంబు చూ
ప్పద, నభయంబు లిచ్చి వెలయం దనప్రాణము లిచ్చియైన-నె
ప్పఁడు నవరించు, నప్పురుషవర్యుఁడు పుణ్యుఁడు, తద్విధంబు చూ
ప్పదక యుపేక్షసేయు జడభావులు పొందుదు రుగ్రదుఃఖముల్, ౪౫

క. ధారుణిఁ ద్రిభువన పూజిత
మీరమ్యక్షేత్రరాజ, మిచ్చోటఁ బ్రియం
బార వసియించు ప్రాణులు
తోరపుదురితములఁ బాయుదురు నిమిషమునన్, ౪౬

క. అవిరళ విచిత్ర మహిమల
భువిఁ బ్రస్తుతికెక్కుఁ దీర్థములు సన్నిటికిం,
రవణింపఁగ నధికంబై
ప్రవిమలతీర్థంబు పరమ పావనలీలన్. ౪౭

తే. అట్టి యీపావనక్షేత్రమందు నియతి
నా వసించినయట్టి పుణ్యంబులోన,
సీలతాంగికి నిచ్చితి నేకదివస
సంచితంబైన సుకృతప్రపంచఫలము. ౪౮

వ. అని పలుకునంత నంతకుని స్వాంతకకింకరులచేత నాభీలంబులగుకాలపాశం
బులఁ గట్టువడి మొఱవెట్టుచున్న యమ్మాని బంధనిర్బంధనం బెడలి -
జంఘరనిరోధం బెడలి భాసిల్లు సుధాంశుకళ యునుంబోలెఁ జాల నొప్పారె—
నప్పు డతిదుర్గమం బగుతన్మార్గంబు మందారమంజరీ మరందబిందు తుంది

లంబు లగుమందానిలంబు పెల్లునఁ జల్లనై తనువుకుఁ దనుపొసంగె మొదలం గదిసి యదలించుచు భయంకరాకారులైన కింకరులు - సంతోషకారులై వారందఱు ప్రసన్నహృదయులై సౌహార్దంబుఁ బాటించి, సమంచిత మధుర భాషణంబుల సంతోషం బొనరించుచు ననుసరించి రనేకవిధప్రయోగంబులు దివ్యభోగంబులై యనురాగంబు సంపాదింపఁ బటుప్రహారలక్షితక్షత ప్రాయంబు నగుతత్కాయంబు పిగతవ్రణనికాయంబై యగణ్యలావణ్య రసభావ రాజితంబై తేజితం బగు శంబరారాతి చేతికరవాలంబులీలఁ బొలుపు దీపించె - నివ్విధంబున నసమానపుణ్యోదయ భాసమానయగు మానిని, తన్నెదనెదఁబొడఁగని సిద్ధమునినిచయంబు లుచితవచనంబుల సంభా వింప నమితవైభవంబున వైవస్వతసభాభవంబున కరిగియందు. ౪౯

క. కనుగొనియె నప్పురంధ్రీ
జనమణి, కృతజంతువివిధచయ సంయమనున్,
వినుతాచారప్రమునున్,
ఘనకల్మషదమను మహిపగమనున్ శమనున్, ౫౦

క. ఆసమవర్తియు, నత్తఱి
నాసుదఁతికిఁ దండ్రిబోలె ననుమోదకరుం
డై, సముపచారపూర్వము
గా సమ్మతిఁ బలికె మధురగంభీరోక్తిన్. ౫౧

సీ. నెలఁత యీభవమున నీచేసినట్టి ధ
ర్మంబు లే దొకలేశమాత్రమైన,
విను మిట, క్రిందటఁ జనిన పంద్రెండవ
జన్మంబునందు నీసదనమునకు
హరిభక్తుఁ డగుసిద్ధవరుఁ డొకఁ డేతెంచి
యుండె సౌఖ్యంబున నొక్కరాత్రి
తత్సన్నిధానజాతప్రభావమున నీ
కటుగల్గె సాధుసమాగమంబు

తే. తన్నిదానోచిత సుకృతత్వమున రంగ
సీమ నశ్వత్థతీర్థవాసియును బ్రహ్మ

వాదియును నైసమాధవి సాదరమున
నొసఁగె, నొకదిన మచటఁ దా నుస్నఫలము ౫౨

క. చెందిన దత్పుణ్యము వసి
గం దరుణీ యుండు మింకఁ, గల్పక్షయమౌ
నందాఁక బ్రహ్మలోకము
నం దవ్యయదివ్యసుఖసమన్వితవగుచున్. ౫౩

చ. అని శమనుండు వీడ్కొలుప నారమణీమణి సమ్మదంబు నె
మ్మనమున నింద, నుద్యదహిమద్యుతి మండలతుగ్విడంబి నూ
తనమణిమాలికా విలసితం బగుదివ్యవిమాన మెక్కి-పెం
పెనయఁగ బ్రహ్మలోకమున కేఁగె సురల్ వెఱఁగంది చూడఁగన్. ౫౪

క. మాధవియు నిచట ననితర
సాధారణ మైనతపము సలుపుచుఁ గరుణాం
భోధిఁ గమలాధిపతి-నా
రాధించి తదీయ చిరపదస్థితి నొందెన్. ౫౫

వ. ఇ ట్లఖిలభువనవిశ్రుతంబైన యశ్వత్థతీర్థంబునఁ గృతస్నానుండవై దేవర్షి పితృతర్పణంబు లొనర్పుము, ఈయితిహాసంబు వినువారికి దురితనిరాసంబును - బుణ్యలోకశాశ్వతనివాసంబును, సిద్ధించు నని పలికి వాల్మీకి మునీంద్రుండు వెండియు నేమి వినవలతు వని యడిగిన నమ్మహాత్మునకు భరద్వాజుం డిట్లనియె - ౫౬

క. ఘనదురితక్షయకరమై
చను నీయశ్వత్థతీర్థసామర్థ్యం బిం
కను విన వేడుక య య్యెడి
మునివర నా కెఱుఁగఁ జెప్పుము కృపామతివై, ౫౭

వ, అనిన నత్తపస్విపరేణ్యుం డతని కిట్లనియె, ౫౮

తే. వినుము వెండియు నొకపురావృత్త మనఘ !
మును మఁ గణ్వుండు నా నొప్పు మునివరుండు,

భక్తి నిండార శ్రీరంగపతి భజించు
కౌతుకంబునఁ దలిర్ప నక్కడికి నడచి - ౭౯

శా. ఆలోలామల చారు కోమలతరంగాహన్యమానోల్లస
త్కూలానోకహపుంజ మంజుసుమనోగుచ్ఛావళీ సుప్తమ
త్తాళివ్రాతఁ, గవేరజాతఁ, గని యం దర్థిం గృతస్నానుడై,
యాలోకించె ననంతరంబ మునిభావాసాంగమున్ రంగమున్ ౬౦

వ. కని తదభ్యంతరంబుఁ బ్రవేశించి యందు, ౬౧

క. శరదమలకమలలోచను,
దరదళిత సరోజధాము ధామశ్యామున్
దరహాస వికసితాననుఁ,
గరుణానిధి, శేషశాయిఁ గామితదాయిన్ ౬౨

క. సందర్శించి ప్రణామము
లందంద యొనర్చి తనుఁ గృతార్థునిఁగాఁగం
డెందంబున దలఁచుచు ద
న్మందిరము వినిర్గమించి మది ముద మొదవన్ ౬౩

సీ. సజల ధారాధర శ్యామ కోమలగాత్రుఁ
బ్రత్యూప ధవళాబ్జపత్రనేత్రు,
మహనీయ కురువింద మణికుండలోద్భాసు
మధురాధరోల్లసన్మందహాసు,
రత్నహారాంకితోరస్థ్సలపరిణాము,
దివ్యాంగదోజ్జ్వల దీర్ఘబాహుఁ,
గటివిస్ఫురత్పీత కౌశేయపరిధాను,
బరిపూర్ణయౌవన భ్రాజమాను,

తే. ధీరు నఖిలైకమోహనాకారు నాత్మ
సన్నిభ ద్విత్రిభక్తానుచర సమేతుఁ,

గాంతుఁ, గాంతాసమన్వితుఁ గనియె నొక్క-
దివ్యపురుషునిఁ గావేరితీరమునను. ౬౪

మ. కని శ్రీరంగమునన్ భుజంగమసురంగద్భోగశయ్యాతలం
బునఁ దా నప్పుడు చూచునట్టి హరి మెప్పుం దేజమున్ మూర్తిచొ
ప్పును-శృంగారవిలాసభంగులు, నెపంబుల్ వేరులే కమ్మహా
త్మునియొండొక్కటఁ గానఁగాఁబడిన నుమ్మాతామ్మభుతస్వాంతుఁడై, ౬౫

క. ఇటఁ జూచితి వెతలితి, మఱి
యెటుజన కదెవచ్చి కంటి నీలోనన, తా
నెటనుండి వచ్చెనొకో యి
చ్చటి కప్పరమేశుఁ డనుచు సంశయమతియై, ౬౬

ఆ.వె. కదియఁ జోయి నిజముగా విలోకించెదఁ
గాక యనుచుఁ గౌతుకమున జేరి
పరగుఁ దత్ప్రభావపరిమోహితాత్ముఁడై
యెఱుఁగలేక మఱియు మఱియుఁ జూచి. ౬౭

క. కాఁ డితఁడు రంగవిభుఁడను,
వేఁడిమి మఱి యట్టివాఁడు వేఱొకఁ డనుచున్,
లేఁడను నిత్తెఱఁగున నవు
గాఁడని భావింపఁ గొఱఁదిగాక జడుండై, ౬౮

శా. ఆందోళించుచు నివ్విధిన్ మునిఁగి చింతాక్రాంతుఁడై నిల్చినన్,
మందస్మేరముఖారవిందుఁ డగుచున్ లక్ష్మీశ్వరుం డాతప
స్విం, దేజోమహితుం, గృపాసహితుఁడై వీక్షించి, ధారాధరా
మందధ్వాన గభీరవాక్యముల సన్మానంబుగా నిట్లనున్, ౬౯

తే. ఏమి చింతించుచున్నాఁడవో, మునీంద్ర!
నీమనంబున నది మాకు నిజముఁ జెప్పఁ
బొసఁగు నేనియుఁ జెప్పుము పొసఁగకున్న
నుండఁగానిమ్ము నీయందు నున్నపగిది, ౭౦

వ, అని యాదేవుండు పలికినఁ జెవుల నమృతంబులు చిలికిన చందంబున నమందానందంబు నొందిన యమ్మకుందున కందంద యభివందనం బాచరించి, కృతాంజలియై యమ్మునికుంజరుం డిట్లనియె, ౨౧

క. అనుపమభోగితల్పగతు నంచితహాసవికస్వరాననున్,
నిను నఖిలేశ నిప్పు డిటు నెమ్మిఁ గనుంగొనవచ్చి, యింతలో
నన యిచటం బ్రియానుగసనాథు నుదారవిహారశీలుఁ జ
య్యనఁ గని యీతఁ డెవ్వఁడొకొ యంచు మనంబున జింతనొందితిన్ ౨౨

ఉ. నీవె యతండ వౌదువని నిర్ణయబుద్ధి జనించె నాకుఁ బ
ద్మావర! యిప్పు డిందుఁ గడు ధన్యుఁడనైతిఁ గృతార్థ మయ్యె—నా
జీవిత, మీభవంబు వెలసెన్ నిను సర్వగు వేదవేద్యు నా
త్రావనలోలు దేవమయు నచ్చట నచ్చటఁ జూడఁ గల్గుటన్, ౨౩

ఉ. నావుడు నంబుజాక్షుఁ డెలనవ్వుఁ దలిర్పఁగ నమ్మునీంద్రుతో,
నీవిమలప్రదేశ మతిహృద్యము నాకు సుధాసమంబు సం
భావనమైన యీవనియుఁ బ్రాణపదం బదిగావునన్, సుఖ
శ్రీ విలసిల్ల నీతటి వసించితి మంగళరంగశాయినై, ౨౪

ఉ. ఇచ్చటఁ దక్కఁ దక్కనెడ లెవ్వియు నామదికిన్ రుచింపమిం
బొచ్చెము లేక యీతటినిపొంత వనాంతములందుఁ, జాలఁ గ
న్నిచ్చకు వచ్చుకందువల నిచ్చపలాక్షియు నేను నిచ్చలున్
మచ్చికమైఁ జరింతుము సమంచిత సౌఖ్య విహారలీలలన్, ౨౫

వ. అని చెప్పి, యప్పద్మవాసినీసహచరుం డనుచరసహితుండై యల్లనల్లన జని ముందట సమదవిలాసభవనం బగువనంబుఁ జొచ్చి-యం దరవిరుల మధుకులంబులు పరువంబులై కదలి తరువం బొడమిన తరువు గురువంబునకు మురువుఁ జూపుకురువకంబుల పొరువులును, దరుణారుణశ్రీకంబులై సైకింబు లగు కేసరంబుల యానీకంబుల నఖిలలోకవిలోకనంబులకు నుత్సేకంబు నెఱపు నశోకంబుల జోకలను, వికసనావసరంబుల నలివిసరంబులకు సుసరంబులై రసంబులకు మాసరంబుల లగు కేసరంబు నతిభాసురంబు లగుపరిసరీలను

కోపంబుల ఎరహుల నేఁపం బురికొను కుసుమచాపంబుజోడు నాటోపంబు నపు ససురూపం బగుకలికాకలాపంబున దీపించు నీపంబుల సమీపంబులను పలరాజు కొలువుమేడల జాడ లలితంబులై ప్రోదలఁ గ్రీడల కేవరించుచు, నీడలె క్రీనీడలగు సారంబులగు నమృతపూరంబులచవి నిరసించు నిరాతపంబుల తోరంబు లగునారికేళంబులచేరువులను, నాగలతాయోగంబులఁ బొదలి దళాభోగంబుల పరాగంబు లడర నుద్వేగంబుల భోగులకు ననురాగంబు లొసఁగు పూగంబులవెస భాగంబు లగుసుజాతంబులగు కలికాజాతంబులకు-నికేతనంబులై, కాముకవ్రాతంబులచేతంబు లుత్కళికాసమేతంబుగాఁ జేయు పారిజాతంబుల యీతలాతలను సరసాలవాలంబులై హరినీలంబుల బోలు ఫల జాలంబుల విశాలంబులగుజంబూ సాలంబుల మూలంబులను వనదేవతా కేళికందుకంబులనం గేళీకందుకంబుల పొందున సుగంధకబిందుఫలకంబుల పొందునఁ బొల్చుతిందుకంబుల కందువలను, బసిఁడి బొమ్మల చెలువంబు గల కొమ్మల కస్తూరి చెమ్మలుగల కుచమ్ముల తమ్ముల వెసివాసనల తెమ్మ లగుఫలమ్ముల వీఁగు కొమ్మలు గల నిమ్మల యిమ్ములను, శుభాకారంబులు గల తీరంబుల విహారంబులకు నిజాగారంబు లగు సహకారంబుల కనతి దూరంబులను వలపుల పెంటలయి యలరు తేనియతేటలాని చెలఁగు తేఁటిజూటుల పాటలంబు లీనమి సయ్యాటలం గొని యాటలకుం దగి తుంటవిల్తు నాటకశాల లన పికవిహారంబునకుఁ బాటలై యభినవారుణ ప్రభాపాటలంబు లగు-పాటలంబుల చాటులను గనకసముజ్జ్వలంబు లగు దలంబుల నెసఁగి దలంబు లగుపరిమళంబు లగుఫలంబున- వనచర కులంబునకు బలంబుల నొసఁగు కంటకీఫలంబుల సవిధంబులను, అంగజు నిషంగంబు లన సురంగంబులగు కుసుమ కుడుంగంబులఁ బరిమళానుషంగంబులై యతిరాగ రసోత్తరంబులుఁగాఁ జెలంగు భృంగంబులకుఁ గ్రీడారంగంబులసంగతి, నలికంబులఁ దిలకంబులఁ గల కంబుకంఠుల యలికంబుల తేటి నలకంబుల బొలుచు నలకంబులకు నలవడునలరుల కులంబు లగు తిలకంబుల కెలఁకులను, విటజనంబుల మనంబుల ఘనంబు లగు మానధనంబు లనుదినంబును గొనబఱచు మరునిపరిజనంబులకు నావటంబు లగు వటంబుల కుఱంగటలను, జరగు వలపులఁ దగిలి మరిగి-తిరుగు తెఱవల మొఱంగి సరగున సురిగి యరుగఁ బ్రియులకు వెరగు లగు సురగుల సొరుగులను, సొంపు దింపక విఱిగియు విరుల పెంపుకలిమి

చంపకమాన దనితలంపక పౌలయు మధుపదంపతులకు మనః కంపంబు లగు చంపకంబుల, శ్రీమంతులను కళావంతుల వింతలీలలను వలవంతలం దగిలింప వలవంతు లగునింతులచే బంతులకు వంతులు వడిన సేమంతుల పొంతలను సజ్జకంబు లగువలవుల నిజ్జగంబుల వాసించుచుఁ గ్రొజ్జిగురు మిగులు గొజ్జెంగల పజ్జలను, రతితంత్రవేదుల విశేషంబులకుఁ బ్రోదు లై మలయజామోదు లగు విరవాదులును, విరవాదులపొదల వీథులఁ జల్ల తెమ్మెరల నల్లలనాడు పూరెల్లులఁ దూఁగు తేఁటి పిల్లలకుఁ బల్లవులు కొల్ల లొసఁగుచు నెల్లలకు మొల్లలవల్లుల మొల్లంబు లలర మెలఁగుచు నసమ విలాసాభిరామ యగు నారామకు నారామ సీమంతతరుసంతానంబు నంతంతం జూపుచు నయ్యాప్రదేశంబుల- ౭౬

క. కురువిందరదన, తత్ప్రియ
సరవిం దలమోఁగు తేఁటిజవరాలికి ముం
దరవిందని పరు వందిన
కురువిందలఁ జూపె నొక్కకురువిందలకున్ ౭౭

క. మాకందము కడు నిదిర
మ్మా! కందము డాయఁ బోయి మంజీరులకున్
మాకందఁగ వెలఁ గవిసిన
మాకందము మగువ మధురమాకంద మిలన్ ౭౮

క. వారములగు నతనుని పరి
వారములకు నెలవు లగుచు వాలెడి సమ్య
గ్వారము వారముదన, కై
వారము లొనరింప సింధువారము లతివా! ౭౯

క. దవనము-వనలక్ష్మివినో
దవనము, సదవనము - విరహతాపాంధులకున్
భువనము లలరఁగ మెలఁగెడి
భవనమున కపూర్వజన్మభవనము తన్వీ! ౮౦

క. శుకముఖరుచిగల తపనాం
శుకముల నెఱి మెఱయు నంగజునితటభవనాం

శుకసులన మెఱయు నవకిం
శుకములఁ గనుఁగొనుము రాజశుకమృదువాణీ ! ౮౧

క. కావలియై మధుకరపృథు
కావలి చరియించు నీలతాగ్రంబున నీ
కావలి విరు లేటికి మన
కావలిదెస చంపకముల కరుగుద మబలా ! ౮౨

క. కలవాణి ప్రేంఖణము ప్రోఁ
కల వాసంతికలఁ గోయఁగా నిక్కెదు నీ
కలవాటు గాదు ప్రాఁకం
గలవా చెలువారు వాని కడకొమ్మలకున్, ౮౩

వ. అనుచు నీచందంబుల విహారంబులు డెందంబున కానందంబు నొందింప
నయ్యాదిమదంపతులు చరియించు సమయంబున - ౮౪

సీ. పరువైన కంకేళివిరుల శాఖల ప్రేలి
తొరఁగు పుప్పొడి ధూళిఁ దూలఁ గోలి,
మాధవీకుసుమాళి మకరందములు గ్రోలి,
భ్రమరించు మత్తాళి రవము నేలి,
ప్రియులతో రతికేళిఁ బెనఁగి యింపుల సోలి,
యలయుపాలము నోలి దెలుపఁ జాలి,
కొనియాడఁదగు మేలికొలఁకులపై వ్రాలి,
వీచిపంక్తుల గ్రాలి వేడ్కఁ దేలి,
తే. కలితపరిపాకభరశాలి కలమశాలి
కలశసందోహములఁ దూలి, గగనపాలి
మెలఁగె విరహాతురులపాలి మేటిజాలి
చందనపుఁ గొండఁ బుట్టిన చల్లగాలి, ౮౫

ఉ. అనునుగాలి సోకునఁ బ్రియం బెసఁగం బులకాంకురావళుల్,
మేనుల నుల్లసిల్లు మధుమేదుర వంజుల మంజరీచర

న్మానిత చంచరీకలలనా కలనాద నవీనగానముల్.
వీనుల విందు సేయ, నరవిందనివాసినియున్ ముకుందుఁడున్. ౧౬

సీ. నిక్కువంబై నిక్కి మక్కువఁ బ్రియురాండ్ర
నిక్కువలకు దార్చు జక్కవలను,
నంచితలీలమై నంచలువడియురా
యంచలఁ గ్రీడించు నంచగములఁ,
దమ్ముల నిమ్ములఁ గమ్ముతేనెలు గ్రోలి
ఝుమ్ము ఝుమ్మని మ్రోయు తుమ్మెదలను,
గ్రాలుఁగంటుల నిడువాలు కన్నుల డాలు
నేలు లీలల వాలు వాలుఁగులను -

తే. జలువ వలపుల నలరుల గెలువఁ జాలు
చెలువ మసఁగిన కన్నె చెంగలువ విరుల
మహితమై పూర్ణిమా చంద్రమండలంబు
కరణిఁ జెన్నారు చంద్రపుష్కరిణిఁ గలసి, ౧౭

క. సారసమంచిత కోమల
సారస నాళాంకురములు చవిగొను మనుచున్
సారముగా విహరించెడు
సారసములఁ జూడు చకిత సారంగాక్షీ! ౧౮

క. చిత్తములు గలఁగ విరహుల
మొత్తముల గదల్చివేయ మొనయ మరునకుం
గ్రొత్తమ్ములైన తమ్ముల
నెత్తములై మెఱయు తేటినికరము గంటే! ౧౯

క. తోయజ దళలోచన తన
తోయంబులలోనఁ దోయతోయము నెలమిం
గాయము దొలఁపెడి సుకృతని
కాయము నీసరసి సురనికాయము కనుపున్. ౨౦

వ. అనుచు నెమ్మనంబున జలకేళీ కౌతుకంబున నా లీలావతి కేలు కేలం గీలించి
యాసరసిఁ దఱియంజొచ్చు సమయంబున - ౯౧

చ. జలనిధికన్య లేఁగురులు షట్పద పంక్తులు, గ్రాలుఁగన్నులుం
గలువలు నవ్వుదేరెడి మొగంబును బద్మము, బాహుయుగ్మమున్
నలికపుఁదూడు దీవలు, ఘనస్తనకుంభయుగంబుఁ జక్రవా
కలుఁ, దనలోన వీడువడి కన్నులపండు వొనర్చెఁ జక్రికిన్. ౯౨

వ. అప్పుడు - ౯౩

సీ. ఉరువడి నెదురీదు నొకచోట వెసఁ గ్రుంకి
తలచూప కొక్కింత తడ వడంగు,
నడుమను మీఁద వెల్వడు నెటనైన
మొనసి చీరఁగ మాఱుమొగము సేయు,
మేను వంచన దాఁచి మీఁదికిఁ బదమెత్తు
రాజహంసలతోడ రాయిడించు,
సుడివడి కమలముల్ వడి ద్రిప్పుబలమున
నుదకంబు తనకురా నొత్తి తిగుచు.

తే. దనరు పద్మాసనస్థుఁడై మునియుఁబోలె
నిగుడు జపమున నెక్కుడు నేర్పు చూపు,
నురగతల్పుఁడు చంద్ర పుష్కరిణియందు
జలధిసుత గూడి జలకేళి సల్పునపుడు. ౯౪

తే. తడిసి యంటినజిలుఁగులోఁ దళుకుచూపు
నిజనితంబంబుపైఁ జూడ్కి నిలుపు చక్రి
నేత్రమున లక్ష్మి చల్లిన సీరధార
యతని ముఖపద్మమున నాళమనఁగ వెలసె. ౯౫

చ. సురుచిరలీల లక్ష్మి వెసఁజూచి నభంబున మండలాకృతిం
దిరుగు మరాళపంక్తిపయి దృష్టి నిగిడ్చిన నొప్పె ధారుణీ

ధరునసు నింపు పెంపెసఁగఁ దద్దయు దేవతనీలదండమున్
దిరముగ సంఘటించి తగఁ దెచ్చిన సల్లనియొల్లెయో యనన్. ౯౬

చ. ఉరుతరపద్మనాళముల నొండొరు ర్రేయుచు డాసి వీడ్వడం
బొరిఁబొరి మోములన్ సలిలపూరము చిమ్ముచు నీరజంబులం
దొరలెడు పుష్పొడుల్ నెనయఁ దోయరుహంబులఁ జల్లి నవ్వుచున్
హరియును లక్ష్మియున్ జలవిహారము సల్పిరి నిండువేడ్కలన్ ౯౭

క. ఈరీతి లోకగురులగు
వారిరువురు నందుఁ గొంతవడి సుఖలీలన్
గూరి పదంపడి సలిలవి
హారముఁ జాలించి వెడలి రాసమయమునన్. ౯౮

క. ఇందిరకుంతలముల తుద
లం దొరఁగెడి జలకణంబు లమరెం భ్రమరీ
బృంద మతిపానవశమున
గ్రందుగ మకరందరసము గ్రక్కెడుమాడ్కిన్ ౯౯

ఉ. పెన్నెఱివేణిఁ గ్రొన్ననల పెంపున సొంపు నటించు పాపటం
జిన్నిమెఱుంగుముత్యముల చెన్నున నిద్దఁపుఁ జన్నుదోయిపైఁ
బన్నిన పచ్చకప్పురపు బన్నసరంబులలీలఁ జాల నొ
ప్పె న్నెఱిఁ దెల్పుమీఱు జలబిందువు లంబుధిరాజకన్యకున్ ౧౦౦

ఉ. అంత ననర్ఘరత్నరచితాభరణంబులు, దివ్యవాసనా
వంతములైన పూఁతలును వాడని మాల్యములన్ సువర్ణస
త్కాంతిఁ దలిర్చు చేలములు గైకొని యొప్పిరి విష్ణుఁడున్ రమా
కాంతయు నిత్యమంగళ జగన్నుత వేష విశేషలీలలన్ ౧౦౧

ఉ. అత్తెఱి నచ్చటం గల మహాముని లందఱు గాంచి విస్మయా
యత్త మనస్కులై ప్రమద మారఁగ నొండొరుతోడ నద్గుణో
దాత్త చరిత్రుఁడైన యితఁ డారయ నెవ్వఁడొ కాక సర్వలో
కోత్తరుఁడైన రంగవిభుఁడో మును గాంచి యెఱుఁగ మీఘనున్ ౧౦౨

క. అని తలపోయఁగ జలజా
సనజనకుం డచటు వాసి చయ్యనఁ జనియెం
గనకాచల శృంగసుగతి
ఘన మగు నశ్వత్థతరువు గల తీర్థముకై ౧౦౩

ఉ. ఆ మహనీయభూజమున కర్థి నమర్త్యులు నస్మునీంద్రులున్
నేమముతోడ నొప్పెసఁగ నించిన పూజల వృత్తిఁ జూచుచుం
దామరసాక్షుఁ డిందిరయుఁ దానును దోఁ జనుదెంచు పూరుష
స్తోమముఁ దన్మహీరుహముఁ జొచ్చె మునుల్ వెఱఁగంది చూడఁగన్, ౧౦౪

వ. ఇత్తెఱంగున నత్తరురాజంబునం దారంగమందిరుం డంతర్ధానంబు నొందిన నాదేవునిఁ గానక పరిదేవనంబు సేయుచు నితాంత సంతప్తమానసుండై కణ్వుఁడు బహువత్సరంబు లాహారంబు పరిహరించి యన్నెలవుఁ బాయ కున్నంత - ననంతరంబ యంతరిక్షంబున నొక్కవాక్యం బిట్లని వినంబడియె. ౧౦౫

ఉ. మానుము రోదనంబు బుధమాన్య చరిత్ర; పవిత్రపావనం
బై నుతికెక్కు నీచలదళాహ్వయతీర్థ జలావగాహనం
బూనిన వేడ్క సేయుజను లొక్కటి మిక్కుటమైన పాప సం
తానము పాసి పొందుదు రుదార సుఖప్రద మత్పదస్థితిన్. ౧౦౬

వ. విను మఖిల పురుషార్థ ప్రదాన సమర్థం బగు నీ తీర్థంబునందు ధేనుదానంబు సేయు మానవుడు దురిత నిరాకరిష్ణుండై విష్ణులోకంబు నొందు, నన్నదానం బపవర్గ సుఖనిదానంబు, తిలదానం బేకవింశతికులోద్ధరణంబు, సువర్ణదానం బుత్తమవర్ణ హత్యానివృత్తి హేతుభూతంబ, యేకరాత్రోపవాసం బపస్మృతి నిరాసంబు గావున - నీ విచ్చట మదర్చనంబు గావించి - రంగమందిరంబున నస్మ్న సందర్శింపు, మట్లయిన నక్షుద్రంబు లగుభద్రంబు లొందెద వని యానతిచ్చి యూరకుండిన - కణ్వుం డప్పుండరీకాక్షు శాసనంబున - బ్రహ్మోపాసనా పరాయణుండై చిరకాలం బుండె నని చెప్పి వెండియు వాల్మీక మునీంద్రుండు భరద్వాజున కిట్లనియె ౧౦౭

ఉ. అనఘ విహంగ కేసరాహ్వయ విఖ్యా(త)
నొసగు తీర్థ మచటి నొకటి గలదు

కోరి ఏన్నఁ జేరుకొన్న విలోకింపఁ
గను దలంగు సఖలకల్మషములు. ౧౦౭

క. నిరుపమ నితాంత మహిమం
బరఁగెడి తత్తీర్థమున, సమంచిత నిష్ఠా
నిరతుఁడు కాశ్యపుఁ డనియెడు
ధరణీసురవరుఁడు మున్న తప మొనరింపన్ ౧౦౮

చ అరినరపాల దుర్మదమహాగజ కేసరి, కాశికాపురీ
శ్వరుఁడు, సుకీర్తినాఁ బరఁగువాఁ డొకనా డట నేఁగుదెంచి చె
చ్చెర బహురోగపీడలఁ గృశించి నశించెడియాత్మసేనఁ ద
త్పరమ పవిత్రతీర్థసవిధంబునఁ గావఁగ బూని సమ్మతిన్. ౧౧౦

క. ఆ విధమున చతురంగబ
లావృతుఁడై వచ్చి తనకు నభివందనముం
గావించి యున్న యావసు
ధావరునకు నత్తపస్వి తా నిట్లనియెన్. ౧౧౧

ఉ. ఎయ్యెడనుండి వచ్చి తిట కెవ్వఁడ వీవు-భవన్మనోరథం
బెయ్యది చెప్పు మిప్పు డది యిందును నందును బోల దుర్లభం
బెయ్యది యైనఁ గైకొని రయంబున నేనొనరింతు నీపయిన్
నెయ్యము మించె నాకు ధరణీవర నావుడు నమ్మునీంద్రుతోన్ ౧౧౨

క. అతనికి నిట్లను కాశీ
పతి యగుసుబలాత్మభవుఁడఁ బరమసుకీర్తిన్
సుతపుణ్యతీర్థసేవా
వ్రతనిష్ఠానిరతి నిటకు వచ్చితి ననుడున్. ౧౧౩

చ. మునివరుఁ డిట్లనుం బరమపుణ్యా యెఱుంగుమ మున్ను నేను నీ
జనకుఁ సాన్నృపాలునకు సౌఖ్యమె రాజ్యముతో నొనర్ప కీ
పనుపమ సర్వభోగముల నంచక యీగతిఁ గందమూలభో
జనములఁ గుందుతాపసుల జాడల నొంటిఁ జరింప నేటికిన్. ౧౧౪

చ. అనిన సుకీర్తి యిట్లను సుదాత్తగుణోజ్జ్వల ! నీయనుగ్రహం
బునఁ గుశలంబు మానుబలభూపతికిన్ భవదీయపాద వం
దనమును జేసి యేను గడుధన్యుఁడ నైతి మదీప్సితంబు లె
ల్లను ఫలియించె నీకృపఁ దలంపఁగఁ జోద్యము లెవ్వి యీయెడన్ ౧౧౫

క. నానాటికి నా సేనలు
నానారోగములచేత నవసి కృశింపం
గా నది మాన్పెదుకొఱకై
యీనది చేరువకు వారి నెల్లను గొనుచున్. ౧౧౬

క. చనుదెంచి మీతపోవన
మున కలజడి యొదవు ననెడుబుద్ధిని బాహ్యం
బున వారి నునిచి వచ్చితి
మునివర ! నీ చరణ కమలములు దర్శింపన్. ౧౧౭

ఆ.వె. అనిన నమ్మునీంద్రుఁ డవనీశ ! నీ బుద్ధి
బలము నెఱయ నఖిలబలములకును
హితముగా నొనర్చి తీ వది కడులెస్స
చెప్పు మింక నేమి సేయ వలయు. ౧౧౮

చ. అనుటయు సమ్మదం బొదవ నానృపుఁ డిట్లను నీపదాబ్జముల్
గనుఁగొనఁ గల్గినప్పుడ తలంగె మదీయబలామయవ్యథల్
పెనఁగు దురాశఁ గట్టువడి భీకరసంసృతిసాగరంబునన్
మునిగెడు నాకు నేదిగతి ముందట నట్టిహితంబుఁ జెప్పవే ! ౧౧౯

వ. అనిన నానృపోత్తమున కాతపోధన సత్తముం డిట్లనియె. ౧౨౦

క. శ్రీవిభుని భక్తవత్సలు
గోవిందుని విశ్వలోకగురు నతిభక్తిన్
సేవింపని మహాత్ములు
భూవర ! సంసారముక్తిఁ బొందం గలరె ! ౧౨౧

క. కావున సప్పరమేశ్వరుఁ
దావనమతిఁ బూజ సేసి పడయుము ముక్తిన్
శ్రీవనితాసంగమ సం
ధావిత నిరవధిక సౌఖ్యపరిణతి నధిపా! ౧౨౨

ఆ.వె. అనినఁ బరమయోగిజనులకు నైనను
తలఁపులోన నిలుపఁ దరముగాని
యట్టిదేవు చంచలాత్ముఁడనైన నేఁ
గొలుచు టెట్లు భయము గెలుచు టెట్లు ౧౨౩

సీ. నావుడు నన్నరనాథుతో సంయమి
శ్రేష్ఠుఁ డిట్లను- నీవు చెప్పినట్లు
యెంతటివారికి నెఱుఁగ శక్యముగాక
దీపించు బ్రహ్మస్వరూపి యగుచు
వెలసిన యమ్మహావిష్ణుఁ డేకాగ్ర భా
వమునఁ దన్నుఁ భజించువారిఁ బ్రోవ
వలసి సత్కరుణమై వాసుదేవాదిక
మూర్తులు దాల్చి యంబుజభవాది
తే. సురలు నడులును సన్మునివరులు గొలువఁ
బరఁగు తద్దివ్య భవ్యరూపంబులందు
నీమనం బెందు నిశ్చలనియతి నిలిచె
నది భజింపుము సిద్ధించు నభిమతములు. ౧౨౪

క. అదియునుంగాక- ౧౨౫

తే. దారు ధాతు శిలానిర్మితంబు లైన
యట్టి హరిబింబములను ధరాధినాథ
దివ్యదేశంబు లెఱుఁగు మద్దేవుఁ డందు
నిత్యసన్నిహితాత్ముఁడై నిలుచుఁ గాన ౧౨౬

మ. గురులీలన్ విరజోపకంఠమున వైకుంఠంబునన్- దివ్య
సురభోగంబుల నిందిరాసహితుఁడై శోభిల్లు నేభంగిఁ బ

హరి, యాభంగిన తత్కావేరతనయాభ్యర్ణంబునన్ మంగళా
కరరంగస్మృబిధామ ముఖ్యముగ సౌఖ్యశ్రీలఁ జెన్నారెడిన్. ౧౨౭

క. చను మచ్చోటికి సనుటయు
ననుమోద మెలర్ప నృపతి యమ్మునిపతికిన్
వినయమున మ్రొక్కి నాతో
ననఘా! చనుదేరవలయు నచటికి నీవున్ ౧౨౮

వ. అని ప్రార్థించిన నప్పార్థివుపలుకు లాకర్ణించి మేదుర ప్రభావభాసురుం డగు నమ్మునిజనాగ్రేసరుండు. ౧౨౯

శా. ఛత్రంబుం జలపూర్ణపాత్రము సుదంచద్వేత్రమున్ బూని స
చ్ఛాత్రశ్రేణి మహ ప్రయోగసరణుల్ చర్చించుచుం దోడరా,
గాత్రస్ఫూర్తులు దిక్కులం బరఁగ రంగస్వామి దర్శింప నా
ధాత్రీనాయకు ముందటం జనియె సద్భావౌత్కుతుకోల్లాసియై. ౧౩౦

క. పటుగతి నమ్ముని పిఱుఁదం
జటులగజద్విరదతురగసంకులసేనా
పటలావృతుఁ డయి చనియెం
బటహధ్వను లెసఁగ భూమిపతియుం బ్రీతిన్. ౧౩౧

వ. ఇత్తెఱంగునఁ జని తన్మార్గంబున నపవర్గదానసమర్థం బగు జంబూతీర్థంబు గదిసి రప్పు డప్పురమ తపోధనుండు మహీధవున కిట్లనియె. ౧౩౨

క. ఈ తీర్థము బహుదురిత
వ్రాత తమఃపటల చటులవనజ వనహిత
ద్యోతము జంబూక సమా
ఖ్యాతము శుభసలిలదేవఖాతము చూపా, ౧౩౩

క. పంచిన శాఖాశిఖరక
దంబకుచే సంఘఫలపథం బొదయుచు లో
కంబులు పొగడఁగ నిట నొక
జంబూతరు వమరు నమర సంపూజితమై. ౧౩౪

ఉ. దేవవిభుండు మున్ను గడుతెంపున వృత్రుని జంపి, బ్రహ్మహ
త్యావృజినంబుచే నిజపదస్థితిఁ బాసి వినష్టతేజుఁడై
యేవిధ మింక నీదురిత మీగుదునంచుఁ బ్రతప్తచిత్తుడై
వావిరి బిట్టుత్రిమ్మఱియె వార్ధిపరీత వసుంధరాస్థలిన్. ౧౩౫

క. మిగిలిన పాపభయంబునఁ
బొగులుచు నయ్యింద్రుఁ డెందుఁ బోయిననైనన్
జగతీశ బ్రహ్మహత్యయు
నిగిడెన్ వెనువెంటఁ దోడనీడయుఁ బోలెన్. ౧౩౬

వ. అది గనుంగొని తల్లడ మడరఁ బాకశాసనుండు వారిజాసను సమ్ముఖమ్మున
కేగి బ్రణమిల్లి తనతెఱం గెల్లఁ జెప్ప నప్పితామహుం డతని కిట్లనియె. ౧౩౭

చ. పరము ననంతు నచ్యుతు నపారకృపామృతపూరసింధు, సిం
ధురవరదున్ బ్రఫుల్ల నవతోయజలోచను నాశ్రయింపు త
త్పరిచిత దివ్యదేశములు పావనతీర్థములుం దదీయబం
ధురశుభనామకీర్తనము దుస్తర పాపనిదాఘమేఘముల్. ౧౩౮

వ. అని యుపదేశించిన వాసవుండు వారిజాసను శాసనంబునఁ దీర్థోపాసనం
బొనరించుచు విమలపుష్కరంబగు పుష్కరంబున నెనిమిది వత్సరంబులు
నపారమహిమోదారంబగు గంగాద్వారంబునఁ బదివత్సరంబు లుపవసించి
భువనమాన్యయగు కళిందకన్యయం దఖిల మునికీర్తితంబులగు తీర్థంబులాడి
యగణ్య పుణ్యాలవాలంబగు సాలగ్రామశైలంబున నారాయణు నారాధించి-
దురితలతికావినాశియగు కాశియందుఁ గృత్తివాసు నుపాసించి సరస్వతీ
కూలంబున సరస్వతీ సమర్చనం బొసర్చి, యేపగిదిం దనపాపంబుఁ బాపి
కొన నోపక యమ్మహేంద్రుండు చంద్రపుష్కరిణికి వచ్చి యచ్చటం
త్రయోవింశతి వత్సరంబులు గడపెఁ దదనంతరంబ- ౧౩౯

శా. జంబూదుంబర బిల్వతీర్థకదళీ సౌవీర భల్లాతకీ
జంబీరామ్ర కపిత్థ తిందుకసలేశాశోభితంబైన యా
జంబూకాహ్వయ తీర్థరాజమున కాఖండారి యేతెంచి భ
క్తిం బూజించె సరోజలోచనుఁ ద్రిలోకీపాప నిర్మోచనున్. ౧౪౦

క. ఆగతి కొండొకకాలము
సాగఁగ, హరిహయుఁ డొనర్చు సమ్యక్పూజా
యోగంబు కెంతయును నను
రాగంబునఁ బొంది పత్త్రరథవాహనుఁడున్. ౧౪౧

ఉ. తెల్లని తమ్మిరేకులగతిం జిగి మించు వెడందకన్నులుం
జల్లని సత్కృపారసముఁ జల్లెడు చూపులు లేఁతనవ్వు- రం
జిల్లెడు నెమ్మొగంబు, వికసిల్లెడు నల్లని కల్వపూలతో
నుల్లసమాడు మైపసయు నొప్పి నిజాకృతిఁ జూపి నిల్చినన్. ౧౪౨

ఉ. పెన్నిధిఁ గన్న పేదగతిఁ బేర్చినయుబ్బున నబ్బలారిపైఁ
గన్నులవిప్పు లెల్ల విరిగాఁ దదుదారవపుర్విలాస సం
పన్నతఁ జూచి మ్రొక్కి, బహుభంగుల సన్నుతు లాచరించి సం
బన్నగతల్పుఁ డిట్లనుఁ గృపామతి మేఘగభీరభాషలన్. ౧౪౩

క. బలశాసన! నీ వనిశము
సలిపెడు పూజనలఁ గడుఁ బ్రసన్నుఁడ నైతిన్
వెలయఁగ నొకవర మిచ్చెద
వలసినయది వేఁడు మనిన వాసవుఁ డనియెన్, ౧౪౪

తే. పెంపుఁ దేజంబుఁ బొలివోయి పెద్దకాల
మలయుచున్నాఁడ నీ బ్రహ్మహత్యచేతఁ
గరుణ దలకొన నీపాతకములఁ బాపి
నన్ను రక్షింపు మేర్పడ నలిననయన, ౧౪౫

క అని విన్నవించుటయు స
ద్దనుజాంతకుఁ డతనిఁ జూచి, తడయక నీ వే
ఘనతీర్థజలనిమజ్జన
మొనరింపుము దురితముక్తి నొందెదు దాసన్, ౧౪౬

గ. వారక, భువి నేపారిన
వారిం గ్రుంకిడుదు రెట్టివా రఘచరితన్

వారించి నాకడం జను
వారై పొందుదురు తుది నశాశ్వతసుఖముల్. ౧౪౭

వ. అని యానతిచ్చి యాచతుర్భుజుండు నిజధామంబున కరిగిన సుత్రాముండు నతిపవిత్రంబులగు నత్తీర్థోదకంబులఁ గ్రుంకి పాపపంకంబు నపనయించి సమంచితతేజో విరాజమానుండై శ్రీరంగరాజ చరణరాజీవ సందర్శనాభి వందనం బొనరించి, తనర్చి, పెంపున నిలింపానీకంబు గొల్వ నాకంబునకుం జని, యఖర్వ వైభవంబునం బూర్వ ప్రకారంబున నుండె నని చెప్పి యక్కాశ్యపమునీంద్రుండు వెండియు నిట్లనియె. ౧౪౮

సీ. భూనాథ! నీవు నీపుణ్యతీర్థంబున
నవగాహనము సేయ నఘము లడఁగు,
మున్ను సిద్ధులు మునిముఖ్యులు నిచ్చోట
నిలచి రాగద్వేషములఁ దొలంగి
యధ్యాత్మవిద్యాపరాయణులై కాంచి
రాత్మాభిలషితంబు లైనగతుల,
రాజ్యవిచ్యుతుఁడైన రాజు మజ్జన మిందుఁ
గావించి మూఁడులోకములు నేలుఁ,

తే. గోరి యీవారిలోపలఁ గ్రుంకువెట్టి
వనిత సత్పుత్రుఁ గను. మూఁడుదినము లుపవ
సించి త్రిషవణస్నానంబు సేయునతఁడు
సప్తజన్మాఘవితతిఁ తత్క్షణమ పాయు. ౧౪౯

క. నేమమున నిజ్జలంబుల
లో మజ్జనమాడు మనుజలోకమునకు నా
నామయములు నవయుఁ దృణ
స్తోమము శిఖిశిఖలఁ గాలుచొప్పున ననఘా. ౧౫౦

క. కావునఁ బనుపుము నీసై
న్యావలి, నీవిమలవారి నవగాహనముం

గావింపఁ దత్ఫలంబున
భూవల్లభ సకలరోగములు పెడఁబాయున్. ౧౫౧

వ. అని చెప్పినఁ దనబలంబుల సమ్మృత్యప్రాయంబులగు సత్త్రోయంబుల నవగాహ
నంబు సేయించె నంత నిరంతరవ్యాధిబాధా నిరోధంబుఁ బాసి భాసిల్లిన
నుల్లంబున సంతసిల్లి భూవల్లభుండు కళ్యపసమేతంబుగాఁ గృతస్నానుండై
యచ్చటుం గదలి, చెచ్చెర నాశ్రమతీర్థంబునకుం జని యమ్మునికుంజరు
ననుమతంబున. ౧౫౨

క. సేనాసమేతముగ న
మ్మానవపతి తన్నియోగమజ్జన మెలమిం
దా నాచరించి, యఘములు
వో నొక్కనితాంతతేజమున వెలుగొందెన్. ౧౫౩

క. అత్తఱి నట విడిసిన నృప
సత్తము సైన్యములచేతఁ జాలఁగ మెఱసెం
దత్తీర్థపరిసరమ్ము-వి
యత్తల ముడుగణముచేత నమరెడుకరణిన్. ౧౫౪

క ఆనెలవున, గతకల్మషు
లై నెగడిన సమ్మసీశ్రమ లాకళ్యపునిం
గానఁ జనుదెంచి, సముచిత
నానావిధ పూజనము లొనర్చిరి ప్రీతిన్. ౧౫౫

చ. అనలసమానతేజుఁడగు నమ్మునిముఖ్యుఁడు వారి నందఱిం
గనుఁగొని యాచరించి, యనఘువ్రతపారగులార యాతటిం
బనుపడు దివ్యగంధరుచిరాక్షత పుష్పఫలోపహారమై
పెనుపుగఁ దోచె నాకు, వినుతింపరె యిట్టివిచిత్ర మెంతయున్. ౧౫౬

ఆ.వె. అనిన సత్తపస్వులం దెల్లఁ బెద్దయై
యనుపమానతేజుఁ డనఘు

భార్గవుం డనంగ బరఁగు సంయమిచంద్రుఁ
డమ్మునీంద్రుతోడ ననియె నెలమి. ౧౫౭

చ. కల దితిహాస మొక్కఁ టది కాశ్యప! నీకెఱిఁగింతు నంతయుం
దెలియఁగ మున్ను సజ్జనవిధేయుఁడు పుష్కరనామధేయుఁ డు
జ్జ్వలగుణశాలి విప్రకులవర్యుఁ డొకండు, సమస్తధారుణీ
తలమునఁ బొల్చుతీర్థములు తాఁ గనుగొంచుఁ జరించుసమ్మతిన్. ౧౫౮

క. ఆతఁడు, త్రిభువననుతమగు
నీతీర్థము మహిమ విని నిరీక్షించెడి సం
ప్రీతి, న్నియతాహారుం
డై తడయక వచ్చునప్పు డమ్మార్గమునన్ ౧౫౯

చ. పిడుగులఁబోలు కోఱలును బెల్లునఁ జల్లినవిస్ఫులింగముల్
వెడలెడు చూపులున్, నెఱయవిప్పిన నోరును గ్రాలుజిహ్వయున్
బెడిదపు గర్జితంబుగల బెబ్బులిరూపు పిశాచి వచ్చి పైఁ
బడె సతత ప్రవర్తితశుభవ్రతభాసురు నమ్మహీసురున్. ౧౬౦

క. వెక్కసమున నాఘాతకుఁ
జిక్కక విడువిడువు మనుచుఁ జెచ్చెర దానిన్
గ్రుక్కక యదలిచి విప్రుఁడు
చక్కన విడిపించుకొని పిశాచికి ననియెన్. ౧౬౧

చ అతులతపఃప్రభావవిజితాఖిలకల్మషచిత్తు నుత్తమ
వ్రతనిరతాత్మ విప్రకులవర్యుని నన్ను నకారణంబ యీ
గతి నిటు చంపఁబూనితివి కష్టపిశాచమ దుష్టబుద్ధివై
యితరునిఁ బోలె నీహృదయ మెంతయుఁ గ్రూరమవో తలంపఁగన్. ౧౬౨

క. నావుఁడు బిశాచి యిట్లను
నేవెంటం దప్పులే దొకింతయు నాయం
దీవిధి ననుఁ బుట్టించిన
దైవమునకుఁ దప్పుగాని ధర్మప్రవణా. ౧౬౩

వ. అనిన బ్రాహ్మణుం డిట్లనియె. ౧౬౪

ఆ. సకల భూతములకు సాక్షియై వర్తించు
దైవమునకు నేమితప్పు చెప్ప
వరుసఁ గీడు మేలు పొరయంగ నిజకృత
కర్మఫలమ తనకుఁ గర్తగాక. ౧౬౫

వ. అనిన నప్పిశాచి యిట్లనియె. ౧౬౬

చ. తెలియవు నీవు తత్త్వగతి తెల్లముగాఁగఁ జరాచరంబునం
గలిగిన యీశ్వరుం డొకఁడ కర్తయు, భోక్తయుఁగాక కల్గ దె
వ్వలనను దద్వియుక్తమగు వస్తువు గావున మేలు గీడునుం
దలకొన భూతరాసుల కొనర్పఁగ శక్యమె కర్మకోటిచేన్. ౧౬౭

ఆ. కర్మఫలములందు కర్తయు భోక్తయు
శ్రుతులు చాఁటు నీశ్వరుండు కర్త
యయ్యెనేని తత్క్రియాశక్తి యతనికి
నాదవుగాన నీదురుక్తు లుడుఁగు. ౧౬౮

వ. అనిన నగి యతని కిట్లనియె ౧౬౯

క. ఆరయ నీవిశ్వమునకుఁ
బ్రేరకుఁ డీశ్వరుఁడు తద్వ్యపేతం బగుచుం
బూరియునేని చలింపఁగ
నేర దతం డొకఁడ కర్త నిఖిలంబునకున్. ౧౭౦

వ. అని యివ్విధంబున పణియును గొండొక సేపు వివాదంబు సేసి యమ్మేదినీ
సురుం డిట్లను నిచ్చోటికి కనతిదూరంబున నామ్రతీర్థంబు చెలువొందు,
నందు మహామునిబృందంబు గ్రందుకొనియుండు, వారిముందట మన
మందటలు చెప్పినీవ గెలిచిన నన్ను భక్షింపు,మేన గెలిచిన నిన్ను వధియించెద,
నని ప్రతిన గావించె, నదియును సమ్మతించి యట్లొడంబడి తత్తీర్థ
వాసుల సకాశంబునకుం జనిన మానవాను గతయైన పిశాచిం జూచి యచ్చెరు

వొంది, రప్పు డిరువురుఁ దదభివందనం బాచరించి నిటలతటంబున నంజలి పుటంబులు వొందించి నిలిచి రందు మహీసురుం డిట్లనియె ౧౭౧

సీ. వినుఁడు సన్మునులు — నావిన్నపం బేనొక
ధరణీసురుండ, నీధాత్రిమీదఁ
గలపుణ్యతీర్థముల్ క్రమమున నాడుచు
నిటకు నేతెంచుచో, నిప్పిశాచి
త్రోవఁ బెబ్బులిరూపుతో నుండిపట్టినఁ
బట్టిక నేఁ దన్నుఁ బదరుటయును
దప్పు నాయదికాదు - దైవంబు దనియెఁ దా
నొగి శుభాశుభముల నొందుచోట—
తే. హేతువగుఁ గర్మ మంటినే, నివ్విధమున
వరుస నవ్వుఁగా దనంగవివాద మెసఁగె,
బూని గెల్చినవానిచే — హీనవాడి
చచ్చు ననుచు మాలోన నిశ్చయము చేసి ౧౭౨

క. ఇరువురమును మీసన్నిధి
కరుదెంచితి, మిందు యుక్తమగు నిది యని మీ
రరసి తగఁ జెప్పుఁ దనుటయు
మఱి పలికెఁ బిశాచి మునిసమాజముతోడన్. ౧౭౩

ఉ. ఏనొక కర్మయోగమున నిట్టి పిశాచపుజన్మ మెత్తితిం
గాని, మదీయబుద్ధిబలగౌరవ మేమియుఁ దప్ప దవ్విధం
బైనను, జాతియుక్త మగునట్టిక్రియాగతి నీతఁ డొంటిమై
రా నిటఁ బట్టితిం జయపరాజయముల్ వివరింపుఁ దేర్పడన్. ౧౭౪

వ. అనిన నయ్యుభయమతంబులందుఁ బూర్వపక్షసిద్ధాంతంబుల నేర్పుఱుప నేర్పరులు గాక తమలో వితర్కించు మునులకోలాహలం బగ్గలంబయ్యె నయ్యెడ— ౧౭౫

సీ. పుండరీకాక్షుఁ డంభోధరశ్యాముఁ డా
జానుబాహుండు విశాలవక్షుఁ

దలినీలకుటిలకుంతలుఁ దంచితస్మిత
లలిత కపోలమండలుఁ దనేక
హారకుండల కంకణాంగద మణిముద్రి
కాది భూషణ భూషితాంగుఁ దమల
పీతాంబరుఁ దనల్పబింబఫలాధరుం
దతులిత చిరమనోహర విలాసుఁ

తే. దసమతేజో విరాజితుఁ దఖిల భువన
మోహనోదారకళ్యాణమూర్తి యొక్క-
పురుష సింహంబు ముగురు నల్గురు నిజోప
మానవేషులు తన్ను సమ్మతి భజింప. ౨౭౬

సీ. చెమట చిత్తడిఁ జాల జిగి నించు మృగనాభి
బొట్టుతో నలకలు పొత్తుసేయఁ
దెగగల వాలారు తెలికన్నుదమ్ముల
సుడియు చూపుల వింత సొలపుఁ దేర
జిగి ధగద్ధగయను మొగడచన్నులమీఁద
జిలుగు పయ్యెద కొంగు జీరువార
ముత్యాలకమ్మలఁ బురుడించు వెన్నెల
తళుకులు చెక్కుటద్దములఁ బొలయ

తే. నంచనటనలు పచరించు నలసగతులఁ
బసిఁడి యందెలు మ్రోయ నివ్వసుధ మెలఁగు
నిందిరాదేవి యననొప్పు నింతి యొకతె
యల్ల నల్లన తనతోడ నరుగుదేర. ౧౭౭

చ. మును బృందావనవీధి గోపవనితల్ మోదంబు సంధిల్లఁగా
వెనువెంటం జనుదేరఁ గేలిగతులన్ వేడ్కన్ వినోదించు కృ
ష్ణుని చందంబునఁ దద్వనాంతర సరస్తోమాభిరామాబ్జ సం
జనితామోద సుగంధగంధవహ సంచారానుషక్తాత్ముఁడై. ౨౭౮

క. ఏలాలవంగలతికా
జాలాలింగిత కదంబసముదయ సుమనో

హేలామద కలకిన్నర
బాలాసంగీతరవము ప్రమదం బెసగన్. ౧౭౯

క. లీలాగతి విహరించుచు
నాలాగున నమ్మునీంద్రు లందఱు రౌదగా
సోలి వితర్కించుచు రవం
బాలించి తదంతికమున కరుదెంచుటయున్. ౧౮౦

చ. అతులిత దివ్యతేజుఁ డగు నమ్మహితాత్మునిఁ గాంచి సంయమి
ప్రతతి-ముదంబు సంభ్రమము పైకొన డిగ్గనలేచి కోమలా
యత కుశవిష్టరంబున బ్రియంబునఁ నుంచి సుఖోపవిష్టులై
యతని ముఖేందుచంద్రికల నాత్మదృగుత్పలరాజి రాజిలన్. ౧౮౧

తే. అనఘ! నీవెవ్వ రబ్ధికన్యయనుబోని
యీవధూమణి మఱియెవ్వ రిట్లు నిన్నుఁ
బోలె సేవించు నీపుణ్యపురుషు లెవ్వ
రిటకు వచ్చిన కారణం బేమియొక్కొ! ౧౮౨

చ. అనవుఁడు, వారితోడ దరహాస మెలర్పఁగ నమ్ముకుందుఁ డి
ట్లను వినుఁ డీప్రదేశమున నర్థిఁ జరించెడినట్టివాఁడ- ని
వ్వనరుహనేత్ర నాహృదయవల్లభ నే నిట వేఁటవచ్చి మీ
పెనురొద వార్ధిఘోషమున బేర్చుటయున్ విని యేఁగుదెంచితిన్. ౧౮౩

క. మిముఁ బొందగఁటి శుభములు
సమకొనియె, మనోరథంబు సఫలం బయ్యెన్
సుమహిత సాధుసమాగమ
మమితశ్రేయః పరంపరావహముగదా! ౧౮౪

వ. అనిన గంభీరభావబంధురంబులును, మధురంబులు నగు తదీయవచస్సుధా పాథోనిధివీచులం దేలి యమ్మునివర్యు లాశ్చర్యంబున నప్రతిపలావణ్య రూప తారుణ్య తేజోవిరాజమాన శుభలక్షణోదారం బగు తదాకారంబు డెందంబుల కమందానందంబు నొందింప నందంద చూచి తమలో నిట్లనిరి. ౧౮౫

మ. దరదిందీవరదామధాముఁ డగు సీతారుణ్యతేజోధికుం
డరయం బన్నగరాజతల్పుఁ డగు హేమాభాంగి యీ పల్లవా
ధరి పద్మాలయ వీరు సిద్ధపురుషుల్, దా నట్టిగాకున్న ని
ద్ధర నెవ్వారికిఁ గల్గు నిట్టి భువనోదాత్త ప్రభావోన్నతుల్. ౧౮౬

చ. అని కొనియాడ నమ్మునుల కప్పురుషోత్తముఁ డిట్లనుం దపో
ధనవరులార! మీర లిటు తర్క మొనర్చుట యేమికారణం
బెనయ విరోధముల్ దొఱఁగి యేకమనస్కులు గాక, కూడివ
చ్చిన కత మేమి ? నా కెఱుఁగఁజెప్పఁగఁ బోలిసఁ జెప్పఁ దేర్పడన్. ౧౮౭

సీ. అనిన నప్పుండరీకాక్షున కాతపో
ధనులు వారల వివాదములతెఱఁగు,
సకలంబు జెప్పి యాజయపరాజయముల
నేమతంబుల నిర్ణయింపలేక,
సందేహమునఁ బొంది చర్చించుచున్నార
మీప్రదేశంబున నిట్లుగూడి
యనఘాత్మ ! సకలలోకానన్యసామాన్య—
భవ్యలక్షణ సముద్భాసితుఁడవు

తే. ప్రవిమలజ్ఞానమును, బుద్ధిబలము, నీకు
నమరు నాకారసమములై, యట్లు గాన
నొండు దలఁప నగణ్య మొకింత లేదు
నీవ యర్హుఁడ వింతయు నిశ్చయింప, ౧౮౮

వ. అనిన సమ్మునిబృందంబునకు నందకహస్తుం డిట్లనియె, ౧౮౯

క వినుఁ, విప్రుండును, బలియును
వినుత ప్రజ్ఞావిశేషవిదు లిరువురు ప
ల్కిన పల్కులు గా వనఁగా
జన వఖిల పురాణశాస్త్రసమ్మత మగుటన్, ౧౯౦

సీ. అఖిల రూపములఁ గర్మానుభూతిశరీర
ధారులగా నాది లా సృజించి,

వానియందుండి సర్వప్రవర్తకుఁ డయ్యు
నప్పయోరుహదళశ్యాము; డపరయఁ,
గర్మప్రసక్తుండు గాక విశ్వమునకు
సాక్షియై యేపారి సంతతమును
సచ్చిదానందభాస్వద్రూపియై యొప్పు,
పరమాత్మ మఱి కర్మబంధుఁడగుచుఁ

తే. బుణ్యపాపము లొనరించి, పూని జీవుఁ
డోలి మేలును-గీడును నొందుచుండు
నిట్లు గాకుండెనేనియు నెసఁగు సకల
మైన శాస్త్రంబులకును వైయర్థశక్తి, ౧౯౧

వ. కావున నీ వివాదంబు ప్రాగల్భ్యం బగుట నిక్కం బగు, జయం బొక్కనికి జొప్పడ, దిప్పిశాచియు విప్రుండును సుఖంబగు నిశ్శ్రేయసపదంబు నొందెద రనిచెప్పిన నప్పరమతబోధన సందోహంబు సందేహంబు బాసి- యాజగన్నివాసు నందఱు నన్ని చందంబులఁ గొనియాడి-పదంబడి, ౧౯౨

ఉ. సమ్మదమార భూసురుఁ, బిశాచిని గన్గొని, మాకు మీ నిమిత్తమ్మున-నీయుదాత్తగుణధాముని దర్శనమున్ సహోనులాపమ్ములు గల్గె సందియము మాని సుఖించెద రింక, నీ శరీరమ్ములతోడ మీరు నమరత్వముఁ జెంది యనేకకాలముల్ ౧౯౩

మ. అని సంభావనచేసి రంతఁ బ్రమదం బారంగ నయ్యిద్దఱుం జని తత్తీర్థమునన్ మునింగి, మును లాశ్చర్యంబునం బొంది కన్గొన దివ్యాకృతులం దనర్చి దివిజుల్ గొల్వంగ నాకంబుకై ఘనతేజం బెసఁగంగ నేఁగిరి సురేంద్రవ్యోమయానంబులన్, ౧౯౪

ఉ. అప్పు డనంతతల్పుఁడు నిజానుచరుల్ గొలువన్ వనంబులో నెప్పటియట్ల కేలిగతు లింపుచరింప దలంప నాత్మలం దప్పని తద్వియోగ పరితాపము సైఁపఁగలేక వారు-నా చొప్పున నేఁగి రచ్చటికిబుషుల్ ప్రమదం బెసఁగంగ సంగడిన్ ౧౯౫

క. ఆలోన, వారి చిత్తము
లాలోకింపం దలంచి యవ్విపినములో,
నాలోక గోచరుఁడు-గా
కా లోకగురుండు చనియె ననుచరయుతుఁడై ౧౯౨

క. అమ్మునివరులును, త్రిభువన
సమ్మోహన మగు తదీయచతురాకృతి దా
రిమ్ములఁ గనుగొనలేమికి
నుమ్మలికము నెమ్మనముల నుప్పతిలంగన్, ౧౯౩

సీ. రాచిలుకలశోక రంతులుగాఁగఁ జ
రించు లేమావుల క్రేవలందుఁ
బరిపరిగతుల షట్పదములు భ్రమరించుఁ
బువ్వారు నెలఁదీవ పొదలతుదల
మగకోవెలలు పంచమస్వరంబున సింపు
పుట్టించుమరుగుల పొరుగులందుఁ
గవకవపలుకు జక్కవకవ లిమ్ములఁ
గ్రీడించుకొలఁకుల కెలఁకులందుఁ
తే. గలయ మెలఁగుచుఁ బలుమఱుఁ బిలిచిపిలిచి
చొలవకెల్లెందుఁ బరికించి చూచి చూచి
యలఁత దలఁకొన మనముల నలసి యలసి
కానలేరైరి యెబ్భంగిఁ గమలనేత్రు. ౧౯౪

క. ఆహారనిద్ర లెఱుఁగక
యాహరి సందర్శనోత్సవాకులమతిఁ ద
ద్వాహినిబొంత ననాదృత
దేహవ్యాపారు లగుచుఁ ద్రిమ్మరుచుండన్. ౧౯౫

వ. కొండొకకాలంబు పస నొక్కనాఁడు సభామండపంబున నొక్కమాఱ్పం
బిట్టుగ వినంబడియె. ౨౦౦

ఉ. తాపసులార ! మీకుఁ బరితాపము లేటికి, లోకరక్షణ
వ్యాపితబుద్ధి రంగనిలయంబునఁ బన్నగశాయినైన ల
క్ష్మీపతి నేను సన్మతి భజింపుడు నన్నచటన్ సమస్తవాం
ఛాపరిపూర్తి మీ కొదవుఁ జయ్యన నయ్యెడ కేఁగుఁ డందఱున్ ౨౦౧

క. అనువాక్యము కర్ణరసా
యన మగుటయు నమ్మునీంద్రు లతిహర్షమునం
జని కాంచి బహువిధంబుల
వినుతించిరి రంగధాము విబుధలలామున్. ౨౦౨

ఉ. ఆపరమేశ్వరుండును దయామృతపూర తరంగితంబులౌ
చూపుల, నత్తపోధనులఁ జూచి సముజ్జ్వలదంతమౌక్తికో
ద్దీపితకాంతు, లాస్యహిమదీధితిఁ బ్రోవఁ బయోద నిస్వనా
టోప గభీరభాషలఁ గడుం బ్రియ మారఁగ వారి కిట్లనున్. ౨౦౩

క, భావమున నొండు దలఁపును
పోవిడిచి, మదేకబుద్ధిఁ బూజలు ప్రీతిన్
గావింపుఁడు నా కనిశము
కైవల్యపదంబు మీకుఁ గలిగెడు దానన్, ౨౦౪

వ. అని యానతిచ్చిన నమందానందంబు నొంది యమ్మునిబృందంబు ముకుందున కభివందనంబు లందందఁ గావించి, మరల వచ్చి యచ్చట నిచ్చలు చతుర్భుజుని త్రికాలంబు నర్చించుచుండిరి, తత్ప్రసవగంధాక్షతాదు లివి యనిచెప్పిన నప్పుణ్యతీర్థంబునఁ బార్థివపుంగవుండు చతురంగబలసహితుండై యవగాహనం బొనర్చి తనర్చిన తేజోబలవిశేషంబుల రాజిల్లు నిజ సైన్యపద్మంబు వికసింపఁ గాశ్యపమునీంద్రున కిట్లనియె. ౨౦౫

క నీకరుణాలోకనమునఁ
జేకుఱె సౌఖ్యము మదీయసేనల కిచటన్
నా కొనరింపఁగ వలసిన
యాకృత్యము లెవ్వియనిన సమ్ముని బలికెన్. ౨౦౬

క. గోదానంబు కుటుంబికి,
నోదనమాత్రంబు దివ్యయోగీంద్రునకుం,
బేదకు భూమి,సువర్ణము
నాదీక్షితునకు, నృపాల యర్థం బొసఁగన్, ౨౦౭

క. దానము సేయఁగ నర్థము
గానఁ బ్రతిగ్రహ మొనర్పఁగా దట్టియెడన్
భూనాధున కిటు సేయమి
నానృపుఁడరుగున్ సగాత్రుఁడై దుర్గతికిన్. ౨౦౮

ఆ.వె భవ్యదేశకాలపాత్రంబు లొడఁగూడి
నపుడు సేయుదాన మక్షయంబు,
దాన నడఁగిపోవు దాతకుఁ గోటి జ
న్మార్జితంబు లైనయఘము లనఘ! ౨౦౯

క. ఈయనిన వన్ని నీయం
దీయెడ సమకూరి యున్న విపు డోధరణీ
నాయక,తద్దానము లెడ
సేయక కావింపు మనినఁ జిత్తం బలరన్. ౨౧౦

సీ. భాసురమణిమయ ప్రాసాదపంక్తులఁ
దరళ పతాకావితానములను,
గాంచనస్తంభసంగతమంటపంబుల
విమల చంద్రోపల వేదికలను,
బహువస్తు సంపన్న పణ్యామార్గంబుల
మహనీయతోరణ మాలికలను,
అమృతోపమానంబు లగుజలాశయముల
రామంబులైన యారామములను,
తే. శాలిసస్యముల సరసరసాలవితతిఁ
జాల నొప్పారు తోటలఁ జప్పరములఁ,

దవిలి భూలోకసారమై తనరు సగ్ర
హార మొకటిని దనపేర నారచించి.- ౨౧౦

క. అలఘుతపస్వులు నుత్తమ
కులజులు-నాచారపరులు - గురుశుశ్రూషా
కలితులు, నానాధ్వర - క
ర్తలు విద్యావిదులునైన ధాత్రీసురులన్. ౨౧౨

ఆ.వె.మూఁడువేల నేర్చి, మొదవుల వారికి
వేయునేసి యొసఁగి, వెలయురత్న
భూషణాంబరములఁ, బొలుపారు కన్యల
దాసదాసికాన్వితముగ నిచ్చి, ౨౧౩

వ. ఒక్కశుభముహూర్తంబునఁ గార్తస్వరోపకరణరమ్యంబు లగుహర్మ్యంబుల నాయాప్రదేశంబుల నతిథిజనంబులకు మనఃబు లలర - నభిమతపదార్థ సంపన్నంబు లగునన్నంబులను - శీతలఘనసార ప్రముఖనిఖిల సురభి ద్రవ్యసంవాసితానేక పానీయపరిపూర్ణకలశంబులం గలిగి యహిమకరనికరంబులకుం జొరవ యీక మిగుల నిగతాశించు - చలిపందిరులను గల్పించి, — కల్పోక్తవిధానంబునం బొసంగించి యచ్చటం గదలి-ముక్తి సీమంతినీసీమంతముక్తాఫలధామం బగు — రంగధామంబున కరిగె - నయ్యవసరంబున - ౨౧౪

ఉ. జ్ఞానవిధూతకల్మషులు, శాశ్వతధర్మవిధిజ్ఞు, లచ్యుత
ధ్యానపరాయణుల్, ఘనదయాకలితుల్, సకలక్రియాను సం
ధానవిశారదుల్, పరహితవ్రతచిత్తు, లుదాత్తదివ్యతే
జోనిధు, లార్యసన్నుతవిశుద్ధచరిత్రులు - తత్పదస్థితుల్ ౨౧౫

క. తనకు నెదు రరుఁగుదెంచినఁ
గని, సంభ్రమ వినయ కౌతుకంబులు మదినె
క్కొనగ మ్రొక్కి, విపులమగు
కనకాదు లుపాయనములుగా నిచ్చి తగన్. ౨౧౬

క. ఆసరపాలుఁడు, వారల
చే నుచితప్రియవచోవిశేషంబుల స
న్మానితుఁడై యట కదచి ప్ర
ధానపురోహిత సమన్వితముగా నెలమిన్. ౨౧౭

వ, చని పురోభాగంబునఁ బరమభాగవత సేవ్యంబగు నద్దివ్యనగరంబు పట్టునకుఁ జుట్టును గావలియైయున్న పన్నగేంద్రునిఫణామండలంబు పరిపాటిం బాటిం నొరయు మేటికొమ్మల నుదారంబగుప్రాకారంబునకు నలంకారంబై, ధగద్ధగీయమానంబు లగుమయూఖప్రతానంబుల - నహర్పతి కిరణంబులకు నెదుర్పడు మణులు దీపించినం బొలుపు దీపించు తలాఁపులం దనరి, నిశిత కులిశపాతనిపాతంబునకుం దప్పి యొప్పు మేరుపర్వతంబునుంబోలె సర్వోన్నతంబై - విలాసాంజనరేఖారంజితంబు లగునగర లక్ష్మీకటాక్షంబుల చందంబున లోకానందకారణం బగుకువలయతోరణంబుల నభిరామంబై ,మలయపవనసంచలితంబులై —యుదంచితంబు లగుకాంచనకింకిణీగణఝణాత్కారంబులఁ బతంగతురంగంబులకలన, ఫల్గువల్గన వల్గుశిక్షావిశేషంబుల నలవరింపం జాలి చాలనూతనంబు లగుకేతనంబులం బొలిచి, మహేంద్రనీలమణికీలితంబు లగు జాలకాంతరంబుల నిరంతరంబును వెడలి కదలుకొను- కాలాగరుధూమస్తోమంబు లంబరంబున నంబుదాగమన సముత్కంఠంబులైన-రుచిర రుచివిజిత తాపింఛంబు లగుపింఛంబుల విప్పి యాడుక్రీడామయూరంబులకు సుకరంబులగు మణిశిఖరంబుల మెఱసి — శరదభ్రశుభ్రచంద్రోపలవిమల చంద్రశాలాంతరపరిస్ఫురన్నటన విలాసవిలాసినీచరణ రచిత మణినూపురంబై నిజవిభవవిజితగోపురంబగు గోపురంబుఁ బ్రవేశించి.— ౨౧౮

క ప్రతిహారానుమతంబున
నతిముదమున నా నృపాలుఁ డతులావరణ
త్రితయము నోలిఁ బ్రదక్షిణ
గతి నవనత పూర్వకంబుగాఁ జొచ్చి యటన్ ౨౧౯

తే. దొరల మంత్రుల హితుల బంధులను గూడి
యష్టదిక్కులఁ గుముదాదులైన తీర్థ

రక్షకులకును, మఱి చతుర్ద్వార పాల
సమితికిని మ్రొక్కి యభ్యంతరమున కరిగి. ౨౨౦

క. స్రుతకనక కషణ సుషమా
ప్రతిమాన మనోజ్ఞ పీతపరిధాను, విభా
జిత బాలభానుఁ ద్రిభువన
వితతేంధన చిత్రభాను విష్వక్సేనున్, ౨౨౧

చ. కనుఁగొని భక్తిపూర్వకముగా వినయానతుఁడై తదీయ శా
సనమున విష్ణుపారిషదసత్తము లాదర మొప్పఁ దన్నుఁ దో
డ్కొని చనఁజొచ్చె దివ్యమణికుట్టిమ కుడ్యకవాటవేదికా
వినుతవిటంక సంజనిత విస్ఫుటధామము రంగధామమున్. ౨౨౨

వ. ఇట్లు ప్రవేశించి— ముందటఁ గుందచందనచంద్రికాపాండురం బగు కుండలి రాజపర్యంకంబునఁ బవ్వళించి సమంచిత మణి శిఖరవిరాజిత రాజతాచల సంగతిఁ గనుపట్టు నీలమేఘంబు చందంబున సందంబై— కెందమ్మి విరుల సిరుల గరువంపుఁ జెన్నునకు వన్నెయొసంగు కెంజాయలఁ జాల రంజిల్లుచుఁ జక్రచామరతామరస కులిశపద్మఝషచాపకలశాదిరేఖలం గల తలంబుల మెఱసి మెఱుంగుజుక్కల చందంబునకు నూరుపునెఱపు నఖమణిరమణీయంబులై నమదమరేంద్రబృంద మందారమాలికా పరిమళ పరంపరా వాసితంబులై వాసవ ధనుర్లీలా విలాసంబునకు వాసి మిగిలి, వివిధ మణి ద్యుతి వ్యతికర మంజులంబు లగు మంజీరంబులఁ బొలుపు మీఱి శుకసనకాది యోగీంద్రధ్యాన గమ్యంబులై- రమ్యంబు లగు చరణంబులును, వృత్తానుపూర్వంబులు నపూర్వ సౌభాగ్యయోగ్యంబులై నిగనిగ నిగుడుభంగి నెగడుకొను చిఱుతొడలును, గ్రొత్తమెఱుఁగుమొత్తంబులు చిత్తగింపం (?) బొరలెత్తిన నునుఁబస నెసంగు నసితకదళికాకాండంబు ననుకారం బగు నూరువులును, నవకర్ణికార కుసుమ సుషమా విశేషంబు నభినయించు నభినవపీత పరిధానపరివృతంబై, కనత్కనకకింకిణీకలిత లలిత మేఖలావలయం బగు నితంబంబును, మిన్నేటిదోటియగు నేటిసుదివడువుస శోభిల్లు నాభీసరోవరంబునఁ దిరంబగు వెలి దమ్మిఁబోని ముఖసరోజ సౌరభంబు గ్రోలఁ జాగి తేఁటితెగ వానున నభిరామం బగు రోమావళిం దనరి వళిత్రయసుందరమ్మై కరతలగ్రహణసాధ్యం బగు మధ్యంబును,

సరసశృంగార లీలావిలాససముల్లాసిని యగు వనజవాసినికి నప్రయత్న రత్నదర్పణంబనఁ బ్రశస్తంబగు కౌస్తుభంబునకు నుచితస్థలంబై- సంతాన లతాంతసంతానదంతురితాంతరతరుణ తులసీదళదామసురభితంబై, కుంకుమ కర్పూర దర్పసార సుగంధిగంధసారానులేపితంబై, శ్రీవత్సలక్షణోపలక్షితంబు లగు వక్షః పరిణాహంబును, సముజ్జ్వలవజ్రకంకణాంగదభద్రముద్రికాశోభితంబులై, కటి కిరీటపార్శ్వవిన్యస్తంబు లగు హస్తంబులును, సారానురాగసాగరకన్యకా కరకంకణపదాంకితంబై జిగి దొలంకు శంఖంబుల పొంకంబునకు బింకంబు దలకొలుపుచు నప్రయత్నరత్నగ్రైవేయక బంధుర మగు కంధరంబును, దళతలఁ బొలయు తళుకులు గులుకులం దాపించిన దీపించు కెంపులఁ బెంపారు మండలంబు లొలయు గండమండలంబులును- బరిపక్వ బింబశోభాసౌభాగ్యంబు నతకరించు మధురాధరంబును సుధారసంబునఁ బదనుగొని తలలెత్తు ముత్యంపుమొలకలపొలుపునఁ దెలుపెసఁగు దశనకాంతులు గలసి వెలయు నెలనవ్వు వెన్నెలలఁ జెలువు మిగిలి సతతప్రసన్నతా సదనం బగు వదన చంద్రబింబంబును, సమున్మీలిత నీలతిలకుసుమసముల్లాసంబు నుల్లసించుచు సురభినిశ్వాసమారుతంబున దిశలు వాసించునాసికయును, వాసరావసర సముల్లసిత సితారవిందదళ విశాలంబులై తొంగలి ఱెప్పల కప్పున నొప్పారి కరుణారసపాత్రంబు లగు నేత్రంబులును నిజవిక్షేపమాత్ర విలాససంపాదితాశేషనిలింప మంగళం బగు నానతభ్రూలతాయుగళంబును, లలిత లావణ్యరస లవంబులన నమరు చెమటచిత్తడిఁ గరంగు హరినీలగిరి శిఖరంబునుంబోలెఁ బద్మరాగప్రభాటోప- విశంకటముకుటసంగతం బగు నుత్తమాంగంబును గలిగి యంగీకృత భక్తజనానుగ్రహంబగు శ్రీరంగరాజు దివ్యమంగళవిగ్రహం బాపాద మస్తకంబును విస్మయస్మితనయనారవిందుండై సందర్శించుచుఁ బరమానందసుధావీచుల నోలలాడుచు- హర్షగద్గద కంఠుండగుచు- నా రాజ కంఠీరవుండు. ౨౨౩

సీ. బాపురే! మృదు పాదపల్లవంబుల యొప్పు
మాయురే! యూరుల సోయగంబు
భళిరె! నితంబబింబంబు సౌందర్యంబు.
మమ్మా! కృశావలగ్నమ్ము చెలువు,

ఆరరే ! యొప్పారు నూరుల భాగంబు
చాగురే ! బాహుల చక్కఁదనము
ఔర ! లేనగవారు నాననాబ్జము పొల్పు
నోహో ! కనుంగవ యొఱపు మెఱపు.

తే. మేలు ! మే లలకంబుల మెఱయు కప్పు
అహహ ! నునుపారు నొసలఁ దట్టాడు తళుకు
లనుచుఁ ద్రిభువన మోహనం బగుతదీయ
మూర్తివైభవ మందంద పొగడి పొగడి. ౨౨౪

క. అక్కజపు భక్తిఁ జాఁగిలి
మ్రొక్కి లలాటమునఁ గదియ మోడ్చిన చేతుల్
నెక్కొలిపి ప్రమద లహరిం
జొక్కుచుఁ దద్వైభవంబుఁ జూచుచు నుండెన్. ౨౨౫

క. అప్పుడు కరుణామృతరస
ముప్పొంగు కటాక్ష దృష్టి నుర్వీవిభునిం
దప్పక కనుఁగొని—మధురిమ
చిప్పిల నాసకలలోక సేవితుఁ డనియెన్, ౨౨౬

తే. పార్థివోత్తమ ! నీమహాభాగవతులు
సంతతంబును మత్పదార్చనమునండ
యొనసి యుండుట నత్యంతహితుఁడ వీవు
తలఁపు నీమీఁద నాకును దగిలియుండు, ౨౨౭

చ. నను మది నిల్పి, మున్ను నలినప్రభవుండు తపంబు సేసినన్
మనమున మెచ్చి తత్ప్రియ మొనర్పుట కీగతిరంగమందిరం
బున మణిసత్ఫణాన్విత సమున్న పన్నగరాజశయ్యపైఁ
దనరెడు దివ్యమూర్తి నవతారమునొందితి సత్కృపామతిన్, ౨౨౮

చ. వనజభవుండు భక్తి గొలువం జిరకాలము సత్యలోకమం
దొనర వసించి పుణ్యమహిమోన్నతి నొప్పునయోధ్యకొక్కనా

ప్పునఁ జనుదెంచి యందు గుణభూషణులైన భవత్కులీను లె
ల్లను వివిధోపచారగతులం బరిపూజ లొనర్ప నుండితిన్. ౨౨౯

ఉ. ఆగతి నందు నాలుగుమహాయుగముల్ చనునంతఁ జాపదీ
క్షాగురుఁ, డాశ్రితావన విశారదుఁ డద్భుతబాహువిక్రమో
ద్యోగుఁడు, జానకీదృగసితోత్పలచంద్రుఁడు,రామచంద్రుఁ డా
భాగవతాగ్రగణ్యుఁ దన బ్రస్తుతి కెక్కిన దానవేంద్రునిన్. ౨౩౦

క. నిజచరణకమలసంతత
భజనపరాయణునిఁ బరమపావనచరితున్.
సుజనప్రియుని- విభీషణు
రజనీచరవంశజలధి రాకాచంద్రున్. ౨౩౧

ఆ. వె. ఆదరించి తనకుఁ బ్రాణంబుకంటె వి
శేషమైన యావిచిత్రభవన
మిచ్చి,యనుప నాతఁ డెలమిమై లంకకుఁ
జనుచు నిచట నున్న సమయమునను. ౨౩౨

చ. అమృతప్రాయములైన తోయముల లోకానందముం జేయు—నీ
కమనీయాపగ నీతటద్రుమసమగ్రచ్ఛాయలం జాల శీ
తములై మించిన సైకతంబులను మోదంబార నీక్షించి—ని
త్యము నిచ్చోట వసించుకౌతుకము డెందం బందు సంధిల్లఁగన్. ౨౩౩

క. అయ్యసురనాధు నొకగతిఁ
జయ్యన నొడఁబఱచి పంచి సన్నుతఫణిరాట్
శయ్యాతలమున సుఖినై
యియ్యెడ నున్నాఁడ లోకహితనిరతమతిన్. ౨౩౪

క. మెచ్చితి నీభక్తికి, మది
నిచ్చెద నే వేఁడు మింక నేవరమైనం
జెచ్చెర నీమనమున గృప
పిచ్చగిలం బల్కుటయును బ్రీతాత్ముండై. ౨౩౫

చ. మనుజవరేణ్యుఁ డిట్లను రమాపర దేవకిరీటకోటి నూ
తన మణిదీప్తి విస్ఫురిత తావకదివ్యపదాంబుజాతముం
గను గొనునట్టి భాగ్యమునకంటె విశేషవరంబు లెవ్వి నా
జని సఫలత్వమొందెఁ గలుషంబు లడంగెఁ గడంగె పుణ్యముల్, ౨౩౬

వ. అని పలికి యారాజపంచాననుండు పాంచరాత్రాగమప్రపంచిత విధానంబున-సావధానమానసుండై యాభోగితల్పు ననల్పభవ్యదివ్యోపచారంబులఁ బూజించి పునఃపునఃప్రణామంబు లాచరించి,తన్ముఖారవిందలావణ్య మధువిలోలంబులైన నిజలోచనమధుపంబుల నెట్టకేలకు మగుడఁ దిగిచికొని 'యనంతవైభవాభిరామంబగు నారంగధామంబు వెడలి ప్రతిహారపాలకులగు దివ్యపురుషుల నవ్యమణిభూషణాంబరాది సమర్పణంబుల సంతర్పితులఁ గావించి విమతవిహగశ్యేనుండగు విష్వక్సేనునికడ కరిగి,ససేనుండై, తదీయపార్శ్వభాగంబులఁ గొలిచి గగనమండలంబున నాఖండలుని నీలగిరిశిఖరంబునుబోలె నుద్దామంబగు తద్ధామంబు వీక్షించి సకలసాధుజనోపాస్యుండగు కశ్యపుఁ గనుంగొని— ౨౩౭

క. సన్నుత మేచక జలధర
సన్నిభరుచి గలిగి గగనచరపథమున -స
ర్వోన్నతమై యొకధామం
బున్నది యది యెట్టిదనుచు నుత్సుకమతియై. ౨౩౮

చ. అడిగిన నన్నరేంద్రునకు నమ్మునిపుంగవుఁ డిట్లనున్ ముదం
బడర ననంతశక్తియుతుఁడై జగదాత్మకుఁడైన చక్రి యె
ప్పుడు వసియింప నిమ్మగుచుఁ బొల్చిన యిమ్మహనీయధామమున్
బుడమి ఫణాగ్రభాగమునఁ బూనినశేషునిగా నెఱుంగుమీ. ౨౩౯

మ. అతిరమ్యంబగు తల్పమై,సతతలీలావాసమై, రత్నసం
గత సింహాసనమై. పరిస్ఫురితముక్తాఛత్రమై,సత్ప్రభా
తతదివ్యాశుగమై, మనోహర పదత్రాణంబులై ,చక్రినం
చితలీలం భజియించికాదె కనియెన్ శేషుండు శేషత్వమున్. ౨౪౦

తే. జ్ఞాన శక్తి బలామితైశ్వర్య వీర్య
తేజములు వొల్చు నతనికి నైజ మగుచు,

బహుగుణానంత్యమునఁ గర్వభావము నను
వెలయు నాతఁ డనంతాఖ్య గలిగి యధిప. ౨౪౧

క. లోకములు, జన్మవిలయ
వ్యాకులములు పొందువేళలందును వికృతుల్
పైకొనక శాశ్వతస్థితిఁ
జేకొని యీధామ ముల్లసిల్లుచునుండున్. ౨౪౨

క. ఇది తచ్ఛాయ నృపోత్తమ
సదమల భవదీయపూర్వజన్మార్జితమై
యొదవిన సుకృతఫలంబున
విదితంబై నీకు గగనవీథిం దోచెన్. ౨౪౩

క. ఈవిధమున బ్రతియుగమున
భూవల్లభ వర్ణభేదములు వెలుఁగొందున్
శ్రీవిభుఁ డీధామము దా
నావేళల నట్టివర్ణమై కానఁబడున్. ౨౪౪

క. పెరుగుచుఁ దఱుగుచునుండును
నరనాయక, కాలవశమునం దివ్యరుచి
స్ఫురితము నహీనమహిమో
త్తరమును నగు నీమనోజ్ఞధామము వసుధన్ ౨౪౫

సీ. ధరణీశ కలియుగోదయవేళ విపరీత
రీతి నిన్నియుఁ బ్రవర్తిల్లుచుండుఁ
గల్ల నిజంబగుఁ గష్టుఁడు దుష్టుఁడై
నెగడు ననిత్యంబు నిత్యమగుచు
హేయ మహేయమై యెసఁగు, ననాచార
మాచారమై చెల్లు నవనిసురులు
మతిచెడి శూద్రులగతిఁ జరింతురు శూద్రు
లావిప్రధర్మంబు లాచరింతు-

ఆ.వె రాలు మగని విడుచు, నాచార్యు నిందించు
శిష్యుఁ, డఖిలదేవసేవ్యుఁడైన
హరి భజింప నొల్ల కన్యదైవంబుల
నెపుడు కోరి కొల్తు రెల్లవారు. ౨౪౬

తే. జలజనాభున కాధారశక్తి యగుచు
దనరు శేషాఖ్య నొప్పుసీధాము మధిప
తెలియ కెప్పుడు సామాన్య దృష్టిఁ జూచు
వారు పోదురు నిరయనివాసమునకు ౨౪౭

మ. అమృతానందనిధానమై-సకల కల్యాణావహంబై-రమా
రమణప్రేమ నివాసమై- మెఱయు శ్రీరంగప్రభావంబు ని
క్క్రముగా నాత్మ నెఱింగి కొల్చుసుజనుల్ కర్మంబులం బాసి-ని
ష్క్రమణన్ శాశ్వతవిష్ణులోకసుఖమున్ బ్రాపింతు రుర్వీశ్వరా. ౨౪౮

క. అని చెప్పిన-నాకాశ్యప
మునివరుఁ గొనియాడి, రాజముఖ్యుఁడు ప్రమదం
బొనరఁగ దద్ధామమునకు
వినతుండై యచటు వాసి వెలువడి-యెదుటన్. ౨౪౯

సీ. శిఖరాగ్ర గతి హరి ప్రఖరాశనికూర
నఖరాభిహత నవ్యనాగకులము
శబరీ పరిప్రస్థ కబరీకలాపవి
క్లబరీణ ఘనభుజంగవ్రజంబు,
రహితదోషాటోప మహితరత్నప్రభా
పిహితబృందారక బృందసరణి,
వితతసానుస్వాన సతతనిర్ఝరజల
ప్లుత తరుప్రత్యంత భూమికులము.

తే. బహుళగైరికమయ దృషత్త్రభవరాగ
కల్పితాలీక దివసావగమనికామ

విపులవార్వహ సందోహ విభ్రమంబు
రంధ్రకటకంబు ధరణిధరేంద్ర మొకటి. ౨౫౦

క. అన్నెలవుకు దక్షిణమున
విన్నులతో రాయుచుండ వీక్షించి సము
త్పన్నకుతూహలమతియై.
సన్నద్ధసమస్త సైన్యసహితుం డగుచున్. ౨౫౧

శా. ఆరాజేంద్రవరుండు, తత్కుధరశృంగారూఢుఁడై చేరువన్
ధీరోదంచిత నారికేర కదళీతిలాక్రమ ఖర్జూర సౌ
వీరాశోక వనావలీకలిత కావేరీ ప్రవాహాంతర
శ్రీరమ్యంబగు రంగమందిరము నర్థిం జేరి సద్భక్తిమై. ౨౫౨

క. తనదృష్టికి నలుదిక్కుల
గనఁబడు దేశముల నమితకనకాంబర-గో
ధనరత్న దాస దాసీ
జనముల నర్పించె శేషశాయికి నెలమిన్. ౨౫౩

క భూనాయకుఁ డద్దివ్య
స్థానము మఱిఁ బాసి పోవఁజాలక యచటం
దా నుండ దలఁచి భూనుత
మై నెగడు తదద్రి పశ్చిమాంచితసీమన్. ౨౫౪

క సారసగరుదనిలాహత
సారస సంవాసితాంబు సారంబగు-కా
వేరీ తీరంబునఁ దన
పేరుగ నొకపురి రచించెఁ బ్రీతి దలిర్పన్. ౨౫౫

క. ఏపట్టణంబుకంటెను.
నాపురవర మమరు విభ్రమాలస లలనా
నూపుర రవమంజులమణి
గోపురమై విభవవిజితగోపుర మగుచున్. ౨౫౬

క. నలినజుఁడను రససిద్ధుం
డల వేలుపుఁగొండ శుద్ధహాటకమయమై
వెలుఁగఁ బుటమిడిన పరుసునఁ
బొలుపగు నప్పురముకోట భూవినుతంబై. ౨౫౫

క. కొమ్మలగెడ మానికపుం
గమ్మల క్రొమ్మెఱుఁగు లడరఁగా, నలవేల్పుం
గొమ్మలు మలతురు పుత్తడి
బొమ్మలగతి వేఱ కోటఁ బొగడఁగ నేలా! ౨౫౬

చ. లలనల కేళిసంభ్రమములం దెగిʼ రాలిన హారరత్నముల్,
జలధరవేళఁ బెంజినుకులం జని తత్పరిఖాతలంబులన్
వెలుఁగఁగ గాంచి వానిఁ గడువేడుకతోడుత సంస్తుతించి మే
నొలయఁగ బల్మఱున్ మురియుచుందురు పన్నగరాజకన్యకల్. ౨౫౭

సీ. తెరల వ్రాసినవ్రాత దీపించు పులులకు
మది లోఁగుఁ జందురు మచ్చయిఱ్ఱి,
తూలాడుపడగల తుదలతాఁకున నుల్కి
హరితేరిహయము లుప్పరము చాఁటు,
గేళాకుళులయందుఁ గెందమ్మితూఁడులు
వింతగా నఱ నెక్కిరింత నంజు,
రమణఁ బెంచిన మయూరమ్ములు వేలుపు
కన్నెల కరతాళగతుల నాడు,

తే. ననిన నందుల ననిచెప్ప నమరులైన
నవడి గ్రహరాజుమేడల నవరణలను
మేటితొడవులు నిట్టిట్టిపాటి వనుచు
జగములోపల మఱి వేఱ పొగడనేల. ౨౫౮

క పురసౌధ శిఖర నికర
స్ఫురదురు మరకతమయూర పుంజములఁ గళా

ధరబింబమధ్యహరిణము
తరుణతృణభ్రాంతి దవ్వుదవ్వులఁ గముచున్. ౨౫౯

చ. హరిణ మటంచ్రు, కాదు వట మందురు, భూప్రతిబింబ మంద్రు, సా
గరతలపంక మంద్రు, శశికం దని యందురు, లోకు లందఱున్,
సరసిజవైరి మైకిఱ నిజంబులు గా వవియప్పురంబు గో
పురశిఖరాళితో నొరయఁ బుట్టినకం దని చెప్పఁ బొందగున్. ౨౬౦

క. నీలమణిచంద్రశాలా
పాలిక లీలావిలోల బాలాలీలా
వాలాపాంగాలి నట
త్కాలాభ్రాంతర తటిల్లతాగతిఁ బొలుచున్. ౨౬౧

క. నీడలు మణిముకురంబులఁ
జూడరు, పట్టణములోని సుగుణులు, సురత
క్రీడాసంభ్రమ గళిత
వ్రీడాబ్జముఖీ కపోలవీథులఁ దక్కన్. ౨౬౨

చ. పురిశృంగారవనంబులన్ మెఱయుచుం బూర్ణేందుబింబాననల్
విరులం గొప్పులు దీర్ప - వేణి యెలమిన్ వేడ్కన్వెసం గప్పు బం
ధుర నీలప్రబలాంధకారము క్రియం దోపం భ్రమం జక్కవల్
విరహార్తిం దురపిల్లుఁ బట్టపగలున్ లీలాసరశ్శ్రేణులన్. ౨౬౩

క. సరసీరుహములు తత్పుర
వరవనితావదన వైభవము గోరి, సరో
వరమధ్యమముల నెప్పుడు
చిరలీలం దపము సేయు చెలువున మెఱయున్, ౨౬౪

క అతనుఁడు సమ్మోహనశర.
మతివల కన్గొనల నిలిపి, యతులోద్యాన
ప్రతతుల నప్పురి నెప్పుడు,
చతురత రతిఁ గూడి క్రీడ సలుపుచు నుండున్. ౨౬౫

చ. ఉపరిరతిప్రయాసముల నుబ్బిన ఘర్మజలోర్మిశీకర
వ్యపనయబుద్ధి నంగనలు, వారిరుహాకరవారి నుల్లస
ద్విపులకుచద్వయీ లిఖిత విస్ఫురితాగరుపత్రవల్లికా
స్నపన మొనర్చి కల్మషము సౌరభముం గలిగింతు రప్పురిన్. ౩౬౬

సీ. మెఱచి పోవని తీవమెఱపులు రతికేళి
కలికి రాచిలుకలు పలుక నేర్చు,
బంగారు ప్రతిమలు ప్రాణంబు లెసఁగిన
చిత్రరూపంబులు, చిత్తభవుని
మోహనాస్త్రంబులు, ముదితలై చరియించు
చంద్రరేఖలు, మహీస్థలి నటించు
కల్పవల్లులు, పులుకడిగిన ముత్తెంపు
తళుకులు, శృంగారకళల చెలులు,

తే. కన్ను లార్చెడు వేలుపుకన్య, లొఱపు
దెలుపు మెత్తని మణిశలాకలు. విలాస
సీమ లనఁ గామకేళి విచిత్రగతుల
వాసి కెక్కుదు రప్పురి వారసతులు ౩౬౭

చ. తనపగవారిలోఁ గొనిన తప్పున కప్పుర (?) నాధుఁ డాద్యులం
బెనుపగు కింక సంకెలలఁ బెట్టిన భీతిగఁ గన్కనిం గనీ
కనముల ముట్టి గిట్టెదునుగ్రైవడి నెందు నమందబృంహిత
ధ్వనులు దలిర్ప నొప్పు మదవారణమాల్ జయకారణంబులై ౩౬౮

చ. వెసఁ గపలించి హో ! యనిసవ్రేల్మిడిలోనన నిల్చుఁ గంధరం
బుసుమక బిట్టదల్చినను భోరన సాగరమైన దాఁటు బ
ల్విసమున ఱాఁగలం దఱిమి వాగె వదల్చినఁ జువ్వనం జవం
బెసఁగఁగ గాలి మీఱు భువి నెన్నిక కెక్కిన ఖర్తులాణముల్. ౩౬౯

సీ. సంతత భువనప్రశస్త సంచారులు
సత్కులగోత్ర విస్తారశీలు,

లవనీసతీ పరిగ్రహార్థ సమర్థులు,
పరిచరప్రహ్లాద నిరతగుణులు,
ప్రకటపదక్రమ ప్రాగల్భ్యనిరతులు
పరపక్షఖండన ప్రౌఢమతులు,
ఖరదూషణక్షయంకర శక్తియుక్తులు,
కృష్ణవర్త్మాధిక కృత్యపరులు,
తే. కలిత సర్వజ్ఞవిగ్రహుల్, కలి మలాప
కర్షణోదీర్ణ సద్ధర్మ కర్మపరులు,
నగుచు శ్రీవిష్ణుమూర్తుల ననుకరించి
వెలయుచుందురు తత్పురి విప్రవరులు ౨౬౦

ఉ. ధీరులు - దోషదూరులు - సుధీజనసంస్తవనీయ సద్గుణో
దారు, లుదారు, లాహవజితప్రతివీరు లపూర్వనిత్య - శృం
గారులు శూరు లుజ్ఝితవికారులు - వార్ధిగభీరు లంగనా
మారులు - శక్తినిర్జితకుమారులు రాజకుమారు లప్పురిన్. ౨౬౧

క. ధనదులు పుణ్యజనేశులు -
ననవరతశివాభినందితాత్ములు - నరవా
హనులు - నిధిపతు - లుదారు ల
య్యెను గారు కుబేరు లచట నుండెడివైశ్యుల్. ౨౬౨

సీ. మధుషట్పదంబుల మధుపానభూములు
రాజకీరంబుల రచ్చపట్లు
పుంస్కోకిలంబుల భోజనశాలలు
మలయానిలంబులు మలయు నెడలు,
సమయూరంబుల నాట్యరంగంబులు,
మకరకేతను సభామండపములు-
విటవిటీజనములు విరుల చప్పరములు
మధులక్ష్మి నైపథ్య మందిరములు,
తే. అం వసంతుని లీలావిహారసీమ
లిట్టలం బగు వలపుల పుట్టినిండ్లు

చిరపరిశ్రాంతపథిక సంజీవనములు
పావనము లప్పురంబున బాహ్యవనులు. ౨౭౩

చ. పరిణత గంధశాలివనపంక్తులు గంధవహానుభూత బం
ధురకణిశంబులై, వెలుపుదూకొనఁ జాలు నిజాలవాలసుం
దర వికచారుణోత్పల వితాన నవప్రమదాలిమాలికా
సురుచిర గీతమాధురికిఁ జొక్కి తలల్ కదలించెనో ! యనన్. ౨౭౪

సీ. పటపాండుకేసర పరిణాహకేసర
ప్రసవ పరాగంబు గొసరి గొసరి
వర్ణితకాసార వరవీచికాసార
శిశిరశీకరములఁ జెలఁగి చెలఁగి
గుణవతీ ఘనసార కుచలిప్త ఘనసార
బహుళసౌరభముల బలసి బలసి
కమనీయమణిజాల ఖచిత సద్గృహజాల
మాలికాంతరముల మలసి మలసి

తే. సమద కరికటతట మదసలిల పాన
ముదిత కలరవ మధుకర మృదుల చలిత
లలిత విపరీతగరుదంచలములఁ బొదలి
మలయపవనుండు పురిలోనఁ గలయఁ బొలయు ౨౭౫

వ. మఱియు రిపుహృదయపుటభేదనం బగునప్పుటభేదనం బమరావతీపురంబునుంబోలె ననిమిషానందకరంబై యలకాపట్టణంబునుంబోలె ధనదనివాసంబై మధురాపురంబునుంబోలె సుల్లసత్పుండరీకంబై పుండరీకంబునుంబోలెఁ బురుషోత్తమావాసంబై, పురుషోత్తమావాసం బయ్యును-వీరభద్రవిహార స్థలంబై, వీరభద్రవిహారస్థలం బయ్యును-దక్షయాగమహోత్సవంబై, దక్ష యాగమహోత్సవం బయ్యును-సర్వమంగళాభిరామంబై-యమరు నందు సుందరుల నయనంబులయందు శ్రుతిసీమాలంఘనోద్యోగంబును, పంగులయందు పదహీనతయుఁ గరులయందు మదోద్రేకంబును దరులయందు శాఖాచలనం బును, ప్రబంధంబులయందు వర్ణబంధంబులును శుకశారికాదులయందు పక్ష

వాతంబులును, గోకులంబులయంద భంగంబులును, భృంగంబులయందంద మధుపానప్రసంగంబులును,వృద్ధదౌవారికాదులయంద-దండగ్రహణంబులును దక్కఁ దక్కెడల లేక యొప్పునందు- ౨౪౬

ఉ. భూజనదృక్చకోర పరిపూర్ణసుధాంశుఁడు-కీర్తిచంద్రికా
రాజితలోకుఁ డానతధరాతలనాథకిరీటరత్న—నీ
రాజితపాదపీఠుఁ డరిరాజకులాచలవజ్రపాణి-పం
క్తేజకులాన్వయాగ్రణి సుకీర్తినరేంద్రుఁడు సమ్మదంబునన్, ౨౪౭

క. హితబంధు మిత్రసేనా
పతి సామంత ప్రధాన పరివార పురో
హిత సహితముగ వసించెను
సతతమహీరాజ్యవిభవ సౌఖ్యాన్వితుఁడై - ౨౪౮

ఆ.వె.అట్లు పెద్దకాల మందుండి యాశ్రిత
పారిజాతు సత్కృపాసమేతుఁ
బ్రతిదినంబుఁ గౌరి భజియించె శ్రీరంగ
ధాము నింద్రనీలధామధాము, ౨౪౯

ఉ. అంతనిజాత్మజాతు—దళితారినృపాలుఁ బ్రజానుపాలనా
త్యంతవిచక్షణున్,సుగుణధాముని—సన్నుతనామ, బంధుసా
మంతజనైకసమ్మతిని మంజుల మంగళ తూర్యసంగతుల్
రంతుగ మ్రోయఁ బ్రాజ్యనిజరాజ్యపదస్థుని జేసి నెమ్మదిన్, ౨౫౦

క తగు లొండు లేక,మఱి యా
జగతీ నాథుఁడు విరక్తి సమకొన, మడఁ బ
న్నగతల్పు నిలిపి నియతిం
దగఁ దప మొనరించి తత్పదస్థితి నొందెన్. ౨౫౧

క. అని ప్రాచేతసుఁ డావర
మెనయ భరద్వాజమునికి నెఱిఁగించిన యా

వినుతేతిహాసపరసం
బున నరులకు నుభయలోకములు పెంపొందున్, ౨౮౨

వ. అని పారాశర్యుండు నాగదంతమునివర్యున కెఱింగించిన తెఱంగు, ౨౮౩

—. ఆశ్వాసాంతము .—

శా. చోళీ చంచదురోజకుంకుమవనక్షోద స్ఫురద్వక్ష!నే
పాళీ చారుకపోల చిత్రరచనాపారీణ!హస్తాబ్జఖం
గాళీ కేళి కలాప!మత్తకరిశిక్షానవ్యపాంచాల!పాం
చాలీభావవికాసకృచ్చతుర!వాచామాధురీవైభవా! ౨౮౪

క. కమలాంకకాంతిశోభిత,
కమలాకరనిభ గభీర,కమనీయదర
త్కమలాయతదళలోచన,
కమలా కలితాత్మసదన కమలామదనా! ౨౮౫

మాలిని — దినకరసమతేజా!దీనమందారభూజా!
వనధినిభగభీరా!వర్ణనీయప్రచారా!
వినయనయవిశాలా!వేదమార్గానుకూలా!
జనకువలయసోమా!చాగయామాత్యరామా! ౨౮౬

— : గద్యము : —

ఇది
శ్రీమద్భ్రమరాం
బావర ప్రసాదలబ్ధ
సిద్ధసారస్వతవిలాసగౌరవ
గౌరనామాత్యపుత్ర సుకవిజనమిత్ర
సుధీవిధేయ భైరవనామధేయప్రణీ
తంబైన శ్రీరంగమహత్త్వం
బనుపురాణకథయందుఁ
జతుర్థాశ్వాసము : —

# శ్రీరంగ మహత్త్వము

## -: పంచమా శ్వాసము :-

క. శ్రీరఘునాయక మృదుపద
వారిరుహభ్రమర, బంధువత్సల, వంశో
ద్ధారణ, సుమహితమతివి
స్తారోరగసార్వభౌమ!చాగయరామా! ౧

వ. అవధరింపు మఖిలకథాకథనచాతురీజనిత రోమహర్షణుండగు రోమహర్షణ
కుమారుండు దివ్యబోధనులగు శౌనకాదితపోధనుల కిట్లనియె, ౨

క. ఈజాడ కలితపుణ్యస
మాజంబగు నాశ్రమతీర్థమహిమ విని భర
ద్వాజుఁడు విపులతపోవి
భ్రాజితు వాల్మీకిఁ జూచి పలికెం బ్రీతిన్, ౩

చ. ఇది యొకపాదపంబు-గడు నేచినశాఖల నెల్లదిక్కులం
బొదివి, మహాతపస్విజన పూజితమై గిరిఁబోలెఁ దోచు చు
న్నది, విలసత్ప్రసూనభర నవ్యమనోహర దివ్యవాసనా
ముదితమదాలిగానఁగఁ బరిమోహితముగ్ధకురంగబృందమై, ౪

క. శ్రుతిసుకరంబై, మధుర
శ్రుతికలితస్వరవిశేషసువ్యక్తంబై,
శ్రుతిఘోషము వినఁబడె వి
శ్రుతముగ నచ్చోట నేమి చోద్యము గలదో! ౫

క. వినిపింపుము నా కత్తెఱఁ
గని, వినయం బెనయఁ దన్ను నడుగ భరద్వా

జుని ననలకల్పతేజునిఁ
గనుఁగొని వాల్మీకమునిశిఖామణి పలికెన్. ౬

చ. వినుము కదంబభూజ మది విశ్రుత మయ్యెను దానిపేర-న
య్యనుపమతీర్థమందుఁ బ్రియమార నిమజ్జన మాచరించున
జ్జను లఘముక్తులై పరఁగ శాశ్వతవిష్ణుపదంబునందుఁ బెం
పున వసియింతు రక్కడికిఁ బోదము రమ్మని సమ్మదమ్మునన్, ౭

మ. అని రూపంబు ధరించి వచ్చు హరిలీలాప్తిం దిగంతంబులం
దనదేహప్రభ లుల్లసిల్లఁగ— భరద్వాజాన్వితుండై - రయం
బున వాల్మీకమునీశ్వరుం దరుగఁ దత్పుణ్యస్థలావాస స
న్మునివర్గం బెదు రేఁగుదెంచి పరమామోదంబు సంధిల్లగాన్, ౮

ఉ. దండడి మ్రొక్కునప్పుడు, సుధామధురప్రియవాక్యచాతురిం
గొందఱఁ బల్లవప్రతిమ కోమలపాణిపరిగ్రహంబులం
గొందఱి, నాదరంబు సమకొల్పుల సత్పరిరంభణంబులం
గొందఱ, గారవించి మునికుంజరుఁ డందఱు దన్ను గొల్వఁగాన్ ౯

చ. అంబురుహాప్త బాలకిరణారుణ కోమలపల్లవ ప్రభా
లంబముఁ జందనానిలచలత్కుసుమ స్తబకప్రబుద్ధరో
లంబము, నాలవాల పరిలాలితకేళివిలోలమత్తకా
దంబము, నగ్రసంశ్రిత పతత్రికుటుంబము నాకదంబమున్, ౧౦

క. డాయఁ జని, మ్రొక్కి, భక్తిం
బాయక పూజించి, పరమపావనమగు త
చ్ఛాయా సంశీతల విమ
లాయత సికతాతలమున నాసీనుండై, ౧౧

తే. ఆరయ నివృత్తయాగచిహ్నంబు లచట
గానఁబడినఁ గౌతూహలాకలితుఁ డగుచు
వారియందు వసుస్తపోవైభవముల
నధికుఁ డగు గౌతమునకు నిట్లనియెఁ బ్రీతి, ౧౨

చ. మునివర యీ ప్రదేశము సమున్నత యూపచయోపశోభితం
బును, బరిపూర్ణపాత్ర పరిభావిత వేదివిరాజితంబునై
గనఁబడుచున్న దే నృపశిఖామణి సమ్మతిఁ జేసెనొక్కొ భూ
వినుత మహాధ్వరంబు లతివిశ్రుత దక్షిణ లిచ్చి యిచ్చటన్. ౧౩

క. అనవుఁడు నాగౌతముఁ డి
ట్లనియెన్ మిథిలాధినాథుఁ డైసవిదేహుం
డొనరించెఁ బెక్కుయాగము
లనఘ మహామునిసమేతుఁడై యచ్చోటన్, ౧౪

ఉ. నావుఁడుఁ బుట్టచూలి సుజనప్రియు గౌతముఁ జూచి-సుస్వరం
బై వినవచ్చుచున్నది నిరంతరమై యొకవేదఘోష-మీ
రావున నిట్టిచిత్ర మెచటన్ మును నే నెఱుఁగన్ మునీంద్ర ! నీ
వావిధ మెల్ల నాకుఁ దెలియన్ వినిపింపు సవిస్తరంబుగాన్, ౧౫

క. అని యడిగినఁ బ్రాచేతస
మునివరుఁ డిట్లనియె గౌతముఁడు సకలజగ
ద్వినుత ప్రభావభాసుర
వినుము పురావృత్త మొకటి వినిపింతుఁ దగ ౧౬

శా. భూనాథుల్ తనపంపు సేయఁగ జగత్పూర్ణప్రతాపోదయ
శ్రీ నొప్పారు విదేహభూమిపతి భూరిద్రవ్యదానంబులం
దీనానాథుల కెంతయుం బ్రియము సంధిల్లం బ్రయోగానుసం
ధానప్రౌఢిమ నీశ్వరానుమతి జన్నం బర్థిఁ గావింపఁగాన్ ౧౭

క ఒకనాటి రాత్రి ఋత్విక్
ప్రకరముఁ బరిచారకులును బడలిన మేనన్
సకలంబు మఱచి నిద్రా
వికలేంద్రియు లగుచునున్న వేళం బెలుచన్. ౧౮

చ. అలరఁగ నొక్కకుర్కుర మనావృత భూరికవాటమైన త
త్సలలిత యజ్ఞవాటము వెసం జనఁజొచ్చి, తదంతరంబునం

గలయ మఱంగి వేలిమికిఁగాఁ దగుపాత్రికలందు ముందు వా
రలవడ నుంచినట్టి పృషదాజ్యము నెమ్మది గ్రోలి వెండియున్ ౧౯

ఆ.వె. అచట మంత్రపూతమగు పురోడాశంబు
కొంత కొంత మెసవి యంతఁబోక
తక్కఁగల పదార్థతతు లెల్ల మూర్కొని
తనిసి వెడలిపోయెఁ దనకుఁ దాన, ౨౦

క ఆవేళఁ దెలసి ఋత్విజు,
లావిధ మేమియును నెఱుఁగక విశిష్టద్ర
వ్యావలిఁ గ్రతువు సమాప్తము
గా వేల్వఁ గడంగుటయును గడుచిత్రముగన్ ౨౧

వ. మంత్రతంత్రంబు లెవ్వియుం దోపకున్న విషణ్ణహృదయులై ఋత్విగ్గణంబు లధ్వరక్రియాప్రబుద్ధుండగు వృద్ధకశ్యపున కత్తెఱం గెఱింగించిన-నతండును భయార్తచిత్తుండై వారల కిట్లనియె, ౨౨

ఉ. అంచితశేముషీవిభవ మందఱు మెచ్చఁగ మున్ను నేనొన
ర్పించిన యాగముల్ కొలఁదివెట్ట నశక్యము నాకు నిట్టివా
క్కించుకయుం బ్రయోగవిధ మిప్పుడుదోఁప దిదేమి చెప్ప నూ
హించిన విస్మృతిం బొరసె నేర్పడ నేర్చిన యన్ని విద్యలున్, ౨౩

క. అనుటయు నట్లు సదస్యులఁ
గనుఁగొని వారడుగ బుద్ధిగలిగి ప్రయోగం
బనఁగా నెట్టిది, మంత్రము
లన నెయ్యవి, నేమెఱుంగ మని రీ రీతిన్. ౨౪

క. జడులై ముందఱ దోఁపక,
తడఁబడ బుడిబుడ్లవోవ ధరణీశ్వరుఁ డ
య్యెడ వారిఁ జూచి మీ కీ
చిడిముడిపా టేలవచ్చెఁ జెప్పుం డనినన్ ౨౫

ఉ. వారు నతాస్యులై ధరణి వల్లభుఁ జూచి, నరేంద్ర! దీనికిం
గారణ మేమెఱుంగ మధికంబగు మేలొదగూడుచోట దు
ర్వారములైన విఘ్నములు వచ్చు ననేకము లంచు, భూమిలో
వారలు రూఢిగాఁ బలుకువాక్యము దప్పునె వేయునేటికిన్ ౨౬

క. నావుడు భూవిభుఁ డిక మన
కేవిధి ప్రజ్ఞావిశేష మేపారు మఖం
బేవెఱవున సంపూర్ణం
బై వెలయు నటంచు ఖిన్నుఁడై చింతింపన్, ౨౭

సీ. అతని కిట్లనిరి వా రందఱు నీరీతి
నవనీశ పరితాప మందనేల-
యేదేవుని గుఱించి యీ యాగమును చేయఁ
గైకొంటి వట్టిలోకైకనాథు
నాదినారాయణు, నాద్యంత విరహితు,
నామ్నాయ సంవేద్యు యజ్ఞ పురుషు
దేవదేవుని, వాసుదేవుని నధికారు
నచ్యుతు నఖిలభూతాంతరస్థు

తే. నాశ్రయింపుము హృద్గతంబైన మోహ
పటల మంతయుఁ బాపు నప్పరమపురుషుఁ
డుదయభానుఁడు దిక్కులఁ బొదివికొనిన
యంధకారంబు విరియించు నవ్విధమున, ౨౮

ఉ. నావుడు సంతసించి నరనాథుఁడు తానును వారుఁ గూడి, స
ద్భావమునం బ్రపన్న పరిపాలనలోలుఁ గృపాలవాలు-రా
జీవదళాక్షు నిల్పి పెఱచింతలఁ ద్రోచి నివాతదేశసం
భావిత దీపభాతిఁ జలభావ మొకింతయు లేక యున్నెడన్. ౨౯

క. వారక తమతమ పనులకుఁ
జేరిక చిత్రించినట్టి చెలువునఁ జేష్టం

గూరక పలుకం గోరక
యూరక నివ్వెఱగు నొందియుండిరి సభ్యుల్. ౩౦

ఉ. అత్తఱి నొక్కసంయమి పరాపరతత్త్వ విచారశాలి, భా
స్వత్తులితప్రభానిధి, నిజప్రతిమ ప్రతిభావిశేషసం
పత్తిఁ దనర్చు శిష్యులు శుభస్థితిఁ గొల్వఁగఁ జొచ్చివచ్చె, ను
ద్వృత్తతపనీయ దీప్తసముదగ్ర కవాటము యజ్ఞవాటమున్ ౩౧

వ. ఇట్లు చనుదెంచి సమంచితధ్యాన తత్పరులగు ఋత్విజులను రాజునుం జూచి
యిట్లనియె, ౩౨

శా. ఏలా విఘ్నము పొందె నీ క్రతువు, మీ కట్లేటి కేతత్క్రియా
జాలం బూరక తక్క, బాలిశులయోజ న్నిల్పి చింతాత్ములై
కాలక్షేప మొనర్చి తారు మొదలం గైకొన్నకార్యంబు ప్ర
జ్ఞాలంకారులు గేలిఁ బుత్తురె వృథా ధ్యానంబునన్ బుద్ధియే ౩౩

మ. క్రతుకర్మంబు సమాప్తిసేయుఁ డని వల్కన్ వార లావిప్రునా
తత తేజోనిధిఁ బ్రీతి గన్గొని మహాత్మా! మంత్రభాగంబు మా
మతులం దోపక తత్ప్రయోగవిధి సామర్థ్యంబునన్ వ్యర్థవి
స్మృతి నొందెం గతమెద్దియో! యెఱుఁగ మీచిక్కట్లు నెక్కొంటకున్, ౩౪

క. అని యీవిధమున వారును
వినయము తోడుతను బల్క విప్రాగ్రణి యా
మునుల గనుంగొని జలద
స్తనిత గభీర స్వరంబు సమకొనఁ బలికెన్, ౩౫

ఉ. కారణ మెద్దియే నొకటి గల్గక యీమఖవిఘ్న మొందఁగా
నేరదు, గావునన్ వినుము నిక్కము సర్వమయాత్ముఁడైన యం
భోరుహనాభుఁ డిమ్మహితభూరుహమంద నిరంతరంబునుం
గోరి వసించియున్కి నెఱుఁగున్ దరితో నివి సర్వవృత్తమున్. ౩౬

క. పూజించి యడుగుఁ డీతరు
రాజము నిది చెప్పు మీకుఁ గ్రతువిఘ్నం బె

యోష్యాజ సమకొనిన తెఱఁగు,సు
ధీజనవరులార ! విస్మృతిం బడనేలా ! ౩౭

ఉ. నావుడు సంతసించి నరనాథుఁడు ఋత్విజులున్ సదస్యులుం
బావన గంధపుష్ప ఫలపాయసపూప గుడాజ్యముఖ్యనా
నావిధ సత్పదార్థ కలనంబున నర్చ లొనర్చి రిమ్మలన్
సేవకకామితార్థ ఫలసిద్ధ్యవలంబము నాకదంబమున్. ౩౮

ఉ. భాతిగ నాకు నిప్పు డతిభక్తి నొనర్చిన యర్చనంబులం
బ్రీతుఁడ నైతి, మీవలనఁ బెద్దయు విప్రవరేణ్యులార ! మీ
కీతఱి నిష్టమైన వర మిచ్చెద వేడుఁడు, నావుడు న్మనః
కౌతుకమార వారు పులకంబులు నెక్కొనఁగ నుద్గతాస్యులై ౩౯

మ. క్షితిజాతోత్తమ ! సర్వలోకపతి, లక్ష్మీమాన సోల్లాసు, నా
శ్రితమందారు నుదారుఁ గౌస్తుభమణి శ్రీరంజితోరస్కు, న
చ్యుతునిన్ భక్తి గుఱించి యీనృపతి విధ్యుక్తంబుగాఁ జేయు స
త్క్రతురాజంబున నేము ఋత్విజులమై కర్మం బనుష్ఠింపఁగన్ ౪౦

క. ఏమంత్రము నేతంత్రము
మామతులకుఁ దెలివిపడక మానినకార్యం
బేమాయెనో ! యదిగాక-మ
తేమాయెనొ !మే మెఱుంగ మేకారణమో ! ౪౧

క. ఆవిధము దెలిసి మెఱసిన
మావిన్నదనంబు మాన్పి మంత్రనియోగ
ప్రావీణ్య మొసఁగి-పూర్ణము
గావింపుము నీవు మఖ మఖండితకరుణన్. ౪౨

చ. అనవుడు నమ్మహావిటపియందు వసించిన రంగధాముఁ డి
ట్లను మునులార ! మీ రలసి యధ్వరవాటిక నుత్కవాటబం
ధన మొనరింపఁగా మఱచి నల్లశలన్ సుఖసుప్తులైనచో
శునకము తన్మఖాలయముఁ జొచ్చి నిజేచ్ఛఁ జరించి యచ్చటన్. ౪౩

క. హోమద్రవ్యము లన్నియు
దా మూర్కొనిపోయె దానఁ దలకొని వేల్వం
గా మొనసిన కారణమున
నేమంత్రస్మృతియు మీకు నెసఁగక తక్కెన్. ౪౪

క. శుచిమద్ద్రవ్యంబుల నతి
శుచియై తద్దీక్షితుఁడు నిత్యశుచులగు ఋత్విక్
నిచయంబుఁ గూడి చేసిన
సుచిరక్రతు వొసఁగు బ్రియము శుచిషత్తునకున్. ౪౫

వ. కావున నపవిత్రంబులగు పాత్రానీకంబు పరిహరించి శుచిద్రవ్యంబుల నవ్యగ్రులై యాగంబు పరిపూర్ణంబుగా నొనర్పుఁడు మీకుం బూర్వప్రకారంబున సర్వమంత్రతంత్రంబులు ప్రయోగసులభంబులై దీపించెడి, నీమహీపాల సత్తముండు నుత్తమగతిఁ బ్రాపింపఁ గలఁ డని యానతిచ్చినఁ దత్ప్రసాదంబున నఖిలవిద్యలు నవగతంబైన సవనంబు నిర్విఘ్నంబులైన నిర్వర్తించి యమ్ముని సమాజంబును రాజును బరమానందంబునుం బొందిరి-మున్ను నిజసమ్మానితుండై యభిరూపంబు నొంది సకాశంబున కేతెంచి హితోపదేశంబు చేసిన భూసురాగ్రణి యెవ్వం డని కుతూహలులై యిట్లనిరి. ౪౬

మ. పురుషవ్యాఘ్ర! భవత్ప్రసాదమున మాబుద్ధుల్ ప్రసన్నంబులై
పరగెం బర్విన దుత్వమోహతమముల్ పాసెన్ మనోవీథిలో
మరలం దోచె సమస్తవిద్యలును సామాన్యుండవే! సర్వది
గ్భరితస్ఫూర్తిఁ దలిర్చె నీదు శుభసాంగత్యప్రభాజాలమున్ ౪౭

క. ఎచ్చోటన్నుండు విచటికిఁ
గ్రచ్ఛుఅ నరుదెంచినట్టి కత మేమి మఖం
బచ్చుపడ నిర్వహింపఁగ
విచ్చేసిన దొరవా! దివిజవిభుఁడవా! చెపుమా! ౪౮

వ. అనిన నయ్యుత్తమపూరుషుఁడు మహర్షుల కిట్లనియె. ౪౯

క. వసియింతు నెల్లయెడలను
వసుధాసురులార! నాకు వాలాయంబై

యొసఁగిన పని లే దొకటియుఁ
బొసగుం జేరువయె నాకుఁ బోలిన లీలల్. ౨౦

మ. వినుత ద్రవ్యసమృద్ధి గల్గి, త్రిజగద్విఖ్యాత చారిత్రులై
చను మీయట్టి మహాత్ము లెల్ల క్రియలం జాగింప సన్మాన్యవ
ర్తనుఁడై మించిన యీవిదేహవిభు సత్రం బంతరాయంబు నొం
దిన యాచంద మెఱింగి తత్పరిసమాప్తిప్రీతి నేతెంచితిన్. ౨౧

తే. క్రతువు సంపూర్ణ మయ్యె, భూపతికి మీకు
భద్ర మయ్యెడు, నేను నాభవనమునకు
బోయి వచ్చెద ననిన నప్పురుషసింహు
బాయఁ జాలక యమ్మునిప్రవరు లెల్ల. ౨౨

చ. వెనుకొని యేఁగి, రప్పు డరవిందదళాక్షుఁడు వారి నందఱం
దన కరుణావలోకన సుధారసధారలఁ దొప్పదోఁగుచుం
దనుభవదివ్యసౌరభకదంబము దిక్కులఁ బర్వ నుర్విఁ బా
వనమగు నుల్లసచ్చరణ వారిరుహంబులలీల మెట్టుచున్. ౨౩

సీ. ఆకదంబముఁ జేర నరుదెంచి తనకు న
మ్మును లాచరించు పూజనలు ప్రీతిఁ
గైకొని వారితో ఘనతపోధనులార
గురుతరం బగు వేదఘోష మొకటి
సకలకాలంబును శ్రవణమంగళముగా
నాదవుగా కని వరం బొకటి యొసఁగి
యంతర్హితుం డయ్యె నదియాదిగా ముని
సేవ్యమై శ్రుతినాదభవ్య మగుచుఁ

తే. బొలుచు నేతత్ప్రదేశంబు భూరిజన్మ
సంచితోదగ్ర పాపప్రపంచనక్ర
వక్రసంచార భయద భవప్రభూత
జలధిజృంభిత బాడబజ్వాలన మనఁగ. ౨౪

వ. అని గౌతమవరుండు చెప్పిన పుణ్యతీర్థప్రభావంబున కలరుచుఁ బరమతత్త్వ వివేకి యగు వాల్మీకి యచటుఁ గదలి-భరద్వాజసహితుండై-మహిత తపో విరాజమాన మునిసమాజ పూజితంబును-ప్రసిద్ధసిద్ధ చారణ గీర్వాణ సేవితంబును,సకలకాలకుసుమ ఫలభరిత తరుఖతా పరివృతంబును,క్రోశమండల విస్తారంబును, నగు బిల్వతీర్థంబునకుం జనియె నని చెప్పి యప్పారాశర్య వర్యుండు వెండియు నిట్లనియె, ౫౫

సీ. ఇంద్రు దేతరువె ము న్నెలమి నారాధించి
సురరాజ్యవైభవ స్ఫురణఁ దనరె,
మైత్రేయినాఁగ బ్రాహ్మణి యేమహీజంబు
సేవించి యోగ సంసిద్ధి నొందె,
వాలఖిల్యాదు లేవరపాదపచ్ఛాయ
నెల్లకాలము నాశ్రయించి యుందు,
రజనిర్మితంబైన యాగవేదిక నేఁడు
నేశాఖ క్రేవ నొప్పెసఁగి వెలయు,

తే. విబుధమానవ దైతేయ వితతిలోన,
నెవ్వ రెవ్వరి కెట్టియభీష్ట మట్టి
వార లెల్లను నేధరణీరుహంబు
కొలిచి వడసిరి తమతమకోర్కు లెలమి, ౫౬

తే. అట్టి బిల్వంబు పేరఁ బ్రఖ్యాతమైన
యమ్మహాతీర్థరాజ సామర్థ్య మెల్లఁ
దెలుపు నితిహాస మొక్కటి గలదు వినుము
దానఁ బెడబాయుఁ బటు దురితవ్రజంబు, ౫౭

సీ కలఁడు సోమకుఁ డనగా నొక్కరాజర్షి
వంశదీపకుఁడు దుర్వారబలుఁడు,
సత్యసంధుఁడు సర్వశాస్త్రతత్వజ్ఞుఁడు,
శమదమాన్వితుఁడు సజ్జనహితుండు,
జలధివేష్టిత మహీచక్రేశ్వరుఁడు, నిత్య
ధర్మశీలుఁడు మహాధానశాలి

సతతయాగక్రియోత్సాహ సంపన్నుండు,
సకలదిగంత విశ్రాంతకీర్తి,

తే. ఘనదయానిధి యాచకకల్పతరువు,
భూప్రజాలోకనోత్సుక పూర్ణచంద్రుఁ
డతిజయోదారుఁ డంభోరుహాక్షదివ్య
చరణరాజీవయుగ సమర్చనపరుండు, ౪౮

క. విగతస్పృహుఁడై తగ న
జ్జగతీనాయకుఁడు షష్టిసమములు కీర్తుల్
నెగడ ధరయేలి తనమెయి
నెగడిన జరఁ జూచి యాత్మ నెసఁగిన చింతన్, ౪౯

మ. జలదాకారము లింద్రజాలమహిమల్ సౌదామనీవిభ్రమం
బులు, గంధర్వపురంబు, లంబునిధిసంభూతోర్మికాజాలముల్
కలలో రాజ్యము, లెండమావులు, నటత్ఖద్యోతకీటద్యుతుల్
తలపోయంగ నసారసంసృతి సముద్యత్సౌఖ్యసంపన్నతల్, ౫౦

క. అదిగాన విపులభోగా
స్పదశాశ్వత పుణ్యలోకసంవాసము నా
కొదవెడునట్టి ప్రయత్నము
వదలక కావింపఁగా నవశ్యము వలయున్, ౫౧

వ. అని వితర్కించి — ౫౨

చ. విమలతపః ప్రసిద్ధులును వృద్ధులు శుద్ధులు వీతరాగులున్
శమదమయుక్తులున్- సకల శాస్త్రవిధిజ్ఞులునైన సద్విజో
త్తములను- సత్పురోహితవితానము- నాప్తుల బంధుమిత్రులం
గ్రమమున గూర్చి వారి కధికంబగు పూజ లొనర్చి యిట్లనున్, ౫౩

చ. చదివితి నెల్ల వేదములు శాస్త్రములున్ బహుధర్మమర్మముల్
విదితముగాఁగ వింటి. బహువిత్తము లిచ్చితి విప్రకోటికిన్,

సదమలబుద్ధిఁ జేసితి ప్రశస్తమఖంబులు, జీవలోకసౌ
ఖ్యదములుగా -వనంబులు జలాశయముల్ కడుఁ బెక్కొనర్చితిన్ ౬౪

క సుకృతము లెడపక సేసియుఁ,
బ్రకటితసంపదలఁ బెంపు వడసియుఁ గులదీ
పకుఁడగు సుతుఁ గనుభాగ్యం
బొకటియ లే దనిన మనుజుఁ డొందునె శుభమున్, ౬౫

క. వరపుత్రవంతులకుఁ గల
దరయఁగ సద్గతి సుఖంబు,'నాపుత్రాణాం
పరలోకస్థితి' యనఁగా
బరఁగెడు వాక్యంబు వినమె బహుశాస్త్రములన్, ౬౬

క. మేదిని బరఁగిన లౌకిక
వైదికధర్మంబు లెఱుఁగు వఱతలు గడుమీ,
రేదిగతి చెప్పుఁ డీఁకఁ బు
త్రోదయలాభోత్సవంబు లొందని నాకున్ ౬౭

ఉ. నావుడు వార లమ్మనుజనాయకుఁ గన్గొని పూర్వజన్మసం
భావిత పాపయుక్తి ననపత్యుఁడ వైతివి నీవు-దీనికిం
గా వగ పేటికిం బటుశిఖావిసరోజ్వల మైనవహ్నిఁ గా
ష్ఠావలిఁబోలె గాచు నశుభాతిశయంబులఁ బుణ్యకర్మముల్ ౬౮

వ. తొల్లి దుంధుమార సగర దిలీప దశరథాది మేదినీశులు హృషీకేశు నారాధించి తత్ప్రసాదంబున నసాధారణ బలపరాక్రమ సౌభాగ్యవినయవిధేయత్వాదిగుణ గణోదారులగు కుమారులం గనిరి, నీవును దత్ప్రకారంబునఁ గారుణ్యసింధు వగు సింధురవరదునిం బూజింపుము, రథాంగపాణి భవన్మనోరథంబు సఫలంబు సేయు నెడసేయక తత్ప్రీతికరంబగు నధ్వరంబు గావింపు మనిన సమ్మదం బంది—యమ్మహీవరుండు. ౬౯

క. తన కనుసన్న నృపాలురు
పనిసేయు నుదారవిభవపరిణతదివిజుల్

గొనియాడ వేదవిద్యా
ఘనులగు భూసురులఁ గూడి క్రతు వొనరింపన్. ౨౦

శా. చండాంశుప్రతిమప్రతీకరుచు లాశాచక్రవాళంబునన్,
నిండం బర్వ బ్రవాళపాటల జటాసీకంబు దూలం గ్రియా
పాండిత్య ప్రథమానసంయమికదంబం బర్థి సేవింప- మా
ర్కండేయుం డరుదెంచెఁ దన్మఖ దిదృక్షాకౌతుకోల్లాసియై ౨౧

తే. అమ్మునీంద్రునిఁ గని వినయం బెలర్ప
నెదురుచని మ్రొక్కి తోడ్కొని యేఁగుదెంచి,
యర్ఘ్యపీఠంబుపై నుంచి, యర్ఘ్యపాద్య
ముఖ్యసత్కారములు గ్రమంబున నొనర్చి. ౨౨

క. ఘనులగు తదీయ శిష్యుల
మన మలరఁగఁ బూజచేసి, మనుజాధీశుం
డనురాగంబున నమ్ముని
యనుమతి ఋత్విజులుఁ దాను నాసీనుండై, ౨౩

క. క్షేమంబే మీకును, శిష్య
స్తోమమునకు నీతిబాధ చొప్పడక తపో
భూమి దలిర్చునె విఘ్నము
లేమియు గైకొనక జరుగునే సత్తపముల్, ౨౪

చ. అనవుడు, నమ్ముని ప్రవరుఁ డాన్నృపుతో భవదీయరక్షచేఁ
బనువడు మాకు సర్వమును భద్రము, నీవును నీ సుహృజ్జనం
బును-సుఖమున్నవారె, గుణభూషణ! సత్ప్రతలాభకాంక్షనె
క్కొన నొనరించు నీమఖము కోరి కనుంగొన నిందు వచ్చితిన్. ౨౫

క దీన భవదీప్సితార్థము
గానేరదు, పూర్వజన్మకలుషం బధికం
బై సపఁ డొనరించెడి సుకృ
తానూన ఫలాగమంబు నెదిపెట్టు నృపా! ౨౬

మ. అతివిఖ్యాతము లై మహిం బరఁగు పుణ్యక్షేత్రతీర్థంబు లం
చితబుద్ధిన్ భజియింపఁ గర్మములు సంక్షీణత్వముం బొందినన్,
వితతంబై భజియించుకార్యములు నిర్విఘ్నంబులౌఁ గావునన్
క్షితినాథోత్తమ! తద్విధం బిపు డనుష్ఠేయంబు నీ కెమ్మెయిన్, ౭౭

క. నావుడు, నమ్మునిఁ గనుఁగొని
భావం బలరంగ నానృపాలుఁడు త్రిజగ
త్పావన చరిత్ర! తత్తీ
ర్థావలి నా కెఱుఁగఁజెప్పు మని వేడుటయున్, ౭౮

వ. మార్కండేయమునీంద్రుం డన్నరేంద్రున కిట్లనియె, ౭౯

సీ. వసియించు నెందేని వైకుంఠనాథుండు
ఫణిరాజభోగతల్పంబునందు,
నెందేని పరమయోగీంద్రు లేప్రొద్దును
బాయకుందురు పరబ్రహ్మనిరతి,
బహుభవార్జితపాప పటలంబు లెందేని
నిమిషమాత్రంబున సమసిపోవు,
మెఱుఁగుఁగోఱలతోడి మృత్యుదేవతగర్వ
మడఁచితి వెందేని నద్భుతముగ,

తే. నట్టి శ్రీరంగమండలాభ్యంతరమున
నఖిలలోకైక పావనమైన మహిమఁ
గరము శోభిల్లు చంద్రపుష్కరిణిసుమ్ము
సకలతీర్థంబులకు నెల్లఁ జక్రవర్తి, ౮౦

వ. ఆతీర్థంబునకుఁ గ్రమంబున గంధవాహన నరవాహన పురహార పురందర వైశ్వానర వైవస్వత పలాశన పాశధర దిశాభాగంబుల భజదమర సార్థంబు లగు తీర్థంబులు గల, వవియును, గేసరకదంబామ్రమబిల్వజంబూపలాశాశ్వత్థ పున్నాగాహ్వయంబు లన నంహోనిరాసంబులై భాసిల్లు నందుఁ బున్నాగ

తీర్థంబున బ్రహ్మవర్చసోదారుండగు వర్చసుండను బ్రాహ్మణుండు బ్రహ్మ జ్ఞాన నిరతుండై-సంసార విరక్తిం బొంది నిత్యానందంబు నొందె, భార్గవ కుల విస్తారుండైన తారకుం డను తాపసాగ్రణి కేసరతీర్థంబునఁ దపంబు సేసి భవపాశంబులం బాసె, జితారివర్గుండై వర్గగోత్రజాతుండైన రుక్మదృష్టి భజదభీష్ట ఫలప్రదం బగు కదంబంబు నుపాసించి బ్రహ్మపదప్రాప్తుం డయ్యె, నఖిలలోకోపాస్యుండగు కాశ్యపమునీశ్వరుండు విధాత పావధ్రామం బగు న్రామంబు నాశ్రయించి యమృతత్వంబు నొందె-మఱి యనేకు లీతీర్థంబుల నిజమనోరథంబు లవితథంబులుగాఁ బడసి రని చెప్పి—మార్కండ నంద నుండు వెండియు నిట్లనియె, ౮౧

క. శ్రుతిపర్వమై, మహాఘ
ప్రతతిం బాపుచు నభీష్టఫలదం బగునీ
యితిహాస మొకటి చెప్పెద,
క్షితినాయకతిలక చిత్తగింపుము ప్రీతిన్, ౮౨

సీ. జయధరుఁడను నొక్క జననాయకుఁడు—సుధా
కరవంశ్యుఁడు ధరిత్రిఁ గలఁ డతండు
క్రూరుఁడై భూసురకోటికి నెగ్గులు
గావించువారు, తద్దాపలోప
పావక జ్వాలలఁ బరితప్త హృదయులై
విసివి యారాజ్యంబు విడిచి చనిన,
శూద్రభూయిష్ఠమై శ్రుతి ఘోషరహితమై
భయరోగదుర్భిక్ష బహుల మగుచు,

తే. నాడు నాటికి రాష్ట్రంబు నాశమొంది,
కరితురంగమ రథభట కాంచనాది
సంపదల సొంపు సకలంబు ముంపుఁ దప్పి,
దీనదశ నొందె నజ్జగతీ విభుండు, ౮౩

క. వాని సుతశతము నొక్కట
నానామయపీడఁ జాల నవసి కృతాంత

స్థానమున కరిగి దత్తతీ
నానరపతి సతులు దాను నడలుచు నుండన్, ౧౪

శా॥ అంతం బుష్కరిణీతటంబున హరిధ్యానామృతానందిత
స్వాంతుండై వసియించియున్న గురునిన్ వాల్మీకి దర్శింప-న
త్యంతప్రీతి దలిర్ప నేఁగుచు భరద్వాజుండు, తన్మేదినీ
కాంతుం డున్నపురంబుపై నరుగ మార్గం బౌట నచ్చోటికిన్. ౧౫

ఆ.వె వచ్చి తనకు శిష్యవరుఁ డగుతత్పురో
హితునివలన నమ్మహీశ్వరునకుఁ
దొడరినట్టి కష్టదుర్దశ లన్నియు
విని మనంబులోనఁ గనికరించి. ౧౬

క తా నటఁ జని, నిజగురునకు
నానృపువర్తనముఁ జెప్పి ననుకంప మదిం
బూని, ముని వానిరాష్ట్రము
లో నుండక చనిన విప్రలోకమునెల్లన్, ౧౭

చ పిలువఁగఁ బంపి వారలకుఁ బ్రీతి దలిర్పఁగ నిట్లనున్- సము
జ్జ్వలమతులార! మీ రలిగి వచ్చినయంతటనుండి పైపయిం-
దలకొనినట్టి యాపదల దందడిఁ గుందిరి భూప్రజల్- మహీ
తలపతియున్ దురంతపరితాపనిపీడితుఁ డయ్యె నెంతయున్. ౧౮

క. నాలుగు పురుషార్థములకు,
నాలుగు వర్ణములవారి నడవడికిని, భూ
పాలకుఁడు కారణము- త
న్మూలంబున నెపుడు సర్వముం దలపోయన్ ౧౯

చ అలుకలు దక్కి నాపలుకు లాదటఁ గైకొని సత్కృపాగుణం
బలవడ నుద్ధరింపుఁడు- మహామహులార! నితాంతశోకవి
హ్వలుఁ డగుమేదినీశుని దురంతములైన యుపద్రవంబులన్
జెలుకుటకున్నెమ్మనంబు దుఃఖించుచునున్న మహీప్రజాలికిన్. ౨౦

వ. అని చెప్పిన నతనివాక్యప్రబోధితులై క్రోధంబు లుడిగి ప్రసన్నచిత్తులైన భూసురోత్తములఁ బశ్చాత్తాపమానసుఁ డగుమానవేంద్రునిం గలసి వారలఁ దోడ్కొనుచు- నత్తపోధనసత్తముండు నఖిలకామితార్థంబగు బిల్వతీర్థంబున కరిగె,నప్పు డయ్యెడ నున్న మహామునిగణం బతనిరాక గని రాకాసుధాక రోదయంబున నున్నిద్రంబగు సముద్రంబునుంబోలె నిబ్బరంబుగా నుబ్బ సముచితసత్కారంబు లాచరించి సమంచితాన్యోఽన్యప్రియభాషణంబులఁ బరితుష్టులైయున్న సవ ౯౧

చ. అనుపమదివ్యసౌరభ ంధవాహముల్
మునుకొని వీచె, బిల్వ వరపుష్పవృష్టి-భో
రన గురిసెన్, బదంః ాసె నశేషవాద్యని
స్వనము లనంతరంబు రనవ్యగానముల్. ౯౨

క, ఈరీతి నుభయసంధ్యా-
నారూఢములైన మంగళాచారము లే
వారఁ గని పుట్టఁజూలియు
భూరమణుం డద్భుతమ్ము బొందుచునుండెన్, ౯౩

ఉ. అక్కడి కేఁగుదెంచి సముదంచిత దివ్యతనుప్రభాతతుల్
దిక్కులఁ బిక్కటిల్ల నతితీవ్రతపోనియమప్రసిద్ధిఁ బెం
పెక్కిన శిష్యకోటి తను నెంతయుభక్తి భజింప లోకముల్
మ్రొక్క సనత్కుమారమునిముఖ్యుఁడు తీర్థనిషేవణార్థియై. ౯౪

క. అప్పుడు వల్మీకభవుం,
డప్పద్మజసుతుఁడు దాను నాత్మల ముదముఁ
జిప్పిల, నాలింగనములు
చొప్పడ గావించి యుచిత సత్కారమునన్. ౯౫

వ. సుఖాసీనులై యున్న యవసరమున నవగత మనోగతవికారుం డగు సనత్కుమారు నుపలక్షించి యక్షయజ్ఞానకుఠార దారిత సంసార భూజుం డగు భరద్వాజుం డిట్లనియె. ౯౬

ఉ. ఇచ్చటఁ బుష్పవర్షములు, నింపెసలారఁగఁ బాడుపాటలున్,
మెచ్చుల మ్రోయుతూర్యములు, మేదుర వాదములున్, మనంబులం
జెచ్చెర నద్భుతం బొదవఁ జేసి, మహాత్మ యెఱుంగ మేము ము
న్నిచ్చట నిట్టిచోద్య మిదియెంతయుఁ దేటపడంగఁ జెప్పవే. ౫౭

సీ. నావుడుఁ బరమేష్ఠినందనుం డెలమి - ని
ట్లను భరద్వాజుతో ననఘ! మున్ను
సుత్రామసఖుఁడైన చిత్రసేనుం డను
గంధర్వుఁ డతిశుభాకారుఁ డొకఁడు,
తరుణీ సమేతుఁడై తనుఁజేరి యనుచరుల్
గొలువంగఁ దా నదీకూలమునను
గెందమ్మికొలఁకులఁ గ్రీడాద్రిసానుదే
శంబుల దరులనుఁ జఱులయందుఁ

తే గలయ విహరించి, యొకనాఁడు గగనవీథిఁ
జనుచు శ్రీరంగమందిరచ్ఛాయ దాఁట
నది గనుంగొని కనలి సప్తార్ణవములు
గడవవైచిరి — తీర్థరక్షకులు వాని. ౫౮

వ. అత్తెఱం గెఱింగి తత్సఖుండైన శతమఖుండు చతుర్ముఖాదేశంబున దత్పాపంబుఁ బాయు నుపాయం బాదేశించిన—నా గంధర్వుండు సర్వ సర్వం సహాచక్రంబున నేము నీ శరణ్యంబులగు నరణ్యంబుల—పాపలతాలవిత్రంబు లగు పుణ్యక్షేత్రంబుల - ప్రపంచితపురుషార్థంబు లగుతీర్థంబుల నుపాసించుచు వచ్చి వచ్చి యఖిలలోకంబులఁ బావనంబు గావించు ప్రఫుల్ల పుష్కరామోద — పుష్కరయగు పుష్కరిణి నవగాహనంబు సేసి - శుద్ధమానసుండై యతిమధుర గానవిద్యావిశేషంబున - శేషశాయినిఁ బరితోషితుం జేసి — తత్ప్రసాదంబున - భువనసంస్తుత్యంబగు గంధర్వాధిపత్యంబుఁ బడసె - నది మొదలుగా నతం డీతీర్థంబున సితపక్షపంచమి దివసంబున - సర్వకల్యాణకారణు లగునారాయణుల నారాధించుచుండు - నేఁ డిట్టిదివసం బగుటఁ బూజాసముత్సుకంబున సపరిచ్ఛదుండై వచ్చు చిత్రసేనుకృత్యం బిదియని యెఱింగించినఁ బరమహర్షభరితుండై భరద్వాజుం డు వెండియు నిట్లనియె. ౫౯

క. సితపక్ష పంచమీతిథి,
నితరములగు వాసరముల నీతీర్థమునం
ధృతిఁ జేయవలయు నాద
వ్రత పూజావిధులఁ జెప్పవలయు మహాత్మా! ౧౦౦

చ. అనిన సనత్కుమారుఁడు ప్రియంబున-నాతనితో విహంగవా
హనునకుఁ బ్రీతిగాఁ బ్రతిపదాది దినంబుల నాచరించు పూ
జనలును-సువ్రతంబులుఁ బ్రశస్తజపంబులు-నాదిగాఁగఁ గ
ల్గిన నియమంబు లెల్ల నెఱిఁగించుచు నందు యథాక్రమంబునన్. ౧౦౧

క. ఏకాదశేంద్రియంబులఁ
బైకొను పాపముల నెల్లఁ బాపుచు ముక్తి
శ్రీకారణమై వెలసిన
యేకాదశి మహిమచంద మిట్లని చెప్పెన్, ౧౦౨

సీ. పటుఘోరపాతక పటల మహారణ్య
చటుల సముజ్జ్వల జ్వాలనకీల.
దుర్వార దారుణ దుష్కృతసంఘాత
మేఘ సంవర్త సమీరణంబు,
భూరి భీషణపాప పుంజసముత్తుంగ
భూమిభృన్నిశిత దంభోళిధార,
దుస్సహ దురిత సందోహనిరంతర
ధ్వాంతప్రచండ మార్తాండహేతి,

తే. క్రూరకల్మషకుంభి కంఠీరవంబు
భీకరాఘౌఘ పవనకుంభీనసంబు
కుటిల కిల్బిష పాథోధి కుంభసూతి
భాసురంబైన శ్రీ విష్ణువాసరంబు, ౧౦౩

క. ధృతి నచ్యుత దిన నిష్ఠా
శ్రితులగు రుక్మాంగదాంబరీషాదులు స

స్నృతి గనిరిగాదె మును శా
శ్వతకీర్తుల పరమభాగవతులం దెల్లన్, ౧౦౪

వ. అట్టి యేకాదశి ప్రకారం బెట్టి దనిన ౧౦౫

చ. దశమి ప్రభాతవేళ నుచితంబగు కాష్ఠముఁ బూని, మౌనియై
దశనవిశోధనంబు నుచితంబుగఁ జేసి కృతావగాహుఁడై
కుశలమతింగ్రియల్ నడపి, కోరి హరిం భజియించి యొక్కపూ
టశనము తా భుజించి శుచియై వనితారతిఁ దక్కి వేగినన్. ౧౦౬

క. మౌనమునఁ బుణ్యసలిల
స్నానం బొనరించి, సమయసముచితనిత్యా
నూనక్రియా కలాపము
మానక కావించి నియమమానసుఁ డగుచున్. ౧౦౭

శ్లో. ఏకాదశ్యా మహం కించి
దనశ్నన్ పురుషోత్తమ ।
భోక్ష్యేహని పరేశ్రీమన్
పాహిమాం శరణాగతం ॥

వ. అని సంకల్పంబు చేసి-

సీ. పరుల నిందింపక, పాషండ జనగోష్ఠి
సలుపక, యనృతభాషణము లాడ,
కాగ్రహింపక శూద్రు నంట,కింటనె యుండి,
లలనతోఁ గలయ, కన్యులకు నెగ్గు
సేయక, దుర్జనశ్రేణిసంగతిఁ బోక,
క్రయవిక్రయాదుల కసనిపడక,
కోర్కులు మదిఁ బుట్టకుండ నిద్రింపక,
యనుచితకర్మము లాచరించ,

తే. కమలమానసుఁడై యచ్యుతావతార
కథలు సద్భక్తి వినుచు భాగవతజనుల

సంగడంబునఁ గాలంబు జరుపవలయు
హరిదినంబున నుపవాసి యైనయతఁడు. ౧౯౦

వ. ఇట్లుపవసించి-సమంచితగోమయోపలిప్తంబును-ననేకపర్ణనియమపుంగకరంగ వల్లికాభాసురంబును-వివిధవిచిత్రవితానాభిరామంబును - బ్రవాళారుణపిప్పలి తోరణాలంకృతంబును,బరిబద్ధవిశుద్ధ ఫలవిసర ప్రసవమంజరీమంజులంబును, గంధతైలప్రదీపితదీపరాజితంబును నగుపూజామంటపంబున . సముచితాసీనుండై-నలినమణిప్రభా విడంబం బగునంబరంబు లాపీతాంబరునకు సమర్పించి-దర్పసారకర్పూరకలిత గంధసారకలిత కర్దమం బాజనార్దనున కలఁది యనల్ప మణికల్పితంబు లగునాకల్పంబు లాఫణితల్పునకు దొడివి, మరకతశ్యామాభిరామ కోమలతులసీదళదామంబు లావైకుంఠధాము కంఠంబున నునిచి-కించిద్వికసితముకుళవకుళపున్నాగ కేసరమాలతీ నవమాలికారచిత మాలికలావనమాలికిం దుఱిమి,ప్రభూతపతిమళిత దిశాంగణంబు నగు దశాంగ-ధూపంబు లాదశావతారుని కొసంగి-సారఘనసారశకల సముద్దీపితంబు లగుదీపంబు లాజగత్ప్రదీపునకు నివాళించి-హైయంగవీనపరిపక్వంబుల నానా రూపంబులగు నపూపంబులను మధురగుణసంపన్నంబులగు పాయసాన్నంబుల- నమృతకరకళామోదనంబు లగుశాల్యోదనంబులను మరిచ శర్కరా సంప్రవర్తితంబులై రుచిరపరిపాకంబు లగు శాకంబులను సరస రసాలవాలంబులగు ఫలజాలంబులను-గృతసుధాపరితోషంబు లగుపానీయవిశేషంబులను-నతిహృద్యంబు లగునైవేద్యంబు లావేదవేద్యునకు నివేదించి-యప్పుండరీకాక్షునకుఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి-బహువిధస్తోత్రపాఠంబులఁ బాటల నాటల వేగునంతకు జాగరంబు సేసి మఱునాడు కృతస్నానుండై కాల్యకరణీయంబులు దీర్చి యచ్యుతారాధనానంతరంబున గురువచనం బాచరించి శ్రీమదష్టాక్షరానుసంధాన నిష్ఠాగరిష్ఠులగు భాగవతశ్రేష్ఠుల నభీష్టమృష్టాన్నదానంబులఁ బరితుష్టి నొందించి- వారి కంచబుకుఁ జందనమాల్యాంబరాభరణాదు లాదరంబునఁ దనకుఁ గలకొలంది నిచ్చి నిజబంధుమిత్ర సమేతంబుగాఁ బారణ యొనర్చి- పునర్భోజనదివాశయన స్త్రీసంగమాదులం జరిగించక-వ్రతసమాప్తి సేయునతండు సప్తగోత్రంబుల నుద్ధరించి యక్షయానందపదంబగు వైష్ణవసదనంబు నొందు— ౧౯౧

ఆ.వె.విష్ణువాసరమున వినుము-కళామాత్ర
మైన దశమి గలసెనేని, వలవ
దుపవసింప దాన నొదవుఫలం బగ్నిఁ
దృణము గాలినట్లు త్రుంగిపోవు, ౧౧౨

ఉ. కావున నట్టివాసరము గల్గిన నాతిథి మాని, పారసిం
బావన బుద్ధి మీరు నుపవాసము జాగరణంబు దీర్చి యా
వేవినఁ బారణంబు కడువేడుకఁ జేసిన ధన్యుఁ డొందు, నా
నావిధయజ్ఞదానకరణంబునఁ జేకుఱు పుణ్యసంపదల్, ౧౧౩

చ. ఋతువులలో వసంతము మహీధరసంతతిలో సువర్ణప
ర్వతము, గ్రహంబులందు దినరాజు, తరంగిణులందుగంగ, గో
వితతులలో మరుత్సురభి, వేల్పులలో హరిఁ బోలె, నుత్తమ
వ్రతములలోన జక్రధరవారము సువ్రత మొప్పు నెంతయున్. ౧౧౪

సీ. ఖలుఁడు, స్వామిద్రోహి, గరదుఁ, డనాచారి
పరదూషకుఁడు, సురాపానరతుఁడు
గృహదాహకుఁడు, సత్యరహితుఁ, డన్యాంగనా
సక్తుండు, జీవహింసాపరుండు
గురుతల్పగుఁడు, కృతఘ్నుఁడు బ్రాహ్మణద్వేషి
పశుఘాతకుఁడు, సాధుబాధకుండు
వ్రతవిహీనుఁడు, సువర్ణస్తేయ, దుష్ప్రతి
హరజీవనుండు, దుష్టాన్నభోజి,

ఆ.వె. వేదనిందకుండు నాదిగాఁగల పాప
శీలు రెల్ల నితరచింత యుడిఁగి,
హరిదినంబు వ్రతము జరిపి శుద్ధాత్ములై
పడయఁ గాంతు రమృతపదము తుదను ౧౧౫

క. మును దేవవ్రతుఁ డనఁగాఁ
జనుభూసురుఁ డొకఁడు - యోగిజనసేవితమై

దనరెడు పుష్కరతీర్థం
బునఁ జిరకాలము వసించి పూతాత్ముండై. ౧౧౬

ఆ.వె. లీలఁ జూచి చూడలేనిసంపద సుఖ
స్ఫురణఁ దలఁచి విషయనిరతిఁ గుంది,
ప్రకటతేజుఁ డగుపరాశరశిష్యు, మై
త్రేయమునివరేణ్యు డాయ నరిగి. ౧౧౭

చ. వినయవినమ్రుఁడై - మొగము వెల్వెలఁ బాఱఁగ నున్నయాతనిం
గనుఁగొని, యమ్మునీశ్వరుఁడు - కారణ మెయ్యది ? నీవు దీనతం
బొనుపడి యిట్లు డయ్యుటకు భూసురసత్తమ ! నాకు జెప్పు నీ
మనసుకళంకు సర్వమును మాన్పెద నావుఁడు - నాతఁ డిట్లనున్. ౧౧౮

చ. తొడరిన శోకమోహముల త్రొక్కుడులం బడి చిక్కి పైపయిం
బొడము మహోపతాపములఁ బొక్కెడు ప్రాణులపాటుఁ జూచి - తా
నడరుచునున్న దుర్భవభయాకులతం గృశియించు నన్ను - ని
ట్లడుగఁగనేల నిప్పుడు మహాత్మ సమస్తము నీ వెఱింగియున్. ౧౧౯

క. ధీరమతి నెచటి కరిగిన
వారలు మఱి మాతృగర్భవాసములకు రా
రారూఢముగా మోహం
బేరీతిని బాయు, నాకు నెఱిఁగింపు తగన్ ౧౨౦

వ. అనిన మైత్రేయుఁ డిట్లనియె ౧౨౧

సీ. నిత్యుఁ, డక్షరు, డాత్మనిశ్చలుఁడ, విది స
చ్చిదానందభాస్వత్స్వరూపి,
తతగుణాత్మకము, నిత్యము సర్వకా
రణమును, భూతకారణమును దనర్చి,
పరఁగు నీరెంటిలోపలి తారతమ్యంబు
నరసి చూచిన మహదంతరంబు

ప్రకటితేజస్తమః పటలంబునకుఁబోలె
బరగు వీనికి పరస్పరవిరోధ

తే. మమల మగు నాత్మప్రకృతి సంగమముఁజేసి
కర్మవశుఁడై స్వతంత్రుఁడుగాక పొందు
నమరదేహాదులందు దుఃఖమును సుఖము
గానఁ గర్మక్షయము సేఁత కార్యఘనము. ౧౨౨

చ. శమమును దేహశోషణము శౌచము నింద్రియనిగ్రహంబు ని
ర్మమతయు నన్నహీననియమంబును మౌనము వేదశాస్త్రపా
రమును విరక్తియుం గడు దృఢంబగు సత్యమునుం, దపస్వరూ
పము లని చెప్పుచుండుదురు పల్మఱు ధర్మరహస్యకోవిదుల్. ౧౨౩

క. అట్టితప మనులవిత్రము
గట్టిగఁ జేపట్టి కర్మ మనులతల మొదల్
ముట్టఁ దునుము సరునకుఁ జే
పట్టఁగఁ బోలదె విముక్తిభవబంధముఁ-న్. ౧౨౪

క. కావున నుపవాసవ్రత
పావనతీర్థావగాహపరిణతమతివై
నీవు చరింపుము నావుఁడు
దేవవ్రతుఁ డత్తసిప్వతిలకున కనియెన్. ౧౨౫

క. ఏనెల యేదివసంబున
నేనేమముతోడ మనుజుఁ డేదేవునకుం
గా నుపవసింపఁ దగు-నీ
వానతి యీవలయు నాకు నత్తెఱఁగెల్లన్. ౧౨౬

వ. అని-మైత్రేయుఁ డాధాత్రీసురసత్తమునకు వ్రతోత్తమంబు హరివాసరోప
విదితంబుగా నిప్పుడు నీకుఁ జెప్పిన తెఱంగునఁ జెప్పిన, ననురాగతరంగి
తాంతరంగుండై యమ్మునిపుంగవు వీడ్కొని దేవవ్రతుండు తద్వ్రతాచరణం
బున సుదర్శనపాణిం బ్రీతునిం జేసి పరమయోగీంద్ర గమ్యంబును సహస్ర

కిరణసహస్రప్రభారమ్యంబును నగువిష్ణులోకంబున ననేకకల్పంబులు సుఖం
బుండె నని - సనత్కుమారుండు వెండియు నిట్లనియె. ౧౨౬

చ. కుశలుఁ డనంగ నొక్కనృపకుంజరుఁ డొప్పు, సురద్రుమమంజరీ
శశధర కుందకందుక విశారదశారదచంద్రచంద్రికా
విశదయశోవిశాలుఁ డరవిందహితాన్వయదీపకుండు, దో
ర్నిశితకృపాణ నిర్దళిత నిష్ఠురశాత్రవవీరుఁ డుర్వరన్. ౧౨౮

ఉ. ఆతఁడు ద్వాదశీవ్రతపరాయణుఁడై, కమలాక్షుఁ గౌస్తుభ
ద్యోతితవక్షు, నిండుమదితో భజియించుచు, నొక్కనాఁడు సం
జాతకుతూహలంబున నిజప్రియబాంధవుఁడైన భానుమ
త్పూతిఁ గనుగొనం జనియె సుందర హేమరథాధిరూఢుఁడై ౧౨౯

క. సమవర్తియు నానృపవరు
ప్రమదంబున గౌఁగిలించి - బహుమానముగా
రమణీయరత్నమయ పీ
ఠమునం జేసేతఁ దిగిచి డగ్గఱ నునిచెన్. ౧౩౦

క. ఆతఁడు దత్సముఖమ్మున
యాతనలకుఁ దిగువ విహ్వలాత్మకులై - త
ద్దూతలచేత దృఢగదా
ఘాతంబుల నొరయ నారకప్రకరములన్. ౧౩౧

క. కనుఁగొని భయంబు మనమున
బెనఁగొన, సంగములు వడక, బెగ్గిలి దీనా
ననుఁడై తపించి సింహా
సనవిమతియు నొంది యురుగు జననాయకునిన్. ౧౩౨

చ. కనుఁగొని కాలుఁ డిట్లను - జగన్నుతపుణ్యచరిత్ర ! నేఁడు నీ
మనమున నిట్టిభీతి పొడమం గతమెద్దియొ కాకవిస్మృతిం
దనుకుట కేమికారణము ? తప్పక చెప్పుము నాకు నావుఁడున్
వినయవినమ్రుఁడైన పృథివీపతి యాతనితోడ నిట్లనున్. ౧౩౩

క. నానావిధబాధలచే
మేనులు తుత్తుమురుగాఁగ, మిగిలిన వగలన్
మానక వాపోయెడి నీ
ప్రాణుల వీక్షించి భయము నందితి ననియెన్, ౧౩౪

క. ఆనరపతి కిట్లను రవి
సూనుఁడు, భూనాథ ! వింతచోద్యంబులు నీ
చే నెఱిఁగితి విట్టిది గల
దే 'నియతిః కేనలంఘ్యతే' యన వినమే ! ౧౩౫

క. దురితాత్ములకును, నిర్మల
చరితులకును, విపులదుఃఖసౌఖ్యము లొందం
బరమేష్ఠికల్పితము లగు
నరకస్వర్గములు నూతనములా తలఁపన్. ౧౩౬

క. మును చేసిన దురితమ్ముల
కనురూపములైన తీవ్రయాతనలఁ, గడున్
వనరుచు మొఱలిడు వారలఁ
గనుకొని నీ కేల భీతిఁ గంపింప నృపా ! ౧౩౭

ఉ. నావుఁడు నిట్లనున్ మనుజనాయకు ఁడాసమవర్తితోడ - నా
నావిధతీవ్రబాధల ననారతముం బరితాప మంది - వా
పోవుచునున్నవారు, తమపూర్వభవంబున నెట్టి పాపముల్
వావిరిఁ జేసినారొ ! బలవద్విషయవ్యసనాతిసక్తులై. ౧౩౮

ఆనతి యిమ్మన్న - నమ్మహీనాథుతో
ననియె వైవస్వతుం డనఘ! వినుము,
గురుల, దేవతల, భూసురులను నిందించు
దుష్టాత్ములను, మహాదురితమతులు,
నాచారహీనులు, నతినిర్దయాత్ములుఁ
గ్రూరకర్ములుఁ, గృతఘ్నులును, ఖలులు,

పరసతీకుచకుంభ పరిరంభనిరతులు,
విష్ణుమంగళకథా విముఖమతులు,

తే. నైన పాపాత్మకులు వీర, లట్లుగాన
వెమ్ముచున్నారు నరకాగ్ని విపులశిఖలఁ,
గరుణ భావించి నాకును గాచి పంప
రాదు, విధికల్పితంబు నిరాకరించి. ౧౩౯

వ. అనిన గృతాంతునకు నమ్మహీకాంతుం డిట్లనియె. ౧౪౦

ఆ.వె. సకలజంతుసమితి సుకృతదుష్కృతములు
నీ వెఱుంగుదేని, నేనొనర్చు
నట్టిపుణ్య మెద్దియైనను గల్గిన
నంతవట్టు నాకు నానతిమ్ము. ౧౪౧

చ. అనుడు పరేతనాథుఁ డహిమాంశుకులోద్భవుఁడైన యవ్విభుం
గనుఁగొని నీచరిత్రము జగన్నుతిమంతము -సర్వలోకపా
వనభవదీయకీర్తిసురవాహిని నీవు సమస్తపుణ్యవ
ర్తనులకు నెల్ల మేటివి, కరస్థము లారయఁ బుణ్యలోకముల్. ౧౪౨

చ. వ్రతములలోఁ బ్రశస్తము ధ్రువంబుగ మానవనాథ 'ద్వాదశీ
వ్రతమది- నీవునిష్ఠనొకవత్సర మర్థిఁ జరించినాఁడ వూ
ర్జితమగు నమ్మహత్వమునఁ జేసి భవద్భవసంచితాఘసం
తతి లయమొందెఁ దత్ఫలమితం బది యెంతని చెప్పవచ్చునే! ౧౪౩

చ. అనిన నృపాలుఁ డిట్లనియె నర్కజ ' యీనరకాగ్నులందు వే
దనఁ బడువీర లిందఱు ముదంబున సద్గతి కేఁగునట్లుగా
నెనయ మదీయపుణ్యమును నిచ్చెద నేనొకకొంత-నీవుచె
ప్పినగతి నంతవట్టు వినిపింపుము నావుఁడు ధర్ముఁ డిట్లనున్. ౧౪౪

ఉ, భానుకులావతంస 'యొకపారణ నే వుపవాససుంతఁగా
నైనఫలంబు వీరికి దయామతి నిచ్చినఁ దీవ్రయాతనల్

మాని ప్రమోదసంభరితమానసులై మఱి నీవుగన్గొనం
గా నమరేంద్రలోకముకుఁ గ్రందుగ నేఁగెద రిప్డు దండఋన్. ౧౪౫

వ. అనిన హర్షించి యారాజర్షివరేణ్యుం డగణ్యంబగు నెకద్వాదశీవ్రత పుణ్యఫలం బానిరయనివాసుల కొసఁగిన దత్‌క్షణంబ. ౧౪౬

శా. చంచత్కంకణముల్ చెలంగ సురయోషారత్నముల్ లీలమై
కుంచెల్ వేయఁగ, సిద్ధచారణవరుల్ గొల్వఁగ దివ్యప్రభా
తాంచత్కాంచన కింకిణీగణవిమానారూఢులై తేజముల్
మించం బోయిరి- నారకుల్, త్రిదివకేళీలోల చేతస్కులై. ౧౪౭

వ. అప్పుడమితేని కారుణ్యభావంబునకు భావం బలర నతని సంభావించి యావైవస్వతుం డిట్లనియె ౧౪౮

ఉ. కంటె నరేశ! దైవతశిఖామణియై, నిజభక్తకోటిన
ట్టింటినిదానమై! త్రిజగదీశ్వరుఁడైన సరోజనాభు లో
నంటినభక్తి గొల్చిన సమంచితపుణ్యఫలంబు పెంపు,ని
ష్కంటకమోక్షమార్గ మని చాటుఁ గదా హరిసేవ వేదముల్! ౧౪౯

క. వెఱవకు భవతాపములకుఁ
బఱవకు పరదైవతముల భజియింపఁగ వా
చఱవకుము భోగవితతికి,
మఱవకు హరి నీవు వేయుమాటలు నేలా! ౧౫౦

ఆ.వె. అని హితోపదేశ మొనరించి, సఖ్యంబు
వెలయ నాదరించి, వీడుకొల్ప
మగిడివచ్చి కుశలమండలాధీశుండు
నిజపురంబునందు నెమ్మి నుండె. ౧౫౧

సీ. అతిభక్తి హరిదినవ్రత మాచరించిన
దురితముల్ దవ్వులఁ దూలిపోవు,
సకలపుణ్యంబులు సమకూరు, నాయువు
పెంపొందు, నెలమి సంపదలు మిగుల

విజయంబు సిద్ధించు, విద్యలు చేకూరు,
నైశ్వర్య మంతంత కతిశయిల్లు,
సంతానమందుఁ, దేజము మీఱు, నారోగ్య
మొసఁగుఁ గీర్తులు దిశలెల్ల నిండు,
తే. నమరులకునైన దుర్లభ మగుచు వెలయు
నట్టివైష్ణవకులమునఁ బుట్టఁ గలుగు
విమలవైరాగ్య మంతయు విస్తరిల్ల
నొనర నచ్యుతపదమున నుండుఁ దుదిని. ౧౩౨

వ. అని చెప్పిన, సనత్కుమారుండు సగరుండగు భరద్వాజుచేతఁ బూజి తుండై - యథేచ్ఛం జనియె, జయధరధరాధీశుండును బ్రాచేతసప్రబో ధితుండై తద్వ్రతం బాచరించిన సకలవిపద్విముక్తుండును - బరిపూర్ణ మనోరథుండునునై - విగతోపద్రవంబును — వితతభద్రంబును నగు నిజ చక్రం బవక్రవిక్రమంబున బరిపాలింపుచు - బలపరాక్రమోదారులగు కుమారుల నూర్వురం బడసి తత్పుత్రపౌత్రసమేతంబుగాఁ బెద్దకాలంబు సంతానానందభరితుండై యుండి - యొక్కనాడు— ౧౩౩

మ. అతులస్యందన గంధవారణ తురంగానీకముల్, సత్పురో
హిత సామంత సుతాప్తవర్గము ప్రియం బేపారఁ దన్గొల్చిరా
వితతైశ్వర్యసమేతమై నిగుడ - నుర్వీనాథుఁ డేఁగెన్ - విరా
జితరంగేశ పదారవిందయుగళీ సేవాసముల్లాసియై. ౧౩౪

క. ఈజాడ నరిగి, త్రిభువన
పూజిత మగు బిల్వతీర్థమున నెలమి భర
ద్వాజాది శిష్యయుతుఁడై
రాజిల్లెడు ఘనతపోభిరతు వాల్మీకున్, ౧౩౫

చ. కని వినయంబు సంభ్రమముఁ గౌతుకమున్ మది నెక్కొనంగ — మ్రొ
క్కినఁ, గడు గారవించి, మునికేసరి యవ్వసుధాతలేశునిం
పసుఁ గదియంగ నుంచి, యుచితంబగు పూజ లొనర్చి సేమమే
మనుజవరేణ్య ! నీకును - గుమారులకున్ సుహృదాప్తకోటికిన్. ౧౩౬

వ. అని కుశలప్రశ్నంబు గావించె, నప్పు డాపార్థివోత్తముండు, ౧౫౭

సీ. కమనీయ తీర్థావగాహనోత్సాహులై
సతసపడు మహాసంయములును-
సదమలభూరుహచ్ఛాయల హరికథల్
రాణింపఁ జెప్పు పౌరాణికులును
సలలితసైకతస్థలముల హరిపూజ
గావించు పరమభాగవతవరులు
స్ఫటికోపలములందుఁ బ్రణవమంత్రాభ్యాస
రతచిత్తులగు పరివ్రాజకులును

తే. భయద దుర్భర ఘననిదాఘప్రతప్త
జంతుచాతక జలధరసమయ మగుచు
నఖిలలోకైక పావనమై దనర్చు
బిల్వతీర్థంబుఁ జూచి సంప్రీతి నొంది. ౧౫౮

శా. స్నానం బందొనరించి, నిత్యవిధు లోజం దీర్చి యచ్చోటి స
న్మౌనిశ్రేణికి భక్తి మ్రొక్కి, పిదపన్ వారందఱుం దోడరా
భూనాథుం డటఁ బోయి గాంచె-మణివిస్ఫూర్జన్మహాగోపురా
గ్రానూనధ్వజతుంగమున్- గుహరమాయాభంగమున్ రంగమున్ ౧౫౯

చ. కనుఁగొని డాసి -యచ్చట నకల్మషబుద్ధులు నిత్యసిద్ధులుం
జనసుతసౌమ్యమూర్తులును సన్మణిభూషణ నవ్యమాల్య చం
దనఘనతాభిరాములును, దామరసాక్షసమర్చనక్రియా
జనిత సముత్సుకాత్ములును, శాంతులునై విలసిల్లు పుణ్యులన్. ౧౬౦

ఆ. వె. రత్నభూషణాంబరమ్ములు ప్రత్యగ్ర
భూరివస్తుతతులఁ బూజసేసి,
వందనం బొనర్చి వారిసంగతి రంగ
మందిరంబుఁ జొచ్చె మనుజవిభుఁడు ౧౬౧

శా. సేవించెం జగదేకబంధుఁ గరుణాసింధున్ సమున్నిద్ర రా
జీవాక్షుం గమలాఘనస్తనయుగశ్రీఖండసంవాసిత

శ్రీవత్సాంకితవక్షు, నీలమణి సుస్నిగ్ధాంగు, రంగేశ్వరున్,
భావాతీతు మహానుభావు ఫణిరాట్పర్యంక సంశోభితున్ ౧౬౨

తే. పిదప నద్దేవు పరిచారబృందమునకు,
గొలఁది యిడరాని ధనములు వెలయ నొసఁగి
యతులవిజ్ఞాన సంపన్నులైన యట్టి
సంయమీంద్రులుఁ దాను నాచక్కి వెడలి ౧౬౩

మ. ధరణీనాధుఁడు గాంచెఁ దప్తకనకోద్యత్పక్షు శుంభద్దివా
కరబింబస్ఫురితాస్యుఁ దీవ్రనఖసంఘాతున్- బృహద్వక్షు-భా
సురు నాత్మప్రమదప్రభూతు విహగస్తోమావృతున్ సిమ్నగాం
తర చంచత్పులినాసనసుని శకుంతశ్రేష్ఠు దానొక్కరున్. ౧౬౪

క. కమలాక్ష ! రంగనాయక !
కమలావల్లభ ! సమస్తకారణ ! పురుషో
త్తమ ! యనుచు మాటిమాటికిఁ
బ్రమదాశ్రువు లుప్పతిల్లఁ బలికెడువానిన్. ౧౬౫

క. కని విస్మయంబు మనమున
దనుకం గనుతెప్ప లిడక, తనుఁ జూచునృపా
లునితోడఁ బక్షిపుంగవుఁ
డనియెన్ ఘనమై గభీర మగు వాక్యములన్. ౧౬౬

తే. ఎవ్వడవు నీవు ? నీ కులం బెద్ది ? నీకు
జనకుఁ డెవ్వఁడు ? బహుసైన్య సమితితోడ
నిటకు వచ్చిన కారణం బేది చెప్పు !
మనిన నా ఖగముఖ్యున కనియె నృపతి. ౧౬౭

ఉత్సాహ: అనఘ ! సోమవంశ తిలకుఁడైన తీర్థధరుని నం
దనుఁడ, జయధరుం డనంగఁ దనరువాఁడ లోకపా
వన విచిత్రమహిమ గలుగువాఁడ నెసఁగు పుష్కరం
బునకుఁ దీరమాడ వచ్చి భోగిరాజతల్పునిన్. ౧౬౮

క. శ్రీరంగభర్తఁ గరుణాం
భోరాశి భజించి మగిడిపోవుచు నిచటం
బ్రారబ్ధ కర్మఫలమున
భూరిజ్ఞాననిధి నిన్నుఁ బొడగనఁ గంటిన్. ౧౬౯

ఉ. వారనిదప్పిఁ దట్టువడువానికిఁ జల్లనినీరు నాకటం
గూరి కృశించు దీనునకుఁ గోరినయన్నముఁ జాల లేమిచే
నారటమందు పేదకు మహానిధియున్ సమకూరినట్లు- వి
ద్యారతి నున్ననా కొదవెఁ దావకసంగతి పక్షిపుంగవా! ౧౭౦

క. వితత భవానల కీలా
ప్రతతి ననారతముఁ జాలఁ బరితప్తుఁడనే
కృతిమాలియున్న నాకే
గతి నిత్య సుఖావహంబు గలుగు మహాత్మా! ౧౭౧

వ. అనినఁ దద్వచనంబులకు సంతసించి- శకుంతవల్లభుం డిట్లనియె. ౧౭౨

ఆ వె. మున్ను మునులు- యోగముఖ్యులు నిగమాబ్ధి
తలఁపుఁ గవ్వములను దఱచి తఱచి
తనరఁ దెచ్చినట్టి తత్త్వామృతంబు నీ
కే నుపన్యసింతు మానవేంద్ర! ౧౭౩

చ. అవిరళకర్మపాశనిచయంబులచేఁ బ్రతిబద్ధుఁడై - భవా
ర్ణవమున మున్గుచున్ భయమునందెడు కష్టపుదేహికిన్ నృప
ప్రవర! ముకుందపాదయుగ పంకజసంస్మరణంబు దక్క-నె
య్యవియు సముద్ధరింప నసమర్థము లన్ని దురుక్తులేటికిన్, ౧౭౪

క. కనుమూసి తెఱచినంతన
మునుకొని కాలంబు భూతముల ప్రాణంబుల్
గొనుఁగాన, మోక్షయత్నం
బనఘా! తడయక నొనర్పనగుఁ బ్రాజ్ఞులపస్, ౧౭౫

క. క్రీడారతుఁడై, పిన్నట
నాఁ డెఱుఁగఁడు, యౌవనంబునం గాముకుఁడై -
యాడుకొను, ముదిమి నామయ
పీడలఁ బడి చిక్కి మొఱలు వెట్టుచునుండున్, ౧౬౫

వ. కావున- ౧౬౬

క. త్రాడువడి యింద్రియంబులు
పోఁడిమి చెడిపోనినాఁడు, పుణ్యము సేయన్
లేదేని వాని కొదవునె
మూఁడేండ్లకు లేనిబుద్ధి ముప్పదియేండ్లన్, ౧౬౭

క. ఒక్కెడ నఖిలజగంబుల,
నొక్కెడను విరక్తు నునిచి యొగిఁ దులదూఁగన్
మిక్కిలి శక్తి విరక్తుఁడ
తక్కక ములుసూపె నద్భుతంబుగ నధిపా, ౧౬౯

క. కలితసరసాన్న లలనా
కలనాద వినోద మధుర గానంబులపై
పలుదెసలఁ బాఱు మనసుకుఁ
గలుగునె వైరాగ్య మెంతకాలముకైనన్, ౧౭౦

క. పుట్టును జావును వెస నివి
కట్టిడి వైరాగ్యమునకుఁ గసుమఱువై, యి
ట్టట్టు చలింపని యఘముల
పట్టడపఁగ జాలుఁ దీర్థభజనంబు నృపా! ౧౭౧

మ. నరనాథోత్తమ! పుణ్యతీర్థములలోనం బెద్ద, యాచంద్రపు
ష్కరిణీతీర్థము, దివ్యదేశముల శస్తంబైన శ్రీరంగమా
హరికిన్ నిత్యనివాసమై యునికి, నట్లౌఁటం బ్రియంబార సీ
సరి దక్షార్ణమునన్ వసించితి మనస్తాపాపనోదార్థినై, ౧౭౨

క సకలకలికార్షకల్మష
నికరనిరాకరణమహిమ నెగడి మునీంద్ర
ప్రకటిత మగు నితిహాసం
బొకటి గలదు చిత్తగింపు ముర్వీనాథా! ౧౮౩

సీ. మును ప్రభాకరుఁ డనుముని, గర్గగోత్రసం
జాతుండు గలఁడు, ప్రశాంతచిత్తుఁ,
డవిరతబ్రహ్మచర్యాన్వితుండు నసమ
ప్రతిభావిశేష సంపన్నుఁ డతఁడు—
పటు తపశ్శక్తిమై పరమాయు వేపారఁ
బడసి విశ్వంబరాభార మెల్లఁ
గలయఁ జరించుచుఁ గలకాల మెల్లను
వినుత వేదాభ్యాస మొనరఁ జేసి

ఆ వె. పార మొప్ప దానిఁ బరియింప శక్రుండు
నాకవిపులపాకకలితుఁ డగుచు
చిన్నబోయి యాత్మఁ జింతించి తపమున
నిజమనోరథంబు నెరపఁ బూని ౧౮౪

క. నాలుఁగు దెసల నుదగ్ర
జ్వాలాభీలంబులైన వహ్నుల నడుమం
గాలియ తన కశనముగాఁ
గ్రోలుచు బదియేండ్లు నడచెఁ గొంచక మఱియున్. ౧౮౫

క. కొంచెపుటూర్పును బుచ్చక
పంచాబ్దంబులు చరించి పాదాంగుష్ఠం
బించుక ధరపై నూఁది, య
చంచలుఁడై తపము మూఁడు సమముల్ సలిపెన్. ౧౮౬

ఉ. ఆమెడ వేదముల్ కడు ఘనంబైన వొంపముఁ బెక్కువిఘ్నముల్
పాయక చేసినం దరలఁ బాటక వానిఁ దృణీకరించి- య

న్యాయత యోగశక్తి హృదయంబుఁ దిరంబుగఁ జేసి చిత్రరూ
పో యనఁగా శిలాప్రతిమయో! యన నుండె నతండు ధీరతన్. ౧౮౭

ఉ. వానిమహాతపోజనితవహ్ని భయంకరలీలఁ బేర్చి ది
గ్భూనభమున్ సముజ్జ్వలితభూరితరార్చులఁ గాల్పఁ జొచ్చినన్
మానసముల్ గలంగి శతమన్యుని ము న్నిడికొంచుఁ బద్మజుం
గానఁగ నేఁగి నిర్జర నికాయము లోలిఁ గృతప్రణాములై. ౧౮౮

తరల. అవధరింపుము లోకనాథ! ప్రభాకరుండను భూసుర
ప్రవరుఁ డిప్పు డొకండు తీవ్రతపం బొనర్చుచు నున్నవా
డవిరళంబగు తత్తపః ప్రభవాగ్నికీలల వేఁడిమిన్
భువనముల్ పరితాపవేదనఁ బొందియున్నవి గావునన్. ౧౮౯

క. ఏ పగిదినైన నిఁక నీ
యాపద మానింపు మనుచుఁ బ్రార్థించిన వా
ణీపతి వారు న దానును
నా పరమ తపస్వికడకు నరుదెంచి తగన్. ౧౯౦

క. భూదేవకులోత్తమ నీ
మేదుర తపమునకుఁ జాల మెచ్చితి నిదె నీ
కేది ప్రియ మడుగు మనుటయు
నాదివిజశ్రేష్ఠుతోడ నతఁ డిట్లనియెన్. ౧౯౧

క. ఎడపక వేదము లన్నియుఁ
గడముట్టం జదువుకాంక్షఁ గమలాసన! యీ
బెడిదమగు తపము సేయం
గడఁగితి నటువంటి వరము గరుణింపు తగన్. ౧౯౨

వ. అనినఁ బరమేష్ఠి భూసురశ్రేష్ఠున కిట్లనియె, ౧౯౩

చ. అతులతపంబు భూతనివహంబున, కుద్భటఘోరపాతక
ప్రతతి నడంపఁగా దగు మపాయ మభీష్టఫలప్రదాయకం
బతిశయసౌఖ్యమూల మటులౌటఁ జిరాయువు భూరిశక్తియున్
వితత తపోబలంబునన విశ్వపితామహ నాకుఁ గల్గెనిన్, ౧౯౪

చ అనిన విరించి యిట్లను-మహాద్భుతమైన భవత్తపంబు పెం
పున, సులభంబు లైనవి, సమున్నతశాశ్వత పుణ్యలోకముల్,
జననుత నీకు నం దమితసౌఖ్యము లొందుచునుండుఁ గాక యీ
యనువున నందరాని ఫల మందఁగ జేతులు జాఁచ నేటికిన్ ౧౯౫

వ. అనిన నతం డిట్లనియె, ౧౯౬

క. మది కింపుగాని మాటలు
పదివేలును జెప్పనేల భాషాధిప! యిం
పొదవెడి నాదివిజాధిప
పదమైనను నొల్ల వేదపారముదక్కన్, ౧౯౭

వ. అనిన నామాటలు సమ్మతింపక భారతీకాంతుం డంతర్హితుం డయ్యె, నాప్రభా
కరుండును దృఢనిశ్చయుండై వెండియు నతిఘోరతపంబు గావింప నిలింప
ప్రణోదితుండై చతుర్ముఖుండు మఱియు రెండువరుసల నాతపోధనసత్తము
పాలికిం జనుదెంచి యతని పూనిక వదలింపలేక నిజలోకంబున కరిగె -
నంత ౧౯౮

శా పాదం బొక్కటి నేలనూఁది-శుచియై పంచాగ్నిమధ్యస్థితుం
డై, దృష్టుల్ దివిఁ జేర్చి- యమ్మునివరుం డస్వీకృతాహారుఁడై
వేదాత్మున్ విధివిష్ణు శంకరమయున్ విశ్వైకసంపూజ్యు న
య్యాదిత్యున్ మది నిల్పి చేసెఁ దప మత్యంతస్థిరస్వాంతుఁడై. ౧౯౯

చ అరుదుగఁ దత్తపంబు మహిమాతిశయంబున కిచ్చ మెచ్చి బం
ధురమణిభూషణ ప్రతతితోఁ బరితప్త సువర్ణవర్ణ వి
స్ఫురణ దలిర్ప మేనిజిగి పొత్తొసగూడి ప్రవాళపాటలాం
బర కుసుమానులేపన విభాసురుఁడై యతఁ డున్నచోటికిన్ ౨౦౦

సీ. తొవలనాకట్టు చందురుతోడి పెన్నుద్ది,
తమ్మిలవిందు వేదములప్రోవు,
వెన్నెలపులుగుల వెఱ గొంగ జక్కవ,
కపల మోహపుమందు క్షైటభారి,

కుడికన్ను పచ్చని గుఱ్ఱాలధీరుండు,
మూఁడుమూర్తుల.గట్టి వేఁడివేల్పు.
కైవల్యముకుఁ ద్రోవ గ్రహముల మొగదంబు
మునిమిడి చీకటి మాకవిప్పు

తే. జనుల మ్రొక్కులజంట తేజముల నెలవు
వరుసఁ బండ్రెండు నామముల్ పరఁగుమేటి
గగనరత్నంబు త్రిభువనకర్మసాక్షి
భానుఁ దేతెంచె దేదీప్యమానుఁ డగుచు, ౨౦౦

తే. ఆ త్రెఱంగున నరుదెంచినట్టి లోక
బాంధవునిఁ జూచి, నిజమనః పద్మ మలర
ధరణిఁ జాఁగిలి మ్రొక్కి, హస్తములు మొగిచి,
యాప్రభాకరుఁ డిట్లని యభినుతించె. ౨౦౨

లయగ్రాహి. జయజయ సకలదివిజచయమకుట
ఘటిత మణిచయ రుచిరపదయుగళయకలపద్మ-
ద్వయ నిబిడతర తిమిరలయకరణ చణ, హరిత
హయవిహిత సుజనభవభయశమన, నానా-
మయవిపిన హదన ఫణిశయన వరచరణ వృత
నియమ మునినుత నిగమమయ సరసిజాతి
ప్రియదురితహర నిరతిశయమహిమ వితత రథరయ-
విహగ విభవకువలయవన దినేశా. ౨౦౩

క. శ్రీకరములు, సుమహిత శో
భాకరములు, భవవిషోపహరజంతు సుధా
శీకరము, లబ్జ బాంధవ
నీకరములు దనుజకుముదినీ భీకరముల్, ౨౦౪

క. అని వినుతించి ప్రభాకరుఁ
గనుఁగొని రవి నీ తపంబుఁ గడుమెచ్చితి-నీ
మనమున కెద్ది యభీష్టం
బనఘా ! వినిపింపు మనిన నతఁ డిట్లనియెన్, ౨౦౫

ఉ. పారముసందఁగా సిగమపార మొనర్పఁగఁ బూని యాగతిన్
ఘోరతపంబు సేసి కనుగొంటిని-వేదమయాత్మ-భక్తమం
దారుఁ, ద్రిమూర్తి, శక్తియుతు, దారుణదుర్భవవైరి, నిన్ను నా
కోరిక జాగుసేయ కొడఁగూడఁగ జేయుము సత్కృపామతిన్ ౨౦౬

వ. అనినఁ బ్రభాకరునకు విభాకరుం డిట్లనియె, ౨౦౭

క. పురుషుని పురుషార్థంబుల
నరికట్టు, ననేకవిధ భవార్జిత దురితో
త్కరముల వినాశ మొందఁగఁ
బరిపూర్ణముగా నభీష్టఫల సంసిద్ధుల్, ౨౦౮

క. కావున బాపక్షయమగు
నావెర వెఱిఁగింతు నీకు నబ్జోదరని
త్యావాసమై త్రిలోకీ
పావనమగు రంగధామ పరిసరభూమిన్, ౨౦౯

వ. సకల తీర్థోత్తమం బగు పుష్కరిణీ తీర్థంబు గల దచటికిఁ జని తపంబు గావింపు మానెపంబున నశేషదోషఘ్నంబులగుఁ గావునం దత్సంకల్పంబు ఫలియించు— నింక నొక్క విశేషంబు వినుము. ౨౧౦

సీ. కలఁడు సునేత్ర విఖ్యాతుఁ డచ్చటనొక్క-
పక్షీంద్రుఁ డతఁడు దపంబు పేర్మి—
నజునిచే వేదంబు లన్నియుఁ దుదముట్ట
నెఱుఁగు నట్లుగ వరం బెలమి వడసి
యఖిలవిద్వత్ జ్ఞానియై నిర్మలజ్ఞాన
పరుఁడయి భోగైకనిరతుఁ డగుచు
నాత్మసమాన సాచారసంపన్ను
లగు విహంగములు తన్నర్థిఁ గొ...

ఆ.వె. రంగనాథు దివ్యమంగళవిగ్రహ
ధ్యాన సౌఖ్యలీలఁ బూని పెద్ద

గాల మెసఁగి పొల్చు కావేరితటమున
నొక్కదినముఁ బాయకున్నవాడు. ౨౧౧

క. నీ వచటికిఁ దడయక చని
యావిద్వత్ప్రవరు చిత్త మలరఁగ, భక్తిన్
సేవించి యడుగు మెఱుఁగుము
కావలసిన వెల్ల నతఁడు క్రమమునఁ దెలుపున్. ౨౧౨

తే. అనిన నాతాపసోత్తముఁ డబ్జమిత్ర !
యతులితజ్ఞాననిధియైన యమ్మహాత్ముఁ
డేమి కతమునఁ దానొందె నీఖగత్వ
మానతిమ్మన్న నతని కిట్లనియె నినుఁడు. ౨౧౩

క. ఖగవిహగ ప్రముఖాకృతు
లొగిఁ బూని మహాత్ము లుందు రొక్కొకయెడలన్
జగమున దమతమ తలఁపులు
నిగిడిన సంప్రీతి నదియె నెపము దలంపన్. ౨౧౪

మ. క్షితిపైఁ జిక్లిత కాఖ్యకద్విజుఁడు లక్ష్మీనాయకున్ మున్ను స
న్మతి నత్యుగ్రతపంబు పెంపునఁ బ్రసన్నస్వాంతుఁ గావింప నా
శ్రితరక్షామణియైన యవ్విభుఁ డతిప్రీతిం దదీయాంతికా
గతుఁడై వేఁడు వరంబు నీ వనిన నుద్గాఢప్రమోదాత్ముఁడై ౨౧౫

క. ధర జాఁగి మ్రొక్కి భక్తిం
గరములు ముకుళించి నుదుటఁ గదియించి శ్రుతి
స్ఫురితములగు సూక్తంబులఁ
బరువడి వినుతించి విన్నపం బొనరించెన్. ౨౧౬

క. వారిజదళలోచన నేఁ
బారము నొందంగ వేదపఠనము సేయం
గోరెద నవ్వర మొసఁగుము
కారుణ్యము నివ్వటిల్లఁగా నిపు డనినన్. ౨౧౭

ఉ. శ్రీతరుణీవిభుం డతనిచిత్తవిశుద్ధికి నెమ్మనంబునం
బ్రీతి దలిర్ప భూసురవరేణ్య ! శ్రుతుల్ గలయంతవట్టుఁ బ్ర
ఖ్యాతముగాఁగ నీవెఱుఁగునట్లుగ నిచ్చితి నస్మదంఘ్రిసం
జాతనిబద్ధశక్తిని నజస్రము నీమదిఁ బాయకుండెడిన్. ౨౧౮

మ. క్షితిదేవోత్తమ ! సేయు మింకొకటి భక్తిన్ సర్వవిద్యాధిదే
వత నంభోరుహగర్భుదేవిఁ ద్రిజగద్వంద్యన్ శరచ్చంద్రి కాం-
చితవర్ణోజ్వల - నర్థి భారతిఁ దగన్ సేవింప నీ కాసర
స్వతి యిచ్చున్ నిగమాదివిద్యలు సమస్తంబున్ బ్రసన్నాత్మయై. ౨౧౯

వ. అని యానతిచ్చి యచ్యుతుం డంతర్హితుం డయ్యె - నయ్యగ్రజన్ముండును సమగ్రంబగు పూజావిశేషంబుల నావేవి నారాధించి యిట్లని బ్రస్తుతించె. ౨౨౦

గద్య .- శ్రీమదఖిలభువన చరాచర ప్రచురరచనామనోహర చతురానన మానస మానసాంతర్నిరంతర కేళివిలోల మరాళబాలికా, మనల్పకల్ప ప్రసూనాకల్పితచూలికా మరాళవిహార రమణీ రమణీయ మణికంకణ ఝణ ఝణారావముఖర కరతామరస సమంచితా చంచరీకాచంచల చంచరీక నీలాల కాంతకాంతాం. సేవాయత్త దిక్పాలకాంతా, మష్టమీ శశాంకాహంకారధిః కార పటునిటలతల తిలకాయమాన తృతీయనేత్రాం, కరకలితలలితాక్ష సూత్రా, మసమ శరశరాసన విలాసాపహాసభాసమానత భ్రూలతా విభ్ర మారుణాంత సీమా, మగణ్యలావణ్య సరోవరవిహారహారి శఫరాయమాన కర్ణాంత విశ్రాంతలోచనాం, కృతకృపణ కృపారస సేచనాం, మదీయ్ప్ర వికసితాగ్రలంబమానహిమ బిందు సుందరతిలకుసుమ సముల్లాస మౌక్తిక నాసికోద్భాసితాం, యోగిజనశాంత స్వాంత సంవాసితా, మిందుకాంత దర్పణ విదగ్ధ స్నిగ్ధకపోల మాలికాభ్యర్ణ వికీర్ణవాలుకాసక్త ముక్తాఫలకాంతా గళిత మందస్మితసాంద్ర చంద్రికాసదన వదన చంద్రమండలా, మమల ప్రకర్పూరకుండలా, మధరీకృతానేక మణిభంగ మంగళ సుషమావిశేషా ధరబింబా, మఖిలజగదంబా, మతివిమలకంబు ప్రతిబింబ శోభాబంధు బంధుర కంధరాం, వివిధవిలాసమంధరా, మారూఢ బాలప్రవాళ లలిత పారిజాత లతా గర్వ నిర్వాపణ క్రియాచతురచతుర్బాహాం, భజమాన దాన ఘారి సమూహా, మభ్రముకరికుంభ శుంభత్కూటట పాటవాభిషంగ ప్రసంగ

సముత్తుంగ శృంగార రసతరంగిణీ రథాంగ మిథునాయత పృథుస్తన విన్యస్తకాంచన విపంచికా పంచమస్వర సుధారసాస్వాదనాదర మేదురా మోదజనిత రోమాంచ కంచుకితకోమలాంగీం, నిగమవనసంచార సారంగీ, మమర్త్యసరిదావర్త నివృత్తప్రవర్త గంభీర నాభిసరః కూల తమాలలతా యత శ్యామసాధ్య మధ్యభాగాం, మహాభాగా, మధ్యుషిత నిశితపయోరుహ భోగపరాగాను రాగానూదితమదవ దళిమదవతీ వినీల నీలమణిఘృణి సారస రశనా నితంబబింబాం, హృద్యాధరవిద్యాధర మానినీ జేగీయమాన గుణ కదంబా, మంబుదావసానసమయ సముదిత సంపూర్ణ పూర్ణిమాచంద్ర చంద్రికా పటలానుకూల దుకూలాంతర తరత్ప్రభారంభరంభా స్తంభ శోభా విజృంభణ స్తంభనోదీర్ణ వర్ణనీయోరుయుగళాం, విమోచిత సంసారనిగళా, మృజురచిత కావాళోదారచారుతా సముల్లంఘన జంఘాల జంఘావిలాసా, మఖిల సుమనోమనోనివాసా, ముదయ దహిమకర కరనికర దరదరుణతర తరుణసరసిరుహ విలసన పరిహసన పరికరణ పరిణత జతురస కలిత మృదుపదయుగళయుగప దవనతచతుర ఖచరయువతివిసర లసదలికతల తిలకమృగమద జలకణ జనితకళంక శంకాకర నఖరశశంకాభిరామా, మస మానభాగ్యసీమా మవిరళతరళ తారకాతివృత్త ముక్తాఫలహార కేయూరవలయ భద్రముద్రికా మంజు మంజీర ప్రముఖ నవ్యాభరణ కిరణస్ఫురణ పరిణాహ దేదీప్యమాన దివ్యదేహాం, కమలభవవదనగేహా, మీహానురూప వరప్రదాన కరుణారసతరంగి తాపాంగవిలోకాం, పరిపాలిత సకలలోకా, మిందుకుంద చందనమందారక బృందారకవాహినీ నీహార హార హర హీరాదిసమస్త గౌరవస్తుతివైకల్య కరకల్యాణ కల్యాఘనాపఘనసీకాంతి విశద విశదీకృత దశదిశావకాశాం, విముక్త భక్తమోహపాశా, మారూఢ వేదాంగాద్యశేష విద్యావిశేష పరిషదున్మీలిత విశ్వదృశ్య ప్రపంచ వైభవాం, దూరీకృతభవా, మభిధానభేదాపాదితానేక దేవతాశక్తిభా వానుభావైకభా స్వరూపాం, కలకంఠ కలాపా, మఖినపశరద నేహారంభ విస్రంభ విజృంభమాణ రోహిణీరమణ కిరణనిరుద్ధ సమృద్ధ దుగ్ధార్ణవ సహోద్భూతబహుల లహరీ ఘుమఘుమధ్వాన సంరంభ సాహిత్య సుకవిశుకనికర ఫలభరిత మధుర మాకందశాఖాం, శేఖరీకృత శీతాంశురేఖా, మమిత సౌభాగ్యసారదాం, శారదాం, మన్మహే- మన్మహే. ౨౨౧

వ. అని వినుతించి. ౨౨౨

తె. మౌక్తికాక్షసూత్ర మాణిక్య వల్లకీ
కలితపాణిఁ బద్మగర్భురాణి
వాక్య రాజకీర వరనీలవేణికా
కలితయైన వాణి గారవించి. ౨౨౩

క. తడయక ప్రత్యక్షంబై
యడుగుమ మమ్మనిన నాతఁ డామ్నాయంబుల్
గడముట్ట నెఱుఁగువైఖరి
గడనొత్తఁగ నొసఁగు మనినఁ గరుణ దలిర్పన్. ౨౨౪

వ. ఆవాగ్దేవి భూదేవున కిట్లనియె. ౨౨౫

క. నాముందట విహరించెడి
నీ మహిత పతగచతుష్క మిప్పు డుమిసిన యా
యామిషము నమలు మిఁక నీ
యామిషముక నొసవు నీకు నభిమతసిద్ధుల్, ౨౨౬

చ. అనుటయు నట్ల కాకని రయంబునఁ దానును బక్షిరూప మిం
పెసయ ధరించి, తత్పలల మించుకయేనియుఁ జిక్కనీక, చ
క్కన భుజియించి యున్న నధికంబగ శాఖల గల్గు వేదముల్,
తనమదిఁ బ్రస్ఫురింప వసుధామరపుంఖుఁడు నాటినుండియున్ ౨౨౭

క. ఆ విహగ విమలరూపము
తా వదలకయున్నవాఁడు తత్సన్నిధికిన్
నీ వరుగు మనిన నాభూ
దేవుఁడు వెండియును దిగ్మదీధితితోడన్, ౨౨౮

క. ఆ విహగము లెవ్వియు-శుచి
భావుండగు విప్రుఁడెట్లు-పతగోచ్ఛిష్టం

బేవలనను శంకింపక
తా వేడ్క భుజించె ననుచు దపనుడు పలికెన్ ౨౨౯

చ. వెలసిన తద్విహంగములు వేదము లాపలలంబు సర్వవి
ద్యలు నొకటైనముద్ద పతగావళి కామితవాంఛ యెంతయుం
గలుగుట జేసి, యమ్మునిశిఖామణియున్ వలనొప్ప బక్షిరూ
పలర ధరించె నంచు దెలియన్ వినిపించి దినేశు డేగిసెన్. ౨౩౦

వ. ఆ ప్రభాకరుండును, ప్రభాకరోపదిష్టక్రమంబున సునేత్రుండును, బతత్త్రి వరుం డున్నయచ్చటికిం జని, యభివందనంబుచేసి నిజవృత్తాంతం బంతయు నెఱింగించిన నాదరించియిట్లనియె, ౨౩౧

శా. ఆరాధింపుము నీవు సన్మతి త్రిలోకాధారు నారాయణుం
గారుణ్యాంబుధి, నిందిరాకుచతటీ కస్తూరికా సౌరభ
శ్రీరమ్యోరు భుజాంతరాళు, నిగమశ్రేణీసదాసన్నుతున్
శ్రీరంగేశుని బీతవస్త్రు విలసజ్జీమూత సంకాశునిన్. ౨౩౨

క. ఆ నలినాక్షుడు వరదుం
డై నిలచిన బడయరాని యవియుం గలవే !
వాని యఱచేతిలోనివి
వో నలినజ రుద్రపద సుఖోన్నతు లెల్లన్, ౨౩౩

చ. అని యెఱిగించినం బ్రమదమార బ్రభాకరు డేకచిత్తుడై
యనుపమలీల నంబుజదళాక్షు గురించి త్రిలోకసేవ్యమై
యొనరిన చంద్రపుష్కరిణియొద్ద సురల్ వెఱగంది కన్గొనం
ఘనతప మాచరించిన, మనంబున నాహరి మెచ్చి వేడుకన్ ౨౩౪

సీ. కలువ పుష్పముచాయ గమకించు మెయిమించు
పసిడి నిగ్గుల నొరపట్టు పట్టు,
ఎరిపిమ్మిరేకుల సిరి మీఱు కనుదీరు
భవపరితాపంబు బాపు రూపు,

నిలువఁ దీర్చిన ఫాలఫలకంబు తిలకంబు
చిఱునవ్వువెన్నెల చిలుకుతళుకు
కల్పమంజరులచేఁ గడునొప్పు నునుగొప్పు
సొంపారు నురముపై కెంపుసొంపు

తే బాలమార్తాండబింబంబు ప్రభలడంబు
నంబరంబున నెఱపుచక్రంబు నొఱపు
గలిగి జగదేకకల్యాణ లలితమూర్తి
వెలయ నమ్మునియెదుట నావిర్భవించె. ౨౩౫

చ. అతఁడు నభూతపూర్వమగు నప్పరమేశుని దివ్యవిగ్రహం
బతులితభక్తిఁ జూచి వినయంబును హర్షము సంభ్రమంబు, న
ద్భుతమును నంతరంగమునఁ దొట్రుకొనన్ మహిఁ జాగి మ్రొక్కి యా
ర్జితబహువేదసూక్తములచే వినుతించె ననేకభంగులన్. ౨౩౬

క. అప్పుడు మదిఁ గృప చిప్పిలు
నప్పరమేశ్వరుఁడు ప్రీతుఁడై భవదిష్టం
బిప్పుడు ఫలింపఁ జేసెద
చెప్పుము నీవనిన నతఁడు చిత్తం బలరన్. ౨౩౭

తే. కదియ మోడ్చిన చేతులు నుదుటఁ జేర్చి
పంకజోదర! నావిన్నపంబు వినుము
యెల్లవేదంబులను బార మెల్లఁ జదువ
నోపు విజ్ఞానశక్తి నా కొసఁగవలయు. ౨౩౮

చ. అనుటయు నవ్వరం బొసఁగి యాతని కిట్లను బుండరీకలో
చనుఁడు, గణింప నెవ్వరికి శక్యముగానిశ్రుతుల్ పఠింప నే
యనువున దీరుఁ గొంచెమగు నాయువునుం గలయట్టిదేహికిన్
విను మటుగాక పాపములు వీడినగాని ఫలింప వేమియున్.  ౨౩౯

క. కావున బహుజన్మార్జిత
మై వెనుకం దగులు దారుణాఘప్రతతిం

బోవ నడిచి చెప్పం బయి
పై విశ్రుతికెక్కె నమ్మహాతీర్థమునన్. ౨౪౦

క. అతఁ డెఱిఁగించెడి నఖిల
శ్రుతితతియు మదీయశక్తిచోదితుఁడై -వి
కతిముదమున నని లక్ష్మీ
సతీయుతుఁడు నరిగె నంత సంచితలీలన్. ౨౪౧

వ. పరమపవిత్రుం డగు సునేత్రుకడకుం జని కుంజరవరదు పరప్రకారంబుఁ జెప్పి యప్పుత్రవరు ననుమతంబున సమంత్రకంబుగాఁ చ తీర్థస్నానంబుఁ జేసి - చరితార్థం బొంది గురుభజనానురూపంబుగాఁ దానును విహగ రూపంబుఁ బూనిన నాసమ్మదంబున బత్రివరుండు తద్విప్రముఖ్యునకు నఖిలవేదంబు లుపన్యసించె నతండును బుండరీకాక్ష ప్రసాదసాధిత ప్రభావంబున సకృదుచ్చారణమాత్రంబున సకలనిగమ పారగుండై యచ్చట జిరకాలంబు వసించి - విష్ణుపద ప్రాప్తుం డయ్యె - సునేత్రుండు నిరర్గళంబగు నపవర్గంబు నొందె - నాప్రభాకరమునీంద్రునకు - శిష్యులు నలువురు గలిగి రందు సుదర్శనాఖ్యుండ నగునేనును సువర్ణబిందుండు సుత్రామచూడుండును బృహన్మయుండును గ్రమంబున - ఋగ్యజుస్సామాథర్వణంబులు తత్తచ్ఛాఖా సమేతంబుగా ఖగాకారధరులమై యభ్యసించితిమి, నీడోద్భవంబులు నాతోడం జదువు మునికుమారు లనిచెప్పి జయధరునకు నయ్యండజ శ్రేష్ఠుండు వెండియు నిట్లనియె. ౨౪౨

క. పరమంబగు తప మనినం,
బరమపదం బనిన దానిఁ బరికించుచు నీ
పరదేశము నాదేశము
మఱి యితరము లెఱుఁగ నేను మనుజాధీశా ౨౪౩

క. ఈతరువులు నీలతలును
నీతృణగుల్మాదివనమహిస్థలి పుణ్యో
పేతాత్మ లగుమహర్షి
వ్రాతముగా నెఱుఁగు మాత్మ వసుధాధీశా. ౨౪౪

మ. ధరణీనాయక నీకులం బతిపవిత్రంబయ్యె, నీ విమ్మలం
బరిపాలించు మహీతలంబు నతిధన్యంబయ్యె నీపుత్రులుం
బరలోకోన్నతసౌఖ్య మొందిరి, దిశాపాలిన్ భవత్కీర్తులం
జరగెం బుష్కరిణీనిమజ్జనము నిష్ఠ న్నీవు గావించుటన్. ౨౪౫

ఉ. నావుఁడు సంతసించి జననాథుఁడు తన్నుఁ గృతార్థుఁగా మదిం
భావనసేయుచున్ విహగనాథునకున్ ధరఁ జాగిమ్రొక్కి సం
భావన జేసి యాతఁ డనుపన్ బహుమంగళతూర్యమంజులా
రావము లుల్లసిల్లఁగఁ బురంబున కేఁగెఁ జమూసమేతుఁడై. ౨౪౬

క. అతనికిఁ గలిగిరి నూర్వురు
సుతు లందఱు రూపవిభవసుస్వరమతు ల
చ్యుత సువ్రతనిష్ఠాపర
రతులును నగువారు సుజనరంజితచరితుల్. ౨౪౭

క. వారు తనపంపు సేయఁగ
నారాజవరుం డొనర్చె నమితాధ్వరముల్
నేరుపున సుజను లౌనన
వారక దక్షిణలతోడ వైభవ మెసఁగన్. ౨౪౮

క. ఈలీల నతఁడు ధరణీ
పాలన మొనరించి రాజ్యపదముకుఁ దనయుం
జాలించి యితరసుఖములఁ
దేలియుఁ దపమాచరించి త్రిదివము కేఁగెన్. ౨౪౯

వ. అని చెప్పి మార్కండేయుం డన్నరేంద్రున కిట్లనియె ౨౫౦

చ. జనవర! నీవు సోమకులసంజనితుం డనివార్యధైర్యస
ద్వినయ వివేకబాహుబల విక్రమశాలివి, భూప్రజానురం
జనచతురుండ వట్లగుటఁ జాల గృతార్థుఁడ వయ్యు భక్తి నె
క్కొనఁ జని చంద్రపుష్కరిణిఁ గ్రుంకిడి యచ్చటి విప్రకోటికిన్. ౨౫౧

చ. ధనకనకాదివస్తువులు దాన మొసర్పుము, దానఁజేసి - బ
య్యనఁ బెఱఁబాయు నీయఘము లన్నియు, నంత ననంతకీర్తియున్
ఘనతర రాజ్యవైభవ సుఖంబుఁ బవిత్రచరిత్రులైన నం
దనులు ననామయత్వము ఘనంబగు నాయువు నీకుఁ గల్గెడిన్ ౨౫౨

వ. అని యుపదేశించి - యారాజుచేతఁ బూజితుండై నిజాశ్రమంబునకుఁ
జనియె, సోమతుండును - బ్రహృష్టమానసుండై తదుపదిష్టప్రకారంబున
కళత్రమిత్రాప్తబంధుసమేతంబుగాఁ బుష్కరిణీతీర్థంబున కరిగి కృతస్నా
నుండై - యచ్చట హిరణ్యాదినానావిధదానంబుల విప్రుల నతితృప్తులఁ
గావించి నిత్యమంగళాభిరామంబగు శ్రీరంగధామంబునకుం బోయి తద
భ్యంత(రం)బున. - ౨౫౩

సీ. పుండరీకాక్షుఁ బ్రస్ఫురిత కౌస్తుభవక్షు
నాజానుబాహు నీలాభ్రదేహు,
మకరకుండలకర్ణు మహితకృపాపూర్ణు,
నవపీతకౌశేయు నతవిధేయు,
లక్ష్మీసముల్లాసు లలితకోమలహాసు
నానావిధాకల్పు నాగతల్పు,
బహువేదసంవేద్యు భవమహామయవైద్యు
వరతులసీదాము సురలలాముఁ

తే. గలితశృంగారుఁ, ద్రిగుణవికారదూరు,
శోభనాకారు భువనసంస్తుతవిహారు,
యోగిహృద్ధ్యేయు నిజభక్తిభాగధేయు,
సకలఫలదాయి శ్రీరంగశాయి గనియె. ౨౫౪

క. ధరఁ జాగి మ్రొక్కి రత్నా
భరణ సువర్ణాంబరాది బహువస్తుతతుల్,
పరువడిఁ గానుక లిడి సు
స్థిరమతి తత్పూజనంబుఁ జేసినపిదపన్. ౨౫౫

చ. అవిరళవిష్ణుచింతనపరాయణులై - యచట న్వసించు భా
గవతవరేణ్యులం బరమగాత్రులఁ జూతుగదయ్య యంచు - ద
త్పరమపవిత్రులౌ మునులఁ బల్మఱు సువ్రతనిష్ఠచారులన్
వివిధ నిశేషసత్కృతుల వేమఱుఁ బ్రీతులఁ జేసి సన్మతిన్. ౪౩౬

వ. అప్పార్థివోత్తముండు గృతార్థుండై మరలి తరంపతాకాభిశోభితారామాతపత్ర భాసురంబును, సముల్లసిత పల్లవతోరణాలంకృతంబును, ప్రాలంబిత ప్రసూనదామాభిరామంబును, సరస శృంగార పురాంగనాకీర్ణ సువర్ణసౌధవీధి (ధీ) విరాజితంబును, నీరాజనక్రియా సంభ్రమసముల్లాస విలాసినీచరణ మంజీర శింజితమంజులంబును, వివిధమంగళవాద్యహృద్యంబును, ప్రతిహార సంకులప్రవేశ నియంత్రిత - సముత్తుంగ మదముదిత మధుకరఝుంకారముఖరిత గోపురంబును నగు నిజపురంబుఁ బ్రవేశించి- సముంచిత సామ్రాజ్య భోగంబు లనుభవింపుచుఁ జతురుదధివలయ వలయిత వసుమతీభాగం బనురాగంబునఁ బాలించుచుండె నప్పుడు - ౪౩౭

ఉ. ఆతనిరాజ్య మొప్పె నిగమాయతజానపదప్రకీర్ణమై,
యాతతవేదశాస్త్రపరనాదవశోభితమై, యుపద్రవ
వ్రాత విదూరమై, సకలవృత్తివిశేష సమృద్ధిమంతమై,
వీత కళంకమై - సతతవిష్ణుమహోత్సవరమ్యదేశమై. ౪౩౮

క. శ్రీరమణసుచరితామృత
సారంబై, బహుపురాణసమ్మతమై, సం
సారాబ్ధితారకంబగు
శ్రీరంగక్షేత్ర మొప్పె సిరి పెంపారన్. ౪౩౯

సీ. గ్రహణకాలంబునఁ గపిలాసహస్రంబు
నవనీసురుల కిచ్చినట్టిఫలము,
భూరియాగములు సంపూర్ణదక్షిణ లిచ్చి
కావించునట్టి సత్కర్మగరిమ,
పసిఁడిపుష్పముల సద్భక్తి సాలగ్రామ
పూజనం బొనరించు పుణ్యమహిమ,

సంతతజపతపస్స్వాధ్యాయనోపాస
సువ్రతంబుల వచ్చు సుకృతచయము,

తే. నవనియంతయు సత్పాత్రమైనయతని -
కొసఁగ నెసఁగెడి పుణ్యధర్మోన్నతియుసు
గలుగు శ్రీరంగమాహాత్మ్య మెలమిఁ జదువ
నలఘుమతులకు విను విమలాత్ములకును. ౩౬౦

క. ఈయాఖ్యానరతిన్ (గ్రస) నచి
రాయువు నారోగ్యమును, గులాభ్యున్నతియున్
శ్రీయు బహుపుత్రలాభముఁ
బాయని సౌఖ్యములు విష్ణుభక్తియుఁ గలుగున్. ౩౬౧

( ఆ శ్వా సాం త ము )

చ. అని మును లంచితంబుగను నందఱు సమ్మదమూఱ నాగదం
తునకుఁ బరాశరప్రియసుతుం డెఱిఁగించిన యీకథాంశ మిం
పెనయఁ దెనుంగుబాస రచియించితి, నాయువు శ్రీయుఁ గీర్తియుం
ఘనవిజయంబు నీకెపుడు గల్గఁగ జాగయమంత్రిరాఘవా ! ౩౬౨

*చక్రబంధము

శా. నవ్యశ్రీకపరాతి భైరవచరన్నాకద్రుమా ! వర్ణభా
గ్భవ్యారంభకఘస్మరస్తవశుచి స్వాంతప్రపూర్ణ ప్రభా
భవ్యాంగప్రసవాంక వాసవతతః ప్రాఘుఖ్యానందేందు భా
భావ్యాళీన సురాదిశో విభవశోభాభద్రభాస్వన్నిభా ! ౩౬౩

---

చక్ర నాగ గోమూత్రికాబంధ పద్యములలో పొరపాట్లు గంపు సచిత్ర
ములుగా బంధముల నిచ్చి- వ్రాసియుందు- దోషములు సవరింపనైనవిఁ
ప్రక్క- పుటలో సరియగు పాఠము ఖ గల పద్యముల నిచ్చినాను.

— నాగబంధము .—

చ. వరగుణరత్నవిశ్రుత సువర్ణవతంస, సబాలతత్పర
స్ఫురితమరాళ, శ్రీగురువచోవశచిత్త విలాస, వాసవా
వరజ, సమాంగవైరి కరివారిధరానిల ధీరమాంచితో
త్తర సభభాసురక్తతత తత్పరచాగయమంత్రి రాఘవా ! ౨౬౪

—. గోమూత్రికాబంధము —

క. హరిపదసరసిజమధుకర
మురభిదసితమూర్తిరామభోగసురామా !
కరిరద సురకుజ విధుకర
శరదుదసితకీర్తి ధామ చాగయరామా ! ౨౬౫

మాలిని. కమల నయన సేవా ! కౌతుకాధీనభావా !
విమతభయదకోపా ! వీతిహోత్రప్రతాపా !
సుమహితభుజసారా ! సుందరీమానచోరా !
సమర పరశురామా ! చాగయామాత్యరామా ! ౨౬౬

—· గద్యము :—

ఇది శ్రీమద్భ్రమరాంబావర ప్రసాద లబ్ధ సిద్ధ సారస్వత గౌరవ
గౌరనామాత్య పుత్ర సుధీవిధేయ భైరవ నామధేయ
ప్రణీతంబైన శ్రీ రంగ మహత్త్వం బను
పురాణకథయందు— సర్వంబును
పంచమాశ్వాసము

## చక్రబంధము

శా. నవ్యశ్రీకపరాతిభై రవచరన్నాకద్రుమా ! వర్ణ భా
గ్భవ్యారంభకఘస్మర స్తవ శుచిస్వాంతప్రపూర్ణప్రభా
భవ్యాంగప్రసవాంక వాసవతతః ప్రాముఖ్యనందేందు భా
భావ్యాళీన సురాదిశోవిభవశోభాభద్రభాస్వన్నిభా. ౫-౨౬౩



## :- నాగబంధము :-

చ. వరగుణరత్నవిశ్రుత సువర్ణవతంస, సబాల తత్పర
స్ఫురితమరాళ ! శ్రీగురువచోవశచిత్తవిలాస, వాసవా
వరజ, సమాంగ వైరికరివారిధరానిలధీరమాంచితో
త్తరసశుభానురక్తతత తత్పర చాగయమంత్రి రాఘవా ! ౫-౨౬౪



# గోమూత్రికాబంధము

క. హరిపద సరసిజ మధుకర
మురభిదసితమూర్తి రామభోగసురామా!
కరిరద సురకుజ విధుకర
శరదుదసితకీర్తిధామ చాగయరామా! ౫-౨౬౪



# అనుబంధము

ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక (సంపుటము ౧౮. సంచిక ౨. పుటలు ౧౧౫-౧౨౧) యందు భైరవకవి ప్రణీతమైన- కవిగజాంకుశమును- (మానవల్లి వారిచ్చిన ప్రతి) ప్రచురించినారు. దానినే యథాతథముగా నిందు చేర్చినాను. కవి ४ పద్యమున కవిగజాంకుశ మనియు చివరి పద్యమున కవి రాడ్గజాంకుశమనియు- వ్రాసినాడు.

# కవిగజాంకుశము

## (భైరవకవి)

క. శ్రీమత్పరమసితానన
తామరసవికాసలీలఁ దగిలి భ్రమరాం
బామధుమత్తభ్రమరిక
నామన సరసీరుహంబునన్ భ్రమియించున్. ౧

వ. అని యిష్టదేవతాప్రార్థనంబుఁ జేసి, ౨

క. నిరుపమ మతి విస్ఫురణం
బరఁగిన సత్కవులఁ దొల్లి బహువిధముల న
చ్చెరు వొందఁ జెప్పవలసిన
నరనుత సాహిత్యలక్షణ గ్రంథములన్. ౩

క. సందడిపడు లక్షణమును
బొందుగ ధవళించి జాగు పోవిడిచి సుధీ
బృందమ్ము మెచ్చ నేనొక
ఛందమ్మునఁ గవి గజాంకుశ మ్మనుపేరన్. ४

తే. లక్షణగ్రంథ మొనరించి లాగుమీఱ
దానిఁ గొనియేగు సుకవిమాతంగములను
మదము దూలంగ గీపెట్ట మలపువాఁడ
నని ప్రతాపించి పలికిన పలుకు వినుఁడు. ౫

క. భ్రమరాంబికా మహావర
సముదిత నిరవద్యహృద్య సాహిత్యకళా
శ్రమ విమల ప్రతిభాచం
క్రమణ క్రమశాలియైన గౌరనసుతుఁడన్. ౬

క. భైరవుఁడ నుభయభాషా
పారీణుఁడ లోభిభవనభవభూమివ్యా
హార సవికార దుష్కవి
ఘోర పిశాచుల సదల్చుకొను భైరవుఁడన్. ౭

క నక్షత్ర గ్రహగణ భూ
తాక్షర గుణదోష నిర్ణయం బొనరింపన్
దక్షులుగా రిదిగాదని
శిక్షించినఁ గన్ను లెట్టిఁజేతురు కుకవుల్. ౮

క. కిదుపుచు లక్షణ మెఱుఁగక
కొదుకుచు వడిఁ బ్రాసయతిని గూడక మిన్నున్
వెదకుచుఁ బదసంధుల చెడ
నదుకుచు నరకవిత చెప్పునతడుం గవియే, ౯

క, నెఱయ గురులఘువివేకము
లెఱుఁగని ననగూఁటు లెదుర నెమ్మెఁ గవిత
ల్మొఱగెడు కుకవులఁ బద్యపు
దఱటులు గొని వ్రేయవలదె తద్జ్ఞులు సభలన్. ౧౦

క సేవించిన ధనపతిఁగా
దీవింప నహంకరించి తిరిగిన భిక్షుం

గావింప లక్షణజ్ఞుఁడ
భావింపఁగ నన్ను నెన్నఁ బనిలే దింకన్. ౧౧

వ. లక్షణంబు లెవ్వియనిన. ౧౨

సీ. అవని గణా శిగణాళికి నధిదేవ
తలు గ్రహంబులు గ్రమంబులును వాని
కులములు ఫలములు గూడు మర్యాదలు
చుక్కపొంతువులు నచ్చువులు నెఱిఁగి
పిదప మహాభూతి బీజచింతనమును
పర్ణ వర్ణగ్రహ నిర్ణయంబు
లక్షరవేధయు నరిమిత్రశోధన
క్రమముఁ దత్ఫల విచారమును దెలిసి

ఆ వె.తమకు నెదురు లేక దర్పించి వసుమతీ
విభుల సభల బుధులు వివిధవిధులఁ
జెలఁగి పొగడఁ గవిత సెప్పెడివారు స
త్కవుల పేరుసాటుకవులు గలరె. ౧౩

క ఈ యెన్నిన లక్షణము ల
మేయ ప్రతిభన్ రచింతు మృదుతరకావ్య
శ్రీయెసఁగఁ బొసఁగ సది బళి
రే యనుచు న్సుకవు లాదరించి నుతింపన్. ౧౪

క జగతీజలానలానిల
గగన సుధాకర పరోష్ణకర పరమాత్మల్
మగణాదుల కధిదేవత
లగజావల్లభునిమూర్తు లవి యెనిమిదియున్. ౧౫

క రవితురగరజతవిద్రుమ
కువలయ హరినీలశకల కురువింద సుధా
నవకనక నికషరేఖా
ప్రవిమల కాంతులఁ దనర్చుఁ బరువడి గణముల్, ౧౬

క. రజనికరతనయ భార్గవ
కుజ తరణిజ దితిజరాజగురుగురుగ్రహముల్
నిజముగ మయరసతలకును
భ జలకు నెన్న న్నిజాధిపతులు గ్రహంబుల్, ౧౭

క. నలి తయలును నగ్రజకుల
ములు ర జ లవనీశసుకులములు భగణము వి
ట్కులజము మగణము నాలవ
కులముది సగణమ్ము హీనకులముది తలఁపన్, ౧౮

క. సరసాన్నరుచిర భూషణ
పరితాప స్థానచలన బహుదుఃఖ రుజా
పరమాయు రచలలక్ష్మీ
కరములు యమరసతభజనగణములు వరుసన్, ౧౯

క సన్నుత గణాధిదేవత
మన్నగణగ్రహము సత్యమౌ బలిమిఁ గదా
మున్నుఁ గవిభానుఁ డనియెడు
పన్న మతిం గినిసి జాయి పగులం దిట్టెన్, ౨౦

క మహి వేల్పులు నెరసిన శిల
లహితహిత-బుల నొనర్చు నాగతి గణముల్
మహితశ్లోకముఖంబున
గ్రహవశమున మేలుగీఁడుఁ గడువడిఁ జేయున్, ౨౧

క. తొలుత గణగ్రహమైత్రులు
తలపోయని దుడుకుఁగవుల తరమే హర్షం
బొలసిన మన దీవింపం
గలుషించిన ఐద్యవహ్నిఁ గాల్పఁగఁ దిట్టన్, ౨౨

గీ. ఏయవస్థనుండి యేవేళ నేగ్రహం
బేశుభాశుభంబు లిచ్చుచుండు

నాయవస్థనుండి యావేళ నాగణం
బాశుభాశుభంబు లందఁజేయు, ౨౩

గీ. గ్రహము మొలికి గణము గరి యక్షరము పింజ
పద్య మెసఁగుకోల చోద్యమైన
జిహ్వ విల్లు మనసు శింజిని లక్ష్యంబు
ధూర్తజనుఁడు సుకవి వార్తజోదు, ౨౪

క. మగణాదిగణంబులకును
బగయును మైత్రియును నెఱకపడు సుకవులకున్
జగమునఁ దత్తద్గ్రహముల
పగయును మైత్రియును శాస్త్రపద్ధతిఁ గనివన్, ౨౫

గీ. గ్రహము పొత్తుకలిమి గల గణసంగతి
నుండి దుష్టగణము నొసఁగుశుభము
గ్రహముపొత్తు లేని గణముతోఁ బద్యాదిఁ
గూడి మంచిగణముఁ గీడుసేయు. ౨౬

వ. గ్రహమైత్రిప్రకారం బెట్టి దనిన. ౨౭

క. తొలుగణము గ్రహము మిత్రులు
దలపఁ ద్రికోణాధిపతులఁ దత్తద్గ్రహరా
సుల గణము లాదిగణముకుఁ
గలసిన చుట్టంబు లివియె గ్రహగణమైత్రుల్. ౨౮

క. మించుగిరిగొన్న ముత్తెము
కాంచనిమునఁ గదిసినట్టిగతి నల యగణం
బంచితముగఁ దను గూడిన
మంచిదియై లక్ష్మి నొసఁగు మగణము పతికిన్. ౨౯

క. మగణముతోఁ బద్యాదిని
రగణము గదిసినను జావు రయమున వచ్చున్

తగణము డాసినఁ గృతిపతి
పగఱకు వెన్నిచ్చి మానభంగముఁ బొందున్. ౩౦

క. ముందట నిలిపిన మగణము
క్రిందట జగణంబుఁ గదియఁ గీలించిన మే
లొందును సగణము నటువలెఁ
బొందించిన విభుఁడు రిపులఁ బోర జయించున్ ౩౧

క. యగణముతోఁ బద్యాదిని
మగణము గదియింప ధరణిమండల మెల్లం
బొగడొంద నేలుఁ గృతిపతి
సగణము గదిసినను (గీర్తి) చదలకు నెక్కున్. ౩౨

క. *ఉదకగణంబును రగణము
నదవద వడి చెడి కృతీశుఁ డవలం దిరుగున్.
................................
................................................ ౩౩

క. శంకింపక యగణముతోఁ
బంకజహితగణము గూర్చి పద్యము చెప్పం
బొంకము చెడి విభుఁ డరులకు
లెంకెంబడి కూలి దిక్కులేక చరించున. ౩౪

క. ఇంగలపుగణము జగణము
సంగతముగ నొంది తగణసంగతి నొందన్
మంగళకర మని సుకవులు
పుంగల నిలుపుదురు పద్యములకుం గృతులన్. ౩౫

క. యగణము కూడిన నిప్పుల
మగు మగణము గదియఁ బ్రాణహాని యొనర్చున్

*ఈ ౩౩ నెం పద్యము, పరిషత్ పత్రిక యందును పూర్తిగాలేదు.

రగణము సగణముఁ బొందై
భగభగయని పతిగృహంబు భస్మముసేయున్. ౩౬

క. మారుతగణంబు సంప
త్కారణ మంభోగణంబు గదిసినయపు డం
గారక గణంబు గదిసినఁ
జోరులచేఁ బతి గృహంబు చూఱంబోవున్. ౩౭

క. నేరక దుష్కవు లల్లు తు
టారపుఁ బద్యముల మొదల డాసినఁ దనలో
నారవిగణంబు గూడిన
మారుతగణ మధిపుబ్రతుకు మట్టము సేయున్. ౩౮

క, తగణము మగణము గదిసిన
వగపగు సగణంబు గదియ వైరిభయంబు
న్నగణము గదిసినఁ దేజము
రగణము గదిసినను గర్త రాజ్యముసేయున్. ౩౯

క. మొగవాత తగణముండఁగ
వగపగు యగణంబు దాని వడినిడి కినుకం
దెగి తన్నుఁ జంపఁ గడఁగెడు
పగవానికి నైనఁ జనునె పద్యము చెప్పన్. ౪౦

గీ. ఆది తగణ మొప్ప నధిదేవతాఫలం
బరసి చూడ దాని కమరగురుఁడు
గ్రహముగానఁ బద్య గద్య ముఖంబుల
మంచి దనుచు భీముఁ డెంచినాఁడు. ౪౧

క. ఆరోగ్యప్రదమఁ దగు నిపుఁ
డారయ జగణమున కొదయఁ దడి మొదలిడఁగా

నే రోగము గై కొన దా
చేరువ చుట్టంబు గణముఁ జేర్చినఁ జాలున్. ౪౨

క. రవిగణమును గగనగణము
కవి మొదలిడి పద్య మొసఁగఁ గఱచిన నేలా
భువి జెదఱములు (?) గతమును
శివశివ నరు లిట్టి తపము సేయరు మొదలన్. ౪౩

క. రాజులకు జగణరగణము
లోజం గదియించి సుకవి యొసఁగిన పద్యం
బాజుల జయ మీఁజాలదె
తేజులు నేనుఁగులు భటులుఁ దేరులు నేలా ౪౪

చ. ఉడుపతియే గ్రహంబుపదినున్నను దానును వానివన్నెయై
నడచి శుభాశుభంబుల నొనర్చును లోపల నేగణంబుసం
గడి భగణంబు నిల్చు నధికంబగు నాఫల మిచ్చు నవ్విధుం
డొడయఁడుగాన దాని కది యుక్తమె యెన్న వృథోక్తు లేటికిన్, ౪౫

గీ. శుక్రశశులుతెలుపు...వర్ణులు
తరణికుజులు బుధుఁడు సురగురుండు
పసిఁడివన్నెవారు భానుజ రాహులు
సజల జలదరంబు చాయవారు, ౪౬

ఉ. వారిజమిత్రసూనుఁడును వారిజమిత్రుఁడు భూమిపుత్రుఁడుం
గ్రూరులు వారిఁ జేరనెడఁ గ్రూరుఁడు చంద్రతనూభవుండు బృం
దారకరాజమంత్రియును దైత్యగురుండును సౌమ్యు లవ్విధుం
డారయఁ గృష్ణపక్షతిథులందు శుభప్రదుఁ డెన్ని చూచినన్, ౪౭

గీ. శ్వేతచంద్రుఁడైన సేమంబు చేకూరు
రక్తచంద్రుఁడైన రణముచేయుఁ

గృష్ణచంద్రుఁడైన గెడయించు భగణంబు
పీతచంద్రుఁడైనఁ బ్రియము సేయు, ౪౮

క. చందనతరుసంగతిఁ బిచు
మందంబులు పరిమళించుమాడ్కి సమందా
నందము...గణము
పొందున దుష్టగుణవర్ణములు ప్రియ మొసఁగున్, ౪౯

క. రగణముతో రగణంబును
సగణముతో సగణములును జగణముతోడన్
జగణమ్మును దగణముతోఁ
దగణమ్మును గూర్చిచెప్పఁ దగ దెల్లెడలన్. ౫౦

క. శత్రుగణంబులు నొప్పవు
మిత్రసమగణంబులైన మేలొకజోక్కై
మిత్రగణంబులు మనుపును
శత్రుగణంబులు కృతీశుఁ జయ్యనఁ జంపున్. ౫౧

క. శతముఖ జల పావక మా
రుతజీవాద్యమతుషారరుక్తారలు స
న్నుతముగ మగణాది గణ
ప్రతతికిఁ దారకలు గ్రహమురా గణుతింపన్. ౫౨

క. హరిణజ బలిముఖమేషీ
వరసైరిభ ధేను మహిప వాతాశనముల్
వరనమయరసతభజలకు
నరుదుగ నక్షత్రయోనులై విలసిల్లున్. ౫౩

క. ఉరగంబును ముంగిసయును
హరిణంబును గుక్కుటంబు నావును బులియుఁ
దరుచరమును మేషంబును
చురగము మహిషమును జెలిమిఁ దొరయవు మఱియున్. ౫౪

క నరగణము లర్యమాంఘ్రో
ధరరసతారకలు శక్ర దహనర్క్షములా
సురగణము లనిల గురు హిమ
కర నక్షత్రములు దేవగణములు వరుసన్.

క సుర రజనీచరగణములు
కరకరిపడు దనుజ మనుజగణములు మఱియు
న్నరసురగణములు వారయును
సరిఁ బ్రియ మొనరించు నొక్కచందపుగణముల్.

క. కమలహితుఁ డున్న నక్ష
త్రము మొదలుగ నేడు దోషతమములు నడుమం
బ్రమదప్రదములు పండ్రెం
డమరఁగ శుభములు తొమ్మిదింటం బద్యాదిన్ (?)

క. మొదల సజీవగణం బిడఁ
గొదలేక కృతీశుబ్రదుకు కొనసాఁగు మది
న్నొదకక నిర్జీవగణం
బిదికిన యప్పుడు భయంబు నాయువు దరుగున్.

క. కృతిమొదలి దగ్ధతారక
పతి నతిదారిద్ర్యుఁ జేయుఁ బ్రజ్జ్వలితము దు
ర్మృతి నొందించును మఱి దు
ర్మిత నక్షత్రంబు రుజల మెయి నలయించున్.

క. పతితారకుఁ బద్యముఖ
స్థితతారకుఁ గీడు మేలుఁ జింతింపక దు
ర్మతిఁ గవితఁ జెప్పఁ దొడఁగెను
నతఁడు సుమీ కవిపిశాచ మారయ నుర్విన్

ఉ. వర్ణము నిర్ణయించి కృతివక్త్రమునం గదియింప నాయకుం
దర్ణవవేష్టితావని సమస్తము నేలుఁ గవీశ్వరుండు నా

పూర్ణమనోరథుం డగుచుఁ బొల్చు సుఖస్థితిఁ గావ్యముల్ బుధు
ల్వర్ణనసేయ నొప్పు దిశల న్వసుధేశ సభాంతరంబులన్. ౬౧

మ. క్షితిబీజంబులు సంపద ల్పొదలఁ బోషించుం బయోబీజముల్
సతతంబుం బ్రమదం బొనర్చు శిఖిబీజంబుల్ మృతింజేయు మా
రుత బీజంబులు శోకవారిధిఁ బడంద్రోచు న్నభోబీజముల్
పతి నత్యంత దరిద్రుఁ జేయు వరుసం బద్యాది నొందించినన్. ౬౨

వ తత్ప్రకారం బెట్టి దనిన ౬౩

సీ. అ ఇ ఉ ఋ లే ను ను నా దీర్ఘవర్ణంబు
లైదు నేకారంబునైదు నవల
వరుసం గవర్ణాది వర్గపంచకమును
యాదులైదును షాదులైదుఁ గూడఁ
బదివర్గములు వర్ణపంక్తులు నొండొంటి
క్రిందఁ బొందుగ నిల్ప నందులోనఁ
బ్రథమాక్షరంబులు పవనబీజంబులు
నవలివి దహనబీజాక్షరములు

అవని బీజాక్షరంబులగుఁ దృతీయాక్షరములు
వారి బీజంబు లాతరవాతిలిపులు
గగన బీజంబు లైదవకడల వెల్ల
వానిమేలుగు గీడును వలయుఁ దెలియ, ౬౪

క. పొందొంద నంశచక్రము
నందలితారా పదాక్షరావలి వెతలం
బొందుగ నుండఁ గవీంద్రులు
ముందట నిడవలయుఁ బద్యముఖమున నిలువన్, ౬౫

గీ. అక్షరంబు మంచిదైనఁ గ్రూరగ్రహ
వేధ బొంది గుణము విడిచి చెఱచు

నక్షరంబు దుష్టమైన సౌమ్యగ్రహా
వీక్షణమునఁ గీడు విడిచి మనుచు,

వ. అది యెట్టిదనిన—

సీ. అశ్వని పాదాక్షరాదిగా నఖిలతా
రా పదాక్షరములు క్రమముతోడ
నింద్రుని దెసనుండి యిరువదియైదేసి
నలుదిక్కులందును నిలిపి వాని
నవపంచరాశి వర్ణములతో నాల్గేసి
నాల్గేసి రేఖలఁ దగ లొనర్చి,
నడుముల మిగుల వర్ణములకు...
నేడింట రేఖలు గూడఁదీసి
అర్కుఁ డాదిఁగాఁగ నంశచక్రంబుల
రాసులందు సుస్థిరముగ నిలిపి
వేధ దెలిసి చూపు వివరించి వర్ణంబు
వలయు నిలుపఁ బద్యవక్త్రములను—

చ. ఉరుతరసిద్ధ కాష్ఠముల నున్న సమంచితవర్ణ సంకులం
బదుగును సిద్ధకాష్ఠములఁ బ్రస్తుతికెక్కిన యక్కరంబులుం
గరఃపరిలేక కూడి కవికర్తల కభ్యుదయం బొనర్చు నే
నెరవునసైన శత్రువిధి బృందముఁ జంపక తక్కదెక్కడన్.

వ మిత్రారివర్ణశోధన క్రమం బెట్టి దనిన

సీ చదుములై పదియాఱు చౌకపిండ్లఁ గల
యదియ షోడశచక్ర మందులోన
మొదలింట మూఁటను బమనొకంటను తొమ్మి
దింట రెంటను నాలుగింటఁ బదియు
రెంటను బదియు నాలింట నెనిమిదింట

నలిఁ బదాఱింటఁ బధ్నాలుగింట
నేనవరావున నేడవింటను బది
యేనింటఁ బదుమూఁట నిట్టు గలయ
నక్షరంబులు గలయంగ నైదుపదులు
నిలిపి వడికాష్ఠముననుండి వలయముగను
సిద్ధసాధ్య సుసిద్ధాదిచింత వెలయఁ
గాంచి లిపులోలి నడువంగ నెంచవలయు. ౭౧

వ. మఱియును. ౭౨

క. ఇలనకచటతపమాఖ్యలఁ
గలిగిన లిపి వర్గసప్తకమున కధీశుల్
జలజహిత భౌమ బుధ కవి
కులిశాయుధ సచివ సౌరి కువలయమిత్రుర్. ౭౩

క. బహు సంశోధిత వర్ణ
గ్రహమునకుఁ బ్రసిద్ధపద్యగద్యాది గణ
గ్రహమునకుఁ గర్త రాశి
గ్రహమునకును మైత్రి మెఱయఁ గలుగఁగవలయున్. ౭౪

వ. గ్రహంబు లెట్టివనిన- ౭౫

సీ. విభుఁడు మేషమునకు వృశ్చికరాశికిఁ
గ్రూర స్వభావుఁ డంగారకుండు
నాథుండు మిధునకన్యారాసులకు జనా
నందవర్తనుఁ డిఁదునందనుండు
అధిపతిమీనబాణాసనరాసుల
కతుల ప్రభావుఁ డయ్యమరగురుఁడు
రాజు తులా వృషరాసులు రెంటికిఁ
బరమతపోనిధి భార్గవుండు-

మకరకుంభములకు మార్తాండ సూనుఁడు
పతి త్రివేదమూర్తి భాస్కరుండు
కర్త సింహమునకుఁ గర్కటరాశికి
నఖిలలోకవంద్యుఁ డమృతకరుఁడు, ౨౬

వ. అని యివ్విధంబున, ౨౭

మ. గణ వర్ణాదుల మేలుఁ గీడువెలయంగాఁ జెప్పె సాహిత్యల
క్షణదీక్షాగురుఁడైన గౌరన సుధీసత్పుత్రుఁ డత్యుల్లస
ద్గుణరత్నాభరణుండు *భైరవకవీంద్రుం డెందుఁ దద్జ్ఞుల్ దనుం
బ్రణుతింపం గవిరాడ్గజాంకుశము భూప్రఖ్యాతమై మించఁగన్. ౨౮

(ఇంతవరకు పరిషత్‌వారు పైన పేర్కొనిన పత్రికలో ముద్రించిరి,
మధ్య మధ్య పద్యములలోని అసమగ్రభాగాలు( . . . ఈ గుర్తులు)
పత్రిక యందే గలవు, మరియు ౨౮ పద్యానికి ఫుట్‌నోట్సు కూడా -
వారుంచినదే)

కవి గజాంకుశమున లేనివని రెండు పద్యములను చాగంటి శేషయ్యగారు ఆంధ్ర కవితరంగిణియందు ( 1960 ముద్రణ 5 భాగము 244 పుటలో ) ప్రకటించిరి— ఆ పద్యము లివి,

క. పతి మృతుఁ డగుఁ బద్యాదిని
మృత నక్షత్రంబు లిడిన మేదుర సౌఖ్యా
న్వితుఁ డగు నమృతము వలన న
ప్రతిమములగు తారకములఁ బద్యాది నిడన్ ౧

సీ. అవనిగణాలి గణావలి కధిదేవ
తలును వన్నెలు గ్రహంబులును వాని

---

*'రత్నపరీక్షను శ్రీ రంగమాహాత్మ్యమును రచించినకవి, ప్రతికి మూలము మానవల్లి రామకృష్ణకవిగారిచ్చినది' (పత్రిక. ౧౨౧ పుట)

కులములు ఫలములు కూర్మలు పగలును
చుక్క పొత్తువులు నచ్చుగ నెఱింగి
పిదప మహాభూత బీజచింతనమును
వర్ణ వర్గగ్రహ నిర్ణయంబు
నక్షత్రవేధయు నరిమిత్రశోధన
క్రమముఁ దత్ఫల విచారమును దెలిసి

తే. తమకు నెదురులేక తప్పించి ధారుణీ
విభుల సభల బుధులు వివిధగతులఁ
జెలఁగి పొగడఁ గవిత చెప్పెడువారు స
త్కవులు గాక యితర కవులు కవులె ? ౫

౩-౫ సంఖ్యలు కవితరంగిణిలోని పద్యసంఖ్యలు, పై పద్యములందు ౩౧ సంఖ్యగల పద్యము. ఈ ౫ సంఖ్యగల పద్యము కొద్ది భేదముగా-సమానములే, చాగంటివారి కీ పద్యము లెచట లభించెనో ? తెలుపలేదు,

—:o:—

# శ్రీరంగ మహత్త్వమందలి
## గద్యపద్యముల
# అకారాది సూచిక

ఇ

ఖ



గ

## ఘ



## చ



## ఛ



## జ



## జ్ఞ



## డ

## త



## ద

## శ



## శ్రీ

# బైరవ ప్రణీతంబగు

# "కవిగజాంకుశము"

## లోని గద్య పద్యాను క్రమణిక.

విస్మృతకవులు సంపుటము 8

శ్రీరస్తు

భైరవకవిప్రణీతమగు

# శ్రీ రంగమహాత్మ్యము

ఇది
వనపర్తిసంస్థానాధీశ్వరులగు
సవై రాజా రామేశ్వరరావు
బహరీబల్వంతుమహాభూపాలరావుబహద్దురువారి
యాజ్ఞానుసారముగ

మా. రామకృష్ణకవిగారిచేఁ
బరిష్కరింపఁబడి

చెన్నపురి
జ్యోతిష్మతీముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె

1912

(ఇది ప్రథమముద్రణ ముఖపత్రము)

# 'విస్మృత కవులు'

ఈపేర నతి మనోహరములగు ప్రాచీన కావ్యములు మా శక్తి కొలఁది దిద్ది కవి చరిత్రాది విషయములఁజేర్చి ముద్రించుచున్నారము.

ఇప్పుడు వెలకు సిద్ధముగా నుండు కృతులేవనగా —

| | | | |
|---|---|---|---|
| 1. | క్రీడాభిరామము - | శ్రీనాథకవిరచితము (వెలకులభింపదు) | |
| 2. | కుమారసంభవము - | పూర్వభాగము, నన్నెచోడకవికృతము. | 1-00 |
| 3. | నీతిశాస్త్రముక్తావళి | భద్రభూపాలరచితము | 0-5-0 |
| 4. | పరతత్వరసాయనము | ఫణిభట్టుప్రణీతము | 0-12-0 |
| 5. | ప్రబంధమణిభూషణము | సంగ్రథితము | 0-12-0 |
| 6. | త్రిపురాంతకోదాహరణము | తిప్పరాఋప్రణీతము | 0-3-0 |
| 7. | అనర్ఘరాఘవము | తిమ్మభూపాలరచితము | 1-0-0 |
| 8. | శ్రీరంగమహత్త్వము | భైరవకవిప్రణీతము | 1-0-0 |
| 9. | ఉదయనోదయము | అచ్చులోనున్నవి. | |
| 10. | ఐరావతచరిత్ర - | ,, | |
| 11. | డిండిమప్రహసనము | ,, | |
| 12. | రఘునాథరామాయణము | ,, | |
| 13. | సాంబోపాఖ్యానము | ,, | |
| 14. | ముద్రామాత్యము - | క్షేమేంద్రరచితము ,, | |

మా॥ రామకృష్ణకవి.
వనపర్తి, జానంపేట పోస్టు,

('ప్రథమముద్రణప్రతి - చివరి అట్టకు సరియగుప్రతి)